శ్రీరామకథా సుధాలహరి

# యుద్ధ కాండము

## రెండవ భాగము

(శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి - గీతికలలో)




దుర్గా ప్రసాద్

52వ పూజా పుష్పము

శ్రీరామకథా సుధాలహరి

# యుద్ధ కాండము

## రెండవ భాగము

(శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి - గీతికలతో)





దుర్గా ప్రసాద్

ప్రథమ ముద్రణము : 500 ప్రతులు

సర్వస్వామ్యములు రచయితవి

విక్రమనామ సంవత్సరము

ఆశ్వయుజము - శరదృతువు

సెప్టెంబరు మాసము - 2000

వెల : రు. **50-00**

ముద్రణ :
డి. బి. ప్రింటర్స్
విజయవాడ-2

---

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞానభవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500001
అన్ని బ్రాంచీలలో లభ్యమగును

పి. దుర్గారావు, యం.ఓ.యల్.
తెలుగు పండిట్, (రిటైర్డు)
అడవిదేవులపల్లి గ్రామం-508207
వయా మిర్యాలగూడ, నల్లగొండజిల్లా



## సమర్పణము :

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్।
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్॥

పుష్పాంజలులతో

# దే వ తా వం ద న ము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని
విశ్వరూప విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధ సేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళానందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధా కలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# వినయవాక్యము

శ్రీమద్రామాయణ మహాకావ్యము సంస్కృత భాషలో రచింప బడినది. రచించినది శ్రీ వాల్మీకులవారు. ఐదువేల సంవత్సరముల క్రిందట వ్రాయబడినదని పెద్దలు జెప్పుదురు.

శ్రీమద్రామాయణమును భారతీయ భాషలలో ప్రపంచ భాషలలో ఎందరో మహానుభావులు ననువదించిరి. ఆంధ్ర భాషలోగూడ గద్య పద్య గీతికా రూపాలలో ఎందరో మహాకవులు గానము జేసిరి.

శ్రీమద్రామాయణము భారతీయ సాహిత్యమునకును సంస్కృతికిని మూలము. ప్రతీక. రామాయణ కావ్యములోని నాయకుడైన శ్రీరామ చంద్రుడు భారతీయులకు పరమదైవము, పరబ్రహ్మ స్వరూపము. ఋషి తుల్యుడు. ఆదర్శ మానవుడు.

తమ పుట్టిన బిడ్డలకు తెలుగుదేశములో శ్రీరాముని పేరు పెట్టు కుందురు. రామ మందిరము లేని గ్రామము తెలుగుదేశములో లేదని చెప్ప వచ్చును. అట్టి శ్రీరామ చరిత్రమును తెలుగులో, తేలిక భాషలో, సామా న్యులు పాడుకొనుటకు వీలుగా గీతికా రూపమున వ్రాయుటకు బూను కొంటిని.

వృత్తిచేత ఉపాధ్యాయుడ నైనప్పటికినీ, సంస్కృత భాషా పరి జ్ఞానము స్వల్పమైనప్పటికినీ, శ్రీరామునిపై గల భక్తి భావముచేతను, శ్రీ మద్రామాయణమునందు గల ప్రీతిభావముచేతను ఇట్టి మహత్కార్యము నకు బూనుకొంటిని. శ్రీరామచంద్రుడే నా చేత యీ కార్యమును జేయించు చుండెనని నా భావన.

ఈ గ్రంథములోని విశేషములు :

1. శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి, తేలిక భాషలో బాలుర కర్థమగు రీతిలో పాడుకొనుటకు వీలుగా రచించుటకు యత్నిం చితిని.
2. గీతికలుగా వ్రాయుటవలన స్వేచ్ఛానువాదమని భావింపవచ్చును. చేర్పులు, మార్పులు లేకుండా మూలముననుసరించి వ్రాయబడినది.
3. 60 సర్గములుగల యుద్ధకాండము రెండవభాగము దాదాపు 2000 చరణములతో పూర్తిచేయబడినది.

4. ఇందలి ఛందస్సు చతురస్రగతి. మధ్యాంతరమున యతిగాని ప్రాసగాని యుంపబడినది. పాడుకొన్నుటకు వీలుగా పాదాంత్యమున గురువునుంపబడినది. నాలుగేసి పాదములు మూడు లేక రెండు ఒక గీతికగా గుదిగ్రుచ్చబడినది.

5. ఏ సర్గమున కాసర్గ విడదీయబడి, విషయసూచిక జేర్చబడినది.

6. మూలమునందలి రెండు మూడు శ్లోకములను ఒక గీతికగా గూర్చబడినది.

7. మున్యాశ్రమములో మహర్షి వాల్మీకి దగ్గఱ నేర్చుకొని వీథి గాయకులుగా గానముజేసిన లవకుశలే నా కాదర్శము.

ఈ గ్రంథ రచనయందు భాషలో, భావనలో, అచ్చులో కథా గమన పుష్టిలో ఎన్నియో దోషములుండవచ్చును. సహృదయులు దెలియ బఱచిన సరిదిద్దుకొందును.

గీతికా రచనలోగాని, ప్రచురించుటలోగాని ఎట్టి యాటంకములు గలుగనందులకు శ్రీరామచంద్రునకు నా నమోవాకములు. తక్కిన రామాయణకాండలను గూడ యిదే రీతిగా బ్రచురింపవలెనని నా యాకాంక్ష.

శ్రీ వాల్మీకులవారు శ్రీమద్రామాయణ కావ్యమును రచించి ముద్దుగా కుశలవులచే బాడించిరి. అదే విధముగా విద్యార్థులుగూడ యీ రామాయణమును ముద్దుగా బఠించి గానముచేసి సంగీత సాహిత్య సంస్కృతులను సంపాదించుకొనవలెనని నా కోరిక.

శ్రీ రామాయణ గ్రంథము భారతీయులకు బూజనీయమైనది. ఆది కావ్యము. అట్టి గ్రంథముయొక్క ఆత్మీయతను, వాల్మీకులవారి కవితా హృదయమును, రామాయణములోని మహోజ్జ్వలములైన పాత్రలను స్పృశించుటయే గాక, రామాయణ గ్రంథమంతయు గీతికారూపమున వెలువరించుట నా పూర్వపుణ్య సుకృతమని భావించుచున్నాను. సహృదయులకు నమస్కారములు.

—రచయిత

# కృతజ్ఞతలు

1. ఆర్షవిజ్ఞాన ట్రస్టు హైదరాబాదువారు ప్రచురించిన శ్రీమద్రామాయణ గ్రంథము గీతికా రూపమున నేను రచించిన శ్రీరామ కథాసుధా లహరి అను గ్రంతమునకు మిక్కిలి తోడ్పడినది. వారికి నా హృదయ పూర్వక నమస్కృతులు.

   అదే విధముగా టీకా తాత్పర్య సహితముగా వ్యాఖ్యానించిన ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారికి నా వినయపూర్వక నమో వాకములు.

2. నా యీ రామకథాసుధాలహరిని తమ బ్రాంచీల కన్నింటికీ బంపి ప్రజలకు అందజేయుచున్న "విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్," హైదరాబాదు వారికి మిక్కిలి కృతజ్ఞుడును.

3. ఎనిమిది సంపుటాలుగా వెలువడిన యీ మహా గ్రంథమును, పుస్తక ప్రచురణలో సహకరించి సుందరముగా ప్రచురించిన శ్రీ డి. బి. ప్రింటర్సు విజయవాడ వారికి మిక్కిలి కృతజ్ఞతలు.

4. గ్రంథ రచనకు ప్రోత్సహించిన అనేకమంది మిత్రులకు వినయ పూర్వక నమస్కృతులు.

5. 2400 పుటలుగా ఎనిమిది సంపుటాలుగా రచించి ప్రచురించుట ఒక క్రతువు వంటిదని చెప్పవచ్చును. ఎన్ని అవాంతరాలు, అడ్డంకులు వచ్చినప్పటికి గ్రంథము పూర్తిగా ప్రచురించినందులకు. పరబ్రహ్మ స్వరూపమైన శ్రీరామచంద్రునకు భక్తిపూర్వక నమస్కృతులు.

—రచయిత

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### అంతర్గతమగు విషయసూచిక

69. రావణుని పుత్రులు, బంధువులు యుద్ధానికై వెడలుట. అంగదుడు నరాంతకుని వధించుట.

70. హనుమంతుడు దేవాంతక త్రిశిరస్సులును, నీలుడు మహోదరునీ, ఋషభుడు మహాపార్శ్వునీ వధించుట.

71. అతికాయుడు భయంకరమైన యుద్ధము జేయుట, లక్ష్మణుడు అతనిని సంహరించుట.

72. రావణుడు చింతాక్రాంతుడై, "సావధానచిత్తులై నగరమును రక్షింపుడు" అని రాక్షసులను ఆదేశించుట.

73. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రామలక్ష్మణులను, వానర సైన్యమును మూర్ఛను జెందించుట.

74. జాంబవంతుని ఆదేశమును అనుసరించి హిమాలయమునుండి దివ్యౌషధులున్న పర్వతమును దీసికొనివచ్చుట. వాని వాసన తగలగనే రామలక్ష్మణులు, సమస్త వానరులును స్వాస్థ్యము జెందుట.

75. వానరవీరులు లంకను గాల్చుట, రాక్షసులకు, వానరులకు మధ్య భయంకరమైన యుద్ధము జరుగుట.

76. అంగదుడు కంపన-ప్రజంఘులను, ద్వివిదుడు శోణితాక్షునీ, మైందుడు యూపాక్షునీ, సుగ్రీవుడు కుంభుని వధించుట.

77. హనుమంతుడు నికుంభుని వధించుట.

78. రావణుని యాజ్ఞచేత మకరాక్షుడు యుద్ధానికై బయలుదేరుట.

79. రాముడు మకరాక్షుని వధించుట.

80. రావణుడు పంపగా ఇంద్రజిత్తు ఘోరయుద్ధము జేయుట, వానిని వధించు విషయమున రామలక్ష్మణులు మాటలాడుకొనుట.

81. ఇంద్రజిత్తు మాయాసీతను వధించుట.

82. హనుమంతుని నాయకత్వములో వానరులు రాక్షసులతో యుద్ధము జేయుట. హనుమంతుడు రాముని యొద్దకు వెళ్ళుట. ఇంద్రజిత్తు నికుంభిలకు వెళ్ళి యజ్ఞముజేయుట.

83. సీతావధ వృత్తాంతమువిని రాముడు మూర్ఛబోవుట. లక్ష్మణుడు రాముని యోదార్చుచు పౌరుషమును జూపుటకు నుద్యమించుట.

84. ఇదంతయు ఇంద్రజిత్తు మాయ యని, సీత జీవించియే యున్నదని విభీషణుడు రామునితోజెప్పి, లక్ష్మణుని నికుంభిలకు బంపుమని ప్రార్థించుట.

85. విభీషణుడు ప్రార్థించిన ప్రకారము రాముడు ఇంద్రజిత్తును చంపుటకై లక్ష్మణుని బంపుట. లక్ష్మణుడు నికుంభిల దగ్గఱకు వెళ్లుట.

86. వానరులకు రాక్షసులకు మధ్య యుద్ధము జరుగుట. హనుమంతుడు రాక్షస సైన్యమును సంహరించుట. ఇంద్రజిత్తు హనుమంతుని యుద్ధానికి బిలుచుట, లక్ష్మణుడు ఇంద్రజిత్తును గాంచుట.

87. ఇంద్రజిద్విభీషణులు పరస్పరము కోపముతో మాటలాడుకొనుట.

88. లక్ష్మణ—ఇంద్రజిత్తులు ఘోరముగా యుద్ధముజేయుట.

89. విభీషణుడు రాక్షసులను వధించుచు వానర నాయకులను ప్రోత్సహించుట. ఇంద్రజిత్తు సారథిని లక్ష్మణుడు చంపివేయుట.వానరులు రథాశ్వములను చంపివేయుట.

90. ఇంద్రజిత్తు-లక్ష్మణులు ఘోరముగా పోరాడుట. లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుట.

91. లక్ష్మణ విభీషణాదులు రామునివద్దకు వచ్చి ఇంద్రజిద్వధ వృత్తాంతము దెలుపుట. రాముడు సంతోషించి లక్ష్మణుని కౌగలించుకొనుట-సుషేణుడు లక్ష్మణాదులకు చికిత్స చేయుట.

92. రావణుడు శోకించుట - సుపార్శ్వుడు ఓదార్చుటచే అతడు సీతను చంపుటనుండి విరమించుట.

93. రాముడు రాక్షససేనను నంహరించుట.

94. రాక్షస స్త్రీలు విలపించుట.

95. రావణుడు తన యమాత్యుల నందఱినీ పిలిపించి తన యుద్ధోత్సాహమును ప్రకటించుట. వారందఱునూ యుద్ధరంగమునజేరి పరాక్రమమును జూపుట.

96. సుగ్రీవుడు రాక్షససేనను సంహరించి విరూపాక్షుని వధించుట.

97. సుగ్రీవుడు మహోదరుని వధించుట.

98. అంగదుడు మహాపార్శ్వుని వధించుట.

99. రామరావణుల యుద్ధము.

100. రామ రావణుల యుద్ధము. రావణుడు శక్త్యాయుధము ప్రయోగింపగా లక్ష్మణుడు మూర్ఛపోవుట. రావణుడు యుద్ధమునుండి పారిపోవుట.

101. రాముడు విలపించుట, హనుమంతుడు తీసికొని వచ్చిన ఔషధిని సుషేణుడు ఇవ్వగా లక్ష్మణుడు మూర్ఛనుండి తేరుకొనుట.

102. ఇంద్రుడు పంపిన రథమునెక్కి రాముడు రావణునితో యుద్ధము చేయుట.

103. రాముడు అధిక్షేపించుట. యుద్ధములో అలసిపోయిన రావణుని అతని సారధి యుద్ధరంగమునుండి దూరముగా తీసికొని పోవుట.

104. రావణుడు సారధిని నిందించుట, సారధి రావణునకు తగు కారణము చెప్పి, రథమును మరల యుద్ధభూమికి తీసుకొని వెళ్ళుట.

105. అగస్త్యుడు వచ్చి యుద్ధములో జయము సంపాదించుటకు ఆదిత్య హృదయస్తోత్రమును పఠింపుమని రామునకు ఉపదేశించుట.

107. రామ రావణులు భయంకరముగా పోరాడుట.

108. రాముడు రావణుని సంహరించుట.

109. విభీషణుడు విలపించుట. రాముడు అతనిని యూరడించి రావణునకు అంత్యసంస్కారము చేయుమని ఆతనిని యాదేశించుట.

110. రావణుని స్త్రీలు విలపించుట.

111. మండోదరి విలపించుట. విభీషణుడు రావణునకు అంత్యసంస్కార ములు జేయుట.

112. విభీషణుని రాజ్యాభిషేకము, రాముడు హనుమంతుని ద్వారా సీతకు సందేశమును బంపుట.

113. హనుమంతుడు సీతతో మాటలాడి, తిరిగివచ్చి రామునకు ఆమె సందేశమును దెలుపుట.

114. రాముని యాజ్ఞచేత విభీషణుడు సీతను రాముని వద్దకు రప్పించుట. జానకి శ్రీరాముని గాంచుట.

115. సీత చరిత్రను శంకించిన రాముడు 'నీవెక్కడికైన వెళ్ళవచ్చును' అని యామెను ఆదేశించుట.

116. సీత అధిక్షేప పూర్వకముగా రామునకు సమాధానము జెప్పి, తన పాతివ్రత్యమును పరీక్షించుటకు అగ్నిలో ప్రవేశించుట.

117. రామునివద్దకు దేవతలు వచ్చుట. బ్రహ్మదేవుడు నీవు మహావిష్ణువని రామునకు జెప్పి, రాముని స్తుతించుట.

118. అగ్నిదేవుడు ప్రత్యక్షమై సీత పవిత్రురాలని జెప్పి, రామునకు సమర్పించుట. రాముడు సంతోషపూర్వకముగా ఆమెను స్వీక రించుట.

119. మహాదేవుని యాజ్ఞచే రామలక్ష్మణులు విమానమునెక్కి వచ్చిన దశరథునకు నమస్కరించుట, దశరథుడు పుత్రులకు, సీతకు చెప్పవలసిన మాటలు చెప్పి యింద్రలోకమునకు వెళ్ళిపోవుట.

120. రాముడు కోరగా ఇంద్రుడు మరణించిన వానరులను జీవింప జేయుట. దేవతలు స్వర్గమునకు వెళ్ళిపోవుట. వానరసేన విశ్ర మించుట.

121. రాముడు అయోధ్యకు బోవుటకు ఉద్యుక్తుడగుట. రాముని యాజ్ఞ చేత విభీషణుడు పుష్పక విమానమును దీసికొనివచ్చుట.

122. రాముని యాజ్ఞచేత విభీషణుడు వానరులను బాగుగాసత్కరించుట, రాముడు విభీషణుడు, వానరులనుగూడ దీసికొని పుష్పకముపై అయోధ్యకు బయలుదేరుట.

123. అయోధ్యకుబోవుచు రాముడు సీతకు మార్గమధ్యమునందు ఉన్న ఆయాస్థానములను జూపుట.

124. రాముడు భరద్వాజ మహర్షి యాశ్రమములోదిగి ఆయన దర్శనము జేయుట.

125. హనుమంతుడు గుహునకు, భరతునకు రాముని రాకనుగూర్చి చెప్పుట. భరతుడు సంతోషించి హనుమంతునకు బహుమతి నిచ్చుటకు నిశ్చయించుట.

126. హనుమంతుడు సీతారామలక్ష్మణుల వనవాస సమయమునందు జరిగిన వృత్తాంతములు చెప్పుట.

127. రాముని సత్కారముకొఱకై అయోధ్యలో ఏర్పాట్లు. రామునకు ఎదురువెళ్ళుటకై పౌరులందఱు నందిగ్రామములో నున్న భరతుని వద్దకు జేరుట. రాముడు నందిగ్రామము జేరుట. భరతాదులతో రాముడు కలియుట. పుష్పక విమానమును కుబేరునియొద్దకు పంపి వేయుట.

128. భరతుడు రామునకు రాజ్యమును దిరిగి యప్పగించుట. రాముడు అయోధ్యలో ప్రవేశించుట. రాముడు రాజ్యాభిషిక్తుడగుట. వానరులను వెనుకకు బంపుట.

శ్రీమద్రామాయణ గ్రంథ మహాత్మ్యము

విషయసూచిక సమాప్తము

# ని వే ద న

శ్రీరామాయణ పుణ్యగథను దనచిత్తము హర్షము రంజిలగా!
మధుర పదములను మధుర భావముల మల్లెమాలగా నలరింపన్!
శ్రీగణేశ్వరుని జిన్మయశక్తిని జిత్తము బొంగగ స్మరియింతున్!
శ్రీభారతి గిరిజామ తల్లులను సిద్ధిని గోరుచు బ్రార్థింతున్!

ఆదికవులు శ్రీవాల్మీకుల కిదె యలరి జేయుదును వందనముల్!
పూర్వకవులకును బుణ్యమతులకును బూర్ణభక్తి నే నర్పింతున్!
రామ కథను వ్రాసిన ఘనులకు నిదె రమ్య నమస్కృతు లర్పింతున్!
సీతారాముల భజించువారిని జేరికొలుతు నే నడుగడుగున్!

ఆసేతుహిమాచల పర్యంతంబును నలరెడి భారతదేశమునా!
భారతీయులకు బరమాదర్శము భవ్యరామ సీతాకథయే!
వారి మార్గమే యాదర్శము మఱి వారి చరిత దిగ్దర్శనమూ!
వారు నడిచినా మధుర మార్గమే వన్నెదెచ్చు జీవనధర్మం!

చిన్ని మాటలను చిఱుత బాలురకు తీయని తీయని రాగములన్!
తెలియ జేయగను బూనుకుంటినీ తేనె లొలికెడీ గీతికలన్!
రామాయణమది మహాసముద్రము రంజిలు హిమగిరి శిఖరమదీ!
తేట తెలుగులో మహాత్ములెందఱొ తెలియగ వ్రాసిరి విశదముగా!

అందులకే నే నఖిల దేవతల యారాధనలను జేసితినీ!
వదముల నిమ్మని భావము లిమ్మని భారతాంబ నర్థించితినీ!
ఇష్టదైవనుగు నిందిరారమణు నిహపరమిచ్చెడి రఘుపతినీ!
భక్తిభావమున శిరమును మోడ్చితి భావమునందున విలువమనీ!

ఎట్టి పుణ్యమును జేసితినో మఱి యెట్టి సుకర్మలు జేసితినో?
గట్టిగ యా శ్రీరాముని చరితము బట్టువడెను నా మనసునకున్!
మధురాక్షరములు పధురపదములై మంజుల గీతముగా వరుసన్!
లయతాళములను నృత్యము చేసెను లలితరాగ మధురోక్తులతోన్!

అల వాల్మీకులు వ్రాసినదానిని యా శ్రీరాముని నతియందున్!
వీధిగాయకులుగా కుశలవులును విమలగానమును జేసినదీ!
ఆ పాటను నే దేనుగున పాడితి నమరగానమును జేయఁతగన్!
తెలుగు బాసలో తేటతెనుగులో దెలుగు బాలకులు బాడుటకున్!

కఠిన పదములకు దూరముగా నే కఠిన భావముల జొరనీకన్!
బాలకులగు నా కుశలవులనే శ్రావ్యాదర్శముగా గొనుచున్!
శ్రీరాముని మహనీయ చరితమ్మును జేయఁగ బూనితి గేయముగా!
బాలురు వృద్ధులు బాడుకొనుటకై శ్రావ్యరాగలయ తాళములన్!

భారతదేశమునం దణుకణువున శ్రావ్య ధామ శుభచరితంబున్!
పాడుకొనును శ్రీరామరామ యని శ్రావ్యరాగలయ తాళములన్!
గాలికదలికల వినిపించును నా కమ్మని రాముని నిస్వనముల్!
అట్టి కథను నే రచింప బూనితి ఎట్టిసుకృతినో యీ జన్మన్!

సిద్ధివినాయక! చిత్రము రంజిల శిల్పి వోలె నా మదియందున్!
శ్రీరామాయణ చిత్రమందిరము జేయుచుంటి శక్తిని రక్తిన్!
ఒక్కొక్క చరణము నందియిమ్ము నే మక్కువ తోడను నిర్మింతున్!
మధురాక్షరములు దుధురభావములు మానసంబు జిందులు ద్రొక్కన్!

కన్నతల్లివని కఱలు యందునను గాంచుదుకద! భారతి! వాణీ!
అంధకారమును తొలగజేసి వ న్నాదరింపు వీణాపాణీ!
హృదయకమలమున నిడుగిడి దయతో హృది వెన్నెలను గావించీ!
కావ్యకన్యకను గమనీయముగా కాంచన కుసుమము గావింపూ!



# శ్రీ రామకథా సుధాలహరి

## యుద్ధకాండము - రెండవ భాగము

### అఱువది తొమ్మిదవ సర్గము

[రావణుని పుత్రులు, బంధువులు యుద్ధమునకు వెడలుట—
అంగదుడు నరాంతకుని జంపుట—]

ఈ ప్రకారమున విలపించుచు మఱి యిలపై బాష్పము లొలుకుచునూ,
దుర్బుద్ధియు మఱి దోర్బలుండు నగు దురహంకారము దొలగిన యా
లంకాధీశుని వాక్యములను విని శంకలేక శాంతముతోడన్
త్రిశిరస్సనెడు రాక్షస వీరుడు దీరుగ బలికెను నీరీతిన్! 1

రాక్షసేంద్ర మా తండ్రుల యందున రహి మధ్యముడగు వీరుండున్
కుంభకర్ణుడల మహారణముననుఁ కూలెను విక్రమమును జూపి
అదినిజమే! కానీ మహాప్రభూ! యరయగ మది యాలోచింపన్
నిను బోలెడి సత్పురుషులు ధాత్రిని నీరసించి విలపింపరుగా! 2

రాక్షసేంద్ర! ముల్లోకంబులనూ రహి జయింప గలవాడవునూ!
అట్టి నీవు మఱి యధీరుండవై యిటు మది జింతింపగ దగునా!
ప్రాకృత మానవునికివలె నీవిధి బరగ కలత జెందుట తగునా?
లోకములన్ని జయించిన వాడవు లోకేశ్వరుడవు నీవు ప్రభూ! 3

బ్రహ్మదత్తమగు శక్తియు గలదూ బహు దృఢమగు కవచంబు మఱిన్
సాయకములు మఱి ధనుస్సుగలదూ సహస్ర ఖరములు గట్టిన యా
మేఘమాలతో సమానమ్మైనా మిగుల ధ్వనియుగల రథంబునూ
నీకుగలవు! ఓ లంకాధీశా! నీకు సాటి మఱి లేరుగదా! 4

అనేకంబులగు జైత్రయాత్రలను నలఘుక వీరత జేసితివీ!
ఆయుధములచే దేవదానవుల యలరి జయించిన వాడవుగా!
సర్వాయుధముల సంపన్నుడవై సాహసవిక్రమముల గూడీ
రామచంద్రునీ శిక్షించుటకును రహి సమర్థుడవు నీవు ప్రభూ! 5

మహాప్రభూ నీవట్లే యుండుము! మానుగ నే యుద్ధంబునకున్,
బయలుదేరెదను సాయుధుండనై బలవిక్రమములు జూపెదనూ!
గరుత్మంతు డా సర్పములను వలె కదనరంగమున జీల్చెదనూ
నీ శత్రువులను నిర్మూలించెద నిర్దయతో వెకలింతు నిదే! 6

దేవేంద్రునిచే శంబరాసురుడు దీరుగ నీల్గినపటుల మఱిన్,
విష్ణువుజేతను నరకాసురుడును విమలగతిని బొందిన రీతిన్
నా జేతను రణభూమి యందునను నయముగ శ్రీరాముడు నేడున్
నిపతితుండై మఱి నేల కౌఁగిలిగనూ నిదురపోవు జిరకాలంబున్! 7

రాక్షసాధిపుండైన రావణుడు రహిని త్రిమూర్ధుని మాట వినీ,
కాలచోదితుండై తా మఱలను నిల జన్మించిన వానినిగా
మనసునందు భావించెను నాతడు మానుగ ధీరత్వము నందీ,
శిథిలమైన తన యాశలు మఱలను జిగురులు దొడుగగ చిత్తమునన్! 8

త్రిశిరస్సు రాక్షసు మాటలు విని దీరుగ దేవాంతకుడు మఱిన్
నరాంతకుండును, దేజస్వియునగు నయముగ యతికాలయుండు మఱిన్,
యుద్ధమునకు నుత్సాహము జూపుచు నూహకు నందని విధముననూ,
సిద్ధమైన రణరంగమునకు మఱి శీఘ్రము బెనుకేకల తోదన్! 9

అటుపిమ్మట రావణుని తనూజులు నల శక్రునితో సమానులున్,
బాహు పరాక్రమమందు విక్రములు బన్నుగ రణకుశలురు వారున్
నేను వే ననుచు గేకలు వేయుచు వినిపించుచు బహు ప్రతాపముల్
యుద్ధోత్సాహము గలవారగుచును యుద్ధమునకు బయనంబైరీ! 10

వారందఱు నాకాశమునందున వనర సంచరించెడి వారున్
వారందఱు మాయా విశారదులు వలనొప్పగ బహు నేర్పరులున్
సురలతోని యుద్ధంబులు జేసీ ప్రుక్కగ జేసినవారు నుఱిన్
ఆరాక్షసు లందఱు రణమందున యలరు దుర్మదులు, ప్రతాపులున్! 11

సర్వులు దృఢబల సంపన్నులునూ సర్వులు కీర్తియు గలవారున్,
జైత్రయాత్రలకు బోయి దేవతల సరగున గంధర్వుల జేతన్

కిన్నెర, మహోరగులచే గూడను బరగ పరాజితులైనటులన్!
జెప్పబడనివారే, వారందఱు జెలగి జయించిన వారు మఱిన్! 12

ఆ రాక్షసు లందఱు నస్త్రముల యలరి దెలిసినావారు మఱిన్,
వారందఱు యుద్ధమున నేర్పరులు నలరు బలాఢ్యులు, విక్రములున్!
శ్రేష్ఠమైన విజ్ఞానము గలిగిన స్థిరమగు బుద్ధులు గలవారున్
పరదేవతలను బూజలు జేసి వరముల నందినవారు మఱిన్! 13

భాస్కరతుల్య సుదర్శనమును గల ప్రబల శత్రుబల సంపదలన్
పీడించెడి యా సుతులతోని మఱి కూడియున్న యా రావణుడున్
మహాదానవుల బలదర్పములను మానుగ యణచెడి దివిజులతో
గూడినట్టి యా దేవరాజువలె కూరిమి యతడు ప్రకాశించెన్! 14

రావణు డంతట తన కుమారులను రహి కౌగిలిని జేర్చికొని
స్వర్ణరత్న భూషణముల తోడను సాధురీతి భూషించి మఱిన్
ప్రశస్తమగు నాశీర్వాదములను బన్నుగ వారల దీవించి
రణరంగమునకు వారల నంపెను రయమున సాయుధ బలగముతో!

రావణు డంతట తన కుమారులను రక్షణార్థమై వేవెంటన్,
దన సోదరులగు యుద్ధోన్మత్తుని దగ మత్తుని వారల వెంటన్
రణరంగమునకు బంపెను వారల రయమున జయమును నందగనూ! 16

మహా కాయములుగల రాక్షసులును మానుగ మహాత్ముడగునట్టి
లోక రావణుండైన రావణుని లోలత వందనమును జేసి!
ప్రదక్షిణంబును జేసి యంజలుల ప్రభుభక్తిని బ్రకటించి మఱిన్,
యుద్ధభూమికిని పయనం బైరి యుద్ధతులగు వీరులతోడన్! 17

మహాబలాఢ్యులు మహావిక్రములు మానుగ యార్గురు రాక్షసులున్,
సర్వౌషధులును, సుగంధములనూ సమాలభ్యులై సురుచిరతన్,
బటుతర యాయుధముల గైకొని మఱి ప్రబల సైన్యముల గూడికొని
కాలచోదితులునై వారందఱు క్రమమున వెడలిరి రణమునకున్! 18

త్రిశిరస్సుండును, నతికాయుండును, దేవాంతకుడును, నరాంతకుల్
మహోదరుండును, మహాకాయుడును మహాయుధములను ధరియించి,
యుద్ధభూమికిని బయలుదేరిరి యురుతర ప్రతాపమును జూపన్! 19

అటుపిమ్మట యా మహోదరుండును బటుపరాక్రముడు వేగముగన్,
నల్లని జీమూతముతో సమమగు తెల్లని దంతములును గలుగూ!
ఐరావత కులమున జన్మించిన యతరు సుదర్శన మను పేరన్,
బరగునట్టి గజ మారోహించెను బన్నుగ పరివారముతోడన్! 20

సర్వాయుధముల ధరించి యాతడు సరసత యంబుల పొదుల మఱిన్,
అలంకరింపగ బడిన రాక్షసుడు నా మహోదరుడు నేనుగుపై
విరాజమానుండై యస్త్రాద్రిని విమలమైన శిఖరము నందున్
భానుబింబముగ బ్రకాశించెనూ బన్నుగ కాంతులు జిమ్ముచునూ! 21

రావణాత్మజుండైన త్రిశిరసుడు రయమున యుత్తమ హయములనూ,
గూర్చినట్టి మఱి సర్వాయుధముల గూరిమి నింపగ బడినట్టి
మహోన్నతంబగు రథమును నెక్కెను మానుగ రణభూమికి వేగన్! 22

ధనుర్ధరుండగు నా రాక్షసుడును దగ రథమును నధిరోహించి
మెఱుపులతోడను, బిడుగులతోడను మిగుల యగ్నిజ్వాలల గూడి,
ఇంద్రధనుస్సును గూడినట్టి యా సాంద్ర మేఘములకును బోలెన్
విరాజమానుండై యరదంబున విపుల భాసమానుడు నయ్యెన్! 23

మహోన్నతంబగు యరదమునందున మానుగ యా రాక్షసుడు మఱిన్
మూడు కిరీటములను ధరియించిన మోదము నందిన త్రిశిరసుండున్,
మూడు సంఖ్యగల బంగరు గిరులను మోహనాకృతిని మెఱసెడి యా
శైలేంద్రుండగు హిమవంతునివలె సరసరీతి వెలుగులు నింపెన్! 24

అటుపిమ్మట మఱి యతి తేజస్వియగు నా దశాననుని కుమారుడున్,
ధనుర్ధరులలో శ్రేష్ఠుండును మఱి దగ రణవీరుడు నైనట్టి
అతికాయుడు నున్నతమగు రథమును నధిరోహించెన్ వేగముగన్! 25

సుచక్రములునూ, నిరుసులు గలదియు, సుసంయుక్తమై యలరెడిదీ,
స్వనుకర్షంబును, సుకూబరంబును సాంద్ర తేజమును గలదియునూ!
అశ్వరాజములతో గూడినదీ యంబుల పొదులును, ధనుస్సులున్
ప్రాస, ఖడ్గములతో గూడికొనీ పరిఘలతో నిండుగ యుండెన్,
అతికాయుడు నున్నతమగు రథమును రధిరోహించెను వేగముగన్! 26

అతికాయుండును కాంచన చిత్రిత మైన కిరీటము దోడుతనూ,
అలంకారముల కాంతుల చేతను నలరి ప్రకాశించెడు నట్టీ
సుందరమగు నా మేరుపర్వతము శోభలతో సమముగ యుండెన్! 27

రాక్షస శ్రేష్ఠులతో గూడిన యా రమ్య మహా బలశాలియునూ,
రాజసూను డా రథమునందునను రమ్య తేజముల జిందుచునూ
అమరులతో గూడిన యింద్రునివలె యా రాక్షసుడును వెలుగొందెన్! 28

అటుపిమ్మట యానరాంతకుండును నల యుచ్చైఃశ్రవమును బోలెన్,
శ్వేత వర్ణమును గలదియు మఱియును ప్రీతి కనక భూషణములతో!
మహాజవంబును గలదియు మఱియును మహాకాయమును గలదియునూ!
అట్టి హయంబును నధిరోహించెను నబ్బుర మందగ నందఱునూ! 29

ఆ నరాంతకుడు నగ్నిపిండమును నలరెడి కాంతియు గలదియునూ,
ప్రాసము గ్రహించి యశ్వముమీదను బన్నుగ యధిరోహింపగనూ!
నెమిలిపైని గూర్చుండినట్టి యా నిఖిలేశ్వరి పార్వతి సుతుడున్,
కుమారస్వామికి వలె దేజమునను గూరిమి నొప్పెను రాక్షసుడున్! 30

అటుపిమ్మట యా దేవాంతకుడును నలరు హేమభూషితమైనా
పరిఘను గ్రహించి బయలు వెడలెనూ బటుతర విక్రమమును మెఱయన్!
సముద్ర మథనమునందు బాహువుల సరసత మందర పర్వతమున్
ధరియించిన విష్ణువు శరీరమును దగ యనుకరణము జేయుచునూ!
పరివారములో బయలు వెడలెనూ బటుతర వీరాలాపములన్! 31

మహాతేజమును గలవాడును మఱి మహాపరాక్రమ వంతుండున్,
గదాధరుండును కరనరంగమున కడు చతురుడు నగు రాక్షసుడున్,

మహాపార్శ్వుడును ధరించి గదనూ మానుగ రణమునకును వెడలెన్
యుద్ధమునందున యల కుబేరువలె యుద్ధతి గతిని బ్రకాశించెన్! 32

అమరావతి నుండియు దేవతలును నలరి ప్రయాణము జేసినటుల్,
ఆమహాత్ములగు రాక్షసులందఱు నలరి రణమునకు జనుచుండన్!
మహాబలాఢ్యులు, పదాతిసైన్యము మహాయుధములను ధరియించీ
గజములతోడను, హయములతోడను కఠినమైన ధ్వనియును గలుగూ!
రథములతోడను నా రణవీరులు రయముగ బోయిరి వెనువెంటన్! 33

భాస్కరుడు వర్చస్సును గలవారును బరగ కిరీటంబుల తోడన్,
మహాశోభతో గూడిన వారును, మహాత్ములగు నా రాకొమరుల్
ఆకాశమున విరాజమానమగు నల గ్రహములవలె కాంతులతో
బ్రకాశించిరీ బటు ప్రతాపమును బన్నుగ జూపగ రణమందున్! 34

వారు ధరించిన వస్త్రంబులు మఱి వన్నెలు జిందుచు శివకరమై
శరత్కాల మేఘంబుల బోలుచు చలించుచును దేహంబులపై
ఆకాశము నందున హంసలవలె యలరి ప్రకాశించెను నపుడున్,
బటుతరమగు ధీరత్వము మెఱయగ బాహుబలాఢ్యులు వారపుడున్! 35

మనమైనను మరణింపగవలె ధర మఱి శత్రువు మరణింపవలెన్,
ఏదో యొక్కటి జరిగి తీరవలె యిలపై కీర్తియు నిలువవలెన్,
అనుచు మదిని నిశ్చయమును చేసి యా వీరులు గడు ధీరతమా!
యుద్ధభూమికిని బయలుదేరిరీ సిద్ధిని బొందగ రణమందున్! 36

బయలువెడలినా యా రాక్షసులును బన్నుగ రణరంగము నందున్
దుష్టమదంబును గలవారగుచును దూకుచు ముందుకు గర్జనలన్,
జేయుచు మిక్కిలి ధ్వనులను జేసిరి శీఘ్రము బాణ ప్రయోగములన్
జేసిరి మఱియును నస్త్రశస్త్రముల జెలగి ప్రయోగించిరి వారున్! 37

ఆ రాక్షసులయు వివిధ నాదములు నఱచుట, జబ్బలు జఱచుటనే
భూమండలమును జలించి నటులను భూరి శబ్దమును గలిగె నటన్,

ఆ యసురుల గడు సింహ నాదములు నాకాశము మఱి చీలికలై
బ్రద్దలైన విధమున నట దోచెను బటుతరమగు శబ్దంబులచే! 38

మహాబలముగల రాక్షసవీరులు మానుగ రణమునకును వెడలి,
శిలాయుధములను జేత ధరించీ సిద్ధముగా నిలిచిన యట్టి
వానర సైన్యములను గాంచిరి యట వనరగ రణభూమిని వారల్ 39

మహాత్ములగు కపివీరులు గూడను మానుగ గాంచిరి రాక్షసులన్,
గజములతోడను, హయములతోడను కాంచన రథముల తోడుతనూ!
వందలకొలదియు మువ్వల జేతను వనరగ ధ్వనింప బడుచుండెన్! 40

నల్లని మేఘముతో సమానమై నయముగ యెత్తగ బడినట్టి
మహాయుధంబులు గలిగిన యట్టి మహాకాంతులను జిమ్ముచునూ
అగ్నిసూర్యులకు వలె జ్వలించుచును ననంత రాక్షస బలగముతో
వచ్చుచున్న యా రాక్షససేనను వనరగ గాంచిరి కపివీరుల్ 41

ఆకపివీరులు వచ్చినట్టి యా యతిబల రాక్షస సైన్యంబున్
గాంచి లబ్ధలక్ష్యము గలవారై గలగల జేసిరి ప్రబల ధ్వనుల్!
పర్వతంబులను హస్తంబులతో బన్నుగ నెత్తుచు కపివీరుల్
ఆరాక్షసులను సహింపకను మఱి యఱచిరి యెదురుగ నిలిచి యనిన్! 42-43

అటుబిమ్మట పటు బలవంతులునగు నా రక్షోగణమును నపుడున్
వానరసేనా నాయకులయు మఱి వనరగ కపిసేనల ధ్వనియున్!
అధికమైన ధ్వని విని కపివీరుల యలరు బరమ హర్షము గాంచీ,
సహింపజాలక యా రాక్షసులును సకల భూతములు వెఱగందన్
ఆకాశంబును బ్రతిధ్వనింపగ యలరుచు జేసిరి ప్రలాపముల్! 44

కోపించిన యా కపి వీరులలో గొందఱు నాకాశము నందున్
బ్రవేశించిరీ, మఱికొందఱు మఱి బన్నుగ ధాత్రీతల మందున్
ద్రుమశిలాయుధములును గలవారై దుస్సహ క్రోధమునను గూడీ
రాక్షస సైన్యము నందు జొచ్చి మఱి రహి రణమును సలిపిరి వారున్!

ఆ వానర పుంగవులును రణమున యతి విశాలమగు ద్రుమానులతో
గూడినట్టి వృక్షంబుల తోడుత కూరిమి జేసిరి యుద్ధంబున్
రక్షోవానర సంకులంబునగు రహి యా యుద్ధము జూచుటకున్
మహాభయంకరముగ నుండెను మఱి ఘనముగ యా సమయమునందున్! 47

భయంకరంబగు పరాక్రమము గల బన్నుగ యా వానర వీరుల్
శరజాలముచే నివారింపబడి సరగున ధర బడుచుండిననూ
పాదప శైల శిలా వర్షంబును బన్నుగ కురిపించిరి వారున్! 48

అట్టి మహా రణరంగము నందున యిట్టి వానరులు రాక్షసులున్
భయంకరమగు సింహ నాదములు బటుతరముగ జేసిరి ధ్వనులున్
ఆ వానరవీరులు రాక్షసులను నలరు శైల వృక్షంబుంతో
చూర్ణము చూర్ణము జేసిరి రణమున జూచువారలును భయమొందన్! 49

క్రుద్ధులైన యా వానర వీరులు గోపముతో రణమందుననూ
కవచాభరణములను ధరించినా కలగి వధించిరి రాక్షసులన్
కవచాభరణములను ధరించినా కలగి వధించిరి రాక్షసులన్
రథములమీదను నున్న రాక్షసుల రహి గజములపై గలవారిన్
అశ్వంబులపై నున్నవారినీ నలరుచు జంపిరి ద్రుమములచే! 50

ఆ ప్లవంగ వీరులు భీకరముగ యారాక్షసులను దీవ్రముగా
మర్దించిరి యంగాంగంబులనూ ద్రుమానుల తోడను దీవ్రముగా
శైల శిఖరములు మీదబడుటచే సరగున పిడికిలి గ్రుద్దులచే
కనులు బైకి వచ్చుటచేతను మఱి కంపముజెందిరి రాక్షసులున్
దెబ్బలకోర్వక నేలను బడిరీ దీనముగా నలుచుచు వారున్! 51

రాక్షసవీరులు గూడ యంతటను రహి తీవ్రములగు శరములచే
వానరవీరుల శరీరంబులను వరుసగ జీల్చిరి రెండుగనూ!
శూలంబులతో ముద్గరములతో సురుచిర ఖడ్గంబుల తోడన్
ప్రాసలతోడను, శక్తులతోడను బన్నుగ గొట్టిరి వానరులన్! 52

రిపు శోణిత దిగ్ధాంగంబులతో రెచ్చిన వానర రాక్షసులున్
పరస్పరంబును జయమును గోరుచు బగతుర నాశము గోరుచునూ
యొకరి నొకరు బడ(ద్రోసి కొనుచునూ యొప్పుగ పోరాడిరి వారున్! 53

అట్టుభిమ్మటు యా హరిరాక్షసులును నా విధి రణమును సేయుచునూ!
వారలజేతను విడువ బడిన యా వనర శిలల ఖడ్గంబులచే
ముహూర్తకాలమనందు వసుంధర యహో! రక్తమున దడుప బడెన్! 54

అట్టి సమయమున భూమియంతయును నటు నిటు జిమ్మగ బడినట్టి
పర్వతంబులకు సమానమైనా బన్నుగ యాకారము గలుగూ,
యుద్ధమదంబున మరణించిన యా యుద్ధభూమి యం దంతటనూ
కరచరణాద్యవయవములు దొలగిన కళకు రాక్షసులతో నిండెన్! 55

రానర వీరులబేత శూలములు వడి భగ్నము జేయగ బడుచున్,
ధాత్రీతలమున (ద్రోయగబడినా దగ(ద్రోయగ బడుచుండిన యా
రాక్షసులును మఱి యా వానరులను రహి సమీపమునకును జేరీ
కరచరణాద్యవయవముల జేసిరి కడు నద్భుతమగు యుద్ధంబున్! 56

ఆ రాక్షసవీరులు వానరులను నల వానరవీరుల జేతన్
ఢీ కొట్టించియు జంపిరి వారల ఢీ యని కేకలు వేయుచునూ!
ఆ కపివీరులు గూడ నట్టులే యా రాక్షసులకు రాక్షసులన్
ఢీ కొట్టించియు నాశము జేసిరి ఢీ యని కేకలు వేయుచునూ! 57

ఆ సమయంబున రణరంగంబున యా రాక్షసులును వేగముగన్
ఆ కపివీరులనుండి శిలలనూ నల శైలంబుల లాగికొనీ
వానరవీరుల మర్దించిరిగా వరుసబెట్టి (ప్రబలంబుగనూ!
ఆ వానరులును నష్టేజేసిరి యలరి రాక్షసుల ఖడ్గములన్,
లాగికొనియు మఱి వారల గొట్టిరి దగ వెనుకంజయు వేయకనూ! 58

ఆ కపివీరులు, రాక్షసవీరులు నల పర్వత శిఖరంబులచే,
పరస్పరము భేదించు కొనుచునూ బడి చచ్చిరి ధాత్రీతలమున్,

సింహనాదములు జేయుచు వారలు సింహంబుల వలె పైబడుచున్,
ఒకరి నొకరు జడద్రోయుచు వారలు వికట రీతి జేసిరి రణమున్! 59

వానర వీరుల జేత గొట్టబడి వరుసను రాక్షసవీరు లటన్
భిన్న వర్మ తను త్రాణములనునై భీకర శరీరముల నుండీ,
ద్రుమములు, రస సారమును, జిగురులను దోరముగా విడిచిన యటులన్,
వారి శరీరమునుండి రక్తమును వసరగ క్రొవ్వును గారె నటన్! 60

రణమునందు గపివీరులు గొందఱు రథముజేత మఱి రథంబునూ,
గజము చేత మఱి గజమును గొట్టిరి గడు భుజబలముల జూపుచునూ,
హయముజేత మఱి హయమును గొట్టిరి యలసట యింతయు లేకయునూ!

రాక్షసులంతట క్షుర ప్రశరముల యర్థ చంద్ర బాణంబులచే
భల్ల బాణముల చేతను గఱకగు బటుతర బాణంబుల జేతన్,
వానరవీరులు ప్రయోగించినా వవ వృక్షములను, శిలల మఱిన్
బ్రద్దలుగొట్టిరి చెదిరిపోవునటు బాహుబలంబును వెలయగనూ! 52

రణరంగము నందంతట గూడను రహి పర్వత శిలలను గూడీ
చేదింపగ బడినట్టి వృక్షములు వధియింపగ బడినట్టియునూ
వానర-రాక్షస శవముల తోడను వసరగ రక్తపు మడుగులతో
వ్యాప్తమైన యా వసుధాస్థలమును వసర దుర్గమమునై యుండెన్! 63

ఆ వానరులును సంగ్రామంబున యలరి గర్వ హర్షంబులతో,
సంతోషముతో గూడినవారై సాహసమున భయమును విడిచీ,
అధిక సత్త్వమును గలవారై మఱి అనేక యాయుధముల తోడన్
పోరు సలిపెడీ రాక్షసవీరుల పూని నిలిచి జేపిరి రణమున్! 64

సంకుల సమరము నందు వానరులు సంతోషించుచు నుండుటయున్
ఆ రాక్షసులును నేల గూలుటయు నటు బరాజయము నందుటయున్
కనుల గాంచి పైనుండి దేవతలు కరమున మహర్షులును హృదిలో
సంతోషించిరి కడు వేడుకతో కరములతో జేసిరి ధ్వనులన్! 65

అటువిమ్మట యా నరాంతకుండును బటుతర వాయువు సమానమున్
వేగముగలిగిన గుఱ్ఱము నెక్కి వికటమైన శక్తిని బట్టి
మహామీనమును మహాసంద్రమును మానుగ జొఱబడు నటుల మఱిన్
వానరసైన్యము నందు జొచ్చెనూ వనర విక్రమము జూపగనూ! 66

మహావీరుడును ఇంద్ర రిపుండును మహాత్ముడగు నా రాక్షసుడున్
అత డొక్కరుడు నొక్క క్షణములో నలరి యేడువందల మందిన్
మహావానరుల మహాప్రాసమున మానుగ సంహారము జేసెన్,
వానరసైన్యము నంతను జేసెను వనరగ జిందర వందరగన్! 67

విద్యాధరులును మహా ఋషులునూ విమలాకాశము నందుండీ
హయ పృష్ఠముపై గూర్చొనియుండీ నల వానరసైన్యము నందున్
చండశాసనుని వలె నరాంతకుడు స్థిరముగ దిరుగుచు నుండగనూ
కనులగాంచి యాశ్చర్యముతోడను గడు నద్భుతమును నొంది రటన్!

ఆనరాంతకుడు సంహరించుచును నలరుచు బోయిన మార్గంబున్
రక్త మాంసముల బురదతోని నటు రహి యా మార్గం బంతయునూ
నిండియుండెనూ నేలపై బడిన దండిగ పర్వత సమమైనా
ఆకారముగల కపివీరులతో నలరి యుండె ధరణీతలమున్! 69

విక్రమింపగా వానర వీరులు వేగ దలచు లోపల నంతన్
ఆ కపివీరుల నతిక్రమించుచు నలరి చీల్చివేయుచు నుండెన్!
మెఱుపు యుద్ధమును నా రాక్షసుడును మెఱయుచు జేయుచు నుండె ననిన్
అతలాకుతలము జేయుచు నుండెను నా వానరసైన్యము నంతన్! 70

అగ్ని వనంబును దహించినట్టుల యా నరాంతకుడు గపిసేనన్
దహించి వేసెను వనౌకసులునూ దగ వృక్షంబుల శైలములన్
ఎంత సమయమున బెకలించిరో మఱి యంతలోనె తన ప్రాసమునన్,
గొట్టబడిన వారై వానరులును గుప్పగ కూలుచు నుండి రటన్
వజ్రముజేతను గొట్టబడిన యా వన పర్వతముల వలె బడిరీ! 71

నరసంహారకుడును బలవంతుడు నయముగ యా రణమందుననూ
హస్తమునందున ప్రాసను గైకొని యల వర్షాకాలము నందున్
వాయువునకు వలె నన్నివైపులను నలరి కపుల మర్దించుచునూ
అన్ని దిక్కులను సంచరించెనూ యప్రతిహతముగ ధీరతనూ! 72-73

వీరులైన యా వానరధీరులు విశదముగా మాటాడుటకున్,
నిలబడుటకును సమర్థులు గాకను నీరసులై యుండిరి యపుడున్.
కదలుటకును మఱి సామర్థ్యం బెట? కదన వీరుడగు రాక్షసుడున్,
నెగురుచున్నవానిని, నిలిచియు మఱి కదలి నడుచు వానిని వేగన్,
అందఱినీ వధియించెను నాతడు నలరి బాహుబల వీర్యమునన్! 74

అనేక రాక్షస వీరుల సముడగు నా నరాంతకుడు వేగముగన్,
ఆ మహారణంబున రాక్షసుడును నా వానర సైన్యంబులనూ,
సూర్యుని తేజస్సులు గల ప్రాసను సురుచిరముగ చే ధరియించీ,
బడవేసెను ధరణీతలమందున బన్నుగ వ్యాకుల మందగనూ 75

ఇంద్రుని వజ్రాయుధ సమానమగు సాంద్రమైన ప్రాసనుగాంచీ,
అట్టి ప్రాస పటు ప్రహారంబులకు నా వానరులు సహింపకనూ,
మహాస్వనంబును గావించిరి మఱి మహావేదనల నందుచునూ! 76

ధరణీతలమున బడుచుండిన యా దగ కపివీరుల రూపములున్,
వజ్రాయుధమున శిఖరాగ్రములను వనరగ బీడింపగ వేగన్
బడిపోవుచు నుండెడి గిరులకువలె బరగ ప్రకాశించుచు నుండెన్! 77

పూర్వము రణమున మహాత్ములైనా పొలుపుగ వానర వీరులునూ,
కుంభకర్ణుచే బడిగొట్టగబడి, కోల్కొని రక్షణ నిమిత్తమై
సుగ్రీవుని జెంతకును జేరికొని సూటిగ వేడిరి శరణంబున్! 78

సుగ్రీవుడు పరికించి జూడగా సూటిగ రణరంగమునందున్,
నరాంతకునిచే భయపడి కపులును నయముగ నటునిటు బోవుచునూ.
పరుగులు దీసెడి కపిసైన్యంబును బన్నుగ గాంచెను గపీంద్రుడున్! 79

పాఱిపోవు నా కపిసైన్యంబును బరగ గాంచు సుగ్రీవునకున్,
మహాప్రాసమును ధరించి హయమున మానుగ గూర్చుండియు నెదురన్
వచ్చుచున్న యా నరాంతకుండును వసరగ కనిపించెను వేగన్! 80

మహాతేజమును గలవాడును మఱి మానుగ వానర రాజయినా,
ఆ సుగ్రీవుడు గాంచి మనసునను నబ్బుర మందుచు గాఢముగా,
ఇంద్రుని సమమగు పరాక్రమంబును సాంద్ర బాహుబల వీర్యంబున్
అంగదకుమారు తోని బలికె నిటు మంగళప్రదమగు వాక్యంబున్! 81

అంగదకుమార! శీఘ్రము వెడలుము! నాలస్యము నిక జేయకుమా!
అశ్వము నెక్కి యల్ల కపిసేనను నలరి గూల్చి వేయుచునున్నా,
వీరుడైన యా రాక్షస ధీరుని వెనుక ముందు మఱి జూడకనూ,
కూల్చివేయుమా! రణరంగంబున కూర్మి జయము గలుగగ మనకున్! 82

ఆ సుగ్రీవుని వాక్యంబులను విని యా యంగదుడును వేగముగన్
వీర్యవంతుడును, విక్రమ ధీరుడు విపుల వ్రతుడు నా యంగదుడున్
మేఘసమంబగు సైన్యము నుండీ మేలిమి బంగరు సూర్యుండున్
వెడలివచ్చినటు నా యంగదుడును వెడలి యెగిరి వచ్చెను నటకున్! 83

శిలసముదాయముతో సమానుడును శీలవంతుడును గపులందున్,
బాహుపురులునూ గలిగిన వాడును, బాహు బలాఢ్యుడు నంగదుడున్,
ధాతువులను గూడిన పర్వతముగ దగ యుండెను నా యంగదుడున్! 84

నిరాయుధుండును, మహాతేజుడును, నిండు దనము గలవాడు మఱిన్
నఖ దంష్ట్రంబులు మాత్రము గలిగిన నయముగ వాలి సుపుత్రుండున్!
ఆ నరాంతకుని సమీపించి మఱి నలరుచు నీ విధమున బలికెన్! 85

ఆగు మాగుమా! రాక్షస వీరుడ! యలరి యెదుర్కొనుమా నన్నున్,
సామాన్యులు నీ కపివీరులతో సరసత కలహము దెందులకూ?
వజ్ర సమంబగు స్పర్శయు గలిగిన వసరగ నీ ప్రాసంబు నికన్
నా వక్షస్థలమున వే విసరుము! నయముగ నీ బల శౌర్యమునన్! 86

ఆ యంగదు వాక్యములను వినుచును యా నరాంతకుడు వేగముగన్,
క్రోధముతో బెదవులను గొఱుకుచును గూరిమి విషసర్పము వోలెన్,
బుసలు గొట్టుచును యంగదు మీదకు బొలుపుగ వచ్చెను బై పైకిన్! 87

సముజ్జ్వలించుచు నున్న ప్రాసనూ సరగున హస్తమునను బట్టీ,
వాలి సుతుడు నంగదుపై విసిరెను వనరగ యాశ్చర్యము గలుగన్!
వజ్రసమానంబగు నంగదునీ వక్షస్థలమున బడిపోయెన్
ముక్కలు ముక్కలుగా బడిపోయెను రిక్కలవలె ప్రాసయు ధాత్రిన్! 88

అంగదు డంతట గరుత్మంతుచే నల ఛేదింపగ బడినట్టీ,
సర్పము వోలెను విక్రమ మంతయు సరగున నిష్ఫల మగుటయునూ
విరిగిపోయినా ప్రాసను గాంచీ విపుల బాహు బల శౌర్యమునన్
అరచేతిని మఱి చాచి కొట్టెనూ యశ్వము తలమీదను వేగన్! 89

ఆ నరాంతకుని యచల సమంబగు నా యశ్వము మఱి యంగదునీ,
యఱచేతను గొట్టిన యా దెబ్బకు నా యశ్వము దల పగిలియునూ,
పాదంబులు విరిగెను, నేత్రంబులు బన్నుగ కనుగ్రుడ్లును బగిలెన్,
నిష్క్రాంతంబగు నాలుక గలదై నేలమీద యశ్వము బడియెన్! 90

చంపబడిన బడిపోయిన యశ్వము బరగ నరాంతకుడును గాంచీ,
క్రోధవశుండై పోయెను నాతడు కూరిమి గొఱుకుచు బెదవులనూ,
మహాప్రభావము గల రాక్షసుడును మఱి పిడికిలినీ బిగియించీ,
రణమున యా యంగదుని శిరస్సున రయమున గొట్టెను బలముగనూ! 91

ఆ నరాంతకుని ముష్టి ఘాతమున యా యంగదుడును వేగముగన్,
శిరసున గాయము తగిలి ప్రబద్ధలై చారెడి రక్తము స్రవియించెన్,
మాటిమాటికిని మండి పడుచునూ మఱి మోహము జెందెను నతడున్,
మఱల సంజ్ఞనూ పొందిన బిమ్మట మఱి విస్మయ మొందెను నతడున్! 92

అటుబిమ్మట యా మహాత్ముండునూ యల వాలికిని సుపుత్రుండున్,
అంగదు డంతట మృత్యు సమానము నతివేగము గలిగిన యట్టీ,

పర్వత శిఖరమువంటి పిడికిలిని బహు శీఘ్రముగా బిగియించి,
ఆ నరాంతకుని వక్షస్థలమున యలరి గొట్టి బహు దీవ్రముగన్! 93

వాలిసుతుని యా పిడికిలి దెబ్బకు ఆ నరాంతకుడు శీఘ్రముగన్
అణిగిపోయినా వక్షస్థలమును నారని జ్వాలల గ్రక్కుచునూ!
శోణిత దిగ్ధంబగు గాత్రంబున శోషిలుచును సర్పము వోలెన్,
వజ్రపాతమున భగ్నమైన యా వనర పర్వతము పలె గూలెన్! 94

మహా విక్రమము గలిగినట్టి యా మహారాక్షసుని రణమందున్,
వాలి కుమారుడు హతమార్చుటయును నలరుచు నాకాశము నందున్,
త్రిదశోత్తములును, మహాఋషులుమా, దీరుగ ప్లవంగ వీరులునూ,
ఆనందముతో ధ్వనులను జేసిరి నాకాశము ధ్వనియింపంగన్! 95

అటుబిమ్మట శ్రీరామచంద్రునకు నధిక ప్రహర్షము జేసెడి యా
సుదుష్కరంబగు బరాక్రమంబును జూపెను వాలిసుతుం డపుడున్,
దా జేసిన యా వీరకృత్యమున తానే గడు విస్మయ మొందెన్,
భీమపరాక్రమవంతుడైన యా భీమబలుడు నా యంగదుడున్,
మలల యుద్ధమున యుత్సాహంబును మానుగ జూపెను ధీరతనూ!

(యుద్ధకాండములోని 69వ సర్గము సమాప్తము]

   

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

(డెబ్బదియవ సర్గము)

(హనుమంతుడు, దేవాంతక త్రిశిరస్సులను, నీలుడు మహోదరుణ్ణి ఋషభుడు మహా పార్శ్వుని వధించుట)

నరాంతకుడు సంగ్రామమునందున నయముగ మరణించుట గాంచి,
త్రిశిరస్సు మఱి దేవాంతకుడును దీరుగ దుఃఖితులై మఱియున్,
పులస్త్య బ్రహ్మకు కుమారుడైనా పూనిక మహోదరుండు మఱిన్
వేదనజెందుచు రోదించిరి మఱి వికలత జెందుచు హృదయమునన్! 1

అటుబిమ్మట యా మహోదరుండును నలరు మేఘ సంకాశమునూ,
వారణేంద్రమున యారూఢుండై వనర జవంబున క్రోధమునన్
మహావీరుడగు నంగదుపైకిని మానుగ యెదురుగ బరుగెత్తెన్! 2

భ్రాతృవ్యసన సంతప్త మానసుడు బలవీర్యుడు దేవాంతకుడున్
భయంకరంబగు బరిఘను దాల్చి ప్రబల బాహుబల వీర్యమునన్,
అంగదుపైకిని క్రోధము తోడను జెంగున దూకెను నెదురుగనూ 3

అటుబిమ్మట వీరుడు త్రిమూర్ధుడును నలరు శ్రేష్ఠమగు నశ్వములన్
గూర్చబడిన రవితేజము గలిగిన కూర్మి రథము నధిరోహించి
వాలి పుత్రుడగు నంగదు పైకిని వనరగ బోయెను రణమునకున్! 4

సురల దర్పమును నణచినట్టి యాశూరులు ముప్పుర రాక్షసులున్!
తనపై యుద్ధము జేయుట కొఱకై దగ వచ్చుట గమనించియునూ!
మహా నిటపములు గలిగినట్టి యొక మహావృక్షమును బెకలించి
కరమున గ్రహించి నిలిచియుండెనూ కదనము సేయగ వారలతోన్! 5

వీరుడైన యా యంగదు డంతట వికటమైన శాఖలు గలుగూ!
మహావృక్షమును జేత బుచ్చుకొని మహేంద్రు డంతట జ్వలియించూ
యనిశము వలె యా దేవాంతకుపై యలరి ప్రయోగించెను వేగన్! 6

త్రిమూర్ధుండు సర్పముల సమానము దీరగు బాణంబుల తోడన్
అంగదుండు విసిరిన వృక్షంబును భంగము జేసెను రాక్షసుడున్!
ఛేదింపగబడినట్టి వృక్షమును శీఘ్రము నంగదుడును గాంచీ,
పైకి యెగిరె యా రాక్షసుతోడను బన్నుగ రణమును సలుపుటకై! 7

అటుబిమ్మట యా కపికుంజరుడును బటుతర శిలలను వృక్షములన్,
జడివానగ కురిపించెను శీఘ్రము గడు సంతాపము గలుగంగన్,
కోపించిన యా త్రిమూర్ధుండంతట కూర్మి వాడియగు బాణములన్
ఆ శిలలను వృక్షంబుల నన్నిటి యలరి చూర్ణమును గావించెన్! 8

మహోదరుండును బరిఘాగ్రముతో మహావృక్షముల ఛేదించెన్
త్రిమూర్ధుండునూ శరజాలముతో దీరుగ యంగదు మీదికినీ,
ఎదిరించుటకై బోయెను వేగము కదిలి తనదు సైన్యంబులతో! 9

మహోదరుండును గజముమ నెక్కి మానుగ రణోత్సవంబుననూ,
వాలిసుతునిపై బోయెను శీఘ్రము వనరగ యతనిని వధియింపన్!
ఆ మహోదరుడు గోపించుచు మఱి యల వజ్రముతో సమానమౌన్,
తోమరములతో వక్షస్థలమున ఘోరముగా గొట్టెను నతనిన్! 10

అట్టి సమయమున దేవాంతకుడును నిట్టె క్రోధమును గలవాడై,
వాలి కుమారుని సమీపించి మఱి వనరగ తన పరిఘను వేగన్.
నా యంగదునీ కొట్టి వేగమున నటు దూరము బోయెను నతడున్! 11

ముచ్చరు రాక్షస వీరులజేతను రివ్వున యెదిరింపగబడినా
మహా తేజుడును, ప్రతాపవంతుడు మానుగ వాలి కుమారుండున్,
వ్యధ నే మాత్రము జెందలేదు మఱి బాధ నింత బొందగ లేదూ! 12

వేగవంతుడగు వాలి కుమారుడు వేగముగా నెడురుగ నేగీ,
ఆ దేవాంతకు మహాగజంబును మానుగ యరజేతను గొట్టీ
బడవేసెను మఱి యాగజంబునూ బన్నుగ ధాత్రీ తలమందున్
గనులు దేలవేసియు మరణించెను ధ్వనులు జేయుచును బెల్లుగనూ! 13-14

మహాబలుండగు వాలి పుత్రుడును మానుగ యా యంగదు డంతన్,
ఆ యుద్ధంబున మరణము నందిన యా మహాగజము దంతమునూ,
నూడ బెఱికి దేవాంతకు పైకిని నురికెను నాతని గొట్టుటకై
ఆరాక్షసునీ శిరస్సుపైనీ నలరి గొట్టె బహు దీవ్రముగా! 15

మహావీరుడగు దేవాంతకుడును మానుగ యంగదు ఘాతముచే,
వాతోద్ధూతంబగు ద్రుమంబువలె వ్యాకులుడై బహు దీవ్రముగా!
లత్తుక సమానమగు రుధిరంబును వత్తుగ స్రవియించెను ధరణిన్! 16

అటుబిమ్మట యా దేవాంతకుడును నతి కష్టంబున దేరుకొనీ,
అతి వేగంబున పరిఘను ధరించి యతి విక్రముడగు నంగదునీ,
తన బలమంతయు జేరదీసికొని దగ గొట్టెను నతి తీవ్రముగా! 17

పరిఘజేత మఱి గొట్టబడిన యా బన్నుగ వాలి సుపుత్రుండున్,
మోకాళ్ళను నేలనుబడి యాతడు ముసిరిన జీకట్లను గనులన్,
అతిశీఘ్రముగా లేచి పై కెగిరె నలసట యింతయు బొందకనూ! 18

త్రిమూర్ధుడంతట పైకిలేచి నా దీరుగ వాలి సుపుత్రునిపై
మహాభీకరంబగు శరములనూ మానుగ మూటిని గైకొనియున్,
అంగదు లలాట మందున గొట్టెను నతి సూటిగ బహు దీవ్రముగన్! 19

ముప్వురు రాక్షస శ్రేష్టులజేతను జివ్వున జుట్టగ బడినట్టీ
యాయంగదునకు సాయము జేయగ హనుమంతుండును నీలుండున్,
అచటికి బోయిరి మహాశిలలనూ, నలరి వృక్షముల గైకొనియున్! 20

నీలుడంతటను మహా శిఖరమును నిశితముగా ద్రిప్పుచు వేగన్,
త్రిమూర్ధు రక్కసుపైని విసిరెనూ దీరుగ యా రాక్షసుడు మఱిన్,
తన బాణంబుల బ్రద్దలు జేసెను దగ వచ్చెడి యా శిఖరంబున్, 21

ఆ రాక్షసుచే ననేక శరముల యలరి గొట్టబడి శిఖరంబున్,
విదారితంబై ముక్కలు ముక్కలు విస్ఫులింగములు జెలగుచునూ,
జ్వాలలతోడను గూడికొన్నదై సరగున నేలను బడి పోయెన్! 22

దేవాంతకుడును మహాబలీయుడు మానుగ యుద్ధము నందుననూ
ఉత్సాహముతో విజృంభించిన యురు బలవంతుడు మారుతినీ,
గాంచి వేగమున బరిఘునుబట్టీ కదిలె మారుతిని వధియింపన్! 23

కపికుంజరుడగు హనుమంతుండును గడు వేగముననుఁ బైకెగిరీ,
తన పైకిని వచ్చెడి రాక్షసునీ దగ యా దేవాంతకుని మఱిన్,
వజ్రసమానంబగు పిడికిలితో వాని మస్తకమునను గొట్టెన్! 24

వానరశ్రేష్ఠుండును, విక్రముడును వాయుసుతుండగు మారుతియున్,
నా రాక్షసు దలపైని గొట్టియును నటుబిమ్మట నా సైన్యమునూ
కంపింపగ జేసెను రణమందున గంభీరధ్వని జేయుచునూ! 25

రాక్షసరాజగు రావణు పుత్రుడు రయమున దేవాంతకుడు మఱిన్
వాయుసుతుండగు హనుమంతునిచే వనరగ పిడికిలి పోటుననూ,
తలయు బ్రద్దలై, చూర్ణముగా నయి దంతంబులు మఱి నేత్రములున్
నాలుకయును మఱి వెలుపలికొచ్చెను విలవిల రక్తము జిందుచునూ,
అతడు నసువులను విడిచె ధరణిపై నటుగూలెను రాక్షసులు గనన్! 26

రాక్షస యోధులలో ముఖ్యుండును రాజకుమారుడు బలీయుడున్,
దేవశత్రువగు దేవాంతకుడును దీర్ఘ నిద్ర రణమున జెందెన్,
అటుబిబిమ్మట యాత్రిశిరరాక్షసుడు నతివేగంబున నీలునిపై
భయంకరంబగు బాణవర్షమును బటుతరముగ గురిపించె మఱిన్! 27

కోపించిన యా మహోదరుండును గూరిమి పర్వతసమమైనా,
గజమును నెక్కెను మందరగిరిపై కాంతులీను మార్యుని వలెనూ,
గర్జించెడి యా కాఱు మేఘమును కాంతులు జిమ్ముచు మెఱుపులతో
వానగురిసినటు బర్వతంబుపై వనరగ కఱకగు శరములతో
ఆ నీలునిపై బాణవర్షమును నటు గురిపించెను శీఘ్రముగన్! 28

ఆ మహోదరుని శరముల జేతను నా కపిసేనా నాయకుడున్,
ఆ నీలుని శుభగాత్రమంతయును నటు నిటు గాయములై మఱియున్,
శిథిలము లాయెను నంగము లన్నియు జేతన శక్తియు నశియించెన్!

ఈ రీతిని యా మహారాక్షసుడు నిమ్మగ కపిసేనాపతినీ
కదలకుండ జేసెను విక్రమమున కదనము నందున ధీరతనూ! 30

ముహూర్త కాలము నందున నీలుడు అహో! మఱల సంజ్ఞను బొందీ,
మహావృక్షములతో గూడిన యొక మహా శైలమును బెకలించీ,
మహోగ్ర వేగంబున పై కెగిరీ మానుగ యా శైలముదోడన్,
మహోదరుని మస్తకమున వేసెను మఱి పెనుకేకలు వేయుచునూ! 31

పర్వతంబు పైబడుట చేత మఱి బన్నగ యా రక్కసుడు మఱిన్,
చూర్ణము చూర్ణముగా నైపోయెను జూర్ణిత మాయెను నంగములున్,
ప్రాణములంతట విడిచెను నాతడు బన్నగ యాతని గజము మఱిన్
మరణించెను వజ్రముచే నద్రిని మానుగ గొట్టగ బడినటులన్! 32

అంత త్రిశిరసుడు దన పినదండ్రియు వింతగ మహోదరుం డప్పుడున్
నిహతుండై బడియుండుట గాంచియు నిశ్చేష్టుండై కోపించీ,
ఘన చాపంబును ధరించి యాతడు ఘనుడగు నా హనుమంతునిపై,
వాడియైన బాణంబుల గొట్టెను వరుసను దన చతురత మెఱయన్! 33

వాయుసూను డంతట గుపితుండై వనరగ గిరి శిఖరము నెత్తీ,
ఆ రాక్షసుపై బడవేసెను మఱి యా త్రిమూర్ధుడును వేగముగన్,
వాడియైన బాణంబుల తోడను వచ్చుచున్న గిరి శిఖరంబున్
ముక్కలు ముక్కలుగా మఱి జేసెను మూలమింతయును లేకుండన్! 34

అంతట యా హనుమంతుడు వేగము వింతగ విసిరిన గిరిశిలయున్,
వ్యర్థమగుటయును గాంచి నాతడును యుద్ధమందు రావణి సుతుపై,
వృక్ష వర్షమును గురిపించెను మఱి విపుల మేఘములు గురిసినటుల్! 35

ప్రతాపవంతుండైన త్రిశిరసుడు ఱన్నగ వచ్చెడి ద్రుమములనూ,
వాడియైన బాణంబుల తోడను వడివడి యాకాశమునందే
ఖండించుచు నేలను బడవేసెను గఱకు కంఠమున గర్జించెన్! 36

కపివీరుం డంతట కుపితుండై విపుల విక్రమమునను నెగిరీ,
ఆ రాక్షసు హయమును వేగముగా నల కేసరి నాగేంద్రమునూ
నఖముల జేతను జీల్చివైచు నటు నయముగ యా హయమును జీల్చెన్! 37

అటుపిమ్మట యా రావణాత్మజుడు నా త్రిమూర్థుడును వెనువెంటన్,
అల యముండు నా కాలరాత్రినీ నట గ్రహియించిన యట్టులుగా
శక్తిని గ్రహించి యనిల పుత్రుపై సహజోత్సాహమునను వేసెన్! 38

అంబరమందున నుండి విసరబడి నట్టుల పైపై కొచ్చెడి యా
అగ్నిపిండమును బోలియుండినా నా శక్తిని యా మారుతియున్,
తనమీదను మఱి బడకుండగనే దగ బట్టియు రెండుగ జేసెన్
ఆశక్తిని మఱి భగ్నము జేసీ యలరి ధ్వనియు జేసెను వేగన్! 39

భయంకరంబగు రూపము గలిగిన బరగ శక్తి మారుతి జేతన్
భగ్నమగుటయును గాంచి వానరులు బహు సంతోషించిన వారై
మేఘంబులవలె గర్జన జేసిరి మేదుర శంఖధ్వనుల వలెన్! 40

రాక్షసోత్తముండైన త్రిశిరసుడు రయమున ఖడ్గంబును నెత్తీ,
ప్రబలమైన యా ఖడ్గంబును మఱి బలవంతుండగు హనుమంతున్,
వక్షస్థలమున బాహుబలంబున బహు లోతునకును బో గ్రుచ్చెన్! 41

ఖడ్గప్రహారము ననుభవించినా కడు క్రుద్ధుండై మారుతియున్,
శీఘ్రముగా దన పిడికిలినెత్తీ స్థిరముగ రాక్షసు వక్షమునన్,
ఒక్కపోటు మఱి గట్టిగా బొడిచె చిక్కని రక్తము గ్రక్కంగన్! 42

మహాతేజమును గల రాక్షసుడును మానుగ యా మారుతిజేతన్,
ముష్టిఘాతమును బొందినవాడై చేష్టలు దక్కి, స్పృహదప్పి,
హస్తమునందలి యాయుధంబులును నలరి జారివడె రణభూమిన్,
పర్వతంబు వలె నేలను బడెనూ బహుధ్వనులను గపులును సేయన్!

గిరిసంకాశుండైన మహాకపి కెవ్వున ధ్వనులను జేయుచునూ,
జారి క్రింద బడిపోవుచున్న యా సాహస వంతుని ఖడ్గమునూ,

హస్తమునందున గ్రహించి మారుతి యల రణమునగల రాక్షసులన్,
భయబెట్టుచు మఱి బారద్రోలెనూ బహు విధ గర్జనలను జేసీ! 44

క్రిందబడిన యాత్రిశిర రాక్షసుడు జిందెడి యా మారుతి ధ్వనులన్,
సహింపజాలక పైకి నెగిరి మఱి సాహసమున యా యనిల సుతున్,
పిడికిలి జేతను బోటు పొడిచెనూ ప్రిదులగ మారుతి యంగములన్! 45

మహాకపియునగు నా హనుమంతుడు మానుగ యారాక్షసు జేతన్,
పిడికిలి పోటుకు గొంత నొచ్చుకొని కడు క్రుద్ధుండై వేగమునన్! 46

కోపించిన యా యనిల సుతుండును కూడిన యాతని కిరీటముల్,
కుండలములనూ, శిరస్సులను మఱి మండిత సువర్ణ భూషణముల్
సురరాజగు నా దేవేంద్రుండును సూటిగ త్వష్టకు సుతుడైనా
విశ్వరూపుని తలలు నఱికినటు వేగముగా ఖడ్గము తోడన్,
ఆరాక్షసునీ మూడు దలలనూ నలరుచు మారుతి ఖండించెన్! 47

దీర్ఘమైన యింద్రియములు గలవియు దీప్తిజెందు నగ్నికి వోలెన్,
ప్రజ్వలించు నేత్రములును గలదియు పర్వతములతో సమానముల్,
ఆరాక్షసు మస్తకములు మూడును ఆకాశము నుండియు ధరపై
జారవిడిచినా నక్షత్రములుగ జ్వలించుచును మఱి క్రింద బడెన్! 48

దేవశత్రునగు నా త్రిశిరస్సునూ దీరుగ హనుమంతుని జేతన్,
జంపబడిన వాడగుచుండగ నుఱి వంపుచు హర్షాశ్రువులు ధరన్,
వానరులందఱు సంతోషించిరి వనరగ జేసిరి వీరధ్వనుల్,
భూమియు జలించె, రాక్షసు లందఱు బోయిరి నలుమూలల కపురున్! 49

త్రిశిర రాక్షసుని, మహోదరుని మఱి దీరుగ యెదిరింపగ రానీ
దేవాంతకునీ నరాంతకుని మఱి ధీరులైన కపు లా రీతిన్,
చంపివేయుటను గాంచి మత్తుడును కంపము నొందెను మదియందున్,
అధికమైన కోపమును జెందెనూ యపూర్వమగు నాయుధములతో! 50

జ్వాలలు గల్గియు, నినుముజేత మఱి సలలితముగ జేసినదియునూ,
బంగరు పట్టీలును గలదియు మఱి రంగుగ దృఢమగు నా గదయున్,

రక్తమాంసముల నురుగులతోడను రమ్యముగా విలసిల్లునదీ
శత్రురక్తములజేత దర్పణము సరసత బొందగ బడినదియున్!

ఆ గద యొక్కయు యగ్రభాగమును నగ్ని జ్వాలలను గలిగియునూ,
రక్తమాల్యములచే భూషితమై రమ్యముగా నుండెను మఱియున్,
ఆగద పూర్వము నైరావతమును నలరు మహా పద్మంబులనూ
సార్వభౌమ దిగ్గజములకును మఱి సరసత భీతిని గలిగించెన్! 51-52-53

మహాపార్శ్వుడంతట కోపించీ మానుగ యాగద ధరియించీ,
యుగాంతాగ్ని వలె ప్రజ్వరిల్లుచును యుద్ధ భూమికిని వేగముగా,
వానరవీరుల మీదికి బోయెను వడివడిగా వధియించుటకై! 54

అట్టిసమయమున ఋషభుం డనియెడి యటగల వానర వీరుండున్,
ఎగిరివచ్చి యా రావణు తమ్ముని నిమ్ముగ తలపడి యాతనితో
ఎచుటను నిలిచెను కయ్యమునకు మఱి ఎదిరింపగ రా రమ్మనుచున్! 55

పర్వత సమానుడైన ఋషభుడును బన్నుగ తన యెదుటను నిలువన్,
మహాపార్శ్వుడంతట గోపించుచు మానుగ పెదవులు గొఱుకునూ,
వజ్రకల్పమగు దన గద నెత్తి వక్షస్థలమున బడవేసెన్! 56

మహాపార్శ్వుడును దన గద జేతను మానుగ ఋషభుని వక్షమునన్,
బలిమి గొట్టగా రాక్షస వీరుడు బస జెడి నేలను బడిపోయెన్,
అతని వక్షస్థలము బ్రద్దలై యధిక శోణితము స్రవియించెన్
చలించి పోయెను, చైతన్యంబును సహజముగా గోల్పోయె నటన్! 57

వానర శ్రేష్ఠుండైన ఋషభుడును వనరగ బహు కాలంబునకున్,
సంజ్ఞను బొందెను గోపము తోడను సరసత బెదవులు నదరగనూ!
మహాపార్శ్వునీ కనుగొనె నంతట మానుగ రణరంగము నందున్! 58

శైలనికాశంబగు రూపంటును స్థిరమగు వేగము గలవాడున్,
వానర శ్రేష్ఠులలో ముఖ్యుండును వనరగ ఋషభుడు వేగముగన్,
ఆరాక్షసునీ సమీపించి మఱి నలరి బిడికిలిని బిగియించీ
వక్షస్థలమును మోదెను గట్టిగ వసుధను బడగా రాక్షసుడున్! 59

మహాపార్శ్వుడంతట రక్తముతో మానుగ పడిసిన శరీరుడై,
మొదలు నఱికినా వృక్షంబునువలె మూర్ఛిల్లెను, నా ఋషభుండున్
మహాపార్శ్వునీ భయంకరంబగు మానుగ గద మఱి గైకొనుచున్
మేఘమున్నకు వలె ధ్వనులను జేసెను మేదిని యంతయు జలియింపన్! 60

ముహూర్తకాలము మహాపార్శ్వుడును మోహముతో నటు బడియుండెన్
తదుపరి సంజ్ఞను బొంది రాక్షసుడు దగ పైకిని లేచెను వేగన్,
సంధ్యాకాలపు మేఘంబునకును సమమగు వర్ణము గలవాడున్
నా రాక్షసుడును నా గద బట్టుక నా ఋషభుని రణమున గొట్టెన్! 61

ఆ ఋషభుండును నా ఘాతమునకు నడలి క్షణము మూర్ఛను బొందెన్,
నేలను బడియును సంజ్ఞను బొందీ విలవిల బైకిని లేచియునూ,
పర్వత శిఖరము బోలునట్టి యా ప్రబలమైన యాతని గదనే
గ్రహించి రణమున నాతని గొట్టెను కలకు దనంబున శీఘ్రమునన్! 62

భయంకరంబగు నాగదయును మఱి భయంకరుండగు రాక్షసునీ,
దేవబ్రాహ్మణ యధ్వరములకును దీరుగ శత్రువునైనట్టీ,
మహాపార్శ్వునీ సమీపించి మఱి మానుగ యాతని వక్షమునూ,
బ్రద్దలు జేసెను నా రాక్షసుడును బడలి నేలబడి పోవగనూ!
మహాపర్వతము గైరికాదులను మానుగ ద్రవమును నొలుకునటుల్
ఆ రాక్షసుడును భూరి రక్తమును నా రణభూమిని స్రవియించెన్! 63

మహాత్ముండగు నా ఋషభుడంతటను మహాపార్శ్వునీ గద కడకున్
సమీపించి మఱి గదను గైకొనుచు సరగున నేలను గొట్టుచునూ,
యూపుచు గదనూ రణమూర్ధనిలో నురు బలాఢ్యుడగు రాక్షసునీ
మాటిమాటికిని గొట్టెను వానిని మానుగ యసువులు నొదలగనూ! 64

తన సంబంధంబగు గద జేతను దాను గొట్టబడి రాక్షసుడున్,
విశీర్ణ దశనేక్షణముల తోడను వికట శరీరుండై యతడున్
వజ్రాయుధమున గొట్టబడిన యా వనర పర్వతమునకు బోలెన్
ధరణీ తలమునబడి మరణించెను దగ యమపురికిని బయనించెన్! 65

గత సత్త్వుండును గతాయుష్షుండగు కదనంబున బడిపోయిన యా
మహాపార్శ్వుఁ డా విధమున బడుటయు మూనుగ రాక్షసులును గాంచి,
రాక్షససైన్యము బరుగులు దీసెను రయమున నాలుగు దిక్కులకున్,
వెనుకకు జూడక భయభ్రాంతులై వేగిరమున రావణు కడకున్! 66

రావణు తమ్ముడు మహాపార్శ్వుఁడును రణభూమిని మరణింపగనే
సంద్రమునకు వలె విశాలమైనా సాంద్రమైన యా సైన్యంబున్
ఆయుధముల నన్నింటిని విడిచి నలగి ప్రాణముల రక్షణకై
గట్టుదెగిన యొక మహానదికివలె కదిలి పాఱిపోయెను వేగన్! 67

(యుద్ధకాండములోని 70వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధా లహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### డెబ్బది యొకటవ సర్గము

(అతికాయుడు భయంకరమైన యుద్ధము సేయుట—లక్ష్మణుడు వానిని సంహరించుట)

బ్రహ్మదత్త వరములు గలవాడును, బన్నుగ తేజము గలవాడున్,
బర్వతమునకును సమానుండునూ బరగ దేవదానవుల మఱిన్,
దర్పంబును దొలగించిన వాడును దగ యతికాయుడు రణమందున్,
తుముల ధ్వనియును గలదియును మఱి తోరముగా రోమాంచమునూ
కలిగించునదియు నగు తన సైన్యము గల ధైర్యంబును గోల్పోవన్!
బాధింపగ బడుటయు నటగాంచి, బన్నుగ యింద్ర పరాక్రమములున్,
గలిగిన తన సోదరులు జచ్చుటయు కరమున తన పినతండ్రులునూ

రణమునందు మఱి నిహతులగుటయును రణోత్సాహులగు సోదరులున్
మత్తుండును మఱి యుద్ధోన్మత్తుడు మానుగ సమరము నందుననూ
బడగొట్టగ బడినట్టి వారిగా బన్నుగ గాంచియు గోపించెన్! 3

ఇంద్ర శత్రువగు నా యతికాయుడు సాంద్రకాంతి గల సూర్యునితో,
సమానమైనా కాంతిని గలిగిన సహజ ప్రకాశము నగు రథమున్,
నారోహించియు నా యతికాయుడు నరిగెను కపివీరుల పైకిన్! 4

కిరీటమును మఱి మృష్టకుండములు ధరియించిన యా రాక్షసుడున్,
చాపంబున యా నారిని జఱచీ సరగున దన నామంబు మఱిన్,
వినిపించియు దిగ్గజ ధ్వనిజేసెను వినువీధియు మ్రోగంగన్! 5

ఆ రాక్షసునీ సింహ నాదమున యతని పేరు వినిపించుటచే
భయంకరంబగు జ్యా శబ్దముచే బన్నుగ రణరంగము నందున్,
భయమును జెందిరి యా కపివీరులు బరుగులు దీసిరి దిక్కులకున్! 6

ఆ రాక్షసు నిడు దేహము గాంచీ యతల కుతలమై వానరులున్,
కుంభకర్ణుడే మఱల లేచి యిటు గూరిమి వచ్చెనొ యను నటులన్,
భయముజేత కపివీరు లందఱును పరస్పరము న్నాశ్రయ మందీ
త్రివిక్రముని యవతార సమయమున తేజోరూపుడు విష్ణువుగా,
ఆ రాక్షసు రూపమును గాంచి మఱి యాకపి యోధులు భయబడుచున్
అన్ని దిక్కులకు బరుగులు దీసిరి యా రణరంగము నందుననూ! 7-8

అ యతికాయుని సమీపంబునకు నలరుచు వచ్చియు వెనువెంటన్,
ఏమిచేయవలెనో మఱి యాతని నెటుల యెదుర్కొనగా వలెనో,
ఏమియు దోపక యాకపి యోధులు నిమ్మగ దశరథ శ్రీరామున్
అంజలి ఘటించి శరణు జొచ్చిరీ నా రాక్షసుని వధింపగనూ!
అటువిమ్మట శ్రీరామచంద్రుడును నలరి గాంచె యారాక్షసునీ,
బరగ రథంబున నున్నవానినీ పర్వత సముడగు మహాభుజున్,
కాలమేఘమును వలె గర్జించుచు కదనమునకు వచ్చిన వానిన్
నా యతికాయుని రాముడు గాంచెను నలతి దూరమున నుండి మఱిన్! 9

మహాకాయుడగు నా యతికాయుని యలరి గాంచి శ్రీరాఘవుడున్,
సువిస్మితుండై మానసమందున చోద్యముగా గాంచుచును మఱిన్
ధైర్యము దెలిపీ కపివీరులకును దగ విభీషణునితో బలికెన్! 11

ధనుష్మంతుడును, హరిలోచనుడును దగ పర్వత సంకాశుడునూ,
హయ సహస్రములచే గట్టగ బడి యతి విశాలమగు రథమందున్
నున్నవాడు నితడెవడు విభీషణ? బన్నుగ దెలుపుము వివరముగన్! 12

నిశితములగు శూలంబుల దోడుత నిశితములగు ప్రాసంబులతో,
వాడియైన తోమరముల దోడను సన్నెలు జిందుచు కాంతులతో
తనచుట్టును భూతములు నిలిచినా దగ మహేశ్వరుని వోలె మఱిన్
ప్రకాశించుచున్నాడు ఇతడెవరు బన్నుగ దెలుపుము విభీషణా! 13

రథమునందు నా ప్రబల రాక్షసుడు రమ్యకాంతులను జిమ్ముచునూ;
మృత్యుదేవతకు గల జిహ్వల వలె మిగుల ప్రకాశంబును గలిగీ,
ఆతని చుట్టును శక్తులుండుటను నరసి జూడ యా రాక్షసుడున్,
మెఱుపులు గలిగిన మేఘంబును వలె మిగుల ప్రకాశించుచు నుండెన్! 14

సిద్ధముగా నుంపగ బడినట్టి యొద్దికగా బంగారముతో
పైపూతలు బూసిన భాగములును బన్నుగ గలిగిన ధనుస్సులున్
ఆ రాక్షసునీ శ్రేష్ఠ రథంబును నంబరమును హరివిల్లు వలెన్
అన్నిపైపులను కాంతుల జిమ్ముచు నలరి ప్రకాశించుచు నుండెన్! 15

రథికులలో నగ్రేసరుడైనా యా రాక్షసుడును రణభూమిన్
ప్రకాశింపజేయుచు నరదముపై బన్నుగ భాస్కర కాంతులతో
ఈవైపే మఱి వచ్చుచు నుండెను నిమ్ముగ రణమును సేయుటకున్! 17

రాహు చిహ్నమును ధ్వజాగ్రమందున రమ్యముగా నిలిపిన యతడున్
సూర్యకిరణములవంటి బాణములు నురుచిర కాంతులు జిమ్ముచునూ
పది దిక్కుల మఱి వెలుగుల నింపుచు ప్రకాశింప జేయుచు నుండెన్! 18

ధ్వజముల తోడను బతాకములతో దగ యలంకరింపగ బడియున్
దృఢమగు దూలము గలదియు క్రిందీ గాఢమైన ధ్వని గలదియునూ

ఆతని విశాలమగు నరదంబున యతి బలియమగు సారథులున్
నలుగురు నాలుగు వైపుల సుండియు నయముగ నడుపుచునుండి రటన్!

ఈతని మహా రథంబున గలవూ! నిమ్మగ భయమును గలిగించూ
ఇరువది యెనిమిది యంబుల పొదులును సరిపది సంఖ్యలు గలవియునూ,
మహాధనుస్సులు గలవు రథముపై మఱి విచిత్రమగు వంపులతో,
బంగరు రంగును గలిగిన నారులు బహుసంఖ్యను గల వట గనుమా! 20

ఆ రాక్షసు రథమందు పార్శ్వముల యలరి ప్రకాశించెడి ననియున్
రెండు మహాఖడ్గంబులు గూడను మెండుగ తళతళ లాడుచునూ
పది హస్తంబుల పొడవు గలిగియును బన్నుగ బహు పదునైనవియున్
నాల్గుహస్తముల బిడులచేత మఱి నయముగ బిగింపబడినవియున్! 21

మెడలో నెఱ్ఱని రక్తపు ద్రాడును మేఱుపర్వతపు సన్నిభుడున్,
ధీరుడు నల్లని రూపముగలిగీ దీరుగ కాలుని బోలుచునూ
మహావక్త్రమును గలవారును మఱి మహాదంతములు గలవాడున్
మేఘముపైని సూర్యుని పోలెను మిగుల విరాజిల్లుచు నుండెన్ 22

కాంచనాంగదములను శోభించుచు గడు విశాలమగు భుజములతో
బహు సున్నతమగు శిఖరంబులతో బర్వతములతో శ్రేష్ఠమునూ
హిమపర్వతమునకు బోలెనూ విమల కాంతులను జిమ్ముచునూ
ప్రకాశించుచుండెను రాక్షసుకును బన్నుగ దెలుపుము నిర దెవరో? 23

అమిత దేజసుడు రాజపుత్రుడగు నా రాఘవుడును నిటు లడుగన్
మహాతేజమును గలవాడును నగు మానుగ రావణు సోదరుడున్
శ్రీరామునితో బలికె నిటులనూ స్థిరమగు వాక్యంబులతోడన్! 26

సుభీషణంబగు నీతని ముఖమును సురుచిరముగ కుండలములతో,
పునర్వసూ నక్షత్రము మధ్యను పూర్ణచంద్రబింబము బోలెన్
ప్రకాశించు చున్నది కనుగొనుమా! బన్నుగ యీరాక్షసు డెవడూ? 24-25

గొప్ప బాహువులు గల విభీషణా! కూరిమి యెవనిని గాంచి మఱిన్
వానరవీరులు భయము జెందిరో వనరగ బాదలు దీర్చియునూ

అన్నిదిక్కులకు బారిపోయిరో నలసట జెందుచు బరుగులతో
ఈ రాక్షసు వీరుని వివరములను నిమ్మగ దెలుపుము విభీషణా!

పది కంఠంబులు గలవాడును మఱి బరగ మహాతేజము గలిగీ
వైశ్రవణునకును సోదరు డాతడు వనర మహోత్సాహుండు మఱిన్
భయంకరంబగు కర్మలు జేయుచు భయబెట్టుచు నుండును జగతిన్
రాక్షసు లందఱికిని ప్రభు వాతడు రావణరాక్షసు డతడు సుమా! 27

ఆ రావణునకు వీర్యవంతుడును నలరు పరాక్రమవంతురునూ
తండ్రియైన రావణుతో సముడును దగ రణరంగము లందుననూ,
పెద్దల మఱి సేవించెడివాడును బేర్మి శ్రుతుల ధరియించుచునూ
సర్వశాస్త్రముల నెఱిగినవాడును సర్వవిషయముల విదుషుండున్ 28

అశ్వంబులపై యధిరోహింపను నలరి గజములను నెక్కుటలో
ఖడ్గ ధనుస్సుల నేర్పులందునను గడు చాతుర్యము గలవాడున్
సైన్యములను నడుపుటయందును మఱి సామ దాన భేదములందున్
నీతియందు నాలోచనయందును నతి సమర్థునిగ పేరొందెన్! 29

ఏవని బాహుబలమును లంకాపురి యిమ్మగ యాశ్రయమును నందీ
నిర్భయముగ నిల విరాజిల్లుచును నిర్భయముగ రాజిల్లెడినో
అట్టి మహావీరుడు మఱి యాతడు నిట్టి ధాన్యమాలిని సుతుడున్
అతికాయండని సర్వజనంబును నలరి బిలిచెదరు సద్భక్తిన్! 30

పవిత్రాత్మతో దపసుల జేతను బన్నుగ పూజించెను నజునీ
యారాధనలను నల స్వయంభువుని యలరు దయా వీక్షణములచే
దివ్యాస్త్రములను నందె రాక్షసుడు దివి భువిగల రిపులను గూడన్
సమరమునందున జయించివైచెను సహజ ప్రతాపము వర్ధిలగన్! 31

స్వయంభువుడు స్వయముగ యాతనికి సకల సురాసుర వీరులచే
మరణము గలుగక యుండునటుల మఱి మానుగ యపజయ మొందకనూ
జయించు నటులను వరముల నిచ్చెను జయమాలను కవచము నిచ్చెన్
రవి భాస్వరమగు రథమును నిచ్చెను రహి శత్రువులును వెలగందన్! 32

అనేక మారులు నీతని జేతను నల దేవతలును, దానవులున్
పరాజితులునై పారిపోయిరీ బన్నుగ పది దిక్కులకు మఱిన్
యక్షుల నందఱ నణచివేసెనూ కక్షదీర గంధర్వులనూ
రాక్షసులను రక్షించెను నీతడు రహి లంకాపురమును మఱియున్! 33

రణమునందు దన బాణంబులచే రహి దేవేంద్రుని వజ్రంబున్,
విష్టంభితమును జేసెను నీతడు వీరులందఱును గనుగొనగా!
సలిలంబులకును ప్రభువగు వరుణుని సరగున యాతని పాశమునూ,
పనికిరానిదిగ జేసెను నీతడు బన్నుగ తనశరముల జేతన్!
అట్టివాడు నతికాయుడు వీరుడు నతి బలవంతుడు ధీమతుడున్,
రాక్షసవీరులలో శ్రేష్ఠుండును రావణు పుత్రుడు విక్రముడున్
దేవ దానవుల గర్వము నంతను నేరుగ తొలగించిన వాడున్! 34-35

పురుషపుంగవా! రామా! వినుమా! పూనికతో నీ విషయమునూ!
ఈతని విషయము బహుశీఘ్రముగా నిమ్ముగ యత్నము జేయు మికన్!
అట్లు గానిచో వానరసేనను నిట్టె తనదు సాయకములచే!
క్షయమును బొందింపగ గలుగును నిక జాలమేల శ్రీ రఘురామా! 36

అటుబిమ్మట యా ప్రబల రాక్షసుడు నతిబలవంతుడు వేగముగన్,
హరివాహినిలో ప్రవేశించి మఱి యలరి ధనుస్సును జఱచుదునూ,
మాటిమాటికిని ధ్వనులను జేసెను మారు మ్రోగ యాకాశమునూ! 37

రథమునందు నున్నట్టి వారిలో రథికులలో మఱి శ్రేష్ఠుండున్,
భయంకరంబగు శరీరంబునూ బాహుబలంబును గలవాడున్,
ఆ యతికాయుని గాంచి మహాత్ములు నతి ప్రధానులగు గపివీరుల్
ఆతని కెదురుగ బోయిరి రణమున యా రాక్షసునీ యెదిరింపన్! 38

కుముదుడు, ద్వివిదుడు, మైందుడు, నీలుడు గూరిమి శరభుడు కపివీరుల్
చుహా వృక్షముల, బర్వత శిలలను మానుగ హస్తములను బట్టీ
ఒక్కసారిగా నారాక్షసునీ యెద్దిక బోయిరి యెదిరింపన్! 39

అస్త్రవిదుండును! మహాతేజుడును నతికాయుడు బహువేగముగన్
కనక భూషణంబులతో గూడిన కర్కశమగు దన శరములచే
ఆ కపివీరులు ప్రయోగించినా యా వృక్షములను, శిలల మఱిన్
ముక్కలు ముక్కలుగా ఛేదించెను రిక్కలు నేలను రాలినటుల్! 40

బలవంతుడును, భీమకాయునును బహు విశారదుడు యుద్ధమునన్!
నా యతికాయుడు యుద్ధమునందున యభిముఖులగు నా వానరులన్,
పూర్తియినుముతో జేసినట్టి యా పొలుపగు దీవ్ర సుశరములతో,
జడివానగ కురిపించెను నాతడు దడియగ శోణితమున గపులున్! 41

అట్టి భయంకర రణమునందునను నా యతికాయుని భాణములన్
గొట్టబడుచు నా వానరవీరులు గూరిమి యంగాగంబులునూ,
బద్దలు కాగా,బరాజితులై బన్నుగ యాకపి యోధులునూ
ప్రతిక్రియను జేయుటకును గూడను బన్నుగ యసమర్థులు నైరి! 42

యౌవన దర్పితుడైన రాక్షసుడు గర్వము ద్రిప్పిన యట్టులుగా,
నా కపివీరుల గిరగిర ద్రిప్పెను నా మూలకు నీ మూలకునూ
సింహము మృగయూథంబునకును వలె చెలగి రాక్షసుడు గపిసేనన్
భయమును గలుగగ జేసి వారలను బాధబెట్టి దన బాణములన్! 43

ఆ యతికాయుడు వానర సేనను నని సేయని వారిని నెవరిన్
గొట్టలేదు మఱి ముట్టగలేదూ కూల్చలేదు మఱి యెవ్వరినీ
ధనుస్సు మఱి యంబుల పొది గూడిన దగ నాతడు బహు గర్వమునన్
రామచంద్రునీ సమీపంబునకు రయమున జేరుచు నిటు లనియెన్! 44

శరచాపంబులు గలవాడను నే యరదముపై నే నున్నాడన్
సామాన్యునిలో రణమును సలుపను సహజముగా నే యోధుడనూ!
ఎవనికి శక్తియు నుత్సాహంబులు నిమ్ముగ గలిగినచో నతడున్
నత డిచటికిని సమీపించి మఱి యలరి రణంబును సేయనగున్! 45

అమిత్ర సంహారకుడు లక్ష్మణుడు నా రాక్షసు మాటలు వినుచున్
మహాగోపమును జెంది శీఘ్రముగ మానుగ ముందున కేతెంచీ
చిఱునవ్వును నవ్వుచు సౌమిత్రియు జెలగి ధనుస్సును గైకొనియెన్! 46

కోపించిన యా సౌమిత్రియు మఱి కూరిమి ముందున కేతెంచీ,
అంబుల పొదిలో నుండి బాణమును నలరి పైకి దీసియు మఱలన్,
నాయతికాయుని యెదుట ధనుస్సును నలరి చఱచె నారిని లాగీ! 47

రామానుజుడగు నా లక్ష్మణుడును నటు జేసిన జ్యా శబ్దమునూ,
సమస్తమైనా భూ మండలమును సకలాకాశంబును మఱియున్,
సాగరమును మఱి దిక్కుల నింపుచు దగ శబ్దించెను ఘోరముగా,
నా ధ్వని రజనీ చరులందఱకును నడలగ భయమును గలిగించెన్! 48

ఆ సమయంబున బలవంతుండును నతి తేజస్సును గలవాడున్,
రాక్షసేంద్రుడగు నతికాయుండును రయమున విని యా మహాధ్వనిన్!
మనసున మిక్కిలి యాశ్చర్యంబును మానుగ బొందెను నబ్బురమున్! 49

అట్టి సమయమున రణము సలుపగా నలరి నిలిచినా సౌమిత్రిన్,
గాంచి రాక్షసుడు బహుకుపితుండై బన్నుగ యంబుల పొది నుండీ,
వాడి యైన బాణంబును దీసీ వనరగ ధనుసున సంధించీ,
ఈ రీతిని బలికెను రాక్షసుడును నిమ్ముగ లక్ష్మణుతోని మఱిన్! 50

సౌమిత్రీ! బహు పిన్నవాడవును సాహస విక్రమమందుననూ,
అవిచక్షణుడవు నయి యున్నాడవు నది గాకయు మఱి బాలుడవున్,
వెడలిపొమ్ము! నా యెదుట నుండి మఱి వేగము యముని సమానుడనూ!
నాతో రణమును జేయుట కొఱకును నయముగ మది గోరెదవేలా? 51

మద్బాహువులను విడువబడిన యా మహిమాన్వితములు నగు శరముల్,
తీవ్రత్వంబును, మహావేగమును దీరుగ హిమవత్పర్వతమున్,
సహించుటకు మఱి శక్యముగాదూ! సహింపలే దాకాశంబున్,
భూమండలమును సహింపలేదూ! బొలుపుగ నిలువగ లేవు సుమా! 52

సుఖప్రసుప్తమగు కాలాగ్నిని మఱి సూరత్వంబున లేపుటకున్,
యత్నము సేయుచు నున్నవాడవూ తత్పర మందెద విక నీవున్,

చాపంబును నట విడిచి వెడలుమా సరగున వెనుకకు మఱలు మికన్,
నన్నుజేరి యుద్ధంబును సలిపీ నయముగ ప్రాణము విడువకుమా! 53

అటులగాక ప్రతిస్తబ్ధుండుడవై యలరి నీవు మఱి మఱలకనూ,
రణమును సలుపగ, మది నిలిపినచో రయమున నిలువుము నిచ్చోటన్,
ప్రాణంబులనూ పరిత్యజించియు బన్నుగ యమసదనంబునకున్,
నాతిథ్యంబును గొనెద విప్పుడే యాత్మ బంధువుల విడనాడీ! 54

రిపు దర్పంబును నిర్మూలించెడి విపులశక్తి గల బాణములన్,
ఈశ్వరాయుధములకును సమానము నిమ్ముగ కనక సుభూషణముల్;
గలిగి యున్న నా శరముల గాంచుము గదిలి యుద్ధమును సేయుమికన్! 55

'సర్పముతోని సమానమైన యీ శరమిక గోపించిన వేగన్,
మృగరాజగు సింహము గోపంబున దగ గజరాజును బడద్రోసి
శోణితమును మఱి ద్రావినట్లుగా శూరుడ! నీ రక్తము ద్రావున్!'
అటుల బలికి యా యతికాయుండును నలరి బాణమును సంధించెన్! 56

రాజపుత్రుడగు లక్ష్మణు డంతట రణమున రోషము విలసిల్లన్,
గర్వముతోడను బలికినట్టి యా కఠిన రక్కసుని వాక్యములన్,
విని లక్ష్మణుడును మది కోపించెను విపుల బలంబును గలవాడున్,
మహామనస్వియు శోభయు గలిగిన మానుగ లక్ష్మణు డిటు వలికెన్! 57

ఓ దురాత్ముడా! మాటల జేతను నొవ్వగ పెద్దవుకావు సుమా!
బడాయి మాటలు బలికినందునను బన్నుగ సత్పురుషులు గారూ!
ధనుర్బాణములు ధరించి నేనును దగ యిట నిలిచియు నున్నాడన్,
ఆత్మబలంబును బ్రదర్శింపుమా! యీ మాటలు నేలా యింకన్? 58

కార్యము జేతను గొప్పదనంబును గదనంబున జూపింపు మికన్,
గొప్పలు జెప్పకు మాయ రాక్షసా! గూరిమి శూరుడ ననుచు మఱిన్,
పౌరుషంబు గలవాడే శూరుడు బరగ మెప్పగొను నీ ధాత్రిన్! 59

ధనుర్ధరుడవై యాయుధములతో దగ రథమున నుంటివి గాదా!
సకలాయుధములు రథమున గలవూ! పారింపుము నీ చావమునూ!
బాణంబులచే నస్త్రంబులచే బరాక్రమంబును జూపు మికన్! 60

అటుబిమ్మట నే నిశిత శరములను నలరు నీదు శిరమును వేగన్;
గాలిచేత దగు కాలమునందున గడు బక్వంబగు తాలఫలమ్!
తొడిమనుండి బడగొట్టి నట్లుగా ఘోరముగా నీ శిరస్సునూ
బడగొట్టెద ధరణీతలంబుపై పంచ భూతములలో గలియన్! 61

తప్త కాంచనంబగు భూషణములు దగ గలిగిన నా బాణములున్,
నీ శరీరమున నుండి బాణముల నిగిడిన ములుకుల మధ్యమునన్,
బయలువెడలినా శోణిత ధారల బన్నుగ త్రాగును శీఘ్రముగన్! 62

ఈతడు బాలుడు, పిన్నయనుచునూ నిమ్మగ జూడకు సరళముగా,
బాలుడనైనను, వృద్ధుడనైనను బన్నుగ రణరంగము నందున్,
నీపాలిటి నే మృత్యు దేవతను నిజముగ దెలియుము నతికాయా!
విష్ణువు జేతను మూడడుగులచే విమల త్రిలోకములను నాడున్
ఆక్రమించెగద! రాక్షసాధమా! యలరి బాలుడైనను గూడన్! 63

హేతు బద్ధమును బరమార్థంబును విమలమైన లక్ష్మణు బలుకుల్,
విని యతికాయుడు మిగుల క్రోపమును వికలమైన మనసును గూడీ,
పరమోత్తమమగు బాణము దీసి బరగ చాపమున సంధించెన్! 64

అట్టిసమయమున విద్యాధరులును నలరి భూతములు దేవతలున్,
దైత్య దానవులు మహాఋషులునూ దగ మహాత్ములగు యక్షులున్నూ,
యంబరమందున నుండి గాంచిరీ యా యుద్ధంబును వేడుకగా! 65

అటుబిమ్మట యా యతికాయుండును నలరి మహా క్రోధముతోడన్,
బాణంబును ధనుసున సంధించి బన్నుగ యంబర మంతటినీ
క్షుధించు చున్నాడా యనునట్లుగ క్షూరిమి వేగముగా శరమున్
ప్రయోగించె లక్ష్మణుని మీదికిని బన్నుగ జూడగ దేవతలున్! 66

శత్రువీరులను సంహరించు నా సాహసవంతుడు లక్ష్మణుడున్,
వచ్చి మీదబడుచున్న శరంబును వనర పన్నగము సమానమున్,
వాడియైన యా మహాశరంబును వనరగ యా సౌమిత్రియునూ;
అర్ధ చంద్రబాణముచే రయమున యలరి భేదనము గావించెన్! 67

అతికాయుండును ఛేదింపగబడి నలరు దనదు శరమునుగాంచి,
తెగిన శరీరము గలిగినట్టి యా దీర్ఘగ సర్పమువలె నున్నా,
యనిక్రుద్ధుండై యా రాక్షసుడును వైదు బాణములు సంధించెన్! 68

ఆ నిశాచరుడు నా బాణములను నా లక్ష్మణుపై విసరగనూ!
భరతానుజు డంతట యాశరముల బరగ దనను జేరకముందే
వాడియైన బాణంబుల జేతను వానిని ఛేదించెను మధ్యన్! 69

సర్వవీరులనూ సంహరించు నా బన్నగ లక్ష్మణ కుమారుడున్,
వాడియైన బాణంబుల జేతను వానిని మధ్యను ఛేదించి,
తేజస్సులతో మండుచున్న దా దీరుగ నున్నది యున్నటులన్
వాడియైన బాణమును గ్రహించెను వడివడి రాక్షసు వధియింపన్! 70

లక్ష్మణుండు మఱి యా సాయకమును భీష్మగతిని చాపము నందున్,
కూర్చి వేగమున నారిని లాగి కుదురుగ వదిలెను రాక్షసుపై! 71

వీర్యవంతుడగు లక్ష్మణు డంతట పూర్తిగ లాగి విడిచిన యా
వంగిన కణుపులు గలిగిన యట్టి సంగతి యా బాణము జేతన్
రాక్షసవీరుని లలాటమందున రయమున గొట్టెను బలముగనూ! 72

భయంకరుండగు రాక్షస వీరుని బరగ లలాటము నందుననూ,
మున్గంబై శోణితము జేతనూ మానుగ దడిసియు బాణంబున్,
పర్వతంబుపై సర్పరాజువలె బన్నగ గానగ బడుచుండెన్! 73

అటుబిక్కుట లక్ష్మణుని శరముచే నటు భేదింపగ బడినట్టి,
యా రాక్షసుడును రుద్రబాణమున యలరి గొట్టగను బడినట్టి,
త్రిపురాసుర గోపురమునకును వలె దీరుగ కనిపించెను నప్పుడున్! 74

మహాబలుండగు నా రాక్షసుడును మానుగ నట నిల్చిదొక్కుకొనీ,
విమర్శించుకొని, చింతించియు మఱి విమల వాక్యముల నిటు బలికెన్,
బాగు! బాగు! నీమహా శరంబున బరగ ప్రయోగముజేసి యిటుల్
శ్లాఘనీయ శత్రువుగా నైతివి సరి నిను మెచ్చుచు నుంటి నిదే! 75

ఆవిధంబుగను బలికి రాక్షసుడు నలరి ముఖంబును దెఱచికొనీ,
మహాభుజంబుల వంచుచు మఱియును ఘానుగ బైపైకెత్తుచునూ
రథముయొక్క పైభాగము బట్టీ రహి నిలిచియు రథమందుననూ
రథముజేత సంచారము జేసెను రయమున నటు నిటు విక్రాంతిన్! 76

ఆ రాక్షస శ్రేష్ఠుండు శీఘ్రమువ నలరుచు నొక్కటి మూడు మఱిన్,
ఐదు, నేడు శరములను వేగమున నటు పైకిని దీసియు నతడున్,
సంధించెను దన ధనుస్సునందున సరగున నారిని లాగుచునూ,
విడిచెను నేర్పున భరతానుజుపై విపులాగ్నులు జిమ్మగ యంతన్! 77

ఆ రాక్షసువీరుని ధనుస్సునను వలరి వెడలె నా బాణములున్,
మృత్యుదేవతకు సమానమైనవి మేలిమి బంగరు పుంఖములున్,
సూర్యునివంటీ కాంతి గలిగినవి సురుచిరమగు నా బాణములున్,
ఆకాశంబును మండుచున్నటుల యలరి జేసినవి జ్వాలలతో! 78

అటుబిమ్మట యా రాఘవానుజుడు నతికాయునిచే విడువబడీ,
పైకివచ్చు నాశరముల గాంచీ బరగ కలవరము బడక మఱిన్
నిశిత బాణముల యనేకములచే నీరస బఱచెను రాక్షసునీ,
బాణములన్నిటి నేలను గూల్చెను బన్నుగ ముక్కలు ముక్కలుగా! 79

ఇంద్రశత్రువగు రావణాత్మజుడు సాంద్ర యుద్ధమున దన శరముల్
ఖండింపగ బడుటయు గాంచి మఱి కలవర బాటును జెందుచునూ,
కోపించుచు నొక వాడి బాణమును కూరిమి దీసియు సంధించెన్! 80

మహాతేజమును గల రాక్షసుడును మానుగ తనదు మహాశరమున్
ధనుస్సునందున సంధించియు మఱి దగ విడిచెను లక్ష్మణుపైనీ
యెదుటనున్న లక్ష్మణు వక్షంబున నేపుగ గొట్టెను దీవ్రముగన్! 81

రణమునందు నతికాయుని జేతను రయమున వక్ష స్థలమందున్
గొట్టబడిన యా రామానుజుడును గూర్మి శరీరమునుండి మఱిన్
మత్త గజేంద్రము మదోదకమువలె మానుగ రక్తము స్రవియించెన్! 82

విభుడగు శ్రీ లక్ష్మణు డంతట మఱి విమలాత్మను శీఘ్రమున మఱిన్
తన శరీరమున నుండి బాణమును దగ తొలగించుచు వేగముగన్,
వాడియైన బాణంబును దీసీ వనరగ రాక్షసు బాణముపై
యస్త్రంబును సంధించెను నాతడు నా రాక్షసుడును వెఱగందన్! 83

ఆ సుమిత్ర సుతుడగు లక్ష్మణుడును నాగ్నేయాస్త్రంబును వేగన్
బాణంబున సంధించెను నప్పుడు బరగ మహాత్ముడు నైనట్టి,
యా రామానుజునీ యలరు బాణమును నతని ధనుస్సునుగూడ మఱిన్
అగ్నిజ్వాలలను బ్రజ్వలించెనూ నంతట కాంతులు నింపుచునూ! 84

అతి తేజస్వియు, నతికాయుండును నలరుచు సౌరాస్త్రమును మఱిన్
గ్రహించె నంతట మహారణమునను గలత నంద సౌమిత్రియునూ!
భుజగంబునువలె కాంతులు జిమ్మెడి భూరి హేమ పుంఖంబులతో
ఆ బాణంబును నా శస్త్రముతో నలరి గూర్చె సంధింపగమా! 85

ఆ లక్ష్మణుడును నతివేగంబున యట్టి యుద్ధ రంగమునందున్,
జ్వలించుచుండెడి భీమాస్త్రంబును సంధించిన దన బాణంబున్
అంతకుండు మఱి కాలదండమును మంతనమున వేసిన యటులన్,
అతికాయునిపై ప్రయోగించెనూ యంతట నిప్పులు జిమ్మగనూ 86

ఆ నిశాచరుడు నాగ్నేయాస్త్రము నభియుక్తంబై యుండిన యా
శరమును గాంచీ యా రాక్షసుడును సరగున సూర్యాస్త్రముతోడన్,
గూర్చినట్టి యా భయంకరంబగు గూరిమి యా బాణమును మఱిన్
లక్ష్మణుపైనీ ప్రయోగించెనూ లావుగ కేకలు వేయుచునూ! 87

తేజస్సులతో ప్రజ్వరిల్లుచును దీవ్రమైన మొనలును గలుగూ,
అట్టి రెండు బాణములు గగనమున యిట్టె క్రూర సర్పముల వలెన్,
పరస్పరంబును బాధించుకొనీ బన్నుగ మహాగ్ని జ్వాలలతో
ఆకాశంబును గాల్చివేసినవి యన్ని దిక్కులను దీవ్రముగన్! 88

ఆ బాణంబులు రెండు గగనమున నతి వేగంబున దాకుచునూ,
కాల్చి వేసికొని కనలి దీవ్రముగ కదనభూమిపై బడిపోయెన్,
కాంతి హీనమై భస్మీకృతమై కదనంబున నిస్తేజములై
మండిపోయి యా రెండు బాణములు నిండు బొగ్గులుగ మారె నటన్! 89

అటుబిమ్మట యతికాయుడు వేగము చటుల గోపమును గనబఱచి,
త్వష్టాస్త్రము సంధించి వేగమున దగ యైషీకమునగు శరమున్
ప్రయోగింపగా నా సౌమిత్రియు బన్నుగ యైంద్రాస్త్రము దోడన్
త్వష్టాస్త్రంబును ఛేదించెను మఱి దగ రాక్షసుడును వెఱగందన్! 91

కుమారుడగు నా రావణాత్మజుడు గూరిమి యైషీకమును మఱిన్
లక్ష్మణుండు భగ్నము గావించుట భీష్మ దృశ్యమును గాంచుచునూ
క్రోధముతో తన బాణము నంధున క్రూరమైన యామ్యాస్త్రంబున్
సమకూర్చును నా రాక్షసవీరుడు సకల దేవతలు వెఱగందన్! 92

అటుబిమ్మట యా నిశాచరుండును నా యస్త్రంబును లక్ష్మణుపై
విసిరివేసె మఱి గురి జూచియునూ కసి దీరగ శీఘ్రంబుగనూ
లక్ష్మణు డంతట యా యస్త్రంబును లావగు వాయవ్యాస్త్రమునన్
త్రిప్పికొట్టెనూ తీవ్ర ఘాతమున దీరుగ కపి వీరులు గాంచన్! 93

అటు దర్వాతను సౌమిత్రియునూ యతి కోపంబున గూడి కొనీ
ప్రావృట్కాలవు జలధారలు మఱి బన్నుగ గురిసిన రీతిగనూ
శరధారల గురిపించె లక్ష్మణుడు చయ్యన యతికాయుని పైనీ! 94

అ బాణంబులు నతికాయునిపై యలరి సమీపించియు మఱియున్
వజ్రభూషితంబైన కవచమును వనర దాకి ములుకులు విరిగీ,
మహీతలంబున బడిపోయినవీ మానుగ శక్తి విహీనములై! 95

పరవీరుల సంహారము జేసెడి పరమ యశస్సును గలవాడున్
సౌమిత్రియు దన బాణము లా విధి సార విహీనము లగుటయునూ
అఖిసంప్రేక్షుండై వే వెంటను నలరు వేయి బాణములు మఱిన్
నతికాయునిపై వర్షించెను మఱి యవిరామముగా రణమందున్! 96

మహాబలియుడు నవధ్య కవచము మానుగ గలిగిన రాక్షసుడున్
శరజాలంబును దనపై లావుగ చరచర గురియుచు నుండిననూ
అవధ్య కవచము గల్గుగుట జేతను నతికాయుడు యుద్ధము నందున్
బెదరలేదు మఱి చెదరలే దతడు వ్యథను బొందగను లేదతడున్! 97

అటుబిమ్మట యా యతికాయుండును బటు క్రోధంబును గూడికొనీ
సర్పాకారము వంటి బాణమును చయ్యన విడిచెను లక్ష్మణుపై
శత్రుతాపనుడు భరతానుజునకు సరగున దగిలిన బాణముచే
ముహూర్తకాలము మతి గోల్పోయెను మోదము నందెను రాక్షసుడున్! 98

అటు బిమ్మట యామహా బలుండును నరిందముండగు లక్ష్మణుడున్
లబ్ధ సంజ్ఞుడై శరవర్షముచే లావుగ రాక్షసుపై గురిసెన్!
ఆరాక్షసు ధ్వజమును ఛేదించెను నలరి నాల్గు బాణంబులచే
రణమునందు సారథిని వధించెను రయమున హయముల వధియించెన్!

సుమిత్ర నందనుడైన లక్ష్మణుడు సూటిగ సరిగా గురిజూచీ
యసంభ్రాంత చిత్తముతో నాతడు నా బాణములను రాక్షసునీ
చంపుటకొఱకై ప్రయోగించెనూ సకల దేవతలు గాంచగనూ! 101

నరోత్తముండగు లక్ష్మణు డంతట నయముగ రణరంగమునందున్
అతికాయున కే మాత్రము రుజయును నలరి గలుగ జేయక పోయెన్
అటుబిమ్మట వాయువు నటకొచ్చీ నా లక్ష్మణుతో నిటులనియెన్! 102

బ్రహ్మదత్త వరదానమ్ము జేతను బన్నుగ యా రాక్షసుడు మఱిన్
అవధ్య కవచముచే గప్పగబడె నంటవు ముట్టవు బాణములున్
బ్రహ్మాస్త్రముచే భేదింపుము మఱి బరగ యన్యవిధమున నితడున్
వధింప సక్యము గానినాడు సుమ వధింపు బ్రహ్మాస్త్రము జేతన్!
అన్యేతరములు నగు నస్త్రములను నతని జంప శక్యము గాదూ!
బ్రహ్మదత్త కవచముగలవాడును బలవంతుడు బహు విక్రముడున్! 103

పిమ్మట యింద్రుని ప్రతిమానుండగు సమ్మతి యా లక్ష్మణు డంతన్
వాయుదేవుని మాటలు విని మఱి వనరగ బ్రహ్మాస్త్రము గూర్చి

భయంకరంబగు వేగము గలిగిన బాణము ధనుసున సంధించెన్
అతికాయునిపై ప్రయోగింపగా నలరి ధనుస్సును బైకెత్తెన్! 104

సితాగ్రబాగము గలిగినట్టి యా శ్రేష్ఠమైన బాణము పైనీ
ఆ బ్రహ్మాస్త్రము గూర్చునప్పు డట యల దిక్కులు భీతిల్లె మఱిన్
సూర్యచంద్రులును, మహా గ్రహంబులు శోషజెంది నాకాశంబున్,
మహీతలంబును ధ్వని జేసినదీ మానుగ భీతిలె భూతములున్! 105

సౌమిత్రియు బంగారు పొన్నుతో బన్నుగ గూడిన బాణంబున్
యమదూతకు మఱి సమానమైన యలరు బాణమును ధనుస్సునన్
బ్రహ్మాస్త్రముతో నియోగించి మఱి బన్నుగ నారెని లాగుచునూ
వజ్రకల్పమగు నాశరమును మఱి వనర రాక్షసునిపై వదిలెన్! 106

ఆ రణమున సౌమిత్రి విడిచినా ఆ బాణము వృద్ధిని బొందీ
వాయువేగమున వచ్చుచు నుండెను వనరగ యతికాయుని పైకిన్
నాశర పుంఖంబునకును గలపూ నలరు రెక్కలును జిత్రముగన్
ఉత్తమ వజ్రంబుల చేతను మఱి చిత్రవర్ణములతో నుండెన్!
సమాప తప్తంబగు బాణంబును సరగున గాంచెను రాక్షసుడున్! 107

అతికాయుడు నాశరమును గాంచీ యలరుచు యనేక నిశితములున్
బాణంబులచే దానిని గొట్టెను ప్రబల బాహుబల సాహసతన్
సుపర్ణు వేగము వంటి వేగమును సురుచిరముగ గల లక్ష్మణునీ
ఆశరమును మఱి యతివేగముతో నతని పార్శ్వమునకును జేరెన్ !108

ఆ సమయంబున యతికాయుండును నటు దన మీదకు వచ్చిన యా
యమునితోని మఱి మృత్యుదేవతకు సమానమగు నా బాణంబున్
జూచి మదిని కలతను జెందకనూ జూచి శక్తి ఋష్టుల తోడన్
గద తోడను మఱి కుఠారంబుతో గఱకు శూలములతో గొట్టెన్! 109

అగ్ని దీప్తమగు నాబాణంబును నద్భుత విగ్రహములు గలుగూ
అయాయుధముల నన్నిటి గూడను నర్థ రహితముల గావించెన్

అటుల జేసి మఱి యా యతికాయుని యపురూపంబగు కిరీటమున్
గూడినట్టి యా శిరసును గ్రహించి కూరిమి నేలను బడవేసెన్! 110

లక్ష్మణు జేతను బ్రమర్దితంబై లావగు సశిరస్త్రాణముతో
ఆశి రస్సు హిమ శిఖరంబునువలె నడలగ రాక్షస సైన్యంబున్
మహీతలంబున బడిపోయినదీ మానుగ బహు ధ్వని జేయుచునూ! 111

హత శేషులునగు నిశాచరులునూ నట ధరణీతలమున బడినా
విక్షిప్తాంబర భూషణంబులను వికటంబగు రాక్షసు గాంచీ
కంటికి మంటికి నేకధారగా గంపముతో రోదించి రటన్! 112

రణరంగంబున యలసి పోయి మఱి రహి విషణ్ణముఖముల తోడన్
దీనులైన యా రజనీచరులును ధీరత వీరత్వము దొలగీ
విస్వరంబులగు స్వరముల తోడను విపరీతముగా నేడ్చి రటన్! 113

నాయకుండు రణమున మరణింపగ నయముగ నిశాచరులు నపుడున్
భీతిజెంది రణరంగము నందున బిగువాసక్తియు జెదరగనూ!
లంకాపురికిని యభిముఖంబుగా శంకలేక బరుగెత్తుచునూ
యా నగరమునకు నన్ని వైపులను నటు నిటు బోయిరి వేగముగన్! 114

భీమబలుండును, దురాసదుండును భీకర శత్రువు మరణింపన్
వానరవీరులు సంతోషించిరి వనరగ గంతులు వేయుచునూ
ప్రఫుల్ల పద్మములకు సమమైనా పల్లవించినా ముఖములతో
కోరిన జయమును సంపాదించిన కూర్మి సుమిత్రా నందనునీ
వీరగంధములతో బూజించిరి వేడుకతో నా కపి వీరుల్! 115

అతి బలీయుడును, మేఘసమానుడు నతికాయుని రణరంగమునన్
బడగొట్టియు, సంతోషించుచునూ బన్నుగ యా రామానుజుడునూ
కపివీరులతో సంపూజితుండై కదనంబున విజయము గొనుచున్
రాముని సమీపమునకును జనియెను రయమున యంజలితోని మఱిన్! 116

యుద్ధకాండములోని 17వ సర్గము-సమాప్తము

# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### డెబ్బదిరెండవ సర్గము

(రావణుఁడు చింతాక్రాంతుడై సావధానచిత్తులై లంకానగరమును రక్షింపుడు అని రాక్షసులను నాదేశించుట.)

మహాత్ముడగు నా రామానుజుచే మహావీర్యు డతికాయుండున్
మరణించుట విని రావణాసురుడు మదిలో బహువేదన నందెన్,
ఈవిధంబుగా దనలో దానే నిమ్మగ యోజించెను మదిలో! 1

అక్లిష్టకర్మణుడగు రామునిచే నల ధూమ్రాక్షుడు మరణించెన్,
మహాక్రోధమును గలవాడును మఱి మహాయుధములను ధరియించూ,
ప్రహస్తుడును మఱి కుంభకర్ణుడును బన్నుగ జంపగ బడిరి యనిన్,
శస్త్రధారులను శ్రేష్ఠుడైన యా యస్త్రధారులను ప్రముఖుండున్,
అకంపనుండును రణమున జచ్చెను నరసి జూడ వారందఱునూ
మహావీర్యులును, మహాబలీయులు వీరులు, ధీరులు రాక్షసులున్,
యుద్ధకాంక్షులును బరసైన్యంబును యుద్ధతి యణగించెడి వారున్
దేవదానవులచే నెన్నడును దీరుగ యపజయ మందకనూ,
విజయలక్ష్మినీ బొందిన వారలు వికట శత్రువుల బరిమార్చి,
ససైన్యంబుతో గూలిరి రణమున సాహసవంతులు రణధీరుల్,
సుమహాకాయులు, మహాయుధంబుల సురుచిర జతురత గలవారున్,
రణప్రవీరులు, శూరులు, ధీరులు రహి మహాత్ములగు రాక్షసులున్,
వధింపబడిరీ రణరంగంబున వరుసగ యా రామునిజేతన్! 4

ప్రఖ్యాతుండును బలవీర్యుండును బన్నుగ నాదు సుపుత్రుండున్,
ఇంద్రజిత్తుచే భయంకరంబగు సాంద్రమైన వరములు గలుగూ,
బాణంబుల బంధింపగ బడిరీ బరగ రాజపుత్రులు నాడున్! 5

మహాబలముగల సురాసురులతో మానుగ యక్షుల జేత మఱిన్,
గంధర్వులు, పన్నగులు, కిన్నెరలు గఠినమైన శరబంధములన్,

విడిపించుటకును శక్యముగాదో వీరులైన యా రాక్షసురుల్,
శరబంధమునను ముక్తులైరె మఱి చాల విచిత్రమునగు నిదియున్! 6

మహా ప్రభావము జేతను మఱియును మాయ జేత మఱి విడివడిరో,
మోహింపగ జేసియు విడివడిరో మోదముతో శరబంధమునన్
అంతుబట్టుటయు లేదు గదా మఱి యా రహస్యమును దెలియంగన్! 7

నాదు శాసనము శిరమున దాల్చి నయముగ బోయిన శూరులునూ,
రాక్షస యోధులు రణరంగంబున వనరగ బలవంతులు నైనా,
వానరవీరులచే వధింపబడి వరుసగ గూలిరి వసుమతినీ! 8

ఈ సమయంబున రణరంగంబున నిమ్ముగ రాజకుమారులునూ,
రామలక్ష్మణుల, వారల సైన్యము రయమున విభీషణుని మఱియున్,
ఆ సుగ్రీవుని వధింపగలిగిన యలర్దు శూరుడెవ్వడు నాకున్,
ఈ లంకను గనిపించుటలేదూ! యిమ్ముగ వెదికిన గూడ మఱిన్! 9

అహో! విచిత్రము! రాముని బలమూ! నా లక్ష్మణునీ విక్రమమున్,
రాముని పరాక్రమము జేతను మఱి, రాక్షసులెల్ల నశించుటయున్,
చిత్రమైన విషయము గాదా మఱి శ్రీరాముడు మానవుడు గదా!
రాముడెంత బలశాలి! రామునీ రమ్య విక్రమం బెట్టిదియో! 10

గుల్మములో నీ సైనికు లందఱు గూడి చరింపగ వలయుసుమా!
యీ లంకానగరంబును మఱియును నిమ్ముగ సీత వసించెడి యా
అశోకవనమును గాపాడగ వలె యపాయ మింతయు లేకుండన్,
అప్రమత్తతను జరింప వలెనూ యంతట రక్షింపగ వలెనూ! 11

ఎచ్చటెచట మన సైన్య మంతయును మచ్చిక నిలబడి యుండినదో!
వారందఱు గడు జాగరూకతను వనరగ బూర్తిగ తెలియవలెన్,
నవ్వారలు వెలుపలికి జనెదరో యెవ్వారలు బురి లోపలికిన్,
వచ్చుచుందురో యన్ని వేళలను నిచ్చ దెలియుచును నుండవలెన్! 12

ఓ రజనీచరులారా! వినుడో! యోరిమితో మీ రందఱునూ!
మీ మీ సైన్యంబులతో గూడుక మిగుల ప్రమత్తతో గూడీ,

అన్నివైపులను నిలిచి యుండుడీ! సున్నితముగ శత్రుల జాడన్,
ఆ కపివీరుల సంచారంబును నాలోచనఅను నెఱుగ వలెన్! 13

ప్రదోష కాలము లందుగాని మఱి బరగ యర్ధరాత్రము లందున్,
ప్రత్యూషంబుల యందుగాని మఱి బరగ యన్ని వేళలయందున్,
నప్రమత్తులై యుండ వలయునూ యా కపి వీరుల యందుననూ
శత్రుసైన్యములు రణరంగంబున సరగున దండెత్తుటకు మఱిన్
నుద్యమించుచున్నదొ కనుగొనవలె యురుకులు బరుగులు దీయుచునూ
దండెత్తుటకును వచ్చుచున్నదో నిండు దనంబున నిలిచినదో!
కనుగొనవలె నో రాక్షసులారా! కలిసి మెలసి మీరందఱునూ! 14-15

అటుబిమ్మట యా మహాబలీయులు నా రాక్షసు లందఱు గూడన్,
లంకాపురి రాజైన రావణుని శంకలేక తద్వచనములన్
విని యాతని యాజ్ఞల ప్రకారమును విధిగా జేసిరి శీఘ్రముగన్! 16

రాక్షసాధిపుం డైన రావణుడు రయమున యావిధి నందఱినీ,
యాజ్ఞాపించియు దుఃఖశల్యమును యలరి ధరించుచు దీనుండై,
తన గృహంబులోనికి వే బోయెను దగ జింతించుచు మది యందున్! 17

అటుబిమ్మట యా మహాబలుండును నా రావణుడును గోపాగ్నిన్,
మండిబడుచు బుత్ర వ్యసనంబున దండిగ యాలోచించుచునూ,
మాటి మాటికిని నిట్టూర్పులనూ మానుగ విడిచెను వేదనతో! 18

(యుద్ధరంగములోని 72వ సర్గము సమాప్తము)

   

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### డెబ్బది మూడవ సర్గము

[ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రామలక్ష్మణులను, వానరసైన్యమును మూర్ఛను జెందించుట]

అటు బిమ్మట యా రణరంగంబున హతావశిష్టులు నగువారల్,
త్వరితగతిని యా రావణు కడకును దగ యతికాయుడు త్రిశిరసులున్
మున్నగు రాక్షస వీరులందఱును జెన్నుగ రణరంగము నందున్,
వధింపబడిరని తెలియ జెప్పిరీ వనరగ రాక్షస రాజునకున్! 1

అటుబిమ్మట యైశ్వర్యాదులతో నలరెడి రాక్షసరాజు మఱిన్
దన వారలు రణరంగమునందున దగ హతమైపోయిన యటులన్
మరణవార్తలను విని రావణుడును మానుగ వేదనతో గూడీ!
మహాభాష్ప పరిపూరితాక్షుడై మానుగ పుత్రుల నాశమునూ
భ్రాతృవధను మది యాలోచించుచు బన్నుగ నుండెను మౌనముగన్! 2

అటుబిమ్మట బహు దీనత్వంబున నలరు శోక సంద్రమునందున్,
దేలుచున్న తన తండ్రిని గాంచీ ధీరుడు రథిక సుశ్రేష్ఠుండున్,
రాక్షసరాజుకు సుపుత్రుండునూ, రయమున యింద్రుని జయించినా
ఇంద్రజిత్తు నీ విధమున బలికెను సాంద్ర సుధీర సువాక్యములన్! 3

రాక్షసేంద్ర! ఓ తండ్రీ! వినుమా! రహి నీ పుత్రుడు నింద్రజితూ!
బ్రతికియుండగా నీవు దుఃఖమున బాధ నొందుటయును దగదూ!
రణరంగంబున యింద్రజిత్తుచే రహిశర ఘాతములను నందీ,
ప్రాణంబుల రక్షించు కొనుటకును బన్నుగ శక్యుడు లేడు గదా! 4

ఈనా డిప్పుడు మద్బాణంబుల నిమ్ముగ గొట్టెద శత్రువులన్,
రామలక్ష్మణుల శరీరంబులను రహి నా శరజాలము చేతన్
భేదించియు నటు నిటు బడవేసెద భీమపరాక్రమమున వేగన్,

వాడియైన నా బాణంబులచే వారల యంగములన్నియునూ
గ్రుచ్చగబడి యుండుట గనుగొనెదవు గూరిమి వారిరువురును మఱిన్
ప్రాణంబుల గోల్పోయి నేలపై బడి శయనించుట గాంచెదవూ! 5

శక్ర శత్రువగు నింద్రజిత్తుని సరసమైన వాక్యము వినుమా!
సునిశ్చితంబగు పౌరుషంబుతో సురుచిర దైవ బలముతోడన్,
గూడినట్టి యీ నా ప్రతిజ్ఞనూ కూరిమి వినుమా! ఓ తండ్రీ!
ఇప్పుడిప్పుడే రామ లక్ష్మణుల యిమ్ముగ వ్యర్థములును గానీ,
మహాశరంబులతో నింపెదనూ మానుగ వారల శరీరముల్ 6

ఇంద్రుడు,యముడును,విష్ణురుద్రులును,చంద్రుడు,సూర్యుడు, నగ్నియునూ
అప్రమేయమగు నా పరాక్రమము నల బలి యజ్ఞ సువాటికనూ,
మహావిష్ణువును దన విక్రమమును మానుగ జూపించిన యటులన్,
తండ్రీ! యీ క్షణమున గాంచెదవూ దగ వారలునూ గాంచెదరూ! 7

దేవశత్రువగు నింద్రజిత్తునూ దీరుగ యధీన సత్త్వమునన్
రాక్షస రాజగు దండ్రితోని యిటు రమ్యముగా బలికియు మఱలన్
అనిల తుల్యమగు వేగము గలిగిన యలరు శ్రేష్ఠమగు ఖర్గములలో
గట్టినట్టి యా మహారథంబును నిట్టె యింద్రజితు నెక్కె మఱిన్! 8

మహాతేజమును గలవాడును మఱి మహా శత్రువుల హంతకుడున్
ఇంద్రజిత్తు మఱి హరి రథోపమగు సాంద్ర రథము నధిరోహించీ
ఎచట యుద్ధ మది జరుగుచున్నదో నచటికి బోయెను శీఘ్రముగన్! 9

మహాబలీయులు, భీమ విక్రములు మానుగ బహు రాక్షస వీరుల్
సంతోషించుచు నుత్సాహముతో వింతగ దూలుచు వేలుచునూ
వారందఱుదూ ధనుస్సులను మఱి ప్రాసలు ముద్గర ఖడ్గములున్
గండ్రగొడ్డలుల గదలను ధరించి చండ భుశుండులు ముద్గరముల్
యష్టులు, శతఘ్నులును, బరిఘులునూ యాయుధంబులును గలవారై
మహాత్ముడగు నా యింద్రజిత్తునూ మానుగ వెంటను బయనంబె!

కొందఱు రాక్షసులును వారలలో చందముగా గజముల నెక్కి
మఱికొందఱు హయములను నెక్కిరి మానుగ బోయిరి వెనువెంటన్
కొందఱు వ్యాఘ్రంబులను నెక్కితి కొందఱు బర్వత సమమైనా
లేళ్ళను, బిల్లులు గ్గాడిదలను మఱి ధీరుగ యొంటెల నెక్కి ఘఱిన్
సర్పంబుల మఱి యడవి పందులను సరసత క్రూర మృగంబులనూ
సింహంబులనూ జంబుకంబులను శీఘ్రము నెక్కిరి రణమునకున్!
వీర్యవంతుడును త్రిదశేంద్రారియు విక్రముడగు నా యింద్రజితూ!
గంభీరంబగు శంఖ ధ్వనులును ఘనమగు భేరీ ధ్వనులు మఱిన్
మారుమ్రోగు చుండగ రాక్షసుడును మానుగ బోయెను రణమునకున్! 14

రిపుసూదనుడగు నింద్రజితునూ విపుల కాంతులను విలసిలన్,
శంఖమువలె మఱి చంద్రుని వలెనూ స్ఫటికె కాంతులను ఛత్రంబున్
పున్నమి చంద్రునితో నాకాశము బోలుపుగ నున్నటు భాసిల్లెన్! 15

సకల ధనుర్ధారులలో శ్రేష్ఠుడు స్వర్ణాలంకారంబులతో
కూడినట్టి యా యింద్రజితునూ కూరిమి రాక్షస స్త్రీ లపుడున్
అందమైన బంగరు చామరముల చందముగా వీచిరి యపుడున్
హారతు లిచ్చిరి యందరకతెలును నలరి విజయమును నందుటకై! 16

శ్రీమంతుడగు రాక్షసరాజును స్థిర ప్రతిజ్ఞుడగు రావణుడున్
మహాసేనతో బయలు వెడలినా మానుగ తన పుత్రుని గాంచి,
యీరీతిని బలికెను మధురముగా నిమ్ముగ ధీరత్వము జిందన్! 17

పుత్రా! నీ వప్రతిరథుండవును బోలుపుగ జయించితివి యింద్రున్
మానుష మాత్రుండైన రాఘవుని మానుగ జయింపగలవు సుమా!
ఈ విషయంబును దెలుప వలయునా? యిమ్ముగ తెలియును సర్వమ్మూ!
అటుల బలికి యా రాక్షసరాజును నలరి పుత్రుడును నంజలితో!
ఆశీర్వాదములను గ్రహించి మఱి నటు వెడలెను రణభూమికినీ! 18

అటుదిమ్మట రవితో సమానమగు నలరు దేజమును గలిగిన యా
ఇంద్రజిత్తుతో లంకానగరము సాంద్రకాంతులను గూడికొని

యర్కునితో నంబర మంతయునూ యలరి ప్రకాశించిన యటులన్
ఆ లంకాపురి ప్రకాశించెనూ యద్భుత విచిత్ర కాంతులతో! 19

మహాతేజమును గలవాడును మఱి మానుగ శత్రు వినాశకుడున్
మహారాక్షసుల రథము జుట్టునూ మానుగ నిలిపెను వేగముగన్!
ఆ రాక్షసుడును యజ్ఞభూమినీ యలరి ప్రవేశించెను మఱియున్! 20

అటుబిమ్మట హుతభుక్సదృశమగు నటుల కాంతులను గలిగిన యా
యింద్రజిత్తునూ శ్రేష్ఠములైనా సాంద్ర పవిత్ర సుమంత్రములన్
అగ్నిని విధివత్పూజించియునూ యపుల హోమమును జేసె నటన్! 21

ప్రతాపవంతుండైన రాక్షసుడు బన్నుగ మాల్య సుగంధములన్
హవిర్లాజములతో పావకునీ యలరి హోమము జేసె నటన్! 22

అప్పు డతడు నభిచారక్రియలో నలరి విధింపగ బడినట్టి,
వస్తుజాలమును నుపయోగించెను జిత్తము గ్రోధమునను గూడీ
ఆయుధముల మఱి రెల్లుగడ్డినీ నలరుచు బ్రహ్మాస్త్రనగ నతడున్
వినియోగించెను విభీతకంబను విషవృక్షపు కొమ్మలను మఱిన్
సమిధలుగా వాడెను హోమంబున సరసత యినుమున జేసిన యా
స్రువమును నాతడు నుపయోగించెను సురుచిర లోహిత వస్త్రములన్!
ధరించె నాతడు హోమవాటికను సరగున కార్యము సిద్ధిలపన్! 23

అత డచ్చోటను నగ్ని వేదికను నలరుచు జుట్టును దోమరముల్,
రెల్లుగడ్డినీ బఱచెను నాతడు విల్లు ఖడ్గమును ధరియించీ,
కృష్ణవర్ణమును గలిగిన యట్టీ కుశలముగా జీవముతోడన్
నున్నయట్టి భాగము శిరస్సునూ యొనర గ్రహించెను రాక్షసుడున్! 24

క్షణేమారు భగ్గున మండిన యా యొనరగ ధూమము లేకయునూ,
పెద్ద జ్వాలగా లేచెను నగ్నియు దద్దరిల్లగా వాటికయునూ!
విజయ సూచకములైన చిహ్నములు వేగముగా గనిపించె నటన్! 25

త ప్తకాంచనము సన్నిభమైనా దగ యగ్నియు దా స్వయముగనూ,
పైకి లేచియును ప్రదక్షిణముగా బరగ తిరుగు జ్వాలలు గలదై!
ఆ హవిస్సు మఱి స్వీకరించెనూ యాలస్యము లేకుండగనూ! 26

అస్త్ర విశారదుడైన యింద్రజితు నలరుచు బ్రహ్మాస్త్రంబును వే
యాహ్వానించెను దానితోని మఱి సలరెడి చాపము, తన రథమున్
ఆయుధములనూ, సర్వవస్తువుల యభిమంత్రించెను బహు నిష్ఠన్! 27

అగ్నియందు హోమంబును జేసీ యల బ్రహ్మాస్త్రంబును వేగన్
నాహ్వానించుచు నున్న సమయమున యల సూర్యగ్రహ చంద్రులునూ
నక్షత్రములను గూడిన నభమును నయముగ చలించె ధ్వనించుచున్! 28

అగ్నివోలె తేజస్సును గలిగిన యల మహేంద్రుతో సమమైనా,
మహా ప్రభావము గలిగిన యాతడు మహా విక్రమము గలిగిన యా
యింద్రజిత్తు హోమంబును జేసీ సాంద్ర ధనుర్బాణంబులతో,
ఖడ్గ రథాశ్వము సూతుల తోడను గదిలి యంబరము నందునమూ,
అంతర్ధానము జెందెను నాతడు యంత్రగతిని రణమును సలుపన్! 29

అటుపిమ్మట యా రాక్షస సైన్యము హయముల రథములతో గూడీ
పతాకములతో, ధ్వజముల తోడను బహువిధ యాయుధముల గూడీ
యుద్ధము జేయగ కోరిక తోడను సిద్ధిని బొందగ విజయంబున్
గర్జించుచు మఱి ధ్వనులు జేయుచును కదనంబునకును వెడలె మఱిన్ 30

ఆవహమందున యారాక్షసులును ననేక విధముల యాయుధముల్,
చిత్రమైనవీ, వేగము గలవీ, శృంగారింపగ బడినవియున్,
అనేక విధముల శరములతోడను ననేక విధముల తోమరముల్,
అంకుశములతో గపివీరులనూ శంకలేక వధియించి రటన్! 31

సుసంక్రుద్ధుండగు రావణాత్మజుడు శూరులు రాక్షసులను గాంచీ
మీరందఱునూ యుత్సాహముతో మీఱిన విక్రమమును జూపీ,
వానరులను మఱి హతము చేయుచును వనర మనకు విజయము గలుగన్
చేయు డనుచు నా యింద్రజిత్తునూ స్థిరముగ బలికెను వారలతో! 32

అటుబిమ్మట యా రాక్షసు లందఱు నలరి విజయమును గోరుచునూ,
గర్జించుచున్నూ కేకలు వేయుచు గదనంబున కపివీరులపై
భయంకరముగా బాణ వర్షమును బన్నుగ కురిపించిరి వేగన్! 33

ఆ రణరంగమునందు నింద్రజితు నా రాక్షసు వీరుల గూడీ,
యలీక-నరాచ బాణంబులతో నరయగ గద ముసలంబులచే
వానరవీరుల ఖండించెను మఱి వరుసబెట్టి బహు ఘోరముగన్! 34

శిలలు వృక్షములు నాయుధములుగా స్థిరముగ ధరించు కపివీరుల్,
రణరంగంబున బహువిధములుగా రహి గొట్టగ బడుచును వారున్,
ఇంద్రజిత్తు రాక్షసుపై వారలు సాంద్రశిలలు, వృక్షంబులునూ
ప్రావృట్కాలపు వర్షంబును వలె బన్నుగ వర్షించిరి వారున్! 35

మహాతేజమును గలివాడును నగు మహా విక్రమము గలవాడున్,
వానర వీరుల శరీరంబులను వనర నుగ్గు నుగ్గుగ జేసెన్! 36

క్రుద్ధుడైన యా యింద్రజిత్తునూ కూరిమి రణరంగము నందున్,
రాక్షసులకు హర్షము గలిగింపగ రయముగ యొక బాణము జేతన్,
తొమ్మండుగురను నైదుగురిని మఱి తోరముగా నేడుగుర నటన్,
వానరవీరుల ఛేదించెను మఱి వనర రాక్షసులు ముదమందన్! 37

సుదుర్జయుండగు నింద్రజిత్తు మఱి సురుచిముగ రణరంగమునన్
రవి నమానమును స్వర్ణ విభూషలు రమ్యముగా గల శరములచే
యుద్ధమునందున వానర వీరుల యుద్ధతుడై మధియించె మఱిన్! 38

రణరంగంబున శర బీడితులై రహి గాయంబుల బొందుచునూ
యా కపివీరులు భిన్నగాత్రులై యలసిపోయి దివిజుల చేతన్
మహాసురులు సంకల్ప విఫలులై మానుగ బడిపోయిన యటులన్
వానర వీరులుగూడ విఫలులై వనరగ పడిపోయిరి ధాత్రిన్! 39

సుదుర్జయుండగు నింద్రజిత్తు మఱి సురుచిరముగ రణరంగమునన్
రవి సమానమును స్వర్ణ విభూషలు రమ్యముగా గల శరములచే
యుద్ధమునందున వానర వీరుల యుద్ధతుడై వధియించె మఱిన్! 38

రణరంగంబున శర పీడితులై రహి గాయంబుల బొందుచునూ
ఆకపివీరులు భిన్న గాత్రులై యలసిపోయి దివిజుల జేతన్
మహాసురులు సంకల్ప విఫలులై మానుగ బడిపోయిన యటులన్
వానరవీరులు గూడ విఫలులై వనరగ పడిపోయిరి ధాత్రిన్! 39

వానరవీరులు నా యుద్ధంబున వనర శరములను కిరణములన్
భానునివలె తపియింప జేసెడి బన్నుగ యా రాక్షసు బైకిన్
మహాకోపమున బరుగు లెత్తిరి మానుగ యాతని దునుమాడన్! 40

అటుబిమ్మట యా వానరవీరులు నలిసిపోయి రణగంగమునన్
భిన్నదేహులై, విచేతనులునై భీతిని వ్యధ జెందిన వారై
రుధిరముచే దడుపగబడి వేగము రోదించుచు దీసిరి పరుగుల్! 41

సమరము నందున కొందఱు కపులును సరగున శిలలను ధరియించి
మహావృక్షములు జేత బట్టుకొని మానుగ ధ్వనులను జేయుచునూ
వెనుకకు మఱలని వారై వేగము చని ముందునకును రామునికై
పరాక్రమించియు రగరంగంబున ప్రాణంబులు విడిచిరి వారున్! 42

ఆ ప్లవంగ వీరులు రణమందున యలరుచు సమవస్థితులగుచున్
నింద్రజితును వృక్షంబుల జేతను సాంద్ర పర్వతాగ్రంబులచే
ప్రావృట్కాలపు వర్షంబును వలె బన్నుగ కురిపించిరి వేగన్! 43

మహాతేజుడును సమితింజయుడును మానుగ రావణ తనూజుడున్
ద్రుమముల యొక్కయు శిలల యొక్కయును దోరముగా ప్రాణంబులనూ
హరించునట్టి యా వర్షంబును నతి సులభముగా దొలగించెన్! 44

ఆటుబిమ్మట యతి సమర్థుడైనా యారాక్షసుడును నింద్రజితూ
ఆశీవిషోపములైనట్టివియును యగ్ని సమానములైనవియున్
బాణంబులచే కపిసైన్యంబును బన్నుగ రణరంగమునందున్
భేదించెను నెక్కడి వారక్కడ భీతిని పరుగులు దీయగనూ! 45

ఆ రాక్షసుడగు నింద్రజిత్తునూ యతి ద్రీవములగు బాణములన్
బదునెనిమిది బాణంబుల జేతను బరగ గంధమాదనుని మఱిన్
దూరముగానుండిన యా నలునీ తొరము తొమ్మిది బాణములన్
గురిజూచియు గొట్టెను రాక్షసుడును కూరిమి వారలు వ్యథజెందన్! 46

మహా వీర్యుడగు నింద్రజిత్తునూ మానుగ రణరంగము నందున్
మర్మవిదారణమగు శరములచే మానుగ యేడింటిని విడిచీ
మైందుని గొట్టెను నైదు బాణముల మానుగ గజుపై వదిలె మఱిన్ 47

ఆ రణరంగమునందు నింద్రజిత్తు నంత జాంబవంతుని నంతన్
పది బాణంబులచే గొట్టెను మఱి బన్నుగ ముప్పది శరములచే
నీలుని గొట్టెను అంగాంగములను నీరస బడగా నాతండున్
భయంకరములును ద్రీవములైనా బన్నుగ వర లబ్ధంబైనా
బాణంబులచే సుగ్రీవుని మఱి బన్నుగ ఋషభుని, యంగదునీ
ద్వివిదున్ దన్యంబున జేసివారిగా ధయ్యున బడవేసెను యనిలో! 48

సంక్రుద్ధుండగు నింద్రజిత్తునూ ధయ్యున జ్వలియించినయట్టి
హోమాగ్నికి వలె యనేక శరముల కడు ముఖ్యులునగు వానరులన్
సమరము నందున బహు విధములుగా బన్నుగ పీడించెను వేగన్! 49

ఆ రాక్షసుడును రవి సమానమగు సలరు సుముక్తములగు శరముల్
శీఘ్రముగా బయనించు బాణముల జిత్తము ప్రహర్ష మందగనూ!
వానరసేనను మథించి వేసెను వనరగ మందర గిరివోలెన్! 50

హృష్టాత్ముండై యింద్రజిత్తునూ శిష్టమునగు శరజాలముచే
పీడింపగబడి, శోణితధారల దడుపబడిన యాకపి సేనన్!
ఉత్సాహములో బరమ ప్రీతితో బన్నుగ దర్శించెను నపుడున్! 51

మహాతేజమును గలవాడును మఱి మహా బలీయుడు నింద్రజితూ!
మఱల భయంకర బాణవర్షమును మహాయుధంబుల వర్షంబున్!
సృజించి వానర వీరుల నందఱ జీల్చెను నంగాంగంబులనూ
బలవంతుండగు రాక్షసుండునూ బన్నుగ మర్దించెను గపులన్! 52-53

అ రాక్షసుడును దన సైన్యంబును నలరి విడిచి బహు వేగముగన్
మహాయుద్ధమున వానర సేనను మానుగ సమీపమును జెందీ
అదృశ్యమానుండై రాక్షసుడును నా వానర సైన్యము లందున్
మహోగ్రమగు దశ శరజాలంబును మానుగ నల్లని మేఘములున్
ఉదకధారలను వర్షించిన విధి యురుతరముగ యని వర్షించెన్! 54

ఆ రణమున యా యింద్రజిత్తుచే నలరి విడునబడు బాణములన్
శిథిలగాత్రులై మాయజేత మఱి శీఘ్రము గొట్టగబడి నట్టి
యద్రికల్పులగు నా వానరులును యడలి వికట స్వరములతోడన్
నఱచుచు నింద్రుని వజ్రాయుధమున యలరి గొట్టబడు గిరి వోలెన్
నేలబడిరి మఱి స్పృహను దప్పి యట కాల వైపరీత్యము గాదా! 55

రణమునందు నా వానరవీరులు రహి వానర సైన్యము లందున్
సితాగ్రంబులగు బాణంబులదే స్థిరముగ జూచుచు నుండి రటన్
మాయా నిగూఢమగు రాక్షసునీ మఱి దర్శింపగ లేదచటన్ 56

అటుబిమ్మట రాక్షస నాయకుడగు నలరు మహాత్ముడు నింద్రజితూ
సితాగ్రంబులను, రవిప్రకాశములు స్థిరముగ బాణశతంబులచే
సమస్తమగు దిక్కులను గప్పెనూ సారెకు శరముల వర్షమునన్
వానర నాయకులందఱనూ మఱి వరుసగ జీల్చుచు జెండాడెన్! 57

ఇంద్రజిత్తు మఱి వృద్ధిజెందుచును సాంద్రాగ్నులతో సమమైనా
కాంతి గలగి యగ్నుల కణములతో గనలి ప్రకాశించుచు నున్నా,
మహాగ్ని జ్వాలలు గల శూలములును మానుగ ఖడ్గ పరశ్వథములున్,
ఆకపి సైన్యముపై వర్షించెను నలరెడి జ్వాలా ఘోరముగన్! 58

అటుబిమ్మట జ్వాలా సంకాశము నలరు శక్రజిత్ బాణములన్,
గొట్టబడిన వానర యూథపులును గూరిమి ప్రఫుల్లములునైనా
కింశుక వృక్షంబుల వలెనుండీ విభ్రంశములై దేహములున్; 59

ఇంద్రజిత్తు నస్త్రంబుల జేతను సాంద్రరీతి నిర్భిన్నులునై
వానర శ్రేష్ఠులు నన్యోన్యంబును వనరగ సమాప్యమును జెందీ,
వికృతస్వరములతో నఱచుచునూ, విలపించుచు నేలను బడిరీ! 60

గగనంబుచు బరికించుచున్న యా కడు బలవంతులు వానరులన్
బాణంబులచే నేత్రము లందున బరగ గొట్టుటను శీఘ్రముగన్,
ఒకరినొకరు మఱి కౌగిలించుకొని వనరగ బడిపోయిరి నేలన్! 61

రాక్షసోత్తముండును, బలవంతుడు, రావణు సుతుడగు నింద్రజితూ,
హనుమంతుని సుగ్రీవు నంగదుని నలరు గ్రంధమాదనుని మఱిన్.
జాంబవంతునీ, సుషేణువీరుని సాహసుండు మైందుని మఱియున్,
వేగదర్శినీ, ద్వివిదుని, నీలుని విపుల బలాఢ్యుడు గవాక్షునీ
విద్యుద్దంష్ట్రుండను గపివీరుని వీరుడు సూర్యాననుని మఱిన్,
జ్యోతిర్ముఖునీ, మఱియు రవిముఖుని యతి బలాఢ్యుడగు నలుని మఱిన్,

పావకాక్షునీ కుముదుం డనియెడి బన్నుగ వానర యూథపునీ,
సమస్తమైనా హరి శార్దూలుల విమల మంత్రముల గూడిన యా
ప్రాసలజేతను శూలంబులచే బన్నుగ శిత శరముల జేతన్,
ప్రావృట్కాలపు వర్షధారలుగ బరగ కపులపై గురిపించెన్! 62-65

ఇంద్రజిత్తు రణరంగము నందున సాంద్ర బలీయులు వానరులున్,
మహా యోధులగు హరి యూథపులను మానుగ బంగరు బాణములన్,
ఛేదించెను, నిర్వీర్యము జేసెను స్థిరమగు దన విక్రమముననూ,
సలక్ష్మణుండగు రామచంద్రునీ సరగున ధనున్ను బైకెత్తీ,
భాస్కర కిరణములతో సమానమగు బాణ వర్షమును గురిపించెన్! 66

పరమాద్భుత శ్రీ గలిగిన రాముడు బాణవర్షమును బడుచున్నన్,
నా శర వర్షము జలధారలుగా నలరుచు లక్ష్యము సేయకనూ,
నలుమూలల బరికించుచు రాముడు నయముగ లక్ష్మణుతో బలికెన్ 67

లక్ష్మణ! గాంచుము! రాక్షసేంద్రుడగు లావు బలాఢ్యుడు నింద్రజితూ!
మహాస్త్రంబులను నాశ్రయించి మఱి మానుగ హరిసైన్యంబులనూ;
బడగొట్టుచు మఱి నుగ్గునుగ్గుగా బన్నుగ మనలను గూడ మఱిన్
శితశరంబులను నూటిగ విడిచీ యతి బాధను గలిగించె సుమా! 68

స్వయంభువునిజే వరముల నందీ సమాహితుండును, మహాత్ముడున్,
అంతర్హితమగు భీమకాయమును జింతలేక యుద్ధమునందున్,
కంటి కగపడని దేహము గలిగీ వింటిని యస్త్రము లొదులుచునూ,
మాయను యుద్ధము జేసెడి వానిని మఱి జంపుట యెటులో నిపుడున్! 69
ఏతదస్త్రమునకును నధిదేవత యీ యస్త్రమునకును మూలంబున్,
స్వయంభువుని యచింత్య శక్తియె సరియగు కారణమని దలతున్,
ఓ ధీమంతుడ! సౌమిత్రీ విను! వనరగ నాతో నీవు మఱిన్,
బాణపాతమును గలత జెందకను బరగ సహింపుము! ధీరతనూ! 70
సర్వాధికుడగు నీ రాక్షసుడును సాయక వృష్టిని మనసేనన్,
గప్పివేయుచున్నాడు లక్ష్మణా, కంపితమై వానరసేనల్,
ప్రధానమైనా శూరు లందఱును బడిపోవ్వుటచే గాయములన్,
ఈ వానరసేనా సమూహమును నిమ్ముగ నున్నది నీరవమై! 71
మన మిరువురమును రణమున నుండీ మానుగ విరమించియు మఱియున్,
హర్ష రోషముల గోల్పోవుచు మఱి యలరి నేలబడి పోవుదమూ!
మనల గాంచి యా రాక్షస ముఖ్యుడు మానుగ విజయము నందినటుల్
మనసున భావించుచు సుప్పొంగుచు మఱి లంకకు బోవును వేగన్! 72
అటుబిమ్మట యా రామలక్ష్మణులు జటుల విక్రముడు నింద్రజితూ
ప్రయోగించినా యస్త్రంబులచే బన్నుగ హింసింపగ బడిరీ,
ఇంద్ర శత్రువగు నింద్రజిత్తునూ నిమ్ముగ హింసించియు వారిన్
సంతోషంబున ధ్వనులను జేసెను సకల రాక్షసులు హర్షింపన్! 73
అటుబిమ్మట యా యింద్రజిత్తునూ యారణ రంగము నందుననూ,
లక్ష్మణ సహితుండైన రాఘవుని భీష్మ యుద్ధమున బడవేసీ,
రాక్షస వీరులజేత జయజయలు రమ్యముగా గొని యింద్రజితూ,
రావణు భుజములజేత గుప్తమగు రమ్యమైన లంకా పురిలో
సంతసమున దా ప్రవేశించి మఱి జరిగిన దంతయు దండ్రికినీ,
వివరముగా వివరించి మోదమును వేడుక గలిగించెను మిగులన్! 74-75

(యుద్ధకాండములోని 73వ సర్గము సమాప్తము)

   

## రెండవ భాగము

### డెబ్బది నాలుగవ సర్గము

[జాంబవంతుని యాదేశమును ననుసరించి హనుమంతుడు హిమాలయమునుండి, దివ్యౌషధములున్న పర్వతమును దీసికొని వచ్చుట— వాటి వాసన దగులగనే రామలక్ష్మణులు సమస్త వానరులును స్వాస్థ్యమును జెందుట]

రణాగ్రమందున రామలక్ష్మణులు రయమున బీడింపగ బడుటన్,
హరియూథపులయు సైన్యమంతయును,నచట నుమూర్ఛను జెందుటయున్,
సుగ్రీవుడు మఱి నీలు నంగదుడు సురుచిరముగ సర్వజ్ఞుడునూ
జాంబవంతులకు నేమిజేయగా సరగున దోపగ లే దచటన్, 1

అటువిమ్మట మఱి బుద్ధిమంతులను నలరు వరిష్ఠుడు నుత్తముడున్
విభీషణుండును దిగులు జెందినా విపులమైన కపి సైన్యమునూ,
గాంచి సహజమగు బుద్ధిబలముతో గపిరాజగు సుగ్రీవునితో,
మంచిమాటలను సంబోధించుచు నంచితముగ నీవిధి బలికెన్! 2

ఆర్యపుత్రులగు రామలక్ష్మణులు నలస్వయంభువుని వాక్యములన్,
మన్నించుచు మఱి యింద్రజిత్తుచే మానుగ యస్త్రంబుల జేతన్
ఏకారణమున బీడింపగబడి, యే కారణమున యవశులై
విషాదముకు మఱి జెందియుండిరో వివరింపగ పని లే దిచటన్
దిగులుజెంద వలసిన పనిలేదూ, దీర్ఘాలోచనములకు మఱిన్! 3

ఆమోఘ వీర్యముగల బ్రహ్మాస్త్రము నల స్వయంభువుని జేత మఱిన్
రావణ సుతుడగు నింద్రజిత్తునకు రంజిల యివ్వగ బడినదియున్
ఆ యస్త్రంబును గౌరవించుచును నలరెడి దశరథ రాకొమరుల్
యుద్ధమునందున మూర్ఛనుజెందిరి యుద్ధతుడగు రాక్షసు జేతన్
దుఃఖింపగ దగ వని యేమున్నది దురపిల్లుటకు కారణమున్?

అటుబిమ్మట ధీమంతుడు మారుతి యా హనుమంతుడు నపు డపడన్
కొంతసేపు బంధములో నుండియు జింతలేక విడిపించుకొని!
బ్రహ్మాస్త్రంబును గౌరవించుచును బరగ విభీషణు వచనములన్
విని యారీతిగ బలికె నంతటను విమలమైన వచనంబులతో! 5

వేగవంతులగు వానర సైన్యము వినుల స్వయంభువు నస్త్రముచే
గొట్టగ బడినది యా సైన్యములో గూరిమి యెందఱు జీవముతో
నున్నవారొ మఱి వెదకగ వలయును నన్నగ యా భీకర రాత్రిన్! 6

వీరులైన యా హనుమంతుడును విభీషణుండును నిరువురునూ
అర్ధరాత్రమున గొఱవులు ధరించి శ్రద్ధాసక్తుల తోని మఱిన్
రణరంగంబున సంచరించిరీ రయమున వెదుకుచు వానరులన్! 7

కపివీరుల లాంగూలంబులునూ, కరములు, పాదము, లూరువులున్
వ్రేళ్ళు, శిరస్సులు దెగి పడియుండెను, వేదన బడుచును గొందఱునూ
గాత్రంబుల రక్తమును గారుచును, గంపిలి కొందఱు మూత్రంబున్
విడుచుచుండిరీ రణరంగంబున వికల వేదనల రోదనలన్! 8

ఆ విధముగ యంతట బడియున్నా యల పర్వత సములగు వారున్
గపివీరులచే మహీతలంబును గప్పగలడి యుండెను నపుడున్
బ్రకాశించు నస్త్రంబులుగూడను బడి యుండెను ధర యంతటనూ
అట్టి యుద్ధ భూమిని హనుమంతుడు నా విభీషణులు గాంచి రటన్! 9

హనుమంతుడు మఱి విభీషణుండును వా రణరంగము నందుననూ,
కొట్టబడిన యా సుగ్రీవుని మఱి కూరిమి శూరుడు నంగదునీ
నీలుడు, శరభుడు, గంధమాదనుడు, నిర్మలుడగు నా గవాక్షునీ
వేగదర్శినీ, సుషేణు వీరుని విమలుడైన మైందుని, నలునీ,
జ్యోతిర్ముఖునీ ద్వివిదుల గాంచిరి, రాత్రివేళ కొఱవుల తోడన్! 10-11

బ్రహ్మదేవునికి నిష్టుడైన యా బరగ యింద్రజితు రాక్షసుచే.
బగటియొక్క పంచమ శేషముచే బన్నగ కపివీరుల నపుడున్

అఱువది యేడగు కోట్లమందినీ యా బ్రహ్మాస్త్రముజేత మఱిన్
గొట్టబడెను నేలను బడునట్లుగ కూర్మి భయంకరమగు రీతిన్! 12

ఆ హనుమంతుడు విభీషణునితో యా నిశిలో గొలవుల తోడన్
సముద్రజల సంఘాతము సమమగు శరములచే బీడింపబడీ
కపిసైన్యంబును జూచిరి వారలు, కలతను నలతను బడుచు నటన్
మహాసత్త్వుడగు జాంబవంతునీ మానుగ వెదికిరి వా రచటన్! 13

వయోవృద్ధుడును, బ్రహ్మ పుత్రుడును, వనర జాంబవంతుని గనిరీ
వార్ధక్యముచే సహజకీతి మఱి వవరగ దుర్బలు డగువాడున్,
వందలకొలదియు బాణంబులచే వనరగ వ్యాపించిన వాడున్
శాంతించిన యా మహాగ్నివలెనూ కాంతిని జిమ్మెడివాడు మఱిన్
జాంబవంతు డట రనిపింపగగని సరగున విభీషణుం డటకున్
నేగి మహాత్ముడు జాంబవంతు గనీ యిమ్ముగ బలికెను నీ రీతిన్! 14

పూజనీయ! ఓ జాంబవంతుడా! పొలుపుగ దెలుపుము శీఘ్రముగన్
వాడి బాణముం జేత గాయబడి వనరగ నీ జీవము లిపుడున్
ధ్వంసము జేయగ బడలేదు గదా! హంస జాగ్రతగ గుండె గదా! 16-16

ఋషిపుంగవుడు జాంబవంతుడును ఋజుభాషణుడు విభీషణుతో
అతికష్టంబున వాక్యంబులనూ యలరి యుచ్చరించుచును మఱిన్
నీ విధి బలికెను జాంబవంతుడును నిమ్ముగ గద్గద స్వరముననూ! 17

ఉత్తమ నియమములను పాలించెడి ఓ విభీషణా! దెలుపుము వే,
అంజనదేవీ వాయుదేవులకు నలరి జనించిన సుపుత్రుడున్,
వానరశ్రేష్ఠుడు నా హనుమంతుడు వనరగ యేమూలను నైనా
ప్రాణంబులతో బ్రతికి యుండెనా? బన్నుగ దెలుపుము వేగముగన్! 18

జాంబవంతు వాక్యములను విని మఱి సరగున విభీషణుం డనియెన్
ఆర్యపుత్రులగు దశరథ సుతులను, నా రఘురాముని, లక్ష్మణునీ
యలరు క్షేమమును నడుగకుండగా నాహనుమంతుని వాయుసుతున్
నలవి క్షేమమును బ్రశ్నించితివీ, యలరు గారణము దెలియదుగా! 19

వాయుసుతుండగు హనుమంతునపై వనరగ యంతటి స్నేహంబున్,
జూపుచుంటినో యంతటి స్నేహము జూపుట లేదుగ యితరులపై,
వానరప్రభువగు సుగ్రీవునిపై వలనొప్పగ యంగదు పైనీ,
రామలక్ష్మణుల యందున గానీ, రయమున జూపుట లేదు గదా! 20

విభీషణుని యా వాక్యంబులు విని వినుత స్వాయంభువు బుత్రుండున్,
జాంబవంతుడును బలికె నిట్టులను సరగున రావణు దమ్మునితో!
రాక్షస శ్రేష్ఠుడ! విభీషణా విను! రయమున హనుమంతుని గూర్చి,
ప్రశ్నించుట యెందులకో దెలిపెద, బరగ వినుము విశదంబుగనూ! 21

వీరుడైన యా హనుమంతుండును వికలత నందక జీవముతో
బ్రతికి యున్నచో మన సైన్యంబును బన్నుగ జంపగబడియు నిలన్
బ్రదికియుండినట్లే భావింపుము, ప్రబలమైన యీ రణమందున్,
ఆ మహాత్ముడును మరణించినచో నరయగ మనమందఱము నిలన్
ప్రాణంబులతో నుండిన గూడను బరగ మరణమును నొందినటుల్! 22

తండ్రీ వాయువుతో సమానుడును దగ పరాక్రమము నందునసూ,
వైశ్వానర సముడైన మారుతియు వనరప్రాణముల నుండినచో,
బ్రదుకుపైని మన కాశలు యుండును బరగ జయమునందున గూడన్! 23

అటుబిమ్మట యా యనిల సుతుండును నా హనుమంతుడు వేగముగన్,
వయోవృద్ధుడగు జాంబవంతునీ వనర సమీప్యమునను జేరీ,
వినయ పూర్వకము యతని పాదముల వేగ నమస్కృతులను జేసెన్! 24

ఆ సమయంబున వ్యథితేంద్రియుడగు నాప్లవగోత్తముడైనట్టి,
జాంబవంతుడును వాయుసుతుని యా సరసమైన వచనముల వినీ
తనను మఱల బుట్టినవానినిగా దలచెను మదియందున మిగులన్! 25

మహాతేజుడగు జాంబవంతుడును మానుగ హనుమంతుని తోడన్
మధురవాక్యముల నీ విధిబలికెను మనసు తీయనీ తేనియలన్,
హరిశార్దూలా! రమ్ము! రమ్మిటకు! రయమున గపులను రక్షింపన్,
ఈ సమయంబున నీవు దప్ప మఱి యెవ్వరులేరు శరణ్యంబున్! 26

ఈ వానరులకు నీ సమయంబున యిమ్ముగ పరాక్రమము జేతన్
బరమ మిత్రుడవు! నీవు దప్ప మఱి బన్నుగ మఱి యెవ్వడు లేడూ!
త్వత్పరాక్రమము ప్రదర్శించుటకు దగిన కాల మది వాయుసుతా!
ఈ సమయంబున యన్యులెవరునూ యరయగ కన్పించుట లేదూ! 27

కపి భల్లూకంబుల వీరులయును, గలత జెందినా సైన్యంబున్,
సంతోషంబును గూర్చుము మారుతి! చింతను దొలగింపుము వేగన్!
రామలక్ష్మణుల శల్యంబులనూ రహి దొలగింపుము శీఘ్రముగన్! 28

వాయువేగమును గల వాయుసుతా! వనర మహా సంద్రముపైనీ,
దీర్ఘమైన మార్గమునందుననూ, దీరుగ బయనము గావించీ,
నగ శ్రేష్ఠంబగు హిమనంతమునకు నయముగ బోవలయును నీవున్, 29

అరి నిషూదనా యటుపిమ్మటనూ యులరెడి బంగరు వికారమున్
నత్యుగ్రంబును, సర్వోత్తమమును నచట ఋషభమను బర్వతమున్,
గౌరీ శంకర శిఖరంబును మఱి గానబడును నీ కచ్చటనూ! 30

ఓ వీరుడ! యారెండు శిఖరముల వనరగ మధ్యము నందుననూ,
ప్రదీప్తంబునూ, యనంతప్రభలను బన్నుగ సర్వౌషధి యుతమున్.
ఓషధి పర్వతమును నీ వచ్చట వనరగ దర్శింపగ గలవూ! 31

వానర శార్దూలా! హనుమంతా! వనరగ నాపలుకులు వినుమా!
యాపర్వత శిఖరంబున బుట్టియు నలరుచు ప్రదీప్తమగునవియున్,
నాలుగు నోషధులున్నవి యచ్చట వనర నీవు గనుగొన గలవూ!
పది దిక్కులనూ ప్రకాశించునూ బన్నుగ దీప్తిప్రదములనూ! 32

ఆ యోషధి పర్వతమున గనంబడు నలరుచు మృత సంజీవనియున్
విశల్య కరణియు, సువర్ణకరణియు, విమలమైన సంధానంబున్!
మహౌషధములను జూడగలవచట మానుగ యోషధి గిరియందున్! 33

వాయుసుతా! ఓ హనుమంతా! విను! వనరగ వానిని యన్నిటినీ,
గ్రహించి శీఘ్రముగా వచ్చుటకును గడు సమర్థుడవు నీవు సుమా!

వాయువందనా! హరివీరుల మఱి వనరగ ప్రాణంబులు పోసీ,
యోదార్పుము! నారల నందఱినీ వనర సజీవుల జేసి మఱిన్! 34

వాయునందనుడు! హనుమంతుండును వనర జాంబవంతుని మాటల్
విని సముద్రమును వాయువేగమున విప్పారుచు నిండిన యటులన్!
ఆ మారుతియును నధిక బలముచే నటు బూరింపగబడె నపుడున్! 35

పర్వతంబుపై నిలిచియు దానిని బన్నుగ బీడింపుచు నున్నా,
వీరుడైన యా వాయుసుతుండును వేఱొక పర్వతమునకు వలెన్,
పర్వతంబుపై పర్వతంబు మఱి బన్నుగ నిలిచిన యట్టులనూ,
కనబడుచుండెను నా సమయంబున కాఱుజీకటిని వెలుగులతో! 36

హనుమంతుని బాదంబుల జేతను నణగ ద్రొక్కబడి యా గిరియున్,
గడు మిక్కిలి బీడింపజడినదై, గర్వముతో నిలువగ లేకన్,
భూమిలోపలికి యణగిపోయినది భూరి ధ్వానములు జేయుచునూ! 37

హనుమంతుడు బీడించుట జేతను నా పర్వతమున గల తరులన్,
ఆ వానరవీరుని వేగంబున యట నేలనుబడి జ్వలియించెన్,
ఆ పర్వత శిఖరంబులు గూడను నలరి విరిగి చూర్ణము లయ్యెన్! 38

ఆవిధముగ బీడింపగ బడుచును నలరు వృక్షములు ఖండశిలల్,
విరిగిపోయి బడిపోయినట్టి యా విదుల పర్వతము దిరుగగనూ!
వానరవీరులు నిలువలేక మఱి వనరగ భీతిలి బరుగిడిరీ! 39

ఆ సమయంబున కాలరాత్రిలో నా లంకాపురి ద్వారములున్,
విరిగి పోయినవి గృహద్వారంబులు విరిగి పోయినవి గోపురముల్,
భయముజేత వ్యాకులమై యా పురి బన్నుగ నృత్యము జేసెడినో
యనునట్లున్నది యా పర్వతమును నర్ధరాత్రి సమయమునందున్! 30

పృథివీధర సంకాశుడైన యా పేరిమి యా హనుమంతుడునూ
పృధివీధరమును బీడించియు మఱి బిదప సముద్రముపై నుండీ
సంద్రముతో గూడిన వసుమతినీ సాంద్రముగా క్షోభను గూర్చెన్! 41

ఆమారుతియు త్రికూటము నుండియు నలరు మేరు మంధరగిరులన్,
సమానమైనా మలయపర్వతము సరసత నెక్కెను శీఘ్రముగన్,
ఆ పర్వతమును సెలయేఱులతో ననేక జల ధారలతోడన్
నానా లతా ద్రుమంబులతోడను నయముగ శోభించుచునుండెన్!

వికసించిన కమలోత్పలములతో విమల సరస్సుల గూడికొని
యఱువది యోజనముల యెత్తును మఱి నలరుచుండు నాపర్వతమున్,
విద్యాధరులును, మునిగణంబులును, విమలాప్సరసల జేత మఱిన్,
సేవింపగబడు చుండును మలయము చిత్రమైన మృగ సంఘములన్,
బహుకందర శోభితమునునైరా పర్వతమును మారుతి యెక్కెన్! 42-43

మారుతాత్మజుడు హనుమంతుండును మలయ బర్వతము నెక్కి మఱిన్,
అటగల యక్షుల, గంధర్వులనూ, యలరు కిన్నరులను గూడన్,
వ్యాకుల బఱచుచు, భీతిని గొలుపుచు వనరగ తనదు శరీరంబున్,
మేఘంబును వలె బెనచి నిలిచెనూ మేఱు బర్వతమువలె నచటన్! 44-45

పాదంబులచే నా శైలంబును బన్నుగ యణచుచు మారుతియున్,
బడబా ముఖమును బోలె యగ్రమును భయంకరంగు ముఖముననూ!
నోరు దెఱచి యా రజనీచరులను మాఱుమ్రోగ యాకాశంబున్,
గర్జించుచు భీకర ధ్వనితోడను గడుభయంబు నట గలిగెంచెన్! 45-46

అధికముగా ధ్వని జేయుచున్న యా హనుమంతుని ధ్వనులను వినుచున్
లంకయందుగల రాక్షసశ్రేష్ఠులు శంకను మనసున భయబడుచున్,
నిశ్చేష్టతనూ నిలిచిపోయిరీ యచ్చముగా బ్రతిమల వోలెన్! 47

భీమవిక్రముడు, శత్రుమర్దనుడు, భీకర రూపము గలవాడున్,
నా హనుమంతుడు సముద్రమునకును నలరి నమస్కృతి గావించీ,
రాముని కొఱకై పరమకర్మమును రయముగ జేయగ దలదె మదిన్! 48

భుజంగ కల్పంబగు బుచ్ఛంబును బూని యెత్తి వీపును వంచీ,
చెవులను కొంచెముగా వంచుచునూ స్థిరముగ బడబా ముఖసమమున్

కాంతిగలిగినా ముఖమునుదెలచీ, కడు వేగము గూడినవాడై
ఆకాశంబున గరుత్మంతువలె యలరి యెగిరె యా మారుతియున్! 48

ఆ మారుతియును దన వేగముచే నలరు వృక్ష సముదాయములన్
శైలములను, శిలలను హనుమంతుడు, సామాన్యులునగు వానరులన్
దనతోగూడను హరించె నప్పుడు దగ తీవ్రమునగు వేగమునన్
బాహువులును, నూరువులతోని మఱి బరగ వేగమున యెగిరిన యా
శిలలు, ద్రుమములును క్షీణవేగమున జలములందు బడిపోయినవీ! 50

గరుత్మంతుతో సమానమైనా కడు విక్రమమును గలిగిన యా
వాయు సుతుండగు నా హనుమంతుడు నొనరగ యావేశము నందున్
సర్ప శరీరము వంటి బాహువుల సరగున జాపుచు దిక్కులనూ
లాగుచున్నవాడా యన్నటులను నా హనుమంతుడు నెగురుచునూ!
పర్వతములలో శ్రేష్ఠమైన యా బన్నుగ హిమగిరిపై వ్రాలెన్! 51

ఆ హనుమంతుడు దిరుగుచున్న యా యలరెడి తరంగ పంక్తులతో
నిండిన జలములజేత నందుగల మెండుగ జీవుల నిఖిలమునూ
త్రిప్పివేయుచున్నట్టి సంద్రమును దీరుగ గాంచుచు శీఘ్రముగా
విష్ణు కరాగ్రమునుండి ముక్తయై విమల చక్రమును బోలె మఱిన్
నా హనుమంతుడు బోయె హిమగిరికి నలరుచు నెగురుచు శీఘ్రముగన్!

పితృతుల్యమగు వేగంబును గల భీమవిక్రముడు మారుతియున్
పక్షి గణములను సరసుల కొలనుల బన్నుగ నదులను, జెఱువులనూ
శ్రేష్ఠములైనా నగరంబుల మఱి స్థిరమగు జన సముదాయములన్
గాంచుచు బోయెను ననిల సుతుండును గడు వేగముగా హిమగిరికిన్!

తండ్రికి సమమగు బరాక్రమంబును దగ గలిగిన యా మారుతియున్
ఏమాత్రము నలసట లేకుండగ నిమ్ముగ పయనించుచు నతడున్
ఆదిత్యుని పద మనుసరించుచును నతి శీఘ్రముగా బయనించెన్! 54

వానర శ్రేష్ఠుండైన మారుతియు మానుగ వాయువునకు బోలెన్
మహా జవముతో గూడినవాడై మహానాదమును జేయుచునూ
దిక్కులన్నియును మాఱుమోగగను ధీరత హిమగిరికిని బోయెన్! 54

భీమ విక్రముండైన మహాకపి భీకర రూపము గలవాడున్
హనుమంతుండా జాంబవంతునీ నలరు వాక్యముల స్మరించుచున్
శ్రీకరమగు హిమవత్పర్వతమును శీఘ్రముగా దర్శించె నటన్! 56

నానా ప్రస్రవణోపేతంబును నయముగ బహు కందరములతో
అనేక సెలయేఋలతో గూడుక యంద చందముల లలరియునూ
తెల్లని మబ్బుల సముదాయముతో దీరుగ సమానమును నైనా
అందమైన శిఖరంబుల నొప్పుచు సుందరమగు వృక్షంబులచే
సుశోభితంబును సర్వోత్తమమును సురుచిర హిమగిరికిని బోయెన్ 58

ఆ హనుమంతుడు నతిప్రవృద్ధమును నలరు హేమశృంగములు గలా
యా మహా నగేంద్రంబును గాంచీ నటగల సురసంఘంబులచే
ముని సంఘంబుల సేవింపగబడు ననేక పుణ్యాశ్రమములనూ!
దర్శించెను నా హిమగిరి యందును దగ పవిత్రమగు స్థలములనూ! 58

ఆ హనుమంతుడు నచట గనుగొనెను నల స్వయంభువుని గృహంబునూ!
కైలాసంబును నింద్రుని గృహమును గడు విలాసమున రుద్రుండున్
బాణంబులు విడిచిన స్థలంబునూ బరగ హయగ్రీవుని గొలిచీ
యారాధించెడి యా స్థలంబునూ యట ప్రకాశ యుక్తంబైనా
రుద్రదేవుడును బ్రహ్మదేవునీ రూఢిగ శిరసును ఖండించీ
బడగొట్టిన యాస్థానంబును మఱి బరగ గాంచె రవి కింకరులన్! 59

ఆ హనుమంతుడు గాంచెను హిమగిరి యలరు వజ్రస్థానంబు మఱిన్
వైశ్రవణుని యా నివాసంబునూ వనరగ ఛాయా దేవికినీ
ప్రీతిని గలిగించుటకై సూర్యుని పేరిమి కాంతిని తగ్గింపన్
శాణముపై యెక్కించుట కొఱకై చక్కగ సూర్యుని బంధించీ
విశ్వకర్మ వన్నైన పన్నాగము వివరించెడి యా ప్రదేశమున్
బ్రహ్మాసనమును శంకర ధనుస్సు బరగయుండు నా స్థానంబున్
వసుంధరకు నాభీ యని బిలిచెడి వనరగ రసాతలంబునకున్
ప్రవేశద్వారము పావని గాంచెను బన్నుగ బోత్తుచు మార్గమునన్! 60

హనుమంతుడు నట యుగ్రమైన యా యలరెడి కైలాసము గాంచెన్
హిమవచ్ఛిలనూ ఋషభ పర్వతము నమల మేరుపర్వతము మఱిన్
ప్రదీప్తంబునగు సర్వౌషధులను ప్రకాశించు నోషధి గిరినీ
హనుమంతుండును గాంచె నచ్చటను నతి సంతసమును నందుచునూ! 61

వాసవు దూతయు నగు వాయువునూ వనర పుత్రుడగు మారుతియున్
అనల రాశి వలె ప్రకాశించెడి యా పర్వతమును గాంచుచునూ!
విస్మితుడై యోషధి బర్వతమున విలసితుడై దుముకుచు నచటన్
ఓషధులను నన్వేషింపగనూ వనరగ బూనెను నాతండున్! 62

మహాకపియునగు మారుతాత్మజుడు మానుగ యోజన సహస్రముల్
అంతరిక్షమున బయనించుచునూ, సుంత భీతి మఱి లేకయునూ
దివ్యౌషధముల ధరించు శైలము దీరుగ జేరియు యోషధులన్
వెదుకుచు నాతడు సంచరించెనూ వేగ రామ కార్యార్థంబై! 63

అటుబిమ్మట యా నగోత్తమంబున యలరెడి మహౌషధులు వేగన్
దమను గోరుచును దమకొఱకై మఱి దగ యెవరో వచ్చితి మనుచున్
దెలిసికొనుచు నా యోషధులన్నియు దీరుగ కనబడుకుండగనూ
అదృశ్యంబులై పోయిన వప్పుడు నాశ్చర్యంబున యాగిరినీ! 64

మహాత్ముడగు నా హనుమంతుంధును మానుగ యోషధులను నచటన్
జూడనివాడై బహుకోపించెను, శూరత ధ్వనులను జేసె నటన్!
అగ్నిసమానము నేత్రంబులుగల యా హనుమంతుడు సహింపకన్
మహీధరేంద్రముతో నీ విధమున మానుగ బలికెను దీవ్రముగన్! 65

నగేంద్రమా! యారాముని విషయము నయముగ జాలియుతేదు గదా!
యర్థమగుచు నున్నది మఱి నాకును వ్యర్థమైన నీ నిశ్చితమున్
అట్టులయినను జ్ఞాడుము నగేంద్రమా! నలరు నాదు భుజ బలంబునూ!
గాంచెద విప్పుడు హింసింపగబడి కఠినమైన నా దండననూ! 66

హనుమంతుడు నద్రిని బెకలించియు నలరు సురాసుర నాయకులున్
గూడినట్టి లోకములను ధాటియు, గూర్మి యంబరమునకు నెగిరెన్

ఆకాశంబున సంచరించెడీ యనేక సురముని సంఘముచే
స్తుతింపబడుచును నా హనుమంతుడు శూరుడైన గరుడుని వోలెన్
భయంకరంబగు వేగముతోడను బన్నుగ బోయెను లంకకునూ! 67

వృక్షంబులతో, గజములతోడను విమల స్వర్గమును గూడుకనూ
వేలకొలది ధాతువ్రజను గూడుక వికీర్ణ కూటములును గలిగీ
మండుచున్న చరియల బాగంబులు మానుగ గలిగిన శిఖరంబున్
గ్రహించి శీఘ్రము బహు వేగముగా గగనంబునకును నెగురుచునూ, 68

భాస్కర సమానమగు కాంతులతో బ్రజ్వరిల్లు హనుమంతుడునూ,
భాస్కర సమ శిఖరమును గ్రహించియు భాస్కర మార్గమునందె మఱిన్
ఆ సమయంబున యా పావనియును నల రని సమీపమందుననూ
రెండవ సూర్యునివలె భాసించెను మెండుగ కాంతులు జిమ్ముచునూ! 69

శైల సమానుండగు హనుమంతుడు శైలముతో నంబర మందున్
బ్రయోగింపబడి సహస్ర ధారల బన్నుగ యగ్నుల గూడికొనీ
చక్రముతోడను విష్ణువు వోలెను విక్రమమున గపి భానింవెన్! 70

ఆ వానరులును బవన సుతుని గని యలరుచు జేసిరి హర్షధ్వనుల్
వారల గాంచుచు హనుమంతుడును హర్షముతో నాదముజేసెన్
వారల యధికము నగు ధ్వనులను విని వనరగ లంకను గలవారల్
బహు భయంకరముగా ధ్వనులను వే భయమును జెందియు జేసి రటన్!

అటుబిమ్మట యా మహాత్ముడైనా యా హనుమంతును వేగముగన్
శ్రేష్ఠమైన యా పర్వతంబుపై స్థిరముగ కపిసైన్యము మధ్యన్,
దిగి వానర వీరుల కందఱకును దీరుగ యంజలి ఘటియించీ,
అచట నిలిచినా యా విభీషణుని యాదరమున గౌగిలి జేర్చెన్! 72

దశరథపుత్రులు రామలక్ష్మణులు దగ మహౌషధుల గంధంబున్,
ఆఘ్రాణింపగనే వా రిద్దఱి యలరెడి శల్యములును దొలగెన్!
ఇతరులైన వానర నాయకులును నిమ్ముగ లేచిరి జాగృతినీ! 73

సమస్తమైనా హరి ప్రవీరులు జంపగ బడియుండిన వారున్,
శేషములగు నా యోషధిజాలము స్థిరముగ వాసన దగులగనే!
శల్యములన్నియు దొలగిన వారై సరగున లేచియు గూర్చొనిరీ,
యితరులైన వానర నాయకులును నిమ్ముగ లేచిరి జాగృతినీ! 74-75

లంకయందు వానర రాక్షసులకు శంకలేక మఱి యుద్ధంబున్,
ప్రారంభంబైనదా మొదలుకొనీ బన్నుగ యభిమానంబుననూ,
రావణు నాజ్ఞను యుద్ధమునందున రాక్షసులును గపివీరుంచే
జంపగబడిరో వారందఱినీ సరగున సంభ్రమ నందువనూ
బడవేయుచు నున్నారు శీఘ్రముగ పన్నుగ మానార్థంబుననూ! 76-77

అటుబిమ్మట బహు వేగంబునుగల యల గంధవహాత్మజుడు మఱిన్
నా యోషధిగిరి నపుడు దీసికొని యా హిమగిరికిని బోయి మఱిన్,
యథాస్థానమున బ్రతిష్ఠించెనూ యథావిధిని యాగిరి నంతన్,
మఱల వచ్చి శ్రీరాముని తోడను మానుగ గలిసెను నంజలితో! 78

(యుద్ధరంగములోని 74వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### డెబ్బది అయిదవ సర్గము

(వానరులు లంకను గాల్చుట—రాక్షసులకు వానరులకు మధ్య భయంకరమైన యుద్ధము జరుగుట)

అటుపిమ్మట యా వానరేశ్వరుడు అటుల బరాక్రమ వంతుడునూ,
సుగ్రీవుడు విషయమును దెలుపుచును సురుచిరముగ హనుమంతునితో
అర్థయుక్తమగు వచనము బలికెను నందఱు వినగను నాతనితో! 1

కుంభకర్ణుడును నలుగురు పుత్రులు గూలిరి యని జంపగ బడిరీ,
కావున యిపు డా లంకేశ్వరుడును గడు వేగంబుగ రణభూమిన్,
వచ్చి మనకు మఱి యుద్ధభోజనము మచ్చిక నీయగ జాలడుగా! 2

మహాబలంబును గలవారలునూ, మానుగ చతురత గలవారున్,
వానర వీరులలో శ్రేష్ఠులునూ, వనరగ గలరో విక్రములున్,
సింహంబుల బోలెడి వారలునూ, శీఘ్రము నుల్కల ధరియించీ,
రావణాలయము దగ్ధము జేయగ రయమున లంకను గూర్చి మఱిన్,
వానరవీరులు బోదురుగాతను! వనరగ లంకను దహింపగన్! 3

అటుపిమ్మట యాదిత్యు డంతటను నస్తమించు వా డగుచుండన్,
భయంకరంబగు నిశా ముఖంబున బన్నుగ వానర శ్రేష్ఠులునూ,
అగ్నిజ్వాలలను నలరి బట్టుకొని యాలంకను జేరిరి వారున్! 4

సంహృష్టులునగు వానర వీరులు సరగున పుర ద్వారములందున్,
ప్రాకారంబుల మీదనున్న యా బన్నుగ రక్షణ గృహములనూ,
వీధులందు మఱి సందులందునను విమలమైన ప్రాసాదములన్-
హుతాశనంబును విడిచిరి వారలు బతాకములుగా జ్వాలలనూ! 5

ఆసమయంబున యా హుతభుక్ మఱి యా రాక్షసుల గృహంబులనూ,
వేలకొలదియును గాల్చివేసెనూ వేగము ధగధగ మండుచునూ,

పర్వతముల యాకారము గలిగిన ప్రబలమైన ప్రాసాదములున్,
ధరణీతలమున బడిపోయినవీ దద్దరిల్లగా మహాధ్వనిన్! 6

ఉల్కలు హస్తమునందు ధరించియు నురు వేగంబున హరిగణమున్
అన్నివైపులను నాక్రమింపగా నా రక్షణ స్థానములందున్,
వికృత నేత్రములు గల రాక్షసులును వేగము దీసిరి పరుగులనూ,
వెనుకకు జూడక పారిపోయిరీ, వికట ధ్వనుల మఱి జేయుచునూ! 7

అచ్చట గల యా యగురవంతయును జెచ్చెర గాల్చగ బడుచుండెన్!
బరమ సుచందనమును గాల్పగబడె బన్నుగ స్నిగ్ధ సుమౌక్తికముల్
మణులు, వజ్రములు, ప్రవాలకంబులు నూనుగ కాల్చగ వేయబడెన్! 8

అచ్చట తెల్లని బట్టువస్త్రములు నలరి పట్టుతో నేసిన యా
అందమైన కౌశేయంబులునూ చిందిబోవ గాల్వగ బడియెన్,
గొఱ్ఱె యున్నితో నేసినట్టి యా కూరిమి దుప్పటులును మఱియున్
ఇతర మృగంబుల రోమంబులతో నిమ్ముగ నేసిన వస్త్రములున్,
కాంచన వికారమైన వస్త్రములు గడు చటులములగు నాయుధముల్,
కాల్చివేయబడె కపివీరులచే గలవర మందగ లంకయునూ! 9

నానా వికృత సంస్థానములును, నయముగ హయముల వస్తువులన్
ఇతరమైన సామగ్రియు మఱియును నిమ్ముగ గజముల హారములన్
నడుముకు గట్టెడి బంధనంబులును నయముగ గాల్చిరి యగ్నులనూ
సంస్కరించినా రథ ఖండంబులు, జయ్యన గాల్చిరి కపివీరుల్! 10

రాక్షస వీరుల గవచంబులు మఱి రయమున గజాశ్వ కవచములున్
డాలులు, ఖడ్గములును దనుస్సులును, నల్లెత్రాళ్ళు బాణంబులునూ
దోమరములు మఱి యంకుశంబులును దోరముగా శక్తులు నచటన్
గాల్చివేయబడె కపివీరులచే గఱకు రాక్షసుల రథములనూ! 11

అచట యగ్నియును ఉన్ని వస్త్రముల యటుగల చామర చర్మలనూ
యనేక పక్షులు, ముత్యంబులతో నలరు మణులతో జిత్రములో

ప్రాసాదములను గాల్చివేసెనూ బన్నుగ భస్మము మిగులంగన్!
అనేక విధముల యస్త్రములనూ యగ్ని కాల్చె నిర్విఘ్నముగన్! 12-13

అపుడా యగ్నియు విచిత్రములునగు ననేక విధముల గృహములనూ
గృహము లందు నాసక్తియు గలిగిన బహు రాక్షసుల నివాసములున్
గాల్చివేసెనూ కనబడుచుండగ కనలెడి ధూమంబుల తోడన్
ఆ లంకాపురి యందు వసించెడి యలరెడి వందల కొలదియునూ
రాక్షసులను మఱి కాల్చివేయుచును రయమున యధికముగా మండెన్
ఆ రాక్షసులను గొందఱు నుండిరి యలరెడి బంగరు కవచములన్
కొందఱు మాలలు నలంకారములు గూరిమి సుందర వస్త్రముల్
ధరించి యుండిరి కొంద అచ్చటను దగ మద్యము సేవించుచునూ
మద విహ్వలమున నడుచుచుండిరీ మానుగ దూలుచు త్రేలుచునూ!

కొందఱు గాంతల పైటచెంగులను గూరిమి లాగుచు నుండి రటన్
కొందఱు శత్రుల మీది గోపమున కూరిమి గద శూలంబులనూ
ఖడ్గంబుల హస్తమును ధరించియు కరమున ద్రిప్పుచు నుండిరటన్!
గొందఱు దినుచును ద్రాగుచుండి రట కుదురుగ ప్రియురాండ్రను గూడీ
అమూల్యములు నగు శయనంబులచే నలరుచు నుండిరి శయనించీ
కొంతమంది భయపడుచును నగ్నికి వింతగ భార్యాపుత్రులతో
వెంటబెట్టుకొని పారిపోయిరీ చంటి పాపలుగ పరుగులతో! 14-15-16-18

ఆ లంకను నా మహాగ్నిహోత్రము నల సూర్యుని చుంబించెడివా!
అన్నట్లుండిన పర్వత సమములు బన్నుగ సుసార వంతములున్
అట్టి భవనముల దహించివేసెను నిట్టె భస్మమును జేయుచునూ!

అందమైన యా గృహములన్నియును చందమైన తోరంబులతో
గంభీరముగా నుండెను జూడగ స్తంభములతో గూడికొనీ
పూర్ణచంద్రునీ యాకారముతో బొలుపుగ బంగారము తోడన్
అర్ధచంద్ర యాకారమందునను నా గృహములు నిర్మింపబడెన్!

అందమైన పై యంతస్థులుసూ చందముగా గిటికీలు మఱిన్
అన్నివైపులను నమర్చబడెనూ యా లంకాపుర మందుననూ!
మణులతోడ, పగడంబులతోడను మానుగ విచిత్ర గృహములుసూ
శయనంబులతో, నాసనములతో, సారస పక్షుల స్వనములతో
వీణావాదన ధ్వనులతోని మఱి విపులాలంకారంబులతో
మధుర ధ్వనులతో ప్రతిధ్వనించును మానుగ నుండెను నా గృహముల్
యా గృహంబులను దహింపబడెనూ యా కపివీరుల యగ్నులనూ?19-21

ఆ యగ్నులచే చుట్టుముట్టబడి యాద్వారంబులు మండుచునూ
ప్రావృట్కాలపు ప్రారంభంబున బన్నుగ మెఱుపులతో గూడి
మేఘజాలముల వలె కాంతులతో మిగుల ప్రకాశించెను నపుడున్! 22

ఆ యగ్నులచే జుట్టుముట్టబడి యలరు గృహంబులు నాలంకన్
దావాగ్నులచే ప్రజ్వలించెడి డగ పర్వత శిఖరముపోలెన్
ప్రకాశించినవి వింతకాంతులను బన్నుగ యాసమయము నందున్! 23

విమానముల యందున నిదురించెడి విమలోత్తములగు వరాంగనల్
కాల్చి వేయబడుచుండగ యగ్నులు గడుభీతిని మది బొందుచునూ
అంగములందున గల భూషణములు భంగములై జారుచు నుండన్
హా!హా! అయ్యో! యనుచు నేడ్చిరీ యడలుచు బెను బొబ్బల తోడన్!24

ఆ సమయంబున యా లంకాపురి యగ్నులచే మఱి జుట్టబడీ
మహాభవనములుగూడ మహేంద్రుని మానుగ వజ్రాయుధమునసూ
కొట్టబడిన గిరి శిఖరంబులవలె మానుగ బడిపోయెను నేలన్! 25

అన్నివైపుంను నా లంకాపురి యావిధి కాల్చగ బడుచుండన్
నటగల గృహములు కాలిపోవుచును నల హిమగిరి శిఖరములను పోలెన్
దూరమునుండియు ప్రకాశించినవి తోరముగా మండుచు గృహముల్! 26

కాల్చివేయబడు నా గృహంబులును గడు జ్వాలా ప్రజ్వలితములై
హర్మ్యాగ్రలబుంతో నా లంకయు నా సమయంబున నా రాత్రిన్
పుష్పించిన మోదుగ వృక్షములకు బోలె కనుల గనబడు చుండెన్! 27

గజాధ్యక్ష తురగాధ్యక్షులంచే కాలి కవలి పోకుండగనూ
గజముల హయముల వదిలివేయగా గడువేగముగా బరుగిడుచున్
ఆ లంకాపురి ప్రళయకాలమున యటునిటు దిరిగెడి గ్రాహంబుల్
గలిగినట్టి సంద్రమువలె నుండెను గడు బీభత్సము గొలుపుచునూ! 28

ఒకచోటను విడువగ బడినట్టి వనరగ హయమును గాంచి మఱిన్
గజము భయంబున పారిపోయినది, కడుభీతిని వెనుకకు మఱలీ.
ఒకచోటను భయపడిన గజంబును నొనరగ గాంచియు యశ్వంబున్,
భయమును జెందీ వెనుకకు మఱలీ పారిపోవుచున్నవి యచటన్! 29

దహ్యమానమగుచుండగ లంకయు దారుణ యగ్నుల కాంతులలో
వలిసిన యుదకము గల సంద్రంబున గడునెఱ్ఱని యుదకములు గలా!
మహాసముద్రము నకు వలె నప్పుడు మానుగ ప్రకాశమును బొందెన్! 30

హరివిసరంచే గాల్చివేయబడు నా లంకయు క్షణకాలముననన్,
లోకము నశించు మహాప్రళయమున లోలిత నుండెడి ధాత్రివలెన్!
ఆ లంకాపురి యావిధి మారెను నా సమయంబున ప్రళయముగన్! 31

ధూమముజేతను గప్పివేయబడి, దురపిల్లుచు బహు తీవ్రముగన్
జ్వాలన తపితులగు నారీజనములు, సరగున జేసిన మార్తధ్వనుల్
నూరు యోజనములకు వినబడియెను, మారుమ్రోగుచును రోదనలన్! 32

ప్రవృద్ధ కాయములును గలిగిన యా బన్నుగ రాక్షస వీరులనూ,
వెలువలకును మఱి పారిపోవుచును వేగము ప్రాణ సురక్షణకై,
అట్టివారలను వానరవీరులు నిట్టి నిలిపి యుద్ధంబునకై,
ఎదుర్కొనుచు నుండిరి వారలనూ యిమ్ముగ వృక్షంబుల శిలలన్! 33

వానరవీరుల గంభీరధ్వని వనరగ రాక్షసుల ధ్వనులున్,
పదిదిక్కులమా సముద్రమును మఱి బన్నుగ ధరణీ తలముననూ,
ప్రతిధ్వనింపగ జేసిన వచటను బన్నుగ ప్రళయము గలిగినటుల్! 34
మహాత్ములగు నా రామ లక్ష్మణులు మానుగ యుద్ధపు సోదరులున్,
తొలగిపోయినా శల్యంబులు మఱి తీరముగా జాగృతి నందీ,
అసంభ్రాంతులై వారిరువురునూ యతరి ధరించిరి ధనుస్సులన్! 35

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును నలరు ధనుస్సును ప్రయోగించెన్,
ఆ చాపము ధ్వని యా రాక్షసులకును నతిభయంబు గలిగించుచునూ,
వ్యాకులమైన మహా శబ్దంబును నా చాపంబును గలిగించెన్! 36

ఆ సమయంబున మహాధనుస్సును నలరి జఱచు శ్రీరాఘవుడున్,
వేదరూపమగు మహాధనుస్సును వికటముగా ధ్వని జేసెడి యా
కోపించిన రుద్రునివలె నుండెను గూరిమి శ్రీరాఘవు డపుడున్! 37

రణరంగంబున యుత్సాహముతో రహి వానరుల మహాధ్వనులన్,
రాక్షసవీరులు జేసెడి ధ్వనులును రహి రెండింటిని మించుచునూ,
రాముడు జేసెడి టంకారధ్వని రహి యతిశయముగ వినిపించెన్! 38

వానరవీరుల యఱపుల ఘోషయు, వనర రాక్షసుల నిస్వసముల్,
రాముడు జేసెడి జ్యాశబ్దంబును రయమున యాధ్వని త్రయంబునూ
పది దిక్కులనూ వ్యాపించెను మఱి బన్నుగ ఘన గర్జనల వలెన్! 39

శ్రీ కైలాసము శిఖరము తోడను స్థిరముగ సమానమైనదియున్,
నా లంకాపురి గోపురంబునూ యా రాముని చాపమునుండీ,
విడువబడిన చాపంబుల జేతను వేగము ముక్కలు చెక్కలునై
నేలమీద బడి చూర్ణమైనదీ, నీలాంబరమున చుక్కవలెన్! 40

అటుబిమ్మట యా రామబాణములు నలయెత్తగు భవనములందున్
గృహముల యందును బడుచుండుటచే గూర్మి రాక్షసుల వ్యూహములున్
యుద్ధ వ్యూహములు నన్నియు గూడను వ్యర్థంబులై కుప్పగ కూలెన్! 41

యుద్ధమునకు మఱి యాహ్వానించుచు సిద్ధము రమ్మని బిలుచుచునూ,
సింహనాదములు జేయుచున్న యా శీఘ్రము కపివీరుల కేకల్,
ఆ రాక్షసవీరుల కా రాత్రియు నలరి సహింపగ రానిదియై,
ప్రళయకాలమున కాలరాత్రివలె బన్నుగ యుండెను భీకరమై! 42

ఆ సమయంబున వానరేంద్రుడును నలరు మహాత్ముడు రవినుతుడున్,
నా సుగ్రీవుడు నాజ్ఞాపించెను నా వానర వీరుల కపుడున్,

కపులారా! మీరందఱు గూడను కదిలి సమీపపు ద్వారములన్,
జేరి రణంబును సలుపుడు వేగము స్థిరముగ శత్రులు నశియింపన్!43-44

మీలో నెవ్వడు నా ప్రవేశముల నిలిచియు రణమును సలుపకనూ!
వ్యర్థంబుగ కాలంబు గడుపునో సిద్ధము వాడొక ద్రోహియనీ,
రాజాజ్ఞను మన్నింపని వానిగ రహి నిశ్చయమున మది దలచిచీ
వధియింపగ వలె ప్రాణంబులతో వనర నుండరా దీ ధాత్రిన్! 43-44

మండుచున్న యుల్కలను ధరించియు మెండుగ ద్వారములందుననూ
నిలిచియున్న యా వానర వీరుల నిలిచి జూచి రావణు డంతన్
క్రోధావేశమునందు మునిగెనూ కోపముతో బెదవులు గొఱికెన్! 45

ఆ రావణుడును నొడలు విఱచుకొనె సలసల జెందియు గోపముతో,
దశదిశలును వ్యాకులము లాయెనూ, దగ యాతని యవయవములలో
మహారుద్రునీ రూపము గలిగిన మహాక్రోధమును గనిపించెన్! 46

సంక్రుద్ధుండగు రావణాసురుడు సరగున కుంభుని, నికుంభులన్,
కుంభకర్ణునీ కుమారులను మఱి స్తంభసమానుల రాక్షసులన్
ఆకపి వీరుల నెదిరింపగనూ, యలరి బంపె వారిని వేగన్! 47

కుంభకర్ణునీ పుత్రుల తోడను కూరిమి రావణు నాజ్ఞలచే
యుపాక్షుడు మఱి శోణితాక్షుడును ప్రజంఘుండు మఱి కంపనుడున్,
బయలుదేరిరీ భయంకరంబగు ప్రబలమైన యాయుధములతో! 48

రాక్షసేంద్రుడగు నా రావణుడును రాక్షసులను నాజ్ఞాపించెన్
రాక్షసులారా! యీ క్షణమందే రణమును సలుపగ బోవు డికన్
సింహనాదములు సేయుచు మీరలు శీఘ్రము వానరులను జంపీ,
విజయము గూర్పుడు నాకు లంకకును విమల యశస్సులు గలుగంగన్!

అటు విమ్మట యా దశగ్రీవునిచే నా విధి ప్రేరేపింపబడీ
వీరులైన యా రాక్షస యోధులు వివిధాయుధములు ధరియించీ,
మాటిమాటికిని గర్జించుచునూ మానుగ వెడలిరి రణమునకున్
రథ గజ తురగ పదాతి సైన్యములు రయమున ముందుగ నడువగనూ!

ఆ రాక్షసుల సుభాషణంబులను నలరెడి కాంకులజేత మఱిన్
సహజమైన నిజ కాంతులతోడను సరిదూగుచు నా సమయమునన్
అగ్నులతోడను నా కపివీరులు నరుణ కాంతులను గూడి మఱిన్
రెండు సైన్యముల మధ్యప్రదేశము నిండు కాంతులను విలసిల్లెన్! 51

ఆకాశంబున చంద్రునికాంతియు నల నక్షత్రంబుల కాంతియునూ,
రెండుసైన్యముల యాభరణంబుల నిండు కాంతి జ్వలియించుచునూ
ఆకాంశంబును వింత కాంతులను నలరగ జేసెను నట్టి యెడన్! 52

చంద్రుని కాంతియు భూషణంబులయు సహజ కాంతులను గూడికొనీ
గ్రహముల కాంతియు గలిసిపోయి మఱి కాంతి పుంజములు విరియుచునూ
వానర రాక్షస సైన్యంబులనూ వనరగ జేసెను బ్రకాశమున్! 53

చంచలములు నగు దరంగములతో నంచితమగు సాగర మపుడున్
సగము కాలిపోయిన గృహముతో సంసక్తంబగు సలిలములున్
గదులుచున్న యా తరంగములుగల కాంతివంతమగు సముద్రమున్,
నధికముగా నట బ్రకాశించెనూ, నరుణోదయమైనట్లుండెన్! 54

ఆ రాక్షస సైన్యము బతాకలను నల ధ్వజములను నలంకృతమై,
భయంకరంబగు నశ్వంబులతో బన్నుగ రథములు గజములతో,
అనేక విధముల బదాతిదళముల యతి వ్యాకులమైనుండె నటన్!
ఉత్తమ ఖడ్గములును బరశ్వధము నున్నత శూలంబులు గదలున్,
ప్రాసలు, దోమరములును, ధనుస్సులు బ్రకాశించుచుండెను నచటన్,
భయంకరంబగు బరాక్రమంబును బౌరుషంబుగల యసురులతో
నిండియుండె యా సైన్యమంతయును నిండు వాహినికి వలె నుండెన్! 56

ప్రాస లచట మఱి బ్రజ్జ్వలించుచును బ్రకాశించుచుండెను మఱియున్,
వందల కొలదియు జిఱు గంటల ధ్వని సందడిగా వినబడుచుండెన్,
ఆ రాక్షసులును తమ భుజంబులను నలరు హేమ భూషణములతో
నలంకరించుక నలరుచు నుండిరి యధిక శోభలను జిందుచునూ! 57

ఆ రాక్షస సైన్యంబునందు మఱి యలరు సుగంధపు ద్రవ్యములన్,
గంధ మాల్యముల సుగంధములతో కమ్మని మద్యపు వాసనలన్'
నిండియుండె నా సైన్యమునందున మెండుగ సుగంధ వాసనలన్! 58

కొందఱు రాక్షసు లా సైన్యంబున నలరుచు నుండిరి గొడ్డళులన్,
మహాస్త్రములనూ కదుల్చుచుండిరి మానుగ చాపంబుల పైనీ,
బాణములను సంధించు చుండిరీ మానుగ శత్రులపై విడువన్.
ఆ విధముగ నా రాక్షస సైన్యము నతి భయంకరంబై యుండెన్! 58

భయంకరంబును శూరజనముతో బన్నుగ మేఘధ్వని సమమున్,
ధ్వని గలిగినదీ దూరాసదంబగు దగ వచ్చిన రాక్షస సేనన్,
గాంచి వానరుల సైన్యంబును మఱి యంచితముగ చలియించె నటన్,
బహు బిగ్గరగా ధ్వనులను జేసెను బన్నుగ భయబడుచును నపుడున్! 59

ఆ రాక్షసులయు మహాబలంబును నలరుచు జవమున ముందునకున్,
ఆయుధములు ద్రిప్పుచు వేగముగా నా కపివీరుల దునుమాడన్
పతంగములు నగ్నిని జేరిన విధి బరగ రాక్షసులు శీఘ్రముగన్
శత్రు బలమునకు నెదురుగ బోయిరి విక్రమమును భాసింపగనూ! 60

ఆ రాక్షసులయు భుజస్పర్శలచే నలరి ప్రకాశింపగ బడియున్,
పరిఘలు, వజ్రంబులును గలిగినా బన్నుగ యా రాక్షస బలమున్,
మఱి యుండెను శోభాయుత మయ్యెను మానుగ తేజో కాంతులనూ! 61

అటుపిమ్మట యుద్ధంబును గోరెడి యా కపివీరులు రాక్షసులున్,
తరు శైలంబులు ముష్టి ఘాతముల దగ గొట్టుచు నుండిన వారై
ఉన్మత్తులవలె పైకి నెగిఱియును, నురుతర గోళ్ల దంతములన్
బక్కుచు, గొఱుకుచు నుండిరి వారల రణరంగంబున చిత్రముగన్! 61

ఆ విధముగ నా భీమవిక్రములు నా రాక్షసులును శీఘ్రముగన్
వచ్చుచున్న యా వానరవీరుల వాడియైన బాణములచే
శిరస్సులను మఱి భుజ పాదంబుల శీఘ్రము ద్రుంచిరి చతురతతోన్! 62

అచట రాక్షసుల ఆ కపివీరులు నలరుచు దంతంబులతోడన్
చెవులను ముక్కుల గోఱికి వేసిరీ శీఘ్రము రక్తము ధారలుగన్,
కొందఱి శిరసుల ముష్టిఘాతముల గుధురుగ బగులగ గొట్టి రటన్
శిలా ప్రహారంబుల జేతను మఱి చేరి పగుల గొట్టిరె వేగన్! 64

ఆ విధముగనే భీమరూపులగు నా రాక్షసులను గొందఱునూ
వాడియైన ఖడ్గంబుల జేతను వనరగ రణరంగము నందున్,
ప్రధానులగు వానర యూధపులను బన్నుగ గొట్టిరి తీవ్రముగన్! 65

చంపుచున్న యొకనిని మఱి యొక్కడు జంపెను బైపడుచును వానిన్!
బడద్రోసెను వానిని మఱి యొక్కడు బడద్రోసెను మఱి శీఘ్రముగన్,
నిందించుచునూ యున్నవానినీ నిందించెను వేఱొకరుండున్,
గొఱుకుచున్న వానిని మఱి యొక్కడు గొఱికెను రక్తము లొలుకంగన్!

'కొట్టుము' నని యొక్కండు బలుకగను గుదురుగ 'యిదుగో! గొట్టితినీ!'
'కొట్టుచు నున్నా'నని మఱి యొక్కడు గూరిమి శ్రమ యెందులకనుచున్.
'నిలు నిలు!' మంచును నొకడు బలుకగా'నిలిచితి'నంచునుమఱియొకడున్,
ఈ విధముగ బీరములు బలుకుచును నిమ్ముగ యొకరిని మఱియొకరున్,
బలుకుచు రణరంగమున వారలును బన్నుగ యుద్ధము జేసి రటన్! 67

వానర-రాక్షస మహారౌద్రమగు వనరగ యా యుద్ధము నందున్,
గుఱిదప్పగ జేయుట జేతను మఱి కుదురుగ యెన్నో శస్త్రములన్,
వ్యర్థములై పోయినవి కవచములు వొనరగ విడివడె యంగములున్,
ఆయుధంబులును జారిపోయినవి యాయా స్వస్థానంబులనూ,
మహాప్రాసములు నెత్తబడినవీ మానుగ యష్టులు, శూలములున్,
ఖడ్గంబులు మఱి యత్యధికముగా కరము ప్రయోగింపగ బడియెన్ 68-69

అ రణరంగమునందు రాక్షసులు నఱుచుచు వానర వీరులనూ
పదుగురను, యేడ్గురను నొక్కనిని బన్నుగ జంపుచు నుండగనూ!
ఆ వానర వీరులును రాక్షసుల వదుగుర నేడ్గుర నొక్కనినీ
బడగొట్టిరి రణభూమి యందునదు బరగ విక్రమము జూపుచునూ! 70

వస్త్రంబులు, కేశములు విడివడుగ వనర కవచములు ధ్వజములునూ,
రాక్షస సంబంధంబగు సేనను రయమున కపివీరులు నచటన్
చుట్టు ముట్టి బడవేయుచు నుండిరి శూరుల రాక్షస యోధులనూ! 71

(యుద్ధకాండములోని 75వ సర్గము-సమాప్తము)

★ ★ ★ ★

## యుద్ధకాండము - రెండవ భాగము

(డెబ్బది యాఱవ సర్గము)

[అంగదుడు కంపన, ప్రజంఘులను, ద్వివిదుడు శోణితాక్షునీ, మైందుడు యూపాక్షునీ, సుగ్రీవుడు కుంభునీ వధించుట]

భయంకరంబును, వీరయోధులను బన్నుగ నాశము జేయునదీ
సంకుల సమరము సాగుచుండగా నుంకువతో నా యంగదుడున్,
రణమున యుత్సాహము గలవాడై రయమున వీరుడు కంపనుతో
యుద్ధంబునకును దలపడె నప్పుడు నుద్ధతితో నా సమయమునన్! 1

ఆ కంపనుడును వాలిసుతుని మఱి యాహ్వానించుచు రణమునకున్
ముందుగ గదతో నతికోపంబును జెందుచు గొట్టెను నాతనినీ!
గదా ఘాతమున యంగదు డంతట కదిలిపోయి మూర్ఛను బొందెన్! 2

తేజస్వియు నగు నంగదు నంతట దీరుగ సంజ్ఞను బొందుచునూ,
యచటనున్న యొక గిరి శిఖరంబును నలరుచు నెత్తియు కంపనుపై,
విసిరివేసెనూ మహాబలంబున వేగము నాతనిపై బడగన్
అట్టిఘాతమున బీడింపగబడి యిట్టి కంపనుడు గూలె ధరన్, 3

అటువిమ్మట మఱి శోణితాక్షుడును నారణంబుననను హతమైనా,
యా కంపనునీ గాంచి వేగమున యభీతుండునై రణముననూ,
వాలిసుతుండగు చా యంగదునీ వనర సమీపమునకు జేరెన్! 4

అపుడు శోణితుడు వేగము జూపుచు నలరు శరీరము జీల్చునవీ,
కాలాగ్నికి సమమైన బాణముల కదనము నందున యంగదుపై
ప్రయోగించె నపు డా రాక్షసుడును బన్నుగ వీరావేశమునన్,
క్షురములు మఱియును క్షురప్రములనూ క్షూదులైన నారాచములన్,
వత్సదంతములు, శిలీముఖంబులు వనరగ కర్ణులు, శల్యములున్
విపాఠంబులును, బాణంబులనూ వికటములగు వానివి మఱియున్,
అనేక శరముల బ్రయోగించెనూ యా యంగదుపై రణమందున్! 5-6

వాలిపుత్రుడును, ప్రతాపవంతుడు, వనరగ బలవంతుడు నైనా!
అంగదుండు నా రీతిని తనువున సంగతి గాయములును గలుగన్!
ఉగ్రమైన రాక్షసు ధనుస్సునూ యురుతర రథమును,బాణములన్,
తనబలమున నశియింపజేసెనూ దగ రణరంగము నందుననూ! 7

అటుబిమ్మట యా శోణితాక్షుడును చటుల కోపమున వేగముగన్,
అసి, చర్మంబుల గ్రహించి యతడును నంగదుపై విజృంభించెన్,
పైకి యెగిరె ఖడ్గంబు దోడుతను బన్నుగ యాతని ఖండింపన్! 8

బలీయుడగు నా యంగదు డంతట బన్నుగ యాతని కంటె మఱిన్,
పైకిని యెగిరెను నానిని బట్టీ బరగ తనదు హస్తము తోడన్,
ఆతని ఖడ్గము లాగికొనియు మఱి యలరి సింహనాదము జేసెన్,
నచట నుండినా రాక్షసులంతయు నదిరి బెదిరి పరువెత్తగనూ! 9

అటుబిమ్మట యా మహాబలీయుడు జటుల విక్రముడు నంగదుడున్,
ఫలకము వంటీ భుజమునందునను బన్నుగ ఖడ్గమునను బొడిచెన్,
లోతుగ నాటిన యాఖడ్గముతో లోలత మెడలో జందెముగా,
ఆ రాక్షసునీ నఱికి వేసెనూ యందఱు గనుగొన రణమందున్! 10

వాలి పుత్రుడగు నంగదు డంతట వవరగ ఖడ్గము గ్రహియించీ,
మాటిమాటికిని గర్జించుచునూ మాసుగ రణరంగము నందున్
ఇతరులున్న శత్రువుల వైపునకు నిమ్మగ వెడలెను వేగముగన్! 11
అటుబిమ్మట వీరుండు బలీయుడు నలరుచు యూపాక్షుండు మఱిన్
మహాకోపమున ప్రజంఘుతోడను మానుగ కూడినవాడగుచున్!

మహాబలీయుడు వాలిపుత్రునీ మానుగ యెదిరింపగ దలచీ,
రథమునెక్కి పరివారము తోడను రయమున బోయెను నచ్చటికిన్! 12

వీరుడు కనకాంగదములు గలిగిన వికట రాక్షసుడు శోణితుడున్,
మూర్ఛనుండి మఱి దేరుకొనుచునూ ముడులు గలుగు గద ధరియించీ,
వాలిసుతుండను నా యంగదుపై వనరగ బోయెను రణమునకున్! 13

మహావీరుడును, బలవంతుడును మానుగ ప్రజంఘు డంతటనూ,
క్రుద్ధుండై యూపాక్షునితోడను గూడినవాడై వేగముగన్,
మహాబలీయుడు నంగదు బైకిని మానుగ బోయెను గదతోడన్! 14

శోణితాక్షుడును, నల ప్రజంఘుడును, శూరులు నిరువైపుల నుండన్,
మధ్యను వానరశ్రేష్ఠుడైన యా మహాకపియు నంగదు డుండన్,
విశాఖ నక్షత్రముల మధ్యనూ విమల పూర్ణ శశి నిలిచినటుల్
యాయంగదుడును ప్రకాశించెనూ, యలరు రాక్షసుల మధ్యమునన్!

మైంద ద్వివిదుల నా యంగదునీ మానుగ పరిరక్షించుచునూ,
యితని సమీపమునందు నిలిచిరీ యలరి యుద్ధమును జేయుటకై,
తగిన శత్రువును వెదుకుచు నుండిరి దగ రణరంగము నందుననూ! 16

మహాకాయములును గలవారును మఱి మహాబలీయులు రాక్షసులున్,
నసి బాణా గద ధరులై వేగము నధిక క్రోధ రోషంబులతో,
వానర వీరుల బరిమార్చుటకును వనరగ జనిరి రణంబునకున్! 17

ఆ ముప్వురు రాక్షసవీరులతో నా రణరంగము నందుననూ
ఆముప్వురు వానరవీరులతో నధికమైన పోరును జరిగెన్!
భయంకరంబును ప్రబలమైన యా బాహాబాహీ రణమందున్
జూచువారలకు రోమ హర్షణము సురుచిరముగ గలుగుచు నుండెన్! 18

ఆహవమందున వానరవీరులు వనర వృక్షములు గ్రహియించీ,
మహారాక్షసులపైని విసిరిరీ మానుగ వారల బరిమార్పన్,
మహాబలముగల ప్రజంఘుండు నట మఱి మాటాడక ఖడ్గముచే
నా వృక్షంబుల జిదుపలు జేసెను నలరి నేల బడిపోవగనూ! 19

ఆయుద్ధంబున ప్లవంగ వీరులు నలరుచు శిలలను వృక్షములన్,
మహారాక్షసుల రథముల మీదికి మానుగ హయముల మీదికినీ,
విసిరివేయగా మహాబలీయుడు వికటముగా యూపాక్షుండున్,
వాని నన్నిటిని తన బాణంబుల వనరగ జేసెను జూర్ణముగన్! 20

వీర్యవంతుడును, ప్రతాపవంతుడు, విక్రముండు శోణితుడు మఱిన్,
మైంద ద్వివిదులును విసిరినట్టి యా మహావృక్షముల శిఖరములన్,
తనగద జేతను మధ్యమునందే దగ ధరణీతలమున గూల్చెన్! 21

అటుబిమ్మట యా ప్రజంఘుండునూ చటుల బరాక్రమమున వేగన్,
శత్రువులయు మర్మస్థానంబును జిత్రముగా బరిమార్చునదీ,
విపులమైన ఖడ్గంబును గైకొని వేగవంతుడై రాక్షసుడున్,
వాలి పుత్రుడగు నంగదుపైకిని వనరగ బోయెను గట్టెదురన్! 22

ఆ సమయంబున మహాబలీయుడు నందఱి కంచెను మించిన యా
వాలిసుతుడు నాయంగదు డంతట వనరగ దగ్గఱకొచ్చిన యా
ప్రజంఘు రాక్షసు వేగముగా దా ప్రబల విక్రమము తోని మఱిన్
అశ్వకర్ణ వృక్షముతో గొట్టెను నలరుచు ధ్వనులను జేయుచునూ! 23

అటుబిమ్మట యా వాలిసుతుండును నతి బరాక్రమము జూపుచునూ!
కత్తిబట్టినా ప్రజంఘు హస్తము గఠినమైన తన పిడికిలితో!
విసిరిగొట్టగా నిఘాతంబునకు వేగ ఖడ్గమట నేలబడెన్! 24

ముసలమువంటీ ఖడ్గమంతటను బస జెడి ధర బడిబోవుటయున్,
గాంచి రాక్షసుడు దిగులుజెందకను ఘన బలమునుగల ప్రజంఘుడున్,
వజ్రకల్పమగు దన బిడికిలినీ వనరగ బిగించి పైకెత్తెన్! 25

మహాతేజమును గల రాక్షసుడును, మహావీర్యమును గలవాడున్'
వానర శ్రేష్ఠుండగు నంగదునీ వనర లలాటమునను గొట్టెన్,
నా యంగదుడును ముహూర్తకాలము నట జలించి మూర్ఛను బొందెన్!26

తేజస్వియు మఱి ప్రతాపవంతుడు దీరుగ యంగదు డంతటనూ,
సంజ్ఞను బొందీ ఘనమగు బిడికిలి సరగున జాచియు రాక్షసునీ,
శిరమున మోదెను నా ఘాతంబున శిరము శరీరము నుండియునూ,
వేరై ధరణీతల మందుననూ వేగ దొరలె రక్తపు ధారన్! 27

ఆవహామందున దన పినతండ్రియు నటుల నేలబడి పోవగనూ!
అల యూపాక్షుడు కన్నీళులతో నటు శ్రద్ధాంజలి ఘటియించీ,
యంబుల పొదులను బాణములన్నియు బన్నుగ క్షీణింపగ వేగన్,
రథమునుండి మఱి క్రిందికి దుమికెను రయమున ఖడ్గము ధరియించెన్!28

ద్వివిదు డంతటను తొందరబడుచును దీరుగ వేగము వచ్చెడి యా
దగ యూపాక్షుని గాంచి క్రోధమున దరికిజేరి కోపించుచునూ,
ఆ రాక్షసు వక్షస్థలమందున యలరి గొట్టె బహు తీవ్రముగన్!
బలవంతుండగు ద్వివిదు టంతటను బన్నుగ నాతని బట్టుకొనెన్! 29

అటుబిమ్మట యా తేజోవంతుడు నలరు శోణితాక్షుడు వేగన్
మహాబలముగల తన సోదరునీ మానుగ బట్టుట గాంచుచునూ
ఆ ద్వివిదుని వక్షస్థలమందున నలరి గొట్టె బహు తీవ్రముగన్! 30

అటుబిమ్మట యా రాక్షసు జేతను నా విధమున గొట్టగ బడియున్.
మహాబలముగల యాద్వివిదుండును మానుగ చలించిబోయె నటన్,
మఱల నాతడును గదను నెత్తగా మానుగ ద్వివిదుడు లాగికొనెన్! 31

అంతలోపలను మైందుడు వచ్చెను చెంతకు ద్వివిదుని వద్దకునూ,
మహావిక్రముడు నైన మైందుడును మానుగ బిడికిలి బిగియించీ,
కొట్టెను యూపాక్షుని వక్షంబున గట్టిగ యాతడు నొవ్వగనూ! 32

అట్టి మహా సంగ్రామమునందున యతి జవంబు గల రాక్షసులున్,
శోణితాక్షుడును యుపాక్షుండును శూరులైన కపివీరులతో,
తీవ్రమైన పోరాటము సలిపిరి దీరుగ లాగుచు జీల్చుచునూ! 33

వీర్యవంతుడగు ద్వివిదుడంతటను వికటమైన తన నఖములతో
శోణితాక్షునీ ముఖము నందునను శోణితంబు ధారలు జిందన్!
జీల్చివేసి నేలను బడవేసెను జిత్తుగ గొట్టెను నలుగునటుల్! 34

వానరపుంగవుడైన మైందుడును వవరగ కోపించిన వాడై
యుల యూపాక్షుని దన బాహువులను నటు బీడించెను దీవ్రముగన్
ఆ యూపాక్షుడు జచ్చి నేలబడె నట శోణితమును గ్రక్కుచునూ! 35

హతప్రవీరులు గలిగినట్టిదియు నారాక్షస సేనయు మిగులన్
వ్యధజెందినదై నిరాశతోడను వనర కుంభకర్ణాత్మజుడున్,
ఏ వైపుననున్నాడో యచటకు నిమ్ముగ యభిముఖమై పోయెన్! 36

కుంభకర్ణునీ కుమారుడంతట కూరిమి రాక్షస సైన్యంబున్,
తనవైపునకు వచ్చుట గాంచీ దగ ధైర్యంబును జెప్పి మఱిన్!
అటుబిమ్మట తేజస్వియైన యా నల కుంభుడు కపివీరులిచే
చంపబడిన వీరులు గలిగిన యా పంపబడిన సేనను గాంచీ
ఇతరులెవ్వరును జేయజాలనిదియు, నిమ్ముగ యూహింపనిదియునూ
మహోత్కృష్టమగు మహాకర్మమును మానుగ జేసెను నాతండున్!

ధనుర్ధరులలో శ్రేష్ఠుడైన యా దారుణ రాక్షసుడును మఱియున్
మహాధనుస్సును గ్రహించి యాతడు మానుగ సుసమాహితుడునునై
మహాసర్పముల సమానమైనవి మానుగ దేహము జీల్చునవీ
అట్టి బాణముల విడిచెను నాతడు నిట్టె వానరులు దడబడగన్! 39

సశరంబుతో గూడినట్టి యా సారవంతమును నుత్తమమున్
ఆ రాక్షసునీ మహా ధనుస్సును నలరుచు నుండెను కాంతులతో!
మేఘమునందలి మెఱుపుకాంతితో మిక్కిలి యైరావత కాంతిన్,
ద్వితీయేంద్ర చాపంబును వోలెను దీరుగ యపుడు బ్రకాశించెన్! 40

ఆ సమయంబున యా రాక్షసుడును నలరుచు జెవివఱకును లాగీ
హాటక పుంఖమ్ములును గలిగిన యా నలర ఱెక్కలును గట్టినదీ,
మహాశరంబున ద్వివిదుని గొట్టెను మహాధ్వనియు మఱిజేయుచునూ 41

ఆకస్మికముగ బాణ ఘాతమున నా వానర శ్రేష్ఠుండు మఱిన్
అశీవిషోపమమైనట్టిది మఱి నలరు బాణమును సంధించీ,
ఆకస్మికముగ బాణఘాతమున నా వానరశ్రేష్ఠుండు మఱిన్
ఆ ద్వివిదుండును నడుగులు దడబడ యటునిటు నూగుచు విహ్వలుడై
త్రికూటగిరి యట పడిపోయిన విధి ద్వివిదుడు నేలను బడిపోయెన్! 42

అటుబిమ్మట నా మైందు డచ్చటను చటుల మహాహవమందుననూ
పరాజితుండును నైన సోదరుని బన్నుగ గాంచియు జింతిలుచున్
విపులమైన యొక శిలను గ్రహించీ వేగముగా నా రాక్షసునీ
ఎదిరించుటకును బోయె నప్పుడును మది సంశయ మింతయు లేకన్! 43

మహాబలముగల యా మైందుండును మానుగ యా పర్వతశిలనూ
యారాక్షసుపై విసిరి వేసెనూ యా రాక్షసుడును వేగముగన్
ప్రకాశించు బాణము లైదింటను బరగ శిలను ముక్కలు జేసెన్! 44

తేజస్వియునగు నా కుంభుడును దీరుగ సుముఖము గలిగియునూ
అశీవిషోపమమైనట్టిదియును నలరు బాణమును సంధించీ,
మైందుని వక్షస్థలమున గొట్టెను మానుగ ధ్వనులను జేయుచునూ 45

వానర యూథపుడైన మైందుడును పనరగ శర ప్రహారమునన్
కుంభుని జేతను మర్మ స్థానమున కూరిమి గొట్టగబడి యతడున్,
మూర్ఛనొంది నేఖను బడిపోయెను ముదమునొంద యారాక్షసులున్! 46

బలశాలురు నగు మేనమామలును బన్నుగ మైందుడు ద్వివిదుండున్,
సంజ్ఞను గోల్పోవుటను గనుంగొని సరగున యాయంగదు డపుడున్,
ఎత్తబడిన కార్ముకము గలిగినా సత్త్వము గలిగిన కుంభునిపై
ఎదిరించుటకై శీఘ్రము బోయెను మది సంశయ మింతయు లేకన్! 47

శీఘ్రముగా పైపైకి వచ్చుచును స్థిరబలవంతుడు నంగదునీ
ఐదు నినుప బాణంబులతోడను నన్యములును బహు నిశితములున్
మూడు బాణములజేతను కుంభుడు మోదమునను తోమరములతో
మాతంగంబును గొట్టినట్లుగా మానుగ యా యంగదు గొట్టెన్! 48

పిప్తృవంతుడగు నా కుంభుండును విమల సుముఖములు నైనట్టి
తీవ్రమైన బాధను గలిగించెడి దీరుగ యనేక బాణములున్!
కనకభూషలును గలిగినట్టి యా గడు ప్రచండమగు బాణములన్
వాలిసుతుడు నంగదుపై వేసెను వనరగ యారాక్షసుడు మఱిన్! 49

ఆవిధముగ యా కుంభుని జేతను నలరిగొట్ట బడినను గూడన్
ఏమాత్రము నంగదుడు జలింపక యిమ్ముగ నుండెను ధీరతనూ!
అ కుంభుని యా శిరస్సునందున యటగల పర్వత శిఖరములన్
పాదపముల వర్షించెను వేగము బన్నుగ ఘన మేఘంబు వలెన్! 50

శ్రీమంతుడును, బలవంతుడును స్థిరవిక్రముడు నగు వాడున్
కుంభకర్ణునీ కుమారుడైనా కుంభుడు నాయంగదు జేతన్!
విసరబడిన యా పెనువృక్షములను వికటముగా ఛేదించె నటన్,
పర్వత శిలలను బ్రద్దలు జేసెను బరగ చూర్ణమై నేల బడన్! 51

వానర సేనా నాయకుడైనా వనరగ యా యంగదుడు మఱిన్!
తనపై వచ్చుట గాంచి కుంభుడును దగ కొఱవులతో నేనుగనూ!
కొట్టినట్లు మఱి రెండు బాణముల గూరిమి యంగదు కనుబొమలన్
గుదురుగ గొట్టెను నా రాక్షసుడును కులకుల రక్తము నొలుకంగన్! 52

రక్తము నొలుకుట చేత నేత్రములు రయమున కప్పగ బడిపోయెన్
అంగదుండు బహు వ్యధ జెందుచునూ సంగతి ధైర్యము వహియించీ
రుధిరముచే దడుపగ బడినట్టి రూఢిగ యా నేత్రంబులనూ
ఒక హస్తముచే నదిమి బట్టుకొని ఒకహస్తంబున జేరువనూ
నున్న సాల వృక్షమును గ్రహించెను జెన్నుగ దానిని బెకలింపన్! 53

మహాహవమునందున్న నంగదుడు మ్రానును గూడిన వృక్షమునూ
వక్షస్థలమున నదుముచు దానిని వనర హస్తమున దీసికొనీ
కొంచెముగా వంగుచు వృక్షంబును నంచితముగా బెకలించె నటన్! 54

రాక్షసు లందఱు జూచుచుండగా రయమున యా యంగదుడు మఱిన్
ఇంద్ర ధ్వజమును బోలునట్టి యా సాంద్రమందరము సమానమున్
ఆవృక్షంబును కుంభుని పైనను నతి వేగముతో విడిచె నటన్! 55

మహాబలీయుడు నా కుంభుండును మానుగ యావృక్షమును మఱిన్
శరీరంబు వే బ్రద్దలు జేసెడి శాత శరంబుల నేడింటన్!
నా వృక్షంబును నరికివేసెనూ యారాక్షుడును హర్షింపన్! 56

బహుకాలంబున నుండి యంగదుడు బలు యుద్ధంబులు నేయగనూ
అంగదుండు బహు నలసట జెందియు సంగతి మూర్ఛిలె రణమందున్!57

క్షీణించిన యా సాగరంబువలె క్షీణత జెందిన యంగదునీ
రణమునందు మూర్ఛను బొందిన యా రణవీరుడు యంగదు గూర్చి
వానర నాయకులందఱు గూడను వరుసను దెలిపిరి రామునకున్! 57

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును చటుల రణమునను నంగదుడున్
స్పృహ దప్పుట విని వేవేగంబున శీఘ్రముగా కపిశ్రేష్ఠులనూ!
జాంబవంతునీ మున్నగువీరుల సరగున బంపెను నచ్చటికిన్! 58

రామాజ్ఞను విని వానరశ్రేష్ఠులు రయమున కోపించినవారై
ఎత్తబడిన చాపంబును గలిగియు గత్తెర బాణంబుల తోడన్
రణరంగంబున నిలిచిన కుంభుని రయమున నేగిరి దండింపన్! 59

అటుపిమ్మట యా వానరశ్రేష్ఠులు జటుల ద్రుమములును శైలములన్
హస్తము లందున గలవారగుచును నలరు రక్త లోచను లగుచున్
వాలి సుతుని రక్షించుటకొఱకై వనరగ బోయిరి శీఘ్రముగన్! 60

అలరు జాంబవంతుండు సుషేణుడును నల వానర వీరుడు నైనా
వేగదర్శియును గోపించుచునూ వేగముగా రణభూమికినీ
కుంభకర్ణునీ సుతుని ప్రతాపము కుంభిని యందున గూల్చుటకై
మహా వృక్షములు శిలలను గైకొని మానుగ బోయిరి రణమునకున్! 61

వచ్చుచున్న యా మహాబలంబును వానర నాయకులను గాంచీ
జలాశయంబును మహావృక్షములు సరసత గప్పిన యట్లుగనూ?
శర సముదాయముజేత వారలను సరగున గప్పెన్ రాక్షసుడున్! 62

మహాత్ములును నగు వానరేంద్రులును మానుగ కుంభుని బాణములన్
సహింపజాలక పోయిరి వారలు సాహసింపలేకను వారున్
మహా సముద్రపు తీరంబునువలె మానుగ దాటగ జాలకసూ
స్తంభీభూతులునై వారందఱు స్తంభంబులవలె నుండిరటన్! 63

బాణవృష్టిచే బీడింపగ బడు బన్నుగ హరి సముదాయములన్
గాంచి వేగ నా ప్లవగేశ్వరుడును నంచితముగ సుగ్రీవుడున్!
సోదరు కుమారుడైన యంగదుని శూరత వెనుకను నుంచి మఱిన్
పర్వత చరియల సంచరించెడి బన్నుగ మాతంగము పయిన్
కేసరి బరుగిడినటు సుగ్రీవుడు కేక వేసి కుంభుని పైకిన్
శీఘ్రముగా బోరాడగ బోయెను స్థిర బల పౌరుషముల తోడన్! 64-65

ఆ మహాకపియు నగు సుగ్రీవుడు నలరు మద్ది చెట్టును మఱియున్
అనేకమైనా మహావృక్షముల నటు బెకలించియు రాక్షసుపై!
విసిరెను వానిని యొక్కటొకటిగా విడవడ కుండను వర్షముగా! 66

శ్రీమంతుండగు నా కుంభుండును స్థిరముగ గప్పుచు సంబరమున్
దురాసదంబగు వృక్షవర్షమును దూరము జేయుచు నాతండున్!
నిశిత బాణముల జేతను గొట్టెను నీరవమగునటు ద్రుమ వృష్టిన్! 67

లక్ష్యము గొట్టుటలో బహు నేర్పును లలి భయంకరుం డైనట్టి
యా కుంభుడును నిశిత బాణముల నా రీతిని గొట్టిన ద్రుమముల్
భయంకరంబగు శతఘ్నముల వలె ప్రకాశించినవి రణమందున్! 68

వీర్యవంతుడును శ్రీమంతుడును విలసిత బలమును గలవాడున్!
వానరాధిపతియగు సుగ్రీవుడు పనరగ కుంభుని జేత మఱిన్!
తెగగొట్టగ బడినట్టి వృక్షముల దీరుగ గాంచియు నాతండున్!
మనసునందు వ్యధ జెందలేదు మఱి మానుగ జింతిందగ లేదూ! 69

కొట్టబడుచునున్నను సుగ్రీవుడు కూరిమి శరముల సహించుచున్,
కుంభకర్ణునీ సుతుడగు వానిని కుంభుని యని బెదిరించుచునూ!

ఇంద్రధనుస్ప్రభ కాంతిని జిందెడి సాంద్ర ధనుస్సును లాగికొనీ
విరిచివేసె మఱి రెండు ముక్కలుగ వేగముగా సుగ్రీవుండున్! 70

సుగ్రీవుడు నా విధమున నెగిరీ సుదుష్కరంబగు కర్మమునూ
జేసెను వానర వీరులు జూడగ స్థిరముగ హర్షము నందగనూ!
కోపించిన వాడై యా రాక్షసుడును గూర్మి దంతములు విఱిగిన యా
యేనుగువలె నున్నట్టి కుంభునీ యిమ్ముగ నా సుగ్రీవుండున్!
కోపావిష్టుండై నిటు బలికెను గుదురుగ మధుర ప్రలాపములన్! 71

నికుంభాగ్రజా! నీ పరాక్రమము నిజముగ శరవేగంబు మఱిన్
నత్యద్భుతమును నాశ్చర్యంబును నది నే దెలిసితి నిశాచరా!
రాక్షసులందున బక్షపాతమును రహి ప్రభావమును గలవు సుమా!
నీవును మఱి యా దశగ్రీవుండును నిజముగ సమానులుగ దలతున్! 72

బలి ప్రహ్లాదుల నింద్ర కుబేరులు బన్నుగ వరుణుని తోడుతనూ
సమానుండవగు ఓ రజనీచర! సరసత నీ వొక్కడవు సుమా!
బలవత్తరుడగు తండ్రిని బోలిన తనయుడు వీవు జనించితినీ! 73

మహాబాహువులు గలవాడవునూ మానుగ శూలము హస్తమునన్
అరిందముండవు నిన్నొక్కనినే నలరి దేవతలు గూడ మఱిన్
జితేంద్రియుండగు వానిని వ్యథలను జెరగరాని విధంబుననూ!
నిన్నతిక్రమింపగ జాలరు సుమ! సన్నుతి జేయుచు నుంటి నినున్!
నీ పరాక్రమము నతిశయంబునూ నిశాచరా మాపుము నింకన్!
నేను జేయు కర్మములను గూడను నిజముగ బరికింపుము కుంభా! 74-76

నీ పెదతండ్రియు నైన రావణుడు నిజముగ వరదానంబులచే
దేవదానవుల నెదిరించుచునూ దీప్తి నొందుచున్నాడు మఱిన్!
నీ జనకుండును కుంభకర్ణుడును నిజ పరాక్రమము జేత మఱిన్!
సురాసురుల నెదిరించినాడు సుమ! సురుచిరముగ రణరంగమునన్! 76

ధనుర్యుద్ధమున నింద్రజిత్తుతో దగ ప్రతాపమున రావణుతో
సమానుడవు! మఱి ఓ నిశాచరా! సరిదూగరు నీ కెవ్వరునూ!

అందుచేత నీ వీ సమయంబున యఖిల రాక్షసుల సంఘములో
బల పరాక్రమములందు శ్రేష్ఠుడవు! బన్నుగ దెలుపుచు నుంటి నిదే! 77

నిశాచరా! విను! రణరంగంబున నీకు నాకు యుద్ధము జరుగున్!
భయంకరంబును నాశ్చర్యంబును బన్నుగ సంఘర్షణ జరుగున్!
ఇంద్ర శంబరాసురులకు జరిగిన సాంద్రమైన యుద్ధంబు వలెన్
జరుగునిపుడు మఱి సర్వభూతములు సరసరీతి గాంతురు గాతన్! 78

అప్రతిమము నగు కర్మముజేసీ యతుల విక్రమము జూపితివీ!
అస్త్ర కౌశలము బ్రదర్శింపబడె యతిభయంకరులు వానరులన్!
రణరంగంబున బడగొట్టితివీ రయమున వీరుల నందఱినీ! 79

నిశాచరా! ఓ నికుంభాగ్రజా! నిజముగ నీ శౌర్యం దలచితివీ!
చాలమంది వీరులతో దలపడి సరసత విజయము నందితివీ!
అలసియున్న నిను జంపుటచేతను నల నిందొరయు గలుగును నాకున్!
అందువలన నిను జంపలేను నే చందముగా గొను విశ్రాంతిన్!
అటుబిమ్మట నాబలము యెట్టిదో యలరి జూడు! రజనీచరుడా! 80

అవమానముతో గూడినట్టివియు నల సుగ్రీవుని వాక్యములన్.
గౌరవింపబడె కానీ నాతడు కాఱడవిని యగ్నికి రీతిన్,
ఆజ్యముచే హోమంబు చేయబడి యగ్ని యొక్క తేజస్సువలెన్
ఆరాక్షసునీ తేజముగూడను నలరి వృద్ధి బొందెను నపుడున్! 81

అటుబిమ్మట యా కుంభరాక్షసుడు నల సుగ్రీవుని వేగముగన్
దన బాహువులను నదిమి బట్టెనూ దగ కదలక యుండగ నపుడున్
మద గజములవలె వారిద్దఱునూ నూనుగ పోరాడిరి యపుడున్! 82

మాటిమాటికిని నిట్టూర్పుచునూ మాటిమాటికిని నొరయుచునూ!
ఒకరి దేహమును మఱియొక్కరునూ యొనరగ మెలికలు వేయుచునూ,
భయంకరముగా యుద్ధము జేసిరి బాహిబాహీ రణమందున్! 83

వారిద్దఱి పాదాభి ఘాతమున వసర భూమియును గ్రుంగె నటన్
వరుణాలయమున రరలగములునూ వరుసను వెనుకకు దిరుగుచునూ!
భయంకరంబగు ధ్వనులతోని మఱి బన్నుగ సంద్రము క్షోభించెన్! 84

అటుబిమ్మట నా సుగ్రీవుండును నాకుంభుని పైకిని యెత్తి
మహా సముద్రము నడుగుజూపుచును మానుగ రాక్షను వేగముగా
లవణ సముద్రములో బడచేసెను లాలితముగ జేసెను ధ్వనులన్! 85

అటుబిమ్మట యా కుంభరాక్షసుడు నా సాగరమున బడిపోపన్,
ఆ సముద్రమును పైకి లేచెనూ యా మందరగిరి యెత్తుననూ!
అన్ని వైపులను సముద్ర జలములు నలరి త్రుళ్ళిపడె వేగముగన్! 85

అటుబిమ్మట యా కుంభరాక్షసుడు నా సంద్రంబుగ లేచి మఱిన్
వానర ప్రభువగు నా సుగ్రీవుని వనర సమీప్యముననను జేరీ!
బహు కోపంబున వజ్రకల్పమగు బన్నుగ పిడికిలితో నపుడున్!
సుగ్రీవుని వక్షస్థలమందున సూటిగ గొట్టెను రాక్షసుడున్; 87

ఆ రాక్షసునీ ముష్టి ఘాతమున యా సుగ్రీవుని కవచంబున్,
పుస్ఫోటం బయ్యెను రక్తంబును పూర్ణధారలుగ ప్రవహించెన్,
ఆ కుంభుని యా పిడికిలి పోటును నా సుగ్రీవుని వక్షమునన్
తగిలి హస్తిమండలమున యది దగ ప్రతిహత మయ్యెను జిత్రముగా

ఆ సమయంబున యప్పుడచ్చటను నాఘాతముచే వేగముగా
మహాతేజమును బయలుదేరెనూ మానుగ మేఱువు పర్వతమున్,
వజ్రాయుధమును గొట్టినపుడు మఱి వనరగ వెడలిన జ్వాలవలెన్
మహాతేజమును బ్రజ్వలించెనూ మఱి సుగ్రీవుని వక్షమునన్! 89

ఆ కుంభునిచే నభిహతుడయ్యెను నట్టి మహాబలవంతుడునూ
వానరశ్రేష్ఠుండగు సుగ్రీవుడు వజ్రాయుధమును నమమైనా
పిడికిలి బిగించి యా రాక్షసుపై వడిగా వేయగ నుంకించెన్! 90

వీర్యవలతుడగు నా సుగ్రీవుడు వేయివేయి కిరణంబులతో
సురుచిరముగ వికసించినట్టి యా సూర్యమండలము కాంతివలెన్!
గల తన ముష్టిని కుంభరాక్షసుని విలసిత వక్షమువను వేసెన్! 91

ఆ ప్రహారమున కుంభరాక్షసుడు నతిపీడితుడై వ్యాకులుడై
శాంతించిన యగ్ని జ్వాలలవలె కాంతిదప్పి నేలను బడియెన్!
ఆ ప్రకారమున యా సుగ్రీవుడు నలరి కొట్టగా రాక్షసుడున్,
దీప్తరశ్మిగల యాకుజుండునూ దీరుగ దైవశంబుననూ
నీలాకాశము నుండి శీఘ్రముగ నేలపైని బడినట్టులనూ
ఆ కుంభుండును మహీతలముననను నడలుచు బడియెను ఘోరముగా! 03

భయంకరంబగు బరాక్రముండును బన్నుగ వానర శ్రేష్ఠుండున్
సుగ్రీవుండును రణరంగంబున శూరుడు కుంభు వధింపగనే
మహా శైలముల వనములగూడిన మహీతంబును జలియింవెన్!
ఆ రాక్షసులకు నధిక భయంబుననావహించె నా సమయమునన్! 94

[యుద్ధకాండమునందు 76వ సర్గము సమాప్తము]

   

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### డెబ్బది యేడవ సర్గము

### (హనుమంతుడు నికుంభుని జంపుట)

ఆ నికుంభుడును దన సోదరుడగు నల కుంభుని హతమార్చుటయున్
జూచి కోపమున మండిపోయెనూ శూరుడైన యా రాక్షసుడున్!
కాల్చివేయుచున్నాడా యనునటు గ్రక్కున సుగ్రీవుని గాంచెన్! 1

అటుపిమ్మట యా మహాబలీయుడు నా నికుంభుడును శీఘ్రముగా
పుష్పమాలలను గట్టబడినదియును బొలుపుగ మంగళప్రదమైనా
చందన కుంకుమ ద్రవ్యంబులతో నందముగా పంచాంగుళులన్,
ముద్రలుంచినా మహేంద్ర పర్వత మోదముగా శిఖరము వంటీ
పరిఘను గైకొని బయలు వెడలెనూ బన్నుగ సుగ్రీవుని పైకిన్! 2

హేమపట్ట పరిక్షిప్తంబును మఱి విమల వజ్రములతో గూడీ!
విద్రుమములతో భూషితంబు మఱి వికటమైన యమదండముతో!
సమాన మైనది భయంకరంబును సకల రాక్షసుల భయంబునూ
తొలగించునదగు మహాయుధంబును దోరముగా బట్టెడు బరిఘన్! 3

మహాతేజమును భీమవిక్రమము మానుగ నికుంభ రాక్షసుడున్,
శక్ర ధ్వజమునకును సమానమును సహజకాంతి గలిగినదైనా!
ఆపరిఘను హస్తముననుబట్టీ యలరి ముఖంబును దెఱచిమఱిన్
ఆకాశంబును మాఱుమ్రోగునటు నా రాక్షసుడును గర్జించెన్! 4

ఆ నికుంభుడును వక్షస్థలమున నలరు బదకమును భుజములనూ
బాహుపురులు మఱి కర్ణములందును బన్నుగ కుండలములతోడన్!
చిత్రమైన మాలలతో గూడుక శ్రీకరమగు భూషణములతో,
ఆ మహా పరిఘతోడ నతండును గల మెఱుపులతో నుఱుములతో
గూడినట్టి యా ప్రావృట్కాలపు గుదురుగ మేఘము వలె నుండెన్! 5-6

మహాత్ముడగు వా నికుంభరాక్షసు బరిఘాగ్రము జేతను వేగన్
ఏడు వాయువుల గ్రంథు లప్పుడును నిమ్ముగ పుస్ఫోటములయ్యెన్
మహాఘోషమును గూడికొనిగద్దై మానుగ ధూమములేనట్టి
అగ్ని జ్వాలవలె బ్రజ్వలించెనూ యతని పరిఘ రణరంగమునన్! 7

ఆ నికుంభునీ పరిఘ గాలిచే నలకాపురితో గూడ మఱిన్
గంధర్వుల భవనోత్తములలో సరగున గ్రహ నక్షత్రంబులతో
తారలతోడను, చంద్రునితోడను దగ పెను గ్రహకూటంబులతో
నభస్థలంబంతయు ఘూర్ణితమై నయముగ నట కనబడుకుండెన్! 8

పరిఘుకాంతి మఱి కుంభుడుదాల్చిన బన్నుగ భూషణముల కాంతీ
క్రోధం బనియెడి యెండు కట్టెలును కూరిమి రాక్షసుడను నగ్నిన్
ఉత్థితమైనా యుగాంతాగ్నివలె నురుతరమై యుండెను నపుడున్
ఎదిరింపగ శక్యముగాకుండెను నిమ్ముగ దరి జేరుటకు మఱిన్! 9

ఆ కపివీరులు నారాక్షసులును నా బరిఘను రాక్షసుగాంచీ,
భయమువలన నిశ్చేష్టులునయిరీ బన్నుగ యాసమయము నందున్
కానీ మహాబలీయుడు మారుతి కదలక యటనే నిలిచి మఱిన్
వక్షస్థలమును దెఱచి నిలిచెనూ వనరగ నికుంభు నెదిరింపన్! 10

పరిఘోపమ బాహువులు గలాడును బలశాలియు నగు నికుంభుడున్
భాస్కరు ప్రభలును గలిగిన పరిఘను బలవంతుడు హనుమంతునిపై
వక్షస్థలమున విసిరికొట్టెనూ వనరగ బరిఘను వేగముగన్! 11

స్థిరమును వ్యూఢము నగు హనుమంతుని శ్రీకరమగు వక్షస్థలమందున్,
పడినయట్టి యీ రాక్షసు బరిఘయు బన్నుగ ముక్కలు ముక్కలునై
ఆకాశమునందువ యుల్కలవలె నటు జెదరగ జిమ్మగ బడియెన్! 12

పరిఘుజేత యా రాక్షసు జేతను బన్నుగ గొట్టగ బడినట్టి
వాయుసుతుడు నా హనుమంతుడును వనరభూమి కంపముజెందన్
మహాపర్వతము చలించినటులను మానుగ యతడును జలియించెన్! 13

ఆరాక్షసుచే నభిహతమైనా యాప్లవ గోత్తముడును మఱియున్!
అతిమహాబలుడు నా హనుమంతుడు నలరుచ బిడికిలి బిగియించెన్! 14

మహాతేజమును గలవాడును మఱి మహావిక్రముడు బలీయుడున్
లాయువుతోడను సమానమైనా వనర పరాక్రమ వంతుడున్!
నాహనుమంతుడు బిడికిలి గొట్టెను నా నికుంభు వక్షమునందున్! 15

హనుమంతుని యా ముష్టి ఘాతమున యా నికుంభు కవచంబు మఱిన్
బ్రద్దలాయె మఱి శోణితంబునూ, బన్నుగ ధారగ స్రవియించెన్!
మేఘమునందున మెఱుపుబుట్టినటు మెఱిసె రక్తస్రావంబునటన్! 16

వాయుపుత్రునీ పిడికిలి దెబ్బకు వనరగ నికుంభుడును నపుడున్!
చలించిపోయెను కొంత సేపటికి స్వస్థుండై జాగృతి నందీ,
వాయుసుతుండగు నా హనుమంతుని వనర బట్టుకొనె హస్తములన్! 17

ఆ సంగ్రామము నందు నికుంభుడు నలరు మహాబల శాలియునూ
యా హనుమంతుని బట్టి యెత్తుటను నలరి గాంచి యా రాక్షసులున్
ఆనందముతో భయంకరముగా నఱచిరి ధ్వనులను నచట మఱిన్! 18

ఆ రాక్షసుచే నా విధముగనూ యలరి తనను బై కెత్తుకొనీ
బోవుచుండినను వాయునందనుడు బొలుపుగ హనుమంతుం డపుడున్
వజ్రమువంటీ బిడికిలి తోడను వనరగ గొట్టెను రాక్షసునీ! 19

వాయుపుత్రుడగు హనుమంతుండును వనర రాక్షసుని హస్తములన్
విడిపించుకొనీ యతి శీఘ్రముగా విలవిల ధరణీతలము దిగెన్
చేతులుజాచీ యా రాక్షసునీ నతి తీవ్రముగా బీడించెన్! 20

సావధానుడై యా హనుమంతుడు జతురత యా రాక్షసుని మఱిన్
నేలమీన బడవేసెను శీఘ్రము విలవిల నాతడు బరివింపన్!
నలిపి వేసెమా బహువేగంబున నయముగ వేగము రాక్షసునీ
వక్షస్థలమున బడెను మారుతియు వనరగ నాతడు జితుకంగన్! 21

విశాలమగు బాహువుల జేత మఱి వికటమైన యాతని శిరసున్
బట్టుకొనియు మఱీ మెలిద్రిప్పుచునూ బన్నుగ యా రాక్షసుని మఱిన్
భయంకరముగా నఱచుచుండగను బన్నుగ యాతని కంఠమునూ
పెకలించెను నట రణరంగంబున పెనుధ్వనులను నట జేయుచునూ! 22

అటుబిమ్మట నఱచెడి నికుంభుడును నా రణరంగము నందుననూ
హనుమంతునిచే వధింపబడగా నతికోపంబును జెందిన యా
దశరథ కుమారుడైన రామునకు దగ ఖరు రాక్షసు సుతుడైనా
మకరాక్షునకును సుభీమమైనా మానుగ యుద్ధము జరిగె ననిన్! 23

నికుంభు డంతట మరణింపగనే నిఖిల వానరులు సంతసమున్
జెంది దిక్కులను మాఱుమ్రోగునటు శీఘ్రము గర్జించిరి వేగన్!
భూమి చలించిన యటులయినది మఱి పొందుగ యాకాశంబు మఱిన్
ధరణీతలమున బడినట్లయ్యెను దగ రాక్షస సైన్యంబునకున్,
భయము నావహించిన యటులయ్యెను భగ్నమాయె జయమున యాశల్!24

(యుద్ధకాండములోని 77వ సర్గము సమాప్తము)

   

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### డెబ్బది ఎనిమిదవ సర్గము

[రావణుని యాజ్ఞచేత మకరాక్షుడు యుద్ధమునకు బయలుదేరుట]

రణరంగంబున నికుంభుడునూ రహి వధింపబడి నట్టులనూ
యా నికుంభుడును జంపబడినయటు నిది విని రావణ రాక్షసుడున్
బహుకోపంబును జెందుచు నాతడు ప్రజ్వరిల్లె యగ్నికి వోలెన్! 1

రావణుడంతట క్రోధశోకములు రహి రెండిటితో మూర్ఛితుడై
విశాల నేత్రంబులు గలిగిన యా వికట రాక్షసుడు ఖరపుత్రున్!
మకరాక్షుని యుద్ధంబునకును మఱి మానుగ ప్రేరేపించె మఱిన్! 2

పుత్రా! నిన్నిదె రణరంగమునకు బోవగ యాజ్ఞాపించితినీ
సైన్యముతో గూడిన వాడవునై సరగున బొమ్మి రణమునకున్
రామలక్ష్మణుల, వానరులను మఱి రయమున జంపుము శీఘ్రముగన్! 3

శూరుడనను నభిమానము గలిగిన శూరుడు ఖరు సుతుడగు వానిన్
ఆ మకరాక్షుడు రావణు యాజ్ఞను నాతని వచనములను వినియున్
సంతోషించియు నా మకరాక్షుడు సరగున 'అట్లే' యని పలికెన్! 4

బలవంతుండగు నా మకరాక్షుడు బన్నుగ దశగ్రీవున కపుడున్
నమస్కరించియు, ప్రదక్షిణంబును నయముగ జేసియు శీఘ్రముగన్!
రావణాసురుని యాజ్ఞచేత మఱి రమ్యమైన రుభకరమైనా
గృహమునుండి మఱి బయలుదేరెనూ కేకలు యఱపులతోని మఱిన్! 5

ఖరుని పుత్రుడగు నా మకరాక్షుడు గడు వేగంబును గూడికొనీ,
సమీపమున గల బలాధ్యక్షుతో సరగున బలికెను నీ రీతిన్!
నా రథంబు మఱి నా సైన్యంబును రయమున రప్పింపుము వేగన్! 6

అతని వచనమును బలాధ్యక్షుడును నతివేగంబున పూనుకొనీ
యతని రథంబును సైన్యంబును మఱి యలరి సమీపమునకు దెచ్చెన్! 7

అ నిశాచరుడు మకరాక్షుండును నా రథమునకు ప్రదక్షిణమున్
జేసి, సారథిని బిలిచి రథంబును శీఘ్రముగా దోలుట కొఱకై!
ఆజ్ఞాపించెను రాక్షసు లందఱ యలరి బిలిచి యిటులను బలికెన్
రాక్షసులారా! సహచరులారా! రయమున మీరంచఱును మఱిన్
నా యెదుటను మఱి యుద్ధముజేయుడు! నా కుత్సాహము గలుగంగన్!

రాక్షసరాజగు దశగ్రీవునిచే రహి యాజ్ఞాపింపగ బడితిన్
సమరమునందున రామలక్ష్మణుల సరగున యా యిద్దఱిని మఱిన్
జంపవలయునని యాజ్ఞాపించెను పంపగ వానర సేనలనూ! 10

రాక్షసులారా! వినుడీ మీరును రయమున నాదు ప్రతిజ్ఞ మఱిన్!
ఈ రోజుననే రామలక్ష్మణుల నిమ్ముగ జంపగ వలయుసుమీ!
శాఖామృగమగు నాసుగ్రీవుని చయ్యన జంపగ వలయు ననిన్ !
ఇతర వానరుల నా శరములచే నిమ్ముగ చంపెద జూడు డికన్! 11

రణము నిమిత్తము సంప్రాప్తంబగు రహి వానర సైన్యంబునిదే
అనలము నెండిన కాష్టంబులనూ యలరి దహించిన విధముగనూ,
శూలపాతములచే కపిసేనను జూడుడు దహించి వేసెదనూ! 12

మకరాక్షుని యా వచనములను విని మానుగ బలవంతులునైనా
యా నిశాచరులు నందఱు గూడను ననేక విధ యాయుధములనూ!
కూడినవారై సావధానముగ కూరిమ సుండిరి సిద్ధముగా! 13

కామరూపమును గల వారును మఱి కడు క్రూరులు దంష్ట్రల తోడన్,
పింగళేక్షణములును గల వారును పెను దేహంబులు గలవారున్!
ధ్వస్తకేశములు గలవారును మఱి దగ భీకరులును నగువారున్,
అటు బిమ్మట నా మహారాక్షసులు జటుల మైన యేనుగుల వలెన్!

పెనుబొబ్బలు బెట్టుచును వారునూ భీకర రూపము గలవాడున్
ఖరాత్మజుండగు నా మకరాక్షుని కరమున జుట్టును నిలబడియున్!
సంతోషముతో నాకాశంబును సరగున చలించి బోవునటుల్!
వివిధములగు వాద్యములతోడ మఱి నేగ ధ్వనించిరి రాక్షసులున్. 14-15

అచట నూదబడు శంఖ ధ్వనులయు నలరెడి భేరీ ధ్వనులయునూ
సింహనాదముల జేసెడి ధ్వనియును జిందెడి జబ్బల జఱచిన యా
మహా ధ్వనులునూ రణరంగంబున మానుగ నంతట వినిపించెన్! 16

ఆ సమయంబున యా మకరాక్షుని యల సారథి హస్తము నుండీ
కొరడా జారుచు క్రిందబడినదీ కుదురుగ యపశకునం బయ్యెన్!
ఆ రాక్షసునీ ధ్వజంబుగూడను హఠాత్తుగా నేలను బడియెన్. 17

అతని రథమునకు గట్టిన హయములు నట విక్రమ వర్జిత మయ్యెన్
వ్యాకులంబు అగు చరణంబులతో వనరగ నడుచుచు బోయినవీ!
దీనములై కన్నీరు గార్చుచును దిక్కులు గాంచుచు రణమునకున్! 18

భయంకరుండును దుర్మతియును నగు బన్నుగ మకరాక్షుండు మఱిన్
బయలుదేరు సమయంబున శీఘ్రము బరాగంబుతో గూడికొనీ
బహు దారుణమగు వాయువు వీచెను బన్నుగ దుశ్శకునంబులతో! 19

అధిక విక్రమము గల రాక్షసులును నా శకునములను గాంచియునూ
గణింపకుండగ కలకలదనముతో గదులుచు బోయిరి రణమునకున్!
రామలక్ష్మణులు గలపోటికి మఱి రయమున కేకలు వెయుచునూ! 20

యుద్ధ కౌశలురు నా రాక్షసులును నుద్ధతి వారల శరీరముల్
ఘనగజ మహిషంబుల వలె నుండెను కాఱునలుపు రంగును గలిగీ,
గదలచేత మఱి ఖడ్గంబులచే కదనము నందున గొట్టబడీ
కాయలు గాచెను నల్లని మచ్చలు కఠినముగా నంతట నుండెన్!
అట్టి రాక్షసులు నేను ముందనుచు నిట్టె దిరిగిరీ రణభూమిన్! 21

[యుద్ధకాండమునందు 78వ సర్గము సమాప్తము]

* * * *

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### డెబ్బదితొమ్మిదవ సర్గము

(రాముడు మకరాక్షుని సంహరించుట)

సమస్తమగు నా వానరశ్రేష్ఠులు సరగున వచ్చిన మకరాక్షున్!
గాంచి యుద్ధమును జేయగవలెనను వాంఛను నెగురుచు వచ్చి మఱిన్
నిలిచిరి యా రాక్షసుని కెదురుగను శిలలు వృక్షములు ధరియించీ! 1

అటుబిమ్మట యా కపివీరులకును యా వానరసైన్యము తోడన్
భయంకరంబగు యుద్ధము జరిగెను బన్నుగ రణరంగము నందున్!
దేవదానవులకును జరిగిన యటు దీరుగ జరిగెను యుద్ధంబున్! 2

ఆ సమయంబున కపి నిశాచరులు నలరుచు ద్రుమములు శూలముల్!
విసరుచు గదలను మహాపరిఘలను వికటముగను నువయోగించీ!
ఒకరి నొకరు మర్దించిరి వారలు నొనరగ రణరంగము నందున్! 3

అటుబిమ్మట యా రజనీచరులును జటులములగు నాయుధములతో
శక్తి గదా ఖడ్గంబులతోడను సరగున కుంతంబుల చేతన్,
తోమరములతో బట్టిసములతో దోమరముగ బాణంబులచే,
బింది ఫాలముల బాశంబులతో జిందుచు లావగు దండములన్,
ప్రేలుడు ధ్వనులను జేయు యంత్రముల పెను నాయుధముల దోడుతనూ!
ప్రయోగించి మఱి యారాక్షసులును బన్నుగ వానర శ్రేష్ఠులనూ,
రణరంగమునం దంతట విరివిగ నయమున హింసించిరి యపుడున్! 4-5

ఖరపుత్రుండగు మకరాక్షునిచే గడు తీవ్రముగ ప్రయోగించీ
శర సముదాయముచే బీడింపగ సమస్త వానరవీరులునూ!
సంభ్రాంతులునై భయపీడితులై సరగున బోయిరి దిక్కులకున్! 6

సమస్తమగు నా రాక్షసవీరులు సరగున జారెడి వానరులన్,
గాంచుచు బహువిధ ధ్వనులను జేసిరి యుంచితముగ రణరంగమునన్
ఆ రాక్షసులును సింహంబులవలె యతిగర్వితులై నగుచు మఱిన్
జయముచేత మఱి ప్రకాశించుచును జయజయ ధ్వనులను జేయుచునూ! 7

ఆసమయంబున వానరులందఱు నటు నిటు బోవుచునుండగనూ,
అంతట శ్రీరాముడు శరవృష్టిని వింతగ రాక్షస వీరులపై!
గురిపించెను ముందుకు రాకుండగ కుదురుగ నిలిపెను వారలనూ! 8

అడ్డగింప బడినట్టి రాక్షసుల యా మకరాక్షుడు గనుగొనుచున్
కోపానలమున సమావిష్టుడై కూరిమి యీ విధమున బలికెన్! 9

ఓ శ్రీరామా యటనే నిలబడు! నొనరగ నాకును నీకు మఱిన్,
ద్వంద్వయుద్ధమిక జరుగగలదు సుమ! దగ యీ రణరంగమునందున్!
ధనుర్ముక్తమగు వాడిబాణముల దారుణముగ నీ ప్రాణములన్,
నీ శరీరమున నుండి యిప్పుడే నిజముగ దొలగించెదను సుమా! 10

ఏ యపరాధములేక తనదు పని నిమ్ముగ వర్తించెడి వానిన్,
దండకవనమున నాదు తండ్రినీ జంపితి వా నాడును మఱియున్!
రాక్షసులను జంపుటయే పనిగా రహి చరియించెడి నిన్నిపుడున్!
ఎదుట నిన్ను వీక్షింపగ రామా! మదికోపము రేగుచు నుండెన్! 11

దురాత్ముడా! ఓ రఘురామా విను! దోరముగా ఆనాడు మఱిన్
నాదు దండ్రినీ జంపి దండకను నయముగ కనిపింపగ లేదా!
ఆసమయంబున నిన్ను దండకను నచటనె జంపగ వలసినదీ!
అటు జంపనిచే నా యవయవములు గటువుగ దహింప బడుచుండెన్! 12

దైవవశమును దొరికితి విచ్చట దగ నా కంటనుబడితివిగా
ఆకలి గొనినా సింహంబునకును నలరి మృగము దొరికిన యటులన్!
యుద్ధము గోరిన బగతుడ వీవును యుద్ధము నాతో సేయు మికన్! 13

ప్రస్తుతంబు నా శరజాలంబున బన్నుగ యమపురికిని జేరీ,
ఏ యే రాక్షసవీరులు నీచే నిమ్ముగ జంపగ బడినారో!
వారలతో గూడుక నివసింపుము! వనరగ నా మాటలు నిజమూ! 14

రామా! యీ విషయము నందున నే రహి యధికము జెప్పగనేలా?
విస్తరించి జెప్పుట యేలా మఱి విశదముగా నామాట వినూ!
సమస్త లోకంబులు గూడను మఱి సమస్త దేవతలును గూడన్
రణరంగంబున నీ నా యుద్ధము రమ్యముగా గాంతురు గాతన్! 15

రామా! ప్రస్తుతమందు నిరువురము రణరంగము నందున వేగన్,
అస్త్రంబులచేగాని, మఱియునూ యలరు బాహువులచే గానీ,
నీవే విద్యను నభ్యసించితివొ నిజముగ దెలుపుము నాతోడన్
ఆ విద్యను బోరాడుద మిప్పుడు నతి విక్రమమున రణభూమిన్! 16

దశరథాత్మజుండైన రాముడును దగ మకరాక్షుని బలుకులనూ!
వినియు నాతడును నిక నేమేమో! వింతలు బలుకుచు నుండగనూ!
చిఱునవ్వును నవ్వుచు నాతనితో జెలగి పలికె నీవిధముగనూ! 17

రజనీచర! యసదృశ వాక్యములను రహి బలుకుచు నుంటివి యిపుడున్!
గొప్పలు జెప్పుట యేలా వ్యర్థము గూరిమి రణమును సలుపు మికన్!
రణరంగంబున యుద్ధముజేయక రమ్యమైన బలుకుల జేతన్,
గెలువగజాలవు రాక్షసాధమా! గెలువుము యుద్ధముజేసి మఱిన్! 18

ఓ నిశాచరా! దండక వనమున వనరగ పదునాలుగు వేలున్,
రాక్షసులను నే వధించితిని నట రయమున నీ తండ్రిని ఖరునీ!
త్రిశిరస్సునూ దూషణ రాక్షసు దీరుగ వధియించితి నాడున్! 19

వాడియైన ముక్కులు గోళ్ళనుగల వనరగ గ్రద్దలు నక్కలునూ
వారల మాంసములను భక్షించెను వదలకుండ రవ్వంతయునూ!
యిక నిప్పుడు నీ మాంసముగూడను నిమ్ముగ భుజియింపగ గలవూ! 20

మహాబలముగల మకరాక్షుండును మానుగ రాముని వచనములన్!
విని క్రోధావేశుండై యాతడు వికటమైన రణరంగమునన్!
రామునిపై బహు బాణపరంపర రయమున విడిచెను శీఘ్రముగన్! 21

ఆ భీషణ రణరంగమునందున యన్యోన్యము వారలకు వడిన్
ఖర రాక్షస పుత్రునకు మఱియునూ ఘన విక్రము డా రామునకున్
భయంకరంబగు యుద్ధము జరిగెను బన్నుగ రణభూమిని యపుడున్! 22

మకరాక్షునిచే విడువ బడిన యా మహాశరములను రాఘవుడున్!
తన యద్భుతమగు బాణవృష్టిచే దగ ఛేదించెను వేగముగన్!
రుక్మ పుంఖములు గల బాణంబుల రోదసిలోనే యడ్డుకొనీ
ముక్కలుగా జేసెను శ్రీరాముడు వ్రక్కలునై నేలను బడగా! 23

ఆ సమయంబున రణరంగంబున నలరు ధనుస్సులనుండి మఱిన్
బయలుదేరినా జ్యాశబ్దంబులు బన్నుగ యాకాశము నందున్!
రెండుమేఘముల శబ్దంబుల వలె మెండుగ వినబడె నందఱికిన్! 24

అత్యద్భుతమగు నా సంగ్రామము నలరి జూడ కోరిక తోడన్
దేవదానవులు గంధర్వులునూ తీరుగ కిన్నెర మహోరగుల్!
అంతరిక్షమున నిలిచి వారలును వింతగ గనుచుండిరి వారున్! 25

ఒకరి యంగముల మీద నొకరునూ యొనరగ గొట్టుచు నుండి రటన్!
బలముగూడ మఱి వృద్ధియయ్యెనూ బటుతర సాధనముల జేతన్!
రణరంగంబున, వారిద్దఱునూ రహి నొక్కరు జేసిన దానిన్
వేఱొక్కరు ప్రతిక్రియను జేయుచును వికట యుద్ధమును జేసి రటన్! 26

అట్టి మహా సంగ్రామమునందున యా రాముడు విడిచిన శరముల్,
మహాబలాఢ్యుడు మకరాక్షుండును మానుగ ఛేదించెను యపుడున్!
ఆ రాక్షసుడును విడిచిన శరముల యా రాముడు దన బాణములన్!
ముక్కలు ముక్కలుగా ఛేదించెను వ్రక్కలునై నేలను బడగా! 27

సమస్తమైనా దిక్కులు దిశలును సరగున బాణంబుల చేతన్
వ్యాప్తములైనవి నా యుద్ధంబున వనరగ యాకాశము గూడన్!
బాణంబులచే నిండిపోయినది బరగ మహీతలమును గూడన్! 28

అటుబిమ్మట యా సంగ్రామంబున నలరు మహా బాహువునైనా
ఆ శ్రీరాముడు బహు కోపించియు నా మకరాక్షుని జాపంబున్!
ఛేదించెను మఱి యష్టశరములను శీఘ్రము సూతుని బడగొట్టెన్! 29

మహావీరుడగు నా శ్రీరాముడు మానుగ బాణంబుల చేతన్!
రథమును బ్రద్దలుగొట్టి యశ్వముల రయమున హతంబు జేసె మఱిన్
ఆ మకరాక్షుడు విరథుండై మఱి యా రణభూమిని నిలుచుండెన్! 30

వసుధను నిలిచిన యా మకరాక్షుడు వనర సకల భూతములకునూ,
మహాభయంబును గలిగించుచునూ, మహాప్రళయ కాలాగ్నులతో
సమానమైనా కాంతిగలిగినా కఠినశూలమును హస్తమునన్!
గ్రహించి శ్రీ రఘురాముని మీదకు కాఱుమేఘముగ బరుగెత్తెన్! 31

ఏ యస్త్రంబును గాంచి దేవతలు నిమ్ముగ భయపీడితు లగుచున్!
నలు దిక్కులకును బాఱిపోయిరో యా శూలము మకరాక్షునకున్!
రుద్రుడు నిచ్చెను నాకాశంబున రోదసి యందున కుజుని వలెన్!
ప్రకాశించునది జగత్తునంతను బన్నుగ సంహారము జేయూ!
అట్టి శూలమును గ్రహించి యాతడు నిట్టె బోయె రాముని పైకిన్! 32

ఆ నిశాచరుడు మండుచుండినా యా శూలంబును ద్రిప్పుచునూ!
కోపము తోడను బెదవులు గొఱుకుచు ఘూర్ణితమగు నేత్రంబులతో
మహాత్ముడగు నా రాముని పైనను మానుగ విసిరెను వేగముగన్! 33

మండుచున్నదియు ఖరపుత్రునిచే మానుగ విడువగ బడినదియున్
వచ్చి మీద బడుచున్న శూలమును జెచ్చెర నాలుగు బాణములన్!
అంబరమందే ఛేదించెను మఱి సంబరమందగ వానరులున్! 34

రాముని బాణములను గొట్టగ బడి రయమున ముక్కలు ముక్కలునై
దివ్య స్వర్ణమున మండితమైనా దివ్యశూల మా క్షణమందున్
ఉల్కావోలె నేలను బడిపోయెను గురుతరమగు శబ్దముతోడన్! 35

అక్లిష్ట కర్మణుడగు రామునిచే నా విధమున గొట్టగ బడినా
ఆ శూలంబును గాంచి భూతములు నల నభమున గల దేవతలున్!
'బాగు! బాగు!' నని బలికిరంతటను బహుసంతసమున గూడికొనీ! 36

నిశాచరుండగు మకరాక్షుండును నిరాశ జెందుచు మదియందున్
అట్టి శూలమును నేలబడుటయును నిట్టె బిడికిలిని బిగియించీ!
యెత్తి రామునీ 'నిలు! నిలు!' మనుచును సత్త్వముతో మీదికి వచ్చెన్! 37

అటుపిమ్మట యా రఘునందనుడును జటుల భీమ గర్జనతోడన్!
బిడికిలి తోడుత వచ్చు రాక్షసుని వడి తన బాణము బట్టుకొనీ!
ఆగ్నేయాస్త్రము సంధించెను మఱి యా రాక్షసుమీదికి వేగన్! 38

ఆగ్నేయాస్త్రము జేత గొట్టబడి యా రాక్షసుడును వేగముగన్
భిన్న హృదయుడై రణభూమిని మఱి చెన్నుగ నేలను బడియు మఱిన్!
యమసదనంబునకును జనియెను మఱి యమపురి వింతలు గాంచగనూ! 39

సమస్తమైనా రాక్షసవీరులు సాహసుడగు మకరాక్షుండున్,
యమపురి కరుగుట గాంచి రామునీ యతి భీకర బాణంబులకున్,
భయపడి లంకానగరము జొచ్చిరి బన్నుగ వీడుచు రణభూమిన్! 40

అటుపిమ్మట యా దశరథ రాముని యలరు బాణముల జేత మఱిన్
జంపబడిన యా ఖరాత్మజుని గని వంపబడిన రాక్షసుని మఱిన్!
వజ్రముజేతను గొట్టబడిన యా వనపర్వతమును గాంచినటుల్
మకరాక్షుని గాంచిరి దేవతలును మానుగ యాశ్చర్యము తోడన్! 41

(యుద్ధకాండములోని 79వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### ఎనుబదియవ సర్గము

(రావణుడు బంపగా యింద్రజిత్తు ఘోరయుద్ధమును జేయుట వానిని జంపు విషయమున రామలక్ష్మణులు మాటలాడుకొనుట)

సమితింజయుడగు దశగ్రీవుండును సాహసుడగు మకరాక్షుండున్,
రణరంగంబున జంపబడుట విని రౌద్రంబును గూడినవాడై!
దంతంబుల గటగట గొఱుకుచునూ వింతకోపమున గూడికొనీ,
ఏమి జేయవలెనని యోజించుచు నెఱుగక యాతడు మూఢుడునై!
కుమారుడగు నా యింద్రజిత్తునూ కూరిమి రణరంగంబునకున్,
బొమ్మని యాజ్ఞాపించెను నాతడు కమ్మని మాటల తోడుతనూ! 1-2

సర్వవిధములను బలాధికుండవు! సర్వ విద్యలను బ్రౌఢుడవున్
దృశ్యమానుడవు నగుచును మఱియు నదృశ్యమానుడవు నగుచున్
మహావీర్యులును సోదరులైనా మానుగ దశరథ కొమరులనూ!
వధింప వలయును నే విధినైనను వసరగ వీరుడ వీవు గదా! 3

సాటిలేని కర్మలుగల యింద్రుని సరగున జయించితివి యనిలో,
అట్టి నీవు రణరంగమునందున యిట్టి మానవుల నిద్దఱినీ
గాంచి వధింపగ లేవా పుత్రా? యంచితముగ వనవాసులనూ! 4

రాక్షసేంద్రునీ వచనములను విని రయమున శక్రుని జయించినా
ఇంద్రజిత్తు తన తండ్రి యాజ్ఞలను నిమ్ముగ శిరసున ధరెయించీ!
యజ్ఞభూమినీ హోమము జేసెను యథాశాస్త్రముగ యాతండున్ 5

ఆ రాక్షసుడగు నింద్రజిత్తునూ యట యజ్ఞము జేయుట కొఱకై
సంకల్పింపగ రాక్షస వనితలు సరగున యెఱ్ఱని వస్త్రములన్!
ఋత్త్విక్కుల కొఱకై నటదెచ్చిరి సత్వరముగ యుష్ణీషములన్! 6

హోమమునందున రెల్లుగడ్డియును విమల వేదికను జుట్టియునూ,
తృణములుగా నట బరుపబడినవీ దీరుగ సమిధలుగను నటనూ!
విభీతకములు నగు దారుఖండములు విలసితముగ యోగించి రటన్
ఎఱ్ఱని వస్త్రంబులు నినుప స్రువ మింపుగ యుపయోగింప బడెన్ 7

అగ్నివేదికను నన్నివైపులను నలరు వేదికలను గూడీ!
శరపత్రంబుల జేత బఱచిరీ సరగున జీవముతోనున్నా!
నల్లనైన మేకను బలి యిచ్చిరి జల్లుచు గుసుమాక్షతలు నటన్! 8

ఒక్కమాఱు హోమము జేయుటచే జిక్కని యగ్నుల జ్వాలయునూ
ధూమము లేకను బ్రజ్వలించినది విమల కాంతులను జిందుచునూ!
విజయ సూచకములగు చిహ్నంబులు విపులముగా నట గనబడియెన్! 9

ప్రదక్షిణముగా సుడులు దిరిగెడీ బన్నుగ జ్వాలలు గలిగిన యా
తప్తహాటకము సన్నిభమైనా దగ యగ్నియు బైకిని లేచీ,
స్వయముగ యటగల యా హవిస్సులను సరగున స్వీకారము జేసెన్! 10

అగ్నియందు మఱి హోమముజేసి నటు బిమ్మట దేవతల మఱిన్
దానవులను మఱి మహారాక్షసుల దగ సంతృప్తిని గలిగించీ
యంతర్ధానము నగు సుందరమగు వింతయైన రథమును నెక్కెన్! 11

నాలుగు గుఱ్ఱంబుల తోడుతనూ నయముగ లాగెడి రథమందున్,
వాడియైన బాణంబుల దోడుత వనరగ ఘనమగు చాపంబున్!
రథముపైని యెక్కింపగ బడెనూ! రయమున శక్రజితుం డెక్కెన్! 12

బంగారపు నాచ్ఛాదన గలిగీ బన్నుగ మిక్కిలి విలసిలుచున్,
నున్నరథము బహు నలంకారముల బన్నుగ మృగములజేత మఱిన్,
చంద్రాకారంబుల తోడను మఱి చంద్రార్ధాకారంబులతో
అలంకరింపగబడి యుండెను మఱి యపురూపంబగు నా రథమున్! 13

స్వర్ణవికారంబైన వలయమును సరసదీప్త పావక సమమున్!
ఇంద్రజిత్తు రథమున గల కేతువు సాంద్రమైన వైఢూర్యములన్!
అలంకరింపగ బడియుండెను మఱి యాశ్చర్యంబును గొలుపుచునూ! 14

ఆదిత్యునితో సమానమైనా యా బ్రహ్మాస్త్రము జేత మఱిన్!
బరి రక్షింపగ బడెడి వాడుగద! బన్నుగ యా బలశాలియునూ!
యెదిరింపగ మఱి శక్యముగాకను మదిపొంగుచు నుండును నెపుడున్! 15

సమితింజయుడగు నింద్రజిత్తునూ సరగున రాక్షస వీరులకున్,
దెలిసిన రాక్షస దేవతాకములు దీరుగ మంత్రంబుల జేతన్,
అగ్నియందు హోమంబును జేసీ యంతర్ధానము నొంది మఱిన్!
నగరమునుండీ బయలుదేరుచును నయముగ యీ రీతిని బలికెన్! 16

అసత్యముగ వన వాసముజేయుచు నలరుచు వనమున నున్నాడో
అట్టి రామలక్ష్మణులను రణమున నిట్టె వధింతును నీనాడే!
తండ్రియైన యా లంకేశ్వరునకు దగ రణాజితమునగు జయమున్
బహూకరింతును సర్వభూతములు బన్నుగ సాక్షీభూతముగన్! 17

ఈనాడే యీ యుర్వియందు మఱి ఇమ్ముగ కపులును లేకుండన్
జేసివేసెదను రామలక్ష్మణుల శీఘ్రముగా వధియించి మఱిన్!
మహాప్రీతినీ గలుగజేసెదను మానుగ నా పితరున కిపుడున్!
అనుచు బలుకుచును నింద్రజిత్తునూ యంతర్ధానము నొందుచునూ! 18

వాడియైన చాపంబులతోడను వడిగల బాణంబుల తోడన్
రావణాసురుడు బ్రేరేపింపగ రయమున నాతని కొమరుండున్,
భయంకరుండగు నింద్రజిత్తునూ బన్నుగ వచ్చెను రణమునకున్! 19

ఇంద్రజిత్తు నట గాంచెను దీటుగ సాంద్రవిక్రమము గలవాడున్!
మూడు దలలు గల సర్పంబుల వలె మోదమునను దమ బాణములన్,
విడుచుచున్న వారును గపివీరుల విమల చాదనము గలవారున్
అట్టి వీరులను నిద్దఱ గాంచెను నా రాక్షసుడును బైనుండీ! 20

వీరే యిద్దఱు రామలక్ష్మణులు వీరే శత్రులు నని మదినీ,
యాలోచించియు ఘనకార్ముకమును నలరుచు నారిని సంధించీ
ప్రావృట్కాలపు పర్జన్యము వలె బాణ పరంపర గురిపించెన్! 21

రథమును నెక్కిన యింద్రజిత్తునూ రహి యాకాశములో నుండీ
నేత్రంబులకును గనబడ కుండగ శాత్రవులను గొట్టెడి వాడున్
ఇంద్రజిత్తు తన వాడి బాణములు సాంద్రవేగమున విడుచుచునూ
రామలక్ష్మణుల రయమున గొట్టెను రాక్షస మాయల జూపుచునూ! 22

ఆ రాక్షసుడును ప్రయోగించినా యా బాణంబుల వేగముచే
బీడింపగబడి రామలక్ష్మణులు ఓదప మహా చాపంబులపై
బాణంబుల సంధించి వేగముగ బటుతరమగు దివ్యాస్త్రములన్ !
ప్రయోగించిరి రామలక్ష్మణులు బన్నుగ యా రాక్షసుపైనీ! 23

మహాబలీయులు రామ లక్ష్మణులు మానుగ శరజాలంబులచే
ఆకాశంబును గప్పివేయుచును నా రీతిని వేయుచునున్నన్
సూర్యుని తోడను సమానమైనా సురుచిర యస్త్రంబుల తోడన్
బాణంబులచే నా రాక్షసునీ బరగ స్పృశింపగ జాలకనూ ! 24

శ్రీమంతుండగు నింద్రజిత్తునూ శీఘ్రము బొగ చీకటి తోడన్
ఆకాశంబును గప్పివేసెనూ యచట యేమి కనబడకుండన్
దిక్కులు గూడను మంచు పొగలతో దీరుగ జేసెను జీకటిగా! 25

ఇంద్రజిత్తు వట సంచరింపగను సాంద్ర ధనుష్టంకార ధ్వనుల్
రథ చక్రాంతములయు ధ్వనిగానీ రయమున హయముల శబ్దములున్
వినబడలేదూ యతని రూపమును గనబడలే దెవ్వరికి మఱిన్! 26

మహాబాహువులు గల రాక్షసుడును మానుగ రావణు కుమారుడున్
ఇంద్రజిత్తు నా చీకటి యందున సాంద్ర శరంబులజేత మఱిన్
ఆశ్చర్యంబుగ శిలావర్షముగ నట గురిపించెను బాణములన్! 27

సమరమునందున గోపించిన యా సాహసవంతుడు నింద్రజితూ
వరములు బొందిన వాడు నగుటచే వరగర్వంబున బొంగుచునూ!
ఘాసమానములు నైన శరంబుల బన్నుగ రాముని యంగములన్
నధికముగా గొట్టెను గనిపింపక యంతరిక్షమున దాగుచునూ! 28

జలధారలచే బర్వతములవలె శరములచే గొట్టగబడుచున్
నరశ్రేష్ఠులునగు రామలక్ష్మణులు నయముగ చాపములను నెత్తి!
హేమపుంఖములు గల బాణంబుల ధీమతులై విడిచిరి వేగన్! 29

గ్రద్ధ తెక్కలును గల బాణంబులు గగనమందుగల రాక్షసునీ,
సామీప్యంబును బొంది వానినీ సరగున స్పృశించి రక్తముతో!
ఛడిసి మహీతలముననుబడినవీ, దగ కృతార్థతను నొంది నటుల్! 30

ఇంద్రజిత్తుచే విడువబడిన యా సాంద్ర బాణ సముదాయముచే
మిగుల ప్రకాశము నొందుచుండినా దగ యా రాజకుమారులునూ!
తమపై పడి బడుచున్న బాణముల దగ భల్లక బాణంబులచే,
ముక్కలు ముక్కలు జేసి రంతటను వ్రక్కలుగా నేలను బడగన్! 31

ఆ సోదరులును రామలక్ష్మణులు నా వచ్చెడి బాణంబులనూ
యే వైపున నుండియు వచ్చినవో యటువైపునకే గురి జూచీ,
యుత్తమ మైనా. యస్త్రజాలమును సత్వరముగ విడిచిరి వారున్! 32

అతిరథుడగు నా యింద్రజిత్తునూ యలరు రథము నధిరోహించీ
సమస్తమైనా దిక్కులన్నియును సరగున దిరుగుచు నాతండున్!
అస్త్ర లాఘవము ప్రదర్శించుచును నలరు వాడి బాణంబులతో
రామలక్ష్మణుల గాయబఱచెనూ రయమున రక్తము నొలుకంగన్ 33

సుసంహితంబులు రుక్మ పుంఖములు సూదిమొనలు గల బాణములన్
నా రాక్షసుడును ప్రయోగింపగా నా రాఘవ లక్ష్మణులు మఱిన్
బుష్పించిన కింశుక ద్రుమములవలె బొలుపుగ నుండిరి రణమందున్! 34

ప్రావృట్కాలపు మేఘంబులలో బన్నుగ సూర్యుని గమనమునూ
తెలిసికొనగ జాలని యా రీతిని దీరుగ రాక్షసు గమనంబున్
ఎవ్వరచ్చటను దెలియకపోయిరి యెవ్వరు నాతని రూపంబున్!
ధనుస్సునూ మఱి బాణంబులనూ దగ దెలియకపోయిరి. యచటన్!
ఇతరమైన యాతని జాడలనూ యిమ్ముగ దెలియకపోయి రటన్! 35

ఇంద్రజిత్తుచే గొట్టబడిన యా సాంద్రబలులు వానరు లపుడున్
జంపబడిరి మఱి ప్రాణములొొదిలీ వంపగబడి రణరంగమునన్
వందలకొలదీ వానరవీరులు చందముగా నేలను బడిరీ! 36

అటువిమ్మట యా లక్ష్మణవీరుడు జటుల గోపమును జెందుచునూ
సోదరుడగు శ్రీరామునితోడను శూర వాక్యముల నిటులనియెన్
సకలరాక్షసుల సంహరించుటకు సరగున నే బ్రహ్మాస్త్రమునూ
ప్రయోగించెదను జూడు మనుచునూ బన్నుగ రామునితో ననియెన్ 37

అటువిమ్మట శ్రీరామచంద్రుడును బటు బలవంతుడు లక్ష్మణుతో
ధీర వచనముల నీవిధి బలికెను వీరత్వము దొణికిస లాడన్
ఒక్కనికొఱకై పృధివి యందుగల తక్కిన రాక్షసు లందఱినీ
సంహరించుటది న్యాయముగాదూ! సరియగు విధమును గాదు సుమా! 38

యుద్ధముజేయని వానినిగానీ, యుద్ధము జేయక దాగియునూ
యున్నవానినీ, ప్రాంజలితోడను యున్నవానినీ, శరణమనీ
యున్నవానినీ పారిపోవుచును బన్నుగ యుండిన వాని మఱిన్,
మధువును గ్రోలినవానినిగానీ పూనుగ జంపగరాదు సుమా! 39

మహాభుజా! విను! నింద్రజిత్తునే మానుగ జంపుటకును మనమున్
ప్రయత్నంబు మఱి జేయగ వలయును బన్నుగ మన మిపుడందఱమున్!
మహావేగమును గలిగినట్టియును మానుగ సర్పసమానములన్
అస్త్రంబులనూ బ్రయోగించెదము నా రాక్షసుని వధింపగనూ! 40

మాయావియు మఱి బహుక్షుద్రుండును మానుగ యంతర్హిత రథమున్
గలవాడును నగు నీరాక్షసునీ కదనమందు గానగబడుచో
వానర యూథపులే నీరాక్షసు వనరగ బలిమిని జంపుదురూ! 41

మహీతలంబున బ్రవేశించినను మానుగ స్వర్గములో నైనన్
రసాతలంబున బ్రవేశించినను రయమున యాకాశము నందున్!
దాగికొనిననూ యేవిధముననూ దగ రక్షణ బొందిన గూడన్!

నా యస్త్రంబుల గాల్పబడుచునూ నయముగ ప్రాణంబుల విడిచీ
మహీతలంబున బడును లక్ష్మణా! మానుగ విను నా వచనములన్! 42

మహాత్ముడగు నా రఘుప్రవీరుడు మహార్థమును గల వచనములన్
సోదరుడగు లక్ష్మణుతో బలుకుచు నాదరమున కపిశ్రేష్ఠులతో
భయంకరుండును, క్రూరకర్మలను బన్నుగ జేసెడి వాడు మఱిన్!
ఇంద్రజిత్తునీ జంపుటకొఱకై సాంద్రమైన యాలోచనలన్,
జేయుచుండె నా దశరథరాముడు శీఘ్రము గపులను గూడికొనీ! 43

(యుద్ధకాండమున ఎనుబదవ సర్గము సమాప్తము)

* * * *

## శ్రీరామకథా సుధా లహరి-యుద్ధకాండము
## రెండవ భాగము

### ఎనుబది యొకటవ సర్గము

(ఇంద్రజిత్తు మాయాసీతను వధించుట)

మహారాక్షసుడు నింద్రజిత్తునూ మహాత్ముడగు శ్రీరాఘవునీ
మనసు దెలిసికొని యుద్ధమునుండీ మఱలి పిమ్మటను బురమునకున్
బ్రవేశించి తన బంధువులందఱు బన్నుగ హతమగుటను దలచీ! 1

మహాశూరుడగు నింద్రజిత్తునూ మహాబలీయులు నగువారిన్
కుంభకర్ణునీ మున్నగు వారిని కుదురుగ వధను స్మరించుచునూ!
అరుణారుణ నేత్రంబులతోడను ననికి వెడలె బహుక్రోధమునన్! 2

సుమహావీర్యుడు దేవకంటకుడు సురుచిర పులస్త్యవంశమునన్
బుట్టినవాడును నింద్రజిత్తునూ పూనిక రాక్షసులను గూడీ
పశ్చిమ ద్వారమునుండి వెడలెనూ బన్నుగ రణరంగంబునకున్! 3

అటువిమ్మట యా యింద్రజిత్తునూ యతని సోదరులు వీరులునూ
రామలక్ష్మణులు యుద్ధమునందున రహి సిద్ధంబగుటను దెలిసీ
మహామాయ దా ప్రయోగించెనూ మానుగ యా రాక్షసు డపుడున్! 4

అటుపిమ్మట యా యింద్రజిత్తునూ చటులమైన దన మాయంచే
మాయారూపము గల జానకినీ మానుగ రథమున నిలుపుకొనీ,
మహోన్నతంబగు సైన్యంబును మఱీ మానుగ రథ వలయంబునుగా
నిలిపి యామెనూ వధింపవలెనని నిశ్చయించుకొనె మదియందున్! 5

సుమస్మృతియునగు నా రాక్షసుడును సురుచిరముగ యట నందటినీ,
మోసగింపవలెనను గోరికతోడను ముదముగ సీతను జంపుటకై!
ముదిసి వచ్చి కపులకు సభిముఖుడై మానుగ బోయెను రణమునకున్! 6

సమస్తమగు నా వానరవీరులు సరగున వచ్చెడి యింద్రజితున్
జూచి కోపమున పెదవులు గొఱుకుచు శూరులైన యా కపివీరుల్.
శిలాహస్తులై యుద్ధంబునకును శీఘ్రముగా నెగిరిరి బైకిన్! 7

కపికుంజరుడగు వాయుపుత్రుడును గదిలి దురాసద మగునట్టి
మహోన్నతంబగు బర్వత శిఖరము మానుగ హస్తములను బట్టి!
ఆ వానరవీరులకు ముందుగను నాతడు బోయెను వేగముగన్! 8

ఆహనుమంతుడు నచ్చట గాంచెను నారాక్షసునీ రథమందున్'
బొలగిన యానందమును గలదియును దోరముగా దీనత తోడన్!
నున్నదియును మఱి యేకవేణితో నిమ్ముగ దుఃఖిత యగునదియున్!
ఉపవాసంబులచేత గృశించిన యున్నదియును, నలిగిన యట్టి
మలిన వస్త్రమున నున్నది శరీర మానుగ సస్కారాదులు లేకన్
బరాగంబుచే సకలావయవములు బన్నుగ గలదియు బతివ్రతనూ
రాముని ప్రియురాలైన సీతనూ రథమున మారుతి దిలకించెన్! 9-10

ముహూర్తకాలము నా హనుమంతుడు మోరనెత్తి యామెను గాంచీ,
మైథిలిగా మది నిశ్చయించెనూ మానుగ విషాదమును జెందెన్!

ఆ హనుమంతుడు జనకాత్మజను యలరి కొలది కాలము క్రితమూ!
దర్శించెను గావున యతడప్పుడు దల్లడిల్లె హృదయమునందున్! 11

శోకార్తయు మఱి నిరానందయును శూరుని భార్యను జానకినీ,
యూ మహాకపియు నా హనుమంతుడు నా రాక్షసునీ పార్శ్వమునన్!
సీతను గాంచీ మనసునందునను శీఘ్రము నీవిధి భావించెన్!
ఈరాక్షసు డా సీతాదేవిని యేమి జేయునో తెలియదుగా!
అని మదిలో భావించుచు మారుతి నటగల వానరులకు దెలిపి
ఇంద్రజిత్తుగల ప్రదేశంబునకు సాంద్ర వేగమున బయనించెన్! 12-13

రావణ సుతుడగు నింద్రజిత్తునూ రహి వానర బలమును గాంచీ
క్రోధ మూర్ఛితుండై యొరనుండీ కూరిమి ఖడ్గంబును దీసీ!
సీత శిరస్సును బట్టి లాగెనూ శీఘ్రము కపులందఱు గాంచన్! 14

మాయావియునగు నింద్రజిత్తునూ మానుగ గపులందఱు గాంచన్
మాయచేత తన రథమునందునను రమ్యముగా గూర్చగబడినా
రామ! రామ! యని యేడ్చుచున్న యా రమ్యస్త్రీని గొట్టెను వేగన్! 15

మారుతాత్మజుడు హనుమంతుండును మానుగ మూర్ధజముల బట్టీ
లా మన్న యా రాక్షసుగాంచీ దగ మాయాసీతను గాంచీ!
నిజ సీతగ భావించి దీనుడై నింపె బాష్పములు నేత్రములన్! 16

సుందరమగు సర్వావయవములను సురుచిరముగ గలిగినయట్టీ
రాముని ప్రియురాలైన మహిషినీ రహి వీక్షించియు కోపమునన్
రాక్షసాధిపుని యాత్మజుడైనా రయమున యా రాక్షసు తోడన్,
బరుషముగా నీ విధమున బలికెను బటుతరాక్షరములను గూడీ!
దురాత్ముడా! ఓ యింద్రజిత్తు విను! దూరాలోచన తోడుతనూ!
బ్రహ్మఋషుల కులమందు బుట్టితివి బన్నుగ రాక్షస జన్మంబున్!
ఆమె కేశపాశమును బట్టితివి యంతరించెదవు వేగముగన్! 18

నీ మతి బుద్ధియు నీదృశమైనది నీ కర్మలు నిట్టివియె సుమా!
నృశంసుడవునూ, యనార్యుండవును నీచుండవు దుర్వృత్తుడవున్!
పాప పరాక్రమమును గలవాడవు బన్నుగ జాలియు లేకయునూ!
ఇట్టి కర్మలకు నొడిగట్టితివీ, యట్టి ఫలితముల నొందెదవూ! 19

ఓరీ రాక్షస! నిర్దయ వినుమూ! వనరగ గభీర వచనములన్!
మహాపతివ్రత యీ మైథిలియును మానుగ నిజగృహమున నుండీ!
రాజ్యము నుండియు జారిపోయినది రాముని హస్తము నుండియునూ!
అట్టి సతిని యిటు గొట్టుట దగునా? యెట్టి కీడు జేసెను నీకున్! 20

సీతను జంపిన బిమ్మట నీవును జిరకాలము జీవింపవుగా,
వధార్హుండవును! జంపెద నిప్పుడు వనరగ ముక్కలు ముక్కలుగా!
ఇట్టి పనులు మఱి జేయుట చేతను నిట్టె దొరికితివి మఱి నాకున్! 21

లోకవధ్య! జీవితమును విడిచీ, లోలత పరలోకమును జనీ,
యీ పదునాలుగు లోకములందున యేవి నింద్యమగు కార్యములో,
స్త్రీలను హతమొనరించిన వారలు జిర దుఃఖంబులు బొందుదురో,
అట్టి పాపముల ననుభవించుటకు నిట్టె బోయెదవు నిశాచరా! 22

వాయుసుతుండగు హనుమంతుండును నొనరగ యీవిధి బలుకుచునూ!
సాయుధులగు హరియోధుల తోడను సరగున గూడిన వాడగుచున్!
సంక్రుద్ధుండై రావణసుతుపై రయమున బోయెను రణమునకున్! 23

వచ్చి మీదబడుచున్న వారలును వనరగ ధీరపరాక్రములున్
వానర వీరుల మహాసైన్యమును వనర భయంకర కోపంబున్!
గలిగిన రాక్షస మహాసైన్యమును కదిలి నివారించెను వారిన్! 24

మహావీర్యుడగు నింద్రజిత్తునూ మానుగ వానర సైన్యంబున్,
తన బాణసహస్రంబుల జేతను దగ విక్షోభ్యం బొనరించీ,
హరిశ్రేష్ఠుండగు హనుమంతునితో నా రాక్షసుడును నిటులనియెన్! 25

వానర విభుడగు సుగ్రీవుండును వనరగ నీవును రాఘవుడున్,
ఆ వైదేహిని నీవు కనులతో నలరి జూచుచును నుండగనే,
ఇపుడిపుడే నే జంపివేసెదను నిక్ష్వాకునకును దెలుపుమిదీ! 26

వానర వినుమా! సీతను జంపీ వనరగ రాముని లక్ష్మణునీ
జంపివేసెదను నిన్నును మఱియును జంపివేసెదను యమపురికిన్!
తరువాతను సుగ్రీవుని జంపెద దగ యనార్యుడగు విభీషణున్
జంపివేసెదను వానరులందఱ కంపము నొందగ ధాత్రియునూ! 27

ప్లవంగమా! విను స్త్రీలను ధాత్రిని జంపరాదనుచు బలికితివీ!
నీవు బలికినా నీతిసూత్రమది నిజముగ యామోదింపను నే!
ఏది శత్రులకు బీడాకరమో! యది దప్పక జేయగ వలయున్! 28

ఇంద్రజిత్తు నీ విధమున బలికీ సాంద్రమైన యొక ఖడ్గమునన్,
మాయా నిర్మితమైన సీతనూ మఱి రోదన జేయుచు నున్నా!
యా వైదేహిని గొట్టెను వేగము నట నేలను బడిపోవగనూ! 29

తపస్వినియు మఱి పృథుశ్రోణియునూ దగ ప్రియదర్శిని యగు సీతన్
ఆతడా విధమున జందెము రీతిని నట దెగ వేయగ వింతగనూ!
ఆ మాయాసీతయు బడిపోయెను నలరు మహీతలమున వేగన్! 30

ఇంద్రజిత్తు మాయాసీతను వే సాంద్రఖడ్గమున ఖండించీ
హనుమంతునితో నీవిధి బలికెను నలరుచు బకబక నవ్వుచునూ!
'ఇదుగో!' చూడుము! నా ఖడ్గముచే నిమ్ముగ రాముని ప్రియురాలున్!
వైదేహిని నిదె జంపివేసితిని! వనరగ గాంచుము కపివీరా!
మీ శ్రమ యంతయు వ్యర్థమైనదీ! మీ జానకి మరణించినదీ! 31-32

ఇంద్రజిత్తు ఘనమగు ఖడ్గంబున చంద్రముఖియునగు నా స్త్రీనీ,
స్వయముగ జంపిన పిమ్మట నాతడు సంతోషించుచు బిగ్గఱగా
రథముపైని గూర్చుండీ యఱచెనూ రయమున యందఱు వినునటులన్!33

తెరువబడిన ముఖమును గలవాడును దీరుగ మఱి గొంతెత్తియునూ
అఱచుచున్న యా యింద్రజిత్తునూ నట సమీపమున గలయట్టి,
వానరులందఱు నరసి శబ్దమును వనరగ వినుచు విచారమునన్! 34

దుష్టబుద్ధియగు నా రావణియును ఘోరముగా మాయాసీతన్!
అటుల జంపి మఱి సంతోషించెను నానందంబును బొందె నటన్!
వానర వీరులు సంతోషించెడి వనరగ యా రాక్షసుగాంచీ!
విషాదంబు మఱి బొంది వేగముగ విలపించుచు బోయిరి దిశలన్! 35

(యుద్ధకాండము నందు 81వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### ఎనుబది రెండవ సర్గము

[హనుమంతుని నాయకత్వమున వానరులు రాక్షసులతో యుద్ధము జేయుట—హనుమంతుడు రాముని యొద్దకు బోవుట—ఇంద్రజిత్తు నికుంభిలకు బోయి యజ్ఞమును జేయుట]

ఇంద్రుని వజ్రము సమానమైనటి సాంద్ర భయంకర స్వనమువినీ,
వానర వీరులు నటు నిటు గాంచుచు వనరగ నడలుచు భయభీతిన్,
అన్ని దిక్కులకు బరుగులు దీసిరి యాగక క్షణమును వేగముగన్! 1

అటుపిమ్మట యా మారుతాత్మజుడు జటుల విక్రముడు మారుతియున్
విషణ్ణ ముఖములతో దీనులునై వికలత జెందుచు భయపడుచున్
వేఱువేఱుగా బరుగులు దీసెడి వికటమైన కపులనుగాంచీ
వీరత్వంబున ధీరత్వంబున విపులభావమున నిటు లనియెన్! 2

వానరులారా! యుద్ధోత్సాహము వనరగ విడిచియు దీనులునై
విషణ్ణ వదనములును గలవారై వేగ బరుగిడుచు నున్నారూ?
శూరత్వంబును ధీరత్వంబును శూరులార! యెచటికి బోయెన్? 3

అహవమందున యగ్రభాగమున యలరచు నే బోవుచునుంటిన్!
నాదు పృష్ఠభాగమునను రండీ! నన్ను ననుసరించియు మఱియున్!
ఉత్తమ వంశము లందు జనించిన యున్నతులగు వారెప్పుడునూ!
వెనుకకు బోవుట యుక్తము గాదూ! వెనుజూపుట మంచిది గాదూ! 4

ధీమంతుండగు హనుమంతునిచే ధీర వాక్యముల విని మఱియున్
హృష్టమానసులునై కపివీరులు నిష్టబడుచు రణమును సేయన్!
సుసంవృద్ధులై శైలశృంగముల సురుచిరద్రుమముల గ్రహియించీ
రాక్షస సైన్యము మీదికి బోయిరి రయమున వారల బరిమార్పన్! 5

వానరశ్రేష్ఠులు గర్జించుచునూ వనరగ రాక్షస వాహినికిన్
ఎదురుగబోయిరి పవనసుతుని మఱి కుదురుగ యనుక్రమించుచునూ
అతని నాయకత్వంబున వారలు ననుసరించి బోయిరి యనికిన్! 6

పవనసుతుండగు నా హనుమంతుడు బల్లిదులగు కపివీరులతో
కూడినవాడై రణరంగబున కూర్మిజ్వాలలను గలిగిన యా
హుతాశనునివలె శత్రువాహినిని యూర్చి దహించెను రణభూమిన్! 7

వానర సైన్యముతో గూడిన యా వాయుసుతుండును వేగముగన్
కాలాంతక యమునికి సమానముగ కదనమునందున ధీరుండై!
రాక్షస సంహారంబును జేసెను రహి శిలలను ద్రుమముల దాల్చి! 8

మహత్తరంబగు శోకముతోడను మఱి రోషావేశముతోడన్
వానరనాయకుడైన మారుతియు వడివడిగా నొక మహాశిలన్!
ఇంద్రజిత్తు రథమున బడవేసెను సాంద్రమైన ధ్వని గలుగంగన్! 9

ఆపత న్తమగు శైలశృంగమును నటుగాంచియు రథ సారథియున్
విధేయాశ్వములతో గూడిన యా వికట రథంబును దూరముగా
శైలశృంగమును పైబడకుండగ శీఘ్రముగా బ్రక్కకు ద్రిప్పెన్! 10

సిద్ధముగా యోగింపబడిన యా వనగిరి శిఖరము సారథితో
రథస్థుడగు నా యింద్రజిత్తునూ రయముగ జేరక ముందుగనే
ధరణీతలమును చేదించుకునీ దగ క్రిందికిని ప్రవేశించెన్! 11

అదియు క్రిందబడి పోవుచుండగను శీఘ్రము రాక్షస సేనయునూ
వ్యథజెందెను మఱి విరిగిపోయినది వనరగ లెక్కకు మిక్కిలియున్!
మహారాక్షసుల ప్రాణంబులునూ మానుగ బోయెను యమపురికిన్! 12

మహాకాయములు గల కపివీరులు మానుగ పర్వత శిఖరములన్
మహావృక్షములు నెత్తిన వారై మానుగ గర్జించుచు వారున్!
ఇంద్రజిత్తు మీదికి బరువెత్తిరి సాంద్రబలోన్నతితో నపుడున్! 13

మహా విక్రమము గల కపివీరులు భీకర రణరంగము నందున్
వృక్షంబుల మఱి శైలశృంగముల విసిరిరి యారాక్షసుపైన్
ఆహా వానరవీరులును ఘనంబగు నల వృక్ష శిలావర్షములన్
కురిపించుచు శత్రువులను జంపిరి కుదురుగ ధ్వనులను జేసి రటన్! 14

భయంకరంబగు రూపంబులుగల బరగ నిశాచరులును నచటన్
మహావీరులగు కపివీరులచే మహాపరాక్రమముల జేతన్
శిలా వృక్షముల గొట్టగ బడుచును శీఘ్రము నేలను బడుచు మఱిన్!
కాళ్ళుచేతులను గొట్టుకొనుచునూ కదిలిరి వేగము యమపురికిన్! 15

ఇంద్రజిత్తు మఱి కపివీరులచే సాంద్రమైన తన సైన్యంబున్
పడిపోవగ బడుటయు వీక్షించియు వడివడిగా నటు బిమ్మటనూ!
మహాయుధంబులు ధరించి వేగము మానుగ కోపావిష్టుండై
అభిముఖుడై శత్రులను జీల్చగను నరి వేగమున బయనించెన్! 16

ప్రౌఢ విక్రముడగు నింద్రజిత్తు మఱి ధీరత సైన్యంబును గూడీ
సహస్ర సహస్ర శరజాలంబును సరగున విడిచెను శత్రులపై!
వానరవీరుల ననేకమందిని వరుసను జంపెను రణభూమిన్! 17

ఆహవమందున వాని యనుచరులు నతి బలాఢ్యులగు రాక్షసులున్
శూల ఖడ్గ వజ్రంబులతోడను సూటిగ పట్టిస కూటములన్!
ముద్గరంబులను వానరవీరుల మోదంబున దెగటార్చి రటన్! 18

మహాబలీయుడు హనుమంతుడును ద్రూనులు కొమ్మలు గలవియునూ
వృక్షంబులచే మహాశిలలచే మానుగ హస్తమునను బట్టీ
భీనుకర్మలగు రజనీచరులను భీతిల గొట్టుచు జంపె మఱిన్! 19

హనుమంతుండును శత్రుసైన్యమును వెనుకకు దరిమి నివారించీ
తన సహచరులగు గపివీరులతో దగ బలికెను వీవిధముగనూ!
మఱలుడు వెనుకకు వానరులారా! మఱి యారాక్షస సైన్యంబున్!
నోడించియు మఱి ప్రయోజనంబును నొనరగ పొందగ లేము సుమా! 20

శ్రీరామునకును బ్రియమును జేయగ స్థిరసంకల్పుల మన మగుచున్
ప్రాణంబులకును తెగించి మనమును బనిజేయుచు నుంటిమి యిచటన్?
ఏ సీతామాతను రక్షింపగ నింతయు జేయుచు నున్నామో!
ఆ వైదేహి వధింపబడినది వనరగ రావణసుతు జేతన్! 21

ఈ విషయంబును శ్రీరామునకును నిమ్ముగ సుగ్రీవునకు మఱిన్
దెలియజేయుదము వారిద్దఱునూ దీరుగ ప్రతిక్రియ జేయుదురో
దానిని మనమును గీటుదాటకను దగ జేయుదమో కపులారా! 22

వానరశ్రేష్ఠుండైన మారుతియు వనరగ వానరు లందఱినీ
రణమునుండి మఱి నివారించుచును రాజిల నా విధమునను బలికీ
సైన్యసమేతుండై నిర్భయముగ సకలవీరులను గూడికొనీ
మెల్లమెల్లగా వెనుకకు మఱలెను నుల్లము శోకమునను గూడీ! 23

అటుబిమ్మట యాదుష్టాత్ముండును నతులవిక్రముడు నింద్రజితూ
రాము డెచట గలడో మఱి యచటికి రహి హనుమంతుడు బోయెననీ
మనసునందు మఱి నిశ్చయించుకొని మఱి దా హోమము జేయుటకున్
నికుంభిలా యను క్షేత్రంబునకును నిర్మల చైత్యంబును జనియెన్! 24

నికుంభిలా క్షేత్రమును జేరుకొని నిర్మలమతి యా రాక్షసుడున్
చైత్యమునందున దీరుగ కూర్చుని సరసత హోమము దా జేసెన్
యజ్ఞభూమిలో యా రాక్షసుడును నలరి హోమమును జేయగనూ
పావకుడప్పుడు మాంసరక్తములు బన్నుగ కబళించుచు నుండెన్! 25 26

రక్తహోమమున దృప్తినిబొందిన రమ్యజ్వాలలను మండుచునూ
పైకిలేచినా యాయగ్నియునూ బన్నుగ సంధ్యాసమయమునన్
ఆదిత్యునివలె ప్రకాశించెనూ యలరుచు నెఱ్ఱని కుంకుమలన్! 27

ఆటువిమ్మట యా యింద్రజిత్తునూ యతుల విధానములను నెఱిగీ
రాక్షసులకు నభివృద్ధిని గూర్పగ రహి యభ్యుదయము గలుగుటకై
శాస్త్రవిధిని యా హవ్యంబులచే సరసరీతి హోమము జేసెన్
ఆ రాక్షసులును జూచి హోమమును నటసమూహములుగా నిలిచీ
ఇంద్రజిత్తునకు జయజయ ధ్వనులును నిమ్ముగ జేసిరి ఓట్టుగనూ! 28

(యుద్ధకాండములోని 82వ సర్గము-సమాప్తము)

   

# యుద్ధకాండము - రెండవ భాగము

## (ఎనుబది మూడవ సర్గము)

(సీతావధ వృత్తాంతమును విని శ్రీరాముడు మూర్ఛనొందుట, లక్ష్మ
ణుడు రాముని యోదార్చుచు బౌరుషము జూపుటకు నుద్యమించుట.)

రామచంద్రుడును రాక్షస వానర రణగొణ ధ్వనులను వినియు మఱిన్
బిలిచి జాంబవంతుని దగ్గఱకును బ్రీతి వాక్యముల నిటులనియెన్! 1

సౌమ్యుడవగు ఓ జాంబవంతుడా! సరసత నా మాటలు వినుమా!
మహాభయంకరమగు నాయుధధ్వని మానుగ వినబడుచున్నదియున్
సుదుష్కరంబగు కార్యమేదియో శూరుడు హనుమంతుని జేతన్!
జరిగియుండునని యనిపించెడినీ సందేహం బింతయు లేదూ! 2

భల్లూకంబుల రాజా వినుమా! బన్నుగ తత్కారణముననూ,
నీదు సైన్యముల గూడికొనియు మఱి నిశ్చయముగ నటకును బొమ్మా!
రణమును సలిపెడి వాయుసుతునకును రయముగ జేయుము సహాయమున్
భల్లూకంబుల రాజగు వాడును బరగ జాంబవంతుం డపుడున్
'అట్లేజేసెద'నని రామునితో సలరి బలికి బహువేగమునన్!
తన సైన్యంబులతో సంవృతుడై దగ మారుతి యుండెడి చోటున్!
పశ్చిమద్వారంబునకును బోయెను బన్నుగ జేరగ వాయుసుతున్! 3-4

అటుబిమ్మట నా జాంబవంతుడును జటుల యుద్ధమును జేసి మఱిన్
కపివీరులతో నిట్టూర్చుచునూ కలిసి వచ్చు నా పవనసుతున్!
జాంబవంతుడును బరికించుచు మఱి బరగ క్షేమమును బ్రశ్నించెన్! 5

హనుమంతుండును యుద్ధంబునకై యలరి వచ్చువారల గాంచెన్
నీలమేఘములతో సమమైనా చాల బలముగల ఋక్షములన్
మార్గమధ్యమున భల్లూకంబుల మానుగ సైన్యంబును గాంచెన్!
ఆ సైన్యంబును మరల్చె వెనుకకు నతడు గూడ వచ్చెను మఱలి; 6

మహాయశుండగు నా హనుమంతుడు మానుగ యా సైన్యముతోడన్
శీఘ్రము రాముని సమీపంబునకు జేరి మిగుల దుఃఖించుచునూ!
ఆ శ్రీరామునితోని బలికెనూ యా హనుమంతుడు గద్గదికన్! 7

రావణాత్మజుడు నింద్రజిత్తునూ రణరంగంబున యుద్ధంబున్
జేయుచున్న మే మందఱమును మఱి జేరి జూచుచుండగనె యటన్!
రోదించెడి యా సీతాదేవిని భేదించెను ఖడ్గముతోడన్! 8

అరిందమా! నే నామెను గాంచీ నడలుచు ద్విగ్భ్రాంతుడ నైతిన్,
దిగులుజెందితిని యా వృత్తాంతము దేటబరుపగా మఱి నీకున్!
నిటకువచ్చితిని దశరథరామా! కటువగు వార్తను వినిపింపన్! 9

ఆ సమయంబున యా హనుమంతుని యా వచనంబులను వినుచున్!
ఆ దశరథుని కుమారుడు రాముడు నధిక శోకమూర్ఛితుడునునై
ఛిన్నమూలమగు వృక్షమువోలెను ఖిన్నుడునై నేలను బడియున్! 10

దేవ పురుషుతో సమానుడైనా దేవుడు రాముడు ధరణిపయిన్,
బడిపోవుటగని వానరశ్రేష్ఠులు బరగ దిక్కులన్నిట నుండీ,
యెగిరివచ్చి యా రాముని గాంచిరి టగ సమీప్యమును జేరి మఱీన్! 11

ఆకస్మికముగ పైకి లేచినా యులరి మండెడీ యగ్నివలెన్!
సమీపింప శక్యంబును గానీ సారస నేత్రుడు రామునిపై!
పద్మోత్పలముల సుగంధ జలముల బన్నుగ జల్లిరి ముఖమందున్! 12

అటువిమ్మట మఱి సుదుఃఖితుండగు నా లక్ష్మణుడును వేగముగన్!
అస్వస్థుండగు రామచంద్రునీ యులరి కౌగిలిని జేర్చుకొనీ,
హేత్వర్థంబుల సంయుతంబులగు తత్త్వవచనముల నిటు బలికెన్! 13

శుభకరమగు మార్గమున జరించెడి శూరుడ! విజితేంద్రియుడవునూ!
అట్టి నిన్ను మంగళప్రదమైనా శ్రేష్ఠమైన ధర్మము నిన్నున్
అనర్థములనుండియు రక్షింపగ యాపద నుండియు దప్పింపన్!
సమర్థమును గాలేదుగదా మఱి సరసత వ్యర్థంబైనదిగా! 14

మాయావియగు నగు నింద్రజిత్తునూ మానుగ కపులందఱు గాంచన్
మాయచేత దన రథమునందునను రమ్యముగా గూర్పగబడినా!
స్థావరములు జంగమములు ప్రాణులు సరసరీతి గనబడి నటులన్!
ధర్మాధర్మములకు దర్శనముల దగ జరుగుటలే దిల జూడన్!
కావున ధర్మము లేదనుచుంటిని కడగి మదిని దలచుచు నుంటిన్! 15

స్థావర మేవిధి వ్యక్తరూపమున సరసత గనబడుచున్నదియో
జంగమంబునూ యట్టి విధముగా జగతియందు గనబడుచుండెన్,
ధర్మాధర్మము రూప పదార్ధము దగ ప్రత్యక్షముగా గనమూ!
కనబడుచో నీవంటివానికిని గడగి యాపదలు రావుగదా! 16

అధర్మమది జగతిని గలిగినచో నా రావణుడును నరకమునూ
పొందగలడు మఱి నీవు ధర్మమును బొందుగ యడుగడుగున యుందున్
అనుసరించుచుంటివి గద స్వామీ! యాపద లెందుకు గలిగినవీ? 17

రావణునకు నాపదలు దూరమై రాకుంటయును మఱి నీకున్,
నాపదలును ముంచుకు వచ్చుటయును నది విపరీతముగా దోచున్!
అట్టి యధర్మము ధర్మఫలంబును నా ధర్మమునకు నిక్కముగా!
అధర్మ ఫలమును నిచ్చుచున్నటుల యలరి నాదు మది దోచెడినీ! 18

ధర్మమువలనను ధర్మఫలంబును దగ పొందగ గలరనియు మఱిన్,
నధర్మంబునను యధర్మఫలమును నలరి పొందునను నియమంబున్,
ఏదీ? ఎచ్చట? రఘురామా మఱి యిమ్ముగ కనిపించుటలేదూ!
అధర్మంబు నిల జేయువారు మఱి యధర్మ ఫలమును బొందినచో
లోకజనులు నా యధర్మమందున లోలత శక్తిని జూపుచునూ!
ధర్మమార్గమున పడిచి యుండరూ, ధరణిని గనబడుచున్నదిదీ!
ధర్మమాచరించెడి వారికి మఱి ధర్మఫలము లభియించెడిదీ! 19-20

ఎవరియందు మఱి యధర్మంబునూ నిమ్ముగ ప్రతిష్ఠింప బడియుండున్
అట్టివారి సంపదలు లోకమున నిట్టె వృద్ధి జెందుట చేతన్,

ధర్మశీలురగువారు జగతిలో పగ క్లేశము జెందుట జేతన్!
నీ ధర్మా ధర్మములు లోకమున యిక నిష్ఫలమని దోచు మదిన్! 21

రామా! పుణ్యాత్ములు నధర్మమున రహి వధింపబడి నట్లయినన్,
అధర్మంబుచే ధర్మము జగతిని యలరి జంపబడి నట్లయినన్,
ఆవిధముగ జంపగబడినట్టి నల ధర్మము వలనను జగతిన్-
ప్రయోజనము మఱి యట్టి ధర్మమును బన్నుగ యాచరణను జేసి
ఏమిలాభమును బొందగలడు మఱి యేమి జేయు నాధర్మంబున్? 22

అట్లుగాక విధిచేత నీతడును నలరి జంపబడినను మఱియున్
ఇతరుని దా మఱి జంపిన గూడను నిమ్ముగ యా పాపము గూడన్
దైవంబునకే జెందును మఱి యా దగ కర్తకు నంటదు జూడన్!
కర్మమునకు ఫలదాత యీశ్వరుడు గావున యాతనికే జెందున్! 23

అరిందమా! మఱి పాపకర్మమును నలరి యెదుర్కొను నుపాయమున్,
కానబడనిచో ధర్మము జగతిని గడు నిబ్బరమున నధర్మమున్!
ఏ విధముగ యెదిరించును నిలిచి యెటుల నశింపగ జేయుధరన్! 24

సత్పురుషులలో శ్రేష్ఠుండవు ధర సత్యము దోడుత నడచెదవూ!
అట్టి సత్య ధర్మములునున్నచో నిట్టి వాని మహిమను నీకున్
నెట్టి జెడుగు నాపద రాగూడదు నెట్టి దుఃఖమును రారాదూ!
యే కారణమున నీదృశమైనా నిమ్మగ దుఃఖము గలుగుటయున్
ఆ కారణమున ధర్మమనునదీ యలరి ధరను యున్నది యనుచున్
దెలుపుట కుదురదు రఘురామా విను! దీరుగ ధర్మము లేదు సుమా! 25

లేదా ధర్మము దుర్బలమై మఱి లీలగ ఓరికియు గలదగుచో
దుర్బలంబు మఱి హృతమర్యాదయు దౌర్బలంబు లేనిది యగునో
అట్టిధర్మమును బరిత్యజించుట గట్టిగ మంచిది లోకులకున్!
ఇది నా మదిలో గలిగిన యోచన యిది నామది నిశ్చయము సుమా! 26

కార్యసాధనము విషయము నందున గడగి ధర్మ సత్యంబులునూ
అప్రధానమై పశుబలంబునకు నాదరిలొంగియు బోయినచో

ధర్మంబును మఱి విడిచి పెట్టుమా దగ ధర్మము నిప్పటి వఱకున్!
ఆశ్రయించినటు కటు బలంబునూ నాశ్రయింపుమా రఘురామా! 27

పరంతపా! మఱి సత్యవచనమే బన్నుగ ధర్మంబైన మఱిన్
యనృతుండు మఱి యకరుణుండునగు దగ మన జనకుని దశరథునీ
వెందువలన నిర్లక్ష్యముతోడను కందువ యుపేక్ష జేసితివి? 28

శత్రుమర్దనా! ధర్మముగానీ, దగ యధర్మమును గలవగుచో
వజ్రంబును ధరియించిన శతక్రతు వనర యధర్మం బనక మదిన్!
ఆ మునియునునగు విశ్వరూపునీ యలరి జంపి మఱి యాగంబున్!
జేసినాడు మఱి క్షత్రియులందఱు స్థిరముగ ధర్మాధర్మములన్!
కాలంబును మఱి యనుసరించుచును గడగి జేయుచుండగ వలయున్! 29

రామా! ధర్మము నాచరించినా రహి యధర్మమును జేసిననూ!
వినాశంబు మఱి గలుగుచున్నదీ విడువక మానవు వెన్నంటీ!
అందుచేతనే నరుడు ధరిత్రిని జిందుచు ధర్మాధర్మములన్,
దన యిష్టంబును ననుసరించుచును దగ జేయుచు నుండును ధాత్రిన్! 30

దమనీయ స్థితి నున్నవాడ! విను! దశరథరామా నా మాటన్!
ఇష్టప్రకారము కాలముబట్టీ యిమ్ముగ ధర్మాధర్మములన్,
అనుసరించుటే యుక్తమనుచునూ యలరి నాదు మది నిశ్చయమూ!
ఆ దినమున రాజ్యమును వదిలి మఱి నలరు ధర్మమూలార్థంబున్
ఛేదించితివీ రఘురామా! మఱి చిరతర యాదర్శంబులకై 31

ఉపాయముల వలనను సిద్ధించిన యురుతర సంపద మూలమునన్,
సర్వకార్యములు సిద్ధించును మఱి సర్వకర్మములు నెఱవేఱున్!
పర్వతముల నుండియు జలధారల బరగ నదులు నిండిన యటులన్!
ధనమువలననే సర్వసుఖములను దగబొందును మానవుడు నిలన్! 32

అర్థహీనుడగు నల్పచేతసుని యఖిల కార్యములు నన్నియునూ
గ్రీష్మఋతువునను జిన్నినదులు మఱి సూక్ష్మపాయిలుగ మారినటుల్
భగ్నములై పోవును లోకములో బన్నుగ సాధింపడు జయమున్! 33

సుఖముతో వెలిగిన పురుషుడు మఱి సురుచిర సంపదలను విడిచి
మఱల సుఖమునందున గోరికతో మానుగ పాపము జేయుటకున్,
పాపకృత్యములు ప్రారంభించును ఐన్నగ లోకము నందుననూ!
ఆహా కృత్యంబుల ననేక దోషము లంటు పాపకృత్యమున బడున్! 34

ఎవనికి సంపదలుండునో జగతి యిమ్ముగ మిత్రులు నుండెదరూ!
ఎవనికి సంపదలుండునో యింటను నవతరించెదరు బంధువులున్!
వాడే పురుషుడు యీలోకములో వసరగ యర్థము గలవాడే
పరిగణింపబడు పండితుండుగా ఐన్నగ ధనములు గలవాడే 35

ఏ మానవునకు సంపదలుండునో, నిమ్ముగ యతడే విక్రముడూ!
ఎవనికి యీభర సంపదలుండునో యిల సుగుణుడుగా నెన్నబడున్
యర్థము లెవనికి గూడియుండునో యతడు మహాభాగుడు నిలనూ
అతడే సుబుద్ధియని పిలువగబడు నర్థసంపదలు గలవాడే! 36

ఓ రాఘవా! ఓ రఘురామా! విను! ధీరత రాజ్యము విడువగనూ!
అట్టి నిర్ధనమును తీసికొంటివి నా విధమున వర్తించితివి!
ధనము విడుచుటను గలదోషములను దగ దెలిపితి నే నందుననే! 37

ఎవనికి సంపదలుండునో జగతి యిమ్ముగ ధర్మము కామములున్
నర్థంబులు సిద్ధించును వానికి యంతయు ననుకూలము జరుగున్!
ధనములేనివా డిల ధనమునకై దగ యత్నంబులు జేసిననూ
ధనము లభింపదుగా యీజగతిని దారిద్ర్యము మిగులును దుదకున్! 38

నరాధిపా! ఓ రామచంద్ర విను! నయముగ ధనవంతులకు నిలన్
హర్షము, కామము, దర్పము, ధర్మము నల్క్రోధము శమమును దమమున్
మున్నగు గుణముల నేవి యున్ననూ జెన్నుగ నాతడు శోభించున్! 39

ఏ యత్నంబులు లభించుచుండగ యా యర్థంబులు గ్రహింపకన్
ధర్మమునే చేపట్టు వానికిని దగ యీలోకము నందుననూ!
ఏ ప్రయోజనమును మఱి యుండదో నట్టి ధర్మసంపదలు మఱిన్!

దుర్దిన మందున గ్రహములకువలె దురాసమండవు నీయందున్!
గనిపించుటయును లేదు మహాత్మా! గడు విషాదమును గలిగించున్! 40

తండ్రి యొక్క యాజ్ఞను స్థితుండవై దగ బ్రవాసమున నుండగనూ
ప్రాణంబులలో సమానమైనా బన్నుగ ప్రియురాలగు సీతన్!
నీ భార్యను రాక్షసుడు హరియించెను నిను దక్కువగా జూచుచునూ! 41

ఓ వీరుడ! యా యింద్రజిత్తుచే నొనరగ జేయగబడినట్టి,
నీకు గలిగినా బహుదుఃఖంబును నిజముగ దొలగించెద నిపుడున్!
నా విక్రమమున యారాక్షసునీ నయముగ వధించెదను నిపుడున్
ఆకారణమున లెమ్ము రాఘవా! యలరి ధీరతను బొందు మికన్! 42

దీర్ఘబాహు! ఓ నరశార్దూలా! దీరుగ ధృత వ్రతుడవు నీవున్!
మహాత్ముండవును, కృతాత్ముండవును మానుగ విక్రమ శాలివియున్
నిన్ను గూర్చి వీవే యెందుకు మఱి బన్నుగ దెలియుట లేదేమి?
లెమ్మిక రామా! ధీరవిక్రమా! నిమ్ముగ నిశాచరుల నొంపన్! 43

అనఘా! జనకసుతా నిధనంబున యధిక క్రోధమున నే నిపుడే
నీ ప్రియార్థమై యుద్యుక్తుడనై నిహతుల జేసెద రాక్షసులన్!
రథముల తోడను గజములతోడను రహి హయములతో గూడికొనీ
రావణుతో గూడిన యాలంకను రయమున నా శరముల జేతన్
కూల్చివేసెదను కుప్పజేసెదను గుటిల రాక్షసుల వధించెదన్! 44

(యుద్ధకాండమునందు 83వ సర్గము సమాప్తము)

   

# శ్రీరామకథా సుధాలహరి యుద్ధకాండము

## రెండవ భాగము

### ఎనుబది నాల్గవ సర్గము

ఇదంతయును నింద్రజిత్తుమాయయనీ, సీత జీవించియేయున్నదనీ, విభీషణుడు రామునితో జెప్పి, లక్ష్మణుని నికుంభిలకు బంపుమని ప్రార్థించుట)

భ్రాతృవత్సలుడు లక్ష్మణు డప్పుట బన్నుగ రాముని యారీతిన్,
నోదార్చుచుసుండగ విభీషణుడు నొప్పుగ సైన్య సమూహములన్
నా యా స్థానములందు నిలిపి మఱి నయముగ యచ్చోటికి వచ్చెన్! 1

నానా ప్రహరణములను గూడికొని నల్లని కాటుక ప్రోవులుగా
మాతంగములను వోలెనున్న యా మానుగ యూథపు నాయకులున్!
నలువురితోడను గలిసివచ్చెనూ నయముగ విభీషణుడు వేగన్!
మహాత్ముడును మఱి శోకాక్రాంతుడు మానుగ రాముని సమీపమున్
కన్నీటిని నిండిన వానరులను గాంచె నటను రాముని తోడన్! 2

ఇక్ష్వాకుల కులమున కానందుడు నిమ్ముగ మహాత్ముడును నైనా
మూర్ఛను బొందినవాడు మఱియునూ మోహంబును నొందినవాడున్!
లక్ష్మణకుమారు నంకము నందున లాలితముగ యుండిన వానిన్,
రాముని గాంచెను విభీషణుండును రయమున యాశ్చర్యము నందెన్! 3

సిగ్గుబడుచు మఱి శోకతపితుడై శ్రీరాముని గనుగొనుచు మఱిన్
విభీషణుం డతి దీనత దోడుత వికలత జెందుచు దుఃఖముతో
ఇది యేమా యని శ్రీరఘురాముని యిమ్ముగ బ్రశ్నించెను నతడున్! 4

అంతట లక్ష్మణు డా విభీషణుని జెంతజేరి సుగ్రీవునియున్
వానర వీరుల ముఖమును గాంచుచు వసర దుఃఖ పరిప్లుతములునౌ
నయనంబులతో మందమందముగ నయవాక్యములను నిటు లనియెన్ 5

విభీషణా విను! శ్రీరఘురాముఁడు విని హనుమంతుని వచనములన్
సీత యింద్రజితుచే వధింపఁబడి స్థిరముగ దివికేగెను ననుచున్
నాపలుకుల వినగానే రాముఁడు నతిశీఘ్రముగా నేలబడీ
మూర్ఛను జెందెను స్పృహను దప్పెనూ మునిగెతి మిటు శోకంబుననూ! 7

ఇటుల బలుకుచున్నట్టి లక్ష్మణుని యిమ్ముగ విభీషణుడు నపుడున్
మధ్యలోనె వారించుచు నాతడు మానుగ సంజ్ఞయు లేకయునూ
యున్నరాముతో పుష్కలార్థమును యున్నవాక్యముస నిటు లనియెన్! 8

మనుజేంద్రా! శ్రీరామచంద్ర! విను! మానుగ బహు దుఃఖితుడైనా
హనుమంతుడును దెలిపిన వాక్యము నది నిజమని నే దలపనుగా!
సముద్రమది యెండినదని దెలుపుట సరిగాదు గదా వసుధేశా!
అటులే సీతయు వధింపబడుటయు నసంభావ్యమని దలచెదనూ 9

మహాబాహువులు గలవాడా విను! మానుగ సీతను గూర్చియునూ
దురాత్ముడగు నా రావణు దలవును దూరదృష్టి నే నెఱుగుదునూ!
రావణు డెప్పుడు సీతను జంపడు రహి నా మాటను నమ్ము మిదే! 10

వైదేహిని మఱి విడిచిబెట్టుమని వనర హితము గోరుచు నేనున్
ఎన్నో పర్యాయములు గోరితిని బన్నుగ యాచించితి నతనిన్!
నా ప్రార్థనలను ద్రోసిపుచ్చెనూ నయముగ నిరాకరించుచునూ! 11

సామము జేతను శక్యముగాదూ! దగ వైదేహిని గాంచుటకున్
దానము జేతను భేదముజేతను దగశక్యంబును గాదుసుమా!
యుద్ధము జేతను శక్యముగాదని పద్ధతులను దెలుపగవలెనా?
ఏ యుపాయముల జేతనుగూడను నిల సీతను గాంచగలేరూ! 12

ఇంద్రజిత్తు వానరుల వీరులను సాంద్రమోహమున బడద్రోసీ
తిరిగి వెడలిపోయెను లంకాపురి దీరుగ కపులను నమ్మించి
మహాబాహు! నా జనకాత్మజయును మాయామయి యని భావింపూ!
ఆ విషయంబును మదిని గ్రహింపుము! నంత చింత నొందగనేలా? 13

రావణాత్మజుడు నింద్రజిత్తునూ రమ్మని కుంభిల చైత్యమునన్
జేరి హోమమును జేయగలడు సుమ! శీఘ్రము హోమము జేసి మఱిన్
వచ్చినచో సంగ్రామమునందున మచ్చిక దేవేంద్రుడుగూడన్
అతని జయింపగజాల రెవ్వరును నఖిల లోకముల యందుననూ! 14

వానరవీరుల పరాక్రమంబును వనరగ విఘ్నము జేయుటకున్
మనస్సునందున దలచి రాక్షసుడు మఱి మోసంబును జేయుటకై
ఈ మాయను మఱి ప్రయోగించెనూ నిది సత్యము శ్రీరఘురామా! 15

ఆ హోమము బరిపూర్తియగుటకును నంతకు ముందే సైన్యముతో
నా నికుంభిలకు నిపుడె పోయెదము నయముగ విను శ్రీ రఘురామా!
మిథ్యాసంతాపంబును వీడుము మిగుల శోకమును జెందకుమా!
శోక కర్శితుడవగు నిను గాంచీ శోకముజెందెను సేనయునూ! 16-17

స్వస్థ హృదయమును గలవాడవునై సత్త్వముచే నీవధికుడవై
యిటనే యుండుము శ్రీ రఘురామా! పటుతరమగు ధీరతతోడన్!
సైన్యంబులతో బోవుచుంటిమీ! సరగున నికుంభిలకు నిపుడున్!
మాతో బంపుము లక్ష్మణ వీరుని మానుగ రణరంగమునకున్ 18

నరశార్దూలుడు లక్ష్మణ వీరుడు నయముగ నిశిత శరంబులనూ!
ప్రయోగింపగా నా రాక్షసుడును బరగ హోమమును జేయుటయున్!
భగ్నమగును నాతని యత్నంబును బన్నుగ యా రావణు సుతునీ
వధించుటకు మఱి శక్యంబగునూ వనర హోమ విఘ్నంబగుటన్! 19

వాడియైన బహు తీవ్రములైనా పక్షులతెక్కల వేగమునూ!
గలిగినట్టి లక్ష్మణుని బాణములు గడువేగంబున నింద్రజితున్!
క్రూరమైన పక్షులకును బోలెను గూర్చి శోణితము ద్రావునటన్! 20

అందుచేత ఓ మహాబహు వినుము! నింద్రజితును జంపుట కొఱకై
వజ్రధరుండగు దేవేంద్రుండును వజ్ర ప్రయోగము జేసినటుల్!
శుభలక్షణములు గల లక్ష్మణునీ సురుచిరముగ బంపుము మాతో! 21

మనుజవరా! రిపు నిధనము గూర్చియు మానుగ నేల విలంబమునూ
దగదుగదా మఱి యీ సమయంబున తరుణము మించును శీఘ్రముగన్!
దేవ శత్రువుల జంపుట కొఱకై దివిజేంద్రుడు దివిజులకు మఱిన్
యాజ్ఞ యిచ్చినటు శత్రువధకునూ యాజ్ఞను నిమ్మా రఘురామా! 22

రాక్షస శ్రేష్ఠుండైన యింద్రజితు రయమున హోమము బరిపూర్తిన్
జేసినచో సంగ్రామమునందున సిద్ధిని సురలకు నసురులకున్!
అదృశ్యమూనుండగును నాతనిని నలరి జయించుట కష్టమగున్,
రణమును జేయగ వచ్చిన సురలకు రహి జయంబు సమకూర దికన్!
ప్రాణసంశయంబున బడిపోదురు బరగ ప్రమాదము జరుగు ధరన్! 23

(యుద్ధకాండమునందు 84వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### ఎనుబది యైదవ సర్గము

(విభీషణుడు ప్రార్థించిన ప్రకారము రాముడు నింద్రజిత్తును జంపుటకై లక్ష్మణుని బంపుట - లక్ష్మణుడు నికుంభిలకు బోవుట)

శోకపీడితుండై రాఘవుడును శూరుడు విభీషణుని బలుకుల్
వినియు గూడ యా రాక్షసు వచనము వివరముగా దెలిపిన గూడన్!
స్పష్టముగా నర్థము జేసికొనీ సరగున గ్రహింప లేదతడున్! 1

అటుబిమ్మట యా పరపురంజయుడు నా రఘువీరుడు ధీరతనూ!
తన సమీపమున నున్న విభీషణు దగ కపివీరులు వినుచుండన్!
నీరీతిగ బలికెను శ్రీరాముడు నిమ్ముగ గద్గద కంఠమునన్! 2

రాక్షసవిభు! ఓ విభీషణా విను రయమున నాదు సువచనములన్,
ఏ వాక్యము బలికితివో యిప్పుడు నిమ్మగ బలుకుము నే వినగన్!
మఱల బలుకుమా జెప్పదలచినది మఱల వినుటకును శీఘ్రముగా
అభిలషించుచుంటిని విభీషణా! యలరి బలుకు నీ వచనములన్! 3

రామచంద్రుడా విధి బహు నెమ్మది రమ్యముగా బలికిన బలుకుల్,
వాక్యవిశారదుడైన రాక్షసుడు వసర ప్రయత్నము దోడుతనూ!
యీ విధమున బలికెను రామునితో నిమ్మగ వినయ విధేయతలన్! 4

మహాబాహూ! ఓ రఘువీరా! విను మానుగ నీ యాజ్ఞను నేనున్
సేనా సముదాయముల నన్నిటిని శీఘ్రము నా యా స్థలములనూ!
నిలిపి యుంచితిని యా సేనలనూ నిలిపితి నాయకులను గూడన్!
నీ యాజ్ఞను మఱి తు.చ. దప్పక నెరవేర్చితి శ్రీ రఘురామా, 5-6

మహాప్రభూ! నే మఱియొక విషయము మానుగ దెలుపుచునుంటి నిదే!
విజ్ఞాపన పూర్వకముగ నీకును విన్నవించుచుంటిని వినుమా!
నిష్కారణముగ శోకముజెంది నీరసించి యుంటివి రామా!
అట్టి దుఃఖమును గని మేమును మఱి యిట్టి విషాదము జెందితిమీ! 7

రాజా! యీ శోకంబు మఱియునూ. రహి మిథ్యా సంతాపంబున్,
విడిచిపెట్టుమా! వేగము వానిని విపుల ధీరతను విడువకుమా!
శత్రుహర్షమును బెంపొందించెడి సరగున యీ చింతను విడుమా! 8

రఘువంశంబున జన్మించిన ఓ రామచంద్ర! నా మాటవినూ!
వైదేహిని పొందగ దలచినచో వసర రాక్షసుల జయింపనూ!
మదిలో దలచినచో ఓ రామా! మానుగ పౌరుషమును జూపి,
సంతోషముగా నుండవలయు సుమ! చింతా శోకములను వదిలీ! 9

రఘునందన! యొక మాటను దెలిపెద రహి నా హితవచనము వినుమా!
యీ సౌమిత్రియు గపి సైన్యముతో నిమ్మగ గూడిన వాడగుచున్
నికుంభిలా క్షేత్రమునకు వెడలి నిలిచి యుద్ధ రంగమునందున్

నా మాయావియు నగు రాక్షసునీ యతి తీవ్రములగు బాణములన్,
వధించు గాతను లక్ష్మణ వీరుడు! వనకగ బంప్రుము శీఘ్రముగన్! 10-11

వీరుడైన యా యింద్రజిత్తునూ విమల దపస్సుల జేసియునూ
స్వయంభువునిచే వరముల బొందెను సాహస విక్రము డతడు మఱిన్!
బ్రహ్మ శిరస్సును మహాస్త్రంబునూ బన్నుగ తేజోవంతములున్
కోరిన విధమున బయనించెడి యా కూర్మి హయములను నత డందెన్! 12

అట్టిరాక్షసుడు నింద్రజిత్తునూ యలరి సైన్యమును గూడికొనీ
నికుంభిలా చైత్యమునకు బోయెను నిఖిల శక్తులను సాధింపన్!
అత డచ్చోటను హోమకర్మమును నలరి బూర్తిజేసిన యింకన్!
మన మందఱమును లేనివారమే మానుగ మరణించిన యట్లే! 13

బ్రహ్మదేవుడును సంతోషించుచు బన్నుగ యాతని దపసులకున్
ధీమంతుండగు నింద్రజిత్తునకు దీరుగ యీ వరమును నిచ్చెన్!
ఇంద్రజితూ నీ వెప్పుడైనను సాంద్ర పుణ్య క్షేత్రంబగు నా
నికుంభిలకు జేరకముందుననూ నిర్మలమతి యగ్నుల యందున్.
హోమము జేయుటకును ముందునను నేమముతో నాయుధములనూ!
ధరియించిన నిను నెవడు వధించునొ దగ యాతడు నీ మారకుడున్!
బ్రహ్మయిచ్చినా వరమది రాఘవ! బరగ వధోపాయం బిదియే!
గావున లక్ష్మణ వీరుని బంపుము గడగి వధింపగ నింద్రజితున్! 14-15

మహాబలా! ఓ రామచంద్ర! విను! మానుగ యా రాక్షసు వేగన్!
వధించుటకు మఱి యాజ్ఞాపింపుము వనరగ మన లక్ష్మణవీరున్!
ఇంద్రజిత్తు మరణించిన బిమ్మట సాంద్ర బలముగల రావణుడున్
మిత్రబలముతో దశగ్రీవుండును మేదిని బడినటు దలపు మదిన్! 16

విభీషణుని వాక్యములను మఱి విని విమల శీలుడగు రాఘవుడున్
సిరీతిని బలికెను నాతనితో విమ్ముగ సరళ సువాక్యములన్!
సత్యపరాక్రమ! విభీషణా! విను! సర్వము దెలియును రాక్షసుడున్!
భయంకరుడు మఱి వాని మాయలను బన్నుగ నెఱుగుదు నిదివఱకే! 17

బ్రహ్మాస్త్రంబును దెలిసిన వాడును బన్నుగ మాయావియు వాడున్
బుద్ధిమంతుగును మహాబలీయుడు భూరిపరాక్రమ వంతుడుమా
వరుణునితో గూడిన దేవతలమ వనరగ సంగ్రామము నందున్,
సంజ్ఞలేని వారలుగా జేయును సరనత బహుమాయల జేతన్! 18

మహాయశా! ఓ విభీషణా విను! మానుగ యా రాక్షసుడు మఱిన్
రథము నెక్కి యాకాశమునందున రయమున జరించునపుడు మఱిన్
ఆతని గమనము మేఘములందున నలరు సూర్యగమనము వోలెన్!
ఎటుల దెలియదో జూచువారలకు నటుల దెలియదూ నితరులకున్! 19

అటువిమ్మట శ్రీరామచంద్రుడును బటు దురాత్ముడగు శత్రువుకున్
గలిగిన మాయా వీర్యంబును కదనపాండితిని స్మరియించి!
కీర్తివంతుడగు నా సౌమిత్రిని యరసి బలికె నీ విధముగనూ! 20

కుమార లక్ష్మణ! వానరేంద్రుడనీ కూర్మి సైన్యములతోని మఱిన్
హనుమంతుడు మున్నగు యూథపులను నలరుచు వారలతో గూడీ
మహావీరుడగు జాంబవంతునీ మానుగ యాతని సేనలతో
మాయాబలమును గలిగినట్టి యా మానుగ రావణు కుమారునిన్
రణమునందు మఱి సంహరింపుమా! రంజిల నేనును గపివీరుల్! 22

ఆ రజనీచరుడైన యింద్రజితు నలరెడి మాయల నన్నిటినీ
యెఱిగినవాడగు విభీషణుండును నిమ్ముగ యాతని యనుచరులున్!
నీ వెంబడి నే రణరంగమునకు నీడవలె వత్తురు వెనుకన్! 23

విభీషణునితో గూడినట్టి యా విచిత్ర విక్రమమును గలుగూ
లక్ష్మణుండు రాముని మాటలు విని భీష్మములగు బాణంబులనూ!
మహా ధనుస్సును గ్రహించె నాతడు మఱి భూతములును వెఱగందన్! 24

యుద్ధమునకు మఱి సింసిద్ధుడునై యుద్ధతులను మద మణపగనూ!
కవచంబును ధరియించె నాతడును ఖడ్గంబును నొఱ ధరియించెన్!
బాణంబులతో గూడినవాడై వామహస్తమున ధనుస్సునూ!

ధరించి మఱియును సంతోషించుచు దగ రాముని పాదంబులకున్!
నమస్కరించుచు నీ విధి బలికెను నయముగ వీరోచితముగనూ! 25

మత్కార్ముకమున విడువబడిన యీ మహాశరంబులు నీనాడూ!
ఇంద్రజిత్తునూ నిర్భేధించియు సాంద్రవేగమున హంసలునూ!
పద్మసరస్సుకు బోవుట వలెనూ బన్నుగ లంకకు బోగలవూ! 26

మహా చాప గుణ చ్యుతములైన యీ మహాబాణములు నిపుడిపుడే
క్రూరుడైన యా రాక్షసుదేహము గూరిమి బ్రద్దలుగొట్టియునూ!
ఆ రాక్షసు దేహమును పైకినీ యలరి యెగురగొట్టును వేగన్! 27

ద్యుతిమంతుండగు నా లక్ష్మణుడును ద్రుతమున శ్రీరాముని యెదుటన్!
నీ విధి వచనంబులను బలుకుచును నిమ్ముగ రావణి జంపగనూ!
మనసున కాంక్షించుచు నాతండును మానుగ రణమునకు బోయెన్! 28

ఆ లక్ష్మణుడును అన్నపాదముల యలరుచు నమస్కరించి మఱిన్
ప్రదక్షిణంబును గూడజేసి మఱి బరగ యింద్రజితు జేత మఱిన్
పాలింపగబడు నికుంభిలకు మఱి బన్నుగ బోయెను వేగముగన్! 29

రాజపుత్రుడును ప్రతాపవంతుడు రమ్యగుణుడు నా లక్ష్మణుడున్,
అన్నగారి పాదములకు మ్రొక్కి యలరి ప్రదక్షిణమును జేసీ
ఆశీర్వాదములను బొందియు మఱి యటు విభీషణుని గూడికొనీ
యా నికుంభిలా క్షేత్రంబునకును నతి తొందర బడుచును బోయెన్! 30

ఆ సమయంబున హనుమంతుండును నలరు వేలసైన్యము గూడీ!
యా లక్ష్మణునీ యనుసరించెనూ యతి భీషణమగు రణమునకున్!
విభీషణుండును దన మంత్రులతో విపుల సైన్యముల గూడికొనీ
లక్ష్మణ వీరుని యనుసరించెనూ భీషణ యుద్ధము సేయుటకున్! 31

మహత్తరంబగు వానరసేనయు మానుగ వేగమునను గూడీ!
తనచుట్టును మఱి వచ్చి జేరుటను దగ లక్ష్మణుడును వీక్షించెన్!
మార్గమునందున నిలిచి యున్న యా మహాఋక్ష నాయకుడైనా
జాంబవంతునీ బలములగూడను జరుగుట జూచెను దన తోడన్! 32

మిత్రానందుండైన లక్ష్మణుడు మిగుల పయనమును గావించి,
దూరమునుండియు గాంచి సైన్యమును దోరముగా వ్యూహంబులుగా
రాక్షసేంద్రుని బలమును గాంచెను రమ్య యాయుధములను గూడన్! 33

అరిందముండగు రఘునందనుడగు నా లక్ష్మణుడును సచ్చోటన్
జేరియు మాయా సంబంధముగల శీఘ్రము నా రాక్షసుని మజిన్!
స్వయంభువుడు జెప్పిన ప్రకారమున సరగున హోమము జరుగుటకున్!
ముందుగ రాక్షసు జంపుటకొఱకై మోహరించి యచటను నిలిచెన్! 34

ప్రతాపవంతుడు రాజపుత్రుడును బన్నుగ యా లక్ష్మణు డంతన్!
విభీషణునితో ననిల సుతునితో వీరుడైన యంగదు తోడన్!
స్వయంభువుడు జెప్పిన ప్రకారమున సరగున హోమము జరుగుటకున్!
ముందుగ రాక్షసు జంపుట కొఱకై మోహరించి యచటను నిలిచెన్! 35

అచట నిలిచినా రాక్షస సైన్యము ననేక విధములుగా నుండెన్
అమల శస్త్ర భాస్వరమైయుండెను నంతట కాంతులు జిందుచునూ!
ధ్వజములతోడను మహారథములను దగ క్రిక్కిరిసియు నుండె నటన్!
ప్రవేశింప శక్యముగానిదిగా బన్నుగ గజములు హయములతో!
నిండియున్న యామహా సైన్యమును మెండుగ భీకరమై యుండెన్!
తిమిరము వలె నున్నట్టి సైన్యమున దీరుగ జొచ్చెను లక్ష్మణుడున్!

(యుద్ధకాండములోని 85వ సర్గము సమాప్తము)

   

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### ఎ ను బ ది యా ర వ స ర్గ ము

(వానరులకు-రాక్షసులకు మధ్య యుద్ధము జరుగుట - హనుమంతుడు రాక్షస సైన్యమును సంహరించుట - ఇంద్రజిత్తు హనుమంతుని యుద్ధమునకు బిలుచుట- లక్ష్మణుడు నింద్రజిత్తును గాంచుట)

అటువిమ్మట యా విభీషణుండును నా సమయంబున శత్రులకున్
హితముగానిదియు, నర్థసాధనము నీతియుక్తమగు వాక్యములన్
నా లక్ష్మణుతో నా హనుమంతుని యా యంగదుతో నిటులబలికెన్! 1

అల్లదె! గనబడుచున్నది జూడుడు! నలరుచు మేఘ శ్యామమునన్!
అదియే రాక్షస మహాసైన్యమును నట జరించుచున్నది గనుమా!
వ్యూహంబులుగా నిలిచియున్నదీ యురుతర యాయుధముల తోడన్!
వారలతో మన కపిసైన్యంబును వనరగ పోరాడగ వలయున్!
శిలలు వృక్షములు నాయుధములుగా జేకొని రణమును సేయవలెన్! 2

లక్ష్మణవీరా! మహత్తరంబగు రావణు సేనను వేగముగన్!
ఛేదించుటకును ప్రయత్నింపుమా! భీకరమగు నీ బాణములన్!
ఈ సైన్యము ఛేదింపబడినచో యాబలంబులును జెదిరినచో!
ఇంద్రజిత్తు మన కవుడు గనబడును సాంద్ర భీమ రూపముతోడన్! 3

ఇంద్రుని వజ్రాయుధ సమంబులగు సాంద్రశరంబుల శత్రువుపై
జిమ్ముచు లక్ష్మణ! ముందుకు నడుపుము వమ్ముగాగ శత్రులబలమున్!
హోమము పూర్తియు గాకుండగనే సమరము వేగము జేయవలెన్! 4

దురాత్ముండు మఱి మాయామయుడును దుష్టకర్మములు గలవాడున్
అధర్మంబు మఱి యాచరించుచును నతడు సర్వలోకంబులకున్
భీతిగలుగ జేసెడి వాడును మఱి భీమపరాక్రమ వంతుడునూ!
అట్టివాని యా యింద్రజిత్తునూ బట్టి జంపగను వలయునుమా! 5

శుభలక్షణుడగు లక్ష్మణు డంతట కూరత విని యా వచనములన్
రాక్షసేంద్రసుతుడైన రాక్షసుని రయమున వధియింపగ దలచీ
పటుతరమైనా బాణవర్షముల బరగ యతనిపై గురిపించెన్! 6

మహాశిలలతో మహావృక్షముల మానుగ రణమును జేసెడి యా
భల్లూకంబులు శాఖామృగములు బన్నుగ కలిసిన వారలునై
ఒక్కుమ్మడిగా ముట్టడించిరీ పిక్కటిలగ యబపులతోడన్!
నిలిచియున్న యా రాక్షససైన్యము గలత నొంద బహు వేగముగన్! 7

ఆ రాక్షసులును సంగ్రామంబును నలరి వానరులు జరుపగనూ!
కోరుచున్నవారై శీఘ్రముగా కూర్మి వాడి బాణంబులతో
ఖడ్గంబులు, శక్తులు, దోమరముల కదనమందు నిలిచిరి వారున్! 8

కపిరాక్షసులకు భీకరమైనా కదనము జరిగెను నచ్చోటన్
ఆ సమయంబున బయలు దేరినా యాఘన శబ్దము వేగముగన్!
రాక్షసపురియగు లంకానగరము రయమున నంతట వ్యాపించెన్! 9

వివిధాకారములైన యస్త్రములు వివిధాకారపు నాయుధముల్!
వాడియైన బాణంబుల జేతను వనరగ పాదపముల జేతన్!
భయంకరములగు శైలశిఖరముల బన్నుగ వృక్ష సుశాఖలచే
అంబరమంతయు నా సమయంబున నావృతమైనది చిత్రముగన్! 10

వికృతమైనా ముఖబాహువులును విచిత్రములు నగు కేకలనూ
గలిగినట్టి యా రాక్షస వీరులు కదనమందు గపివీరులపై!
ఆయుధంబులను బ్రయోగించి మఱి యలత నలత గలిగించి రటన్! 11

వానర వీరులుగూడ యుద్ధమున వనర మహాద్రుమముల తోడన్
శైల శృంగముల బ్రయోగించియును సరగున రాక్షసు లందఱినీ
కొట్టుచు, జంపుచు వీరవిహారము గూరిమి జేసిరి రణమందున్! 12

మహాకాయములు గలిగి నట్టియును మహాబలంబును గలవారున్
భల్లూకంబుల నేతల దోడుత, బరగ వానరుల నేతలతో
యుద్ధంబును జేసెడి రాక్షసులకు నుద్భూత భయంబు గలిగె నటన్! 13

దుర్ధర్షుండగు నింద్రజిత్తునూ దోర్బలమగు ఘన సైన్యంబున్
శత్రువుచే బీడింపబడుచునూ సరగున దీనత జెందెననీ;
వినియు నింద్రజితు హోమకార్యముచు విడిచి లేచి పోయెను వేగన్
పూర్తి చేయకుండగనే హోమము నార్తి క్రుంగి లేచెను వేగన్! 14

జాతక్రోధమున యింద్రజిత్తునూ బ్రీతి దక్కి హోమము నందున్
వృక్షంబుల జీకటులనుండి మఱి వెలుపలి కొచ్చెను వేగముగన్!
అదివఱకే హయములను గట్టియును నందముగా గూర్చిన రథమున్
సిద్ధముగా నుండిన యరదంబును శీఘ్రము నెక్కెను రాక్షసుడున్! 15

కృష్ణాంజనచయ సమానుండునూ, కేసరి బలమును గలవాఁడున్,
భయంకరంబగు ధనుర్బాణములు బన్నుగ ధరించి యతడుండెన్,
అరుణారుణ నేత్రంబుల తోడుత నట పెదవులు మఱి గొఱుకుచునూ!
మహా మృత్యుదేవతకు బోలె నట మానుగ నతడు ప్రకాశించెన్! 16

రథస్థుడగు నా యింద్రజిత్తునూ రయమున జూడగ రాక్షసులున్!
భయంకరంబగు వేగము గలిగిన బన్నుగ రాక్షస సేనయునూ!
లక్ష్మణవీరునితో బోరుటకై భీష్మవేగమున నటకొచ్చెన్! 17

ధరణీధర సంకాశుండును మఱి దగ యరిందముడు మారుతియున్
సుదురాసదమగు మహావృక్షమును సురుచిరముగ నెత్తియు మఱియున్
రాక్షస సైన్యంబుల నన్నింటిని రయమున కాలాగ్నికి వోలెన్
దహించుచును మఱి యుద్ధముజేసెను దగ రాక్షసులు నశింపగనూ!
ఆ కపివీరుడు సంగ్రామంబున ననేక వృక్షములను బట్టి
ఆ రాక్షస సైన్యంబును జేసెను నానవాలు లేకుండగనూ! 18-19

వేలకొలది రాక్షసవీరులనూ విడువక వధించు మారుతినీ
జూడగనే యా రాక్షసులును మఱి శూలంబులు మఱి ఖడ్గములన్!
ప్రయోగించిరట హనుమంతునిపై బన్నుగ వివిధాయుధములనూ! 20

శూలంబులు ధరియించిన వారలు శూలంబులతో బొడిచి రటన్
ఖడ్గంబులు ధరియించిన వారలు ఖడ్గంబులతో గొట్టిరటన్,

శక్తులు తోమరములు గలవారును, శక్తులు మఱి తోమరములతో
ఆ హనుమంతుని గొట్టిరి వారలు నతిశయ పౌరుష బలములతో!

పర్వత సముడగు నా హనుమంతుని బన్నుగ రాక్షసవీరులునూ
చుట్టును జేరి పరిఘులతోడుత గట్టిగ కుంతంబుల తోడన్
గదలతోని మఱి ముద్గరముంతో గడు బదునగు శూలంబులతో
బింది పాలముల విడికిలి పోటుల పిడుగుల సమమమగు జబ్బులతో
గొట్టిరి మొత్తిరి గండ్రగొడ్డళుల గూరిమి రాముని భక్తు నటన్!
ఆ హనుమంతుడు సంక్రుద్ధుండై యటగల రాక్షసు లెందఱినో
యమపురి కంపెను నాతిథ్యమునకు నట చోద్యంబుల వీక్షింపన్! 22-23-24

కపిశ్రేష్ఠుండును సమలోపముడును నసంత్రస్తుడగు వాడు మఱిన్
శత్రువులను బరిమార్చుచున్న యా సహజబలుండగు పవనసుతున్
రావణసుతుడగు నింద్రజిత్తునూ రణరంగంబున గాంచి మఱిన్! 25

ఆ రాక్షసుడగు నింద్రజిత్తు మఱి యా సారథితో బలికె నిటుల్,
యా వానరుడును గలచోటికి వే యలరి రథంబును గొనిపొమ్మా!
యీతని యుపేక్ష జేసినచో మఱి యిమ్ముగ రాక్షస సైన్యంబున్
నశింపజేయును గావున రథమును నయముగ గొనిపొమ్మా యటకున్! 26

ఇటుల బలుకబడి యా సారథియును నిమ్ముగ రథమును వేగముగన్,
దుర్ధర్షుండగు నింద్రజిత్తునూ దోరఘుగా రథమందుననూ
యాసీనునిగా జేసి యాతడును హనుమంతుడు గల చోటికినీ,
యా యురగంబును బోలె వేగమున యారణరంగము నందుననూ! 27

ఎదిరింపగ శక్యంబును గానీ యింద్రజిత్తు హనుమంతునికిన్
సమీపమున జని యాతని శిరమున శరములు ఖడ్గములును మఱియున్
పట్టిసములు మఱి విచ్చుకత్తులును బరగ గండ్రగొడ్డళులను వే
ప్రావృట్కాలపు వర్షంబును వలె బన్నుగ గురిపించెను వేగన్! 28

హనుమంతుడును భయంకరములగు నాయుధముల మఱి సహియించీ
మహారోషమును గూడిన వాడై మానుగ యా రాక్షసుతోడన్
బరుషవాక్యముల నీవిధి బలికెను బరుషాక్షరముల తోడుతనూ! 29

దుర్బుద్ధీ విను నా వాక్యములను దోరముగా సద్బుద్ధి నికన్!
ద్వంద్వ యుద్ధమును నాతో జేయుము దగబాహువులను జానితినీ
ఆహవమందున నా వేగంబును నలరి సహింపగ గలిగినచో
రాక్షసులందున శ్రేష్ఠుడ వనుచును రహి యెన్నగ బడుదువు నీవున్! 30

దుష్టబుద్ధి! ఓ రావణాత్మజా! తోరముగా శూరుడవైనన్
యుద్ధముజేయుము! నాతో నిప్పుడు నుద్ధతి బలపౌరుషములతో
వాయుపుత్రునీ సమీపించి మఱి వనరగ ప్రాణంబులతోడన్
వెనుకకు మఱలవు! కావున రాక్షస వీరుడవై యని సలుపు మికన్! 31

ఆ సమయంబున విభీషణుండును నా లక్ష్మణుతో బలికె నిటుల్
అడుగడుగో! వాడేను నింద్రజితు నలరి ధనుస్సును నెత్తుచుసూ
హనుమంతుని మఱి జంపుటకొఱకై యలరి యుద్యమించుచు నుండెన్ 32

మహేంద్రు రణమున గెలిచిన వాడును మహాప్రసిద్ధుడు లోకములన్
రావణాత్మజుడు నీతడు సుమ్మా రయమున రథమున వచ్చుచునూ!
హనుమంతుని జంపగ దలచుచునూ నరయుచున్నవా డదె గదిగో! 33

సాటిలేని యాకారముగలవియు శత్రువులను ఛేదించునవీ,
జీవితమును నంతము జేయునవీ స్థిర భీకరములు నగునవియున్!
అట్టి శరములను నింద్రజిత్తునూ నిట్టె జంపుమిక రణమందున్! 34

శత్రుభయంకరుడైన విభీషణు సరస వచనముల వినియు మఱిన్.
మహాత్ముడగు నాలక్ష్మణు డంతట మానుగ పర్వత సమానుడున్
అరదమునందున యున్నవాడు మఱి యతి భీమబలుండగు వానిన్
ధురాసదుండగు నింద్రజిత్తునూ తోరముగా గనె లక్ష్మణుడున్! 35

(యుద్ధకాండములోని 86వ సర్గము-సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి యుద్ధకాండము

## రెండవ భాగము

### (ఎనుబది యేడవ సర్గము)

(ఇంద్రజిత్తు మఱియు విభీషణుండును కోపముతో మాటలాడు కొనుట)

ఆ విభీషణుడు నాలక్ష్మణుతో నా విధముగ బలికియు మఱియున్
జాతహర్షుడై ధనుష్పాణియెగు నీతివంతుడగు లక్ష్మణునీ
తొందరబడుమను దోడ్కొని పోయెను జిందుచు నట క్షేత్రంబునకున్ 1

ఆ విభీషణుడు నచ్చటినుండీ యలరి దూరమున గలిగిన యా
మహావనంబున ప్రవేశించి మఱి మానుగ యటగల హోమమునూ
రాముని సోదరుడగు లక్ష్మణునకు రయమున జూపించెను నచటన్ 2

తేజస్వియునగు రావణు తమ్ముడు దీరుగ విభీషణుడు నప్పుడున్
నల్లని మేఘముతో సమానమగు నుల్లము ఝల్లున ననిపించూ!
భయంకరంబగు మఱిచెట్టునూ బన్నుగ లక్ష్మణునకు జూపెన్! 3

బలవంతుడగు రావణాత్మజుడు బన్నుగ భూతంబుల నిచటన్
నుపహారంబుల సమర్పించి మఱి మఱుతర శక్తుల సాధించీ
తదుపరి సంగ్రామములకు బోవును దగ విజయంబుల గొనుచుండున్ 4

అటుపిమ్మట యా రావణాత్మజుడు నలరి భూతముల కదృశుడై
సంగ్రామంబుల శత్రుల జంపును సహజ మాయలను గూడికొనీ
శరోత్తమంబుల శత్రులనందఱ సరసత బంధించుచు నుండున్! 5

న్యగ్రోధంబును చేరకుండగాను నయముగ యా రాక్షసుని యికన్
రథములోని యశ్వంబులతోడను రథసారధితో గూడ మఱిన్
ప్రజ్వలించు నీ శరములతోడను ప్రజ్వలింపజేయుము వారిన్! 4

మహాతేజమును గలవాడును మఱి మహావిక్రముడు లక్ష్మణుడున్
'అటులే!' యని యాతనితో బలుకుచు నతి విచిత్రమగు చాపంబున్
జరచుచు నచ్చట యవస్థితుండై యరయుచుండె రాక్షసు రాకన్! 7

బలవంతుడగు రావణాత్మజుడు బన్నుగ కవచము గలవాడున్
ఖడ్గంబును ధరియించినవాడును గనక ధ్వజంబును గలవాడున్,
నైన యింద్రజితు నగ్నివర్ణమును నలరు రథముపై కనబడియెన్! 8

మహాతేజమును గలవాడును నగు మానుగ లక్ష్మణవీరుండున్,
నపరాజితుడగు పౌలస్త్యుడు నగు నలరు నింద్రజితుతోని యిటుల్,
బలికెను రాక్షసరాజ తనూజా! బన్నుగ నిను సమరంబునకున్,
నాహ్వానించుచు నుంటి రాక్షసా! యలరుచు రమ్మిక రణమునకున్! 9

లక్షణవంతుండైన లక్ష్మణుడు లాలితమ్ముగ యిటు బలుకంగన్,
మహాతేజమును గలవాడును నగు మనస్వియును నగు నింద్రజితూ!
అచటనున్న యా విభీషణుని గని యలరి బలకె పరుషంబులనూ! 10

ఓ రాక్షసుడా! విభీషణా విను నానర యిచట జన్మించితివి!
పెరిగితి విచ్చట లంకాపురినీ పెనుగారవమును నొందితివి!
నా తండ్రికి నిజసోదరుండవును నాకును బినతండ్రివి నీవున్!
అట్టి నీవు నీ పుత్రుని కెట్టుల నిట్టి ద్రోహమును జేసితివి! 11

ధర్మదూషణా! దుర్మతి వినుమా! దగ నా వాక్యములను వేగన్,
జ్ఞాతుల విషయము నందునగానీ ప్రీతిస్నేహముల యందుననూ!
జాతినిగానీ, సోదరత్వమును నీతి ధర్మముల సూత్రములన్,
బాటింపక మఱి లక్ష్యపెట్టకను బ్రవర్తించుచుంటివి వీవున్! 12

చెడ్డబుద్ధి గలవాడా! రాక్షస! చేటు దెచ్చితివి కులమునకున్,
జాలిబడగ దగు వాడవు నీవును దూలిబడకు గర్వముతోడన్,
సత్పురుషులు నిను నిందింతురు సుమ! సాక్షి నీవు ద్రోహంబునకున్!
స్వజనంబుల మఱి విడిచి పరులకును సరగున భృత్యుడవైతివిగా! 13

స్వజనంబులతో నివాసమెచ్చుట? నీచ పరాశ్రయ మది యెచటన్!
నీ మహోన్నతంబగు నంతరమును నిమ్మగ నీ నీచత్వము జేతన్
శిథిలమైన నీ బుద్ధిజేత మఱి జేటు దెచ్చితివి లంకకునూ!
ముక్తాయుక్తంబులు మఱచితివి! రక్తిని నీతిని విడిచితివి! 14

శత్రుజనము సుగుణంబులతోడను సరసత గూడియు నుండినను!
నిర్గుణులగు దన బంధుజనములే నిరతము శ్రేయస్సును గూర్చున్,
బరజన మెప్పుడును బరులే కద మఱి పరాశ్రయము నీచముగాదా! 15

స్వపక్ష మెవ్వడు బరిత్యజించుచు స్వార్థపరుడువై యెవడు ధరన్
బరపక్షంబును నాశ్రయించునో బంధుజనంబుల విడనాడీ!
అతని స్వపక్షము సహించపగ మఱి నంపుచు బరపక్షము వారున్
అట్టి జనుని మఱి జంపివేయుదురు నటునిటు జెడు నాతని బ్రతుకున్ 16

రావణానుజా! ఓ నిశాచరా! రాముని తమ్ముని లక్ష్మణునీ!
యీ రహస్యమగు బ్రదేశంబునను నిమ్మగ నను జూపించితివీ!
బంధు ద్రోహివి యనవచ్చును నిను బాంధవు డనుటయు దప్పు సుమా!
జ్ఞాతివి నీవే యిట్టి కార్యమును నీతి దప్పి జేసితి విపుడున్! 17

నిజ సోదరుని కుమారుడైన యా యింద్రజిత్తు మాటలు వినియున్
ఆ విభీషణుడు నిటులను బలికెను నలరుచు సరళ సువాక్యములన్!
ఓ రాక్షసుడా! నా స్వభావమును వనరగ యెఱుగని వానివలెన్!
నెందుల కీ విధి నీతి వాక్యములు? నెందుల కీ విధి గర్వంబున్? 18

దురాత్ముడా! ఓ రాక్షసేంద్రసుత! తోరముగా బారుష్యంబున్,
విడిచిపెట్టుమా! నీ పినతండ్రిని విమల గౌరవము జూపు మికన్,
క్రూరకర్మలును గల రాక్షసులను గూరిమి నే జన్మించితినీ!
ఏది మానవుల యుత్తమ గుణమో నది రాక్షస ప్రకృతికి మఱిన్
విరుద్ధమైనా స్నేహ సౌమ్యతల విమల శీలమే నా శీలమ్! 19

క్రూరకృత్యముల జేత నేను మఱి కూరిమి సంతస మందనుగా!
అధర్మంబునకు దూరము నుండుదు నసత్యంబు వ్యతిరేకింతున్!

ఎంత విషమమగు స్వభావమున్నను సుంత మదిని యోజింపకనూ!
సోదరుండు సోదరుని ద్యజించునె సోదరుండు వను ద్యజించెనూ! 20

ధర్మభ్రష్టమగు శీలముదోడను బరగ క్రూర కర్మలతోడన్!
పాపవిశ్వయము గల బురుషుని మఱి బన్నుగ హస్తము నందున్నా!
విషసర్పంబును విడిచి బెట్టినటు విడిచిబెట్టవలె వేగముగన్,
అట్టివాడు సుఖమందును జగతిని యెట్టి కష్టములు సందకనూ! 21

పరధనంబులను హరించుటయు మఱి పరభార్యా స్పర్శనము మఱిన్
మంచి స్నేహితుల శంకించుటయును, నంచితముగ దోషంబు లివి!
ఇట్టి మూడు దోషములు మానవుని యుట్టె వినాశము గలిగించున్! 21

పసుల ధనంబును నపహరించుటకు పరమాసక్తుడు నగు వానిన్,
పరదారలను స్పృశించు వాడునగు బరమ దురాత్ముని వేగముగన్!
మండిపోవు గృహమును త్యజించినటు ఖండితముగ విడువగ వలయున్
పెద్దలు బలుకుదు రీ మాటలు మఱి పేరిమి శాస్త్రములును బలుకున్! 22

మహర్షులను మఱి వధించివేయుట, మానుగ దివిదేవతల మఱిన్,
విరోధించుటయును, నహంకారమును, వికటరోషమును, వైరంబున్,
ప్రతికూలత్వములను దోషంబులు బన్నుగ జీవితమును మఱియున్,
ఐశ్వర్యంబును నాశము జేయును నందఱిలో దలవంపు లగున్!
ఈ దోషంబులు నా సోదరునీ నిమ్ముగ సుగుణంబులను మఱిన్!
మేఘంబులు శైలమును గప్పినటు స్థిరముగ గప్పెను నింద్రజితూ! 24-25

నా సహోదరుడు నీ తండ్రియునగు నయముగ దశగ్రీవుని యందున్
ఈ దోషంబులు నుండుటజేతను నిమ్ముగ నే విడిచితి నతనిన్!
ఇటుపై యీ లంకాపురియును మఱి యిమ్ముగ నీ తండ్రియు నీవున్
ఇలపై నుండరు విధి నిర్ణయ మది యేల యతిశయములగు బలుకుల్? 26

ఓ రాక్షసుడా! యతి మానంబును నొనరగ మూర్ఖుండవు నీవున్!
దుర్వినీతుడవు వినయములేని దుర్మదాంధుడవు నింద్రజితూ!

కాలపాశమున బంధింపగబడి కఠినముగను బలికితి విప్రుడున్!
బలుకుము నీమది గోరినయట్టుల బన్నుగ నే జింతింపనులే! 27

రాక్షసాధమా! నన్ను గూర్చి మఱి రయముగ బరుషము లాడితివీ!
ఆ కారణమున యాపద వచ్చెను నాలోచింపని పలుకులకున్!
మఱ్ఱిచెట్టు నిక బ్రవేశించుటకు మానుగ శక్యంబును గాదూ! 28

రామానుజుడగు లక్ష్మణవీరుని రయమున రణమున నెదిరించీ,
జీవించుటకును శక్యముగాదూ! శ్రీకరుడగు లక్ష్మణుతోడన్,
రణమును సలుపుము! నీవు జంపబడి రహి యమలోకము నందుననూ
దేవతలకు దాస్యమును జేయుదువు దివిజులు దెలిపిన కార్యములన్! 29

సముద్యతంబగు నాత్మబలంబును సరగున జూపింపుము వేగన్!
సర్వాయుధముల సాయకంబులను సకలము వ్యయమును జేయుమికన్,
లక్ష్మణవీరుని శరజాలముతో భీష్మమైన సైన్యము తోడన్,
జీవించియు పుఱి పోజాలవు సుమ! స్థిరముగ రణరంగమునందున్! 30

(యుద్ధకాండమునందు 87వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి (యుద్ధకాండము)

## రెండవ భాగము

### యాబది యెనిమిదివ సర్గము

(లక్ష్మణేంద్రజిత్తులు భయంకరముగా యుద్ధము జేయుట)

విభీషణుని వచనంబుల వినియును వికటమైన క్రోధముతోడన్,
ఇంద్రజిత్తు నాతని నిందించెను సాంద్ర బరుష వాక్యంబులతో!
వేగముగా నెదురుగ మఱి వచ్చెను వివిధాయుధముల గూడికొనీ! 1

చిత్తబడిన యా మహాయుధంబుల నిమ్ముగ ఖడ్గము ధరియించీ,
నల్లని హయములచే గట్టబడీ నయముగ మహారథము నందున్,
నుండిన వాడును కాలాంతకునికి మెండుగ సముడగువారు మఱిన్! 2

మహాప్రమాణము విశాలమైనా మానుగ వేగము గలిగినదీ,
భయంకరంబగు ధనుస్సు నెత్తీ ప్రబల శత్రువుల బీడించూ!
శరజాలంబును బూని యింద్రజితు సరగున వచ్చెను నెదురుగనూ! 3

మహాధనుస్సును ధరించి మఱియును మహారథంబున స్థితుండునూ,
సమలంకృతుడును శత్రు మర్దనుడు సాహస బలుడగు నింద్రజితూ
యలకృతుండగు రామానుజునీ నా రాక్షసుడును దర్శించెన్! 4

హనుమత్పృష్టముననను గూర్చుండిన యా లక్ష్మణుడును నట్టియెడన్
ఉదయాచలమున నున్నయట్టి యా యుదయ భానువలె భాసించెన్!
అట్టి లక్ష్మణునితో, విభీషణుని, యా వానర వీరుల తోడన్
ఇంద్రజిత్తు మఱి తొందరబడుచును సాంద్రధీరతను నిట్లనియెన్!
ఇప్పుడు గాంచుడు! నా పరాక్రమము నిపుడు నాదు బల వీర్యములన్! 5

ఈ సమయంబున సంగ్రామంబున యిమ్ముగ నా చాపమునుండీ
విడువబడిన మఱి దురాసదంబగు విలవిల వచ్చెడి బాణములున్
ప్రావృట్కాలమునందు మేఘములు బరగ వర్ష జలధారలుగా
మీపై శరవర్షంబు కురియునూ మిగుల ధీరతను సహింపుడూ! 6

ఇపుడు నాదు ఘన చాపమునుండీ నిమ్ముగ వెలునడు బాణములున్
మీ శరీరములు అనలము నంటిన మేల్మి దూది కువ్వకు వలెనూ!
దహించి వేయును బటు శీఘ్రముగను దగ భద్రము మీ ప్రాణములున్! 7

ఈ సమయంబున మిమ్ముల నంటఱ నిమ్ముగ వాడి శరంబులచే
శూలంబులచే శక్తుల జేతను శూరత ఋష్టులజేత మఱిన్!
తోమరములతో జీల్చివెసెదను యమపురి కంపెద శీఘ్రముగన్! 8

క్షిప్రహస్తమున సంగ్రామంబున శీఘ్రము శరవర్షంబులనూ
గురియుచుండగా జీమూతమువలె కూర్మిధ్వనులు జేయుచునుండన్
నా సమ్ముఖమున యెవడు నిలుచునూ సయముగ సంగ్రామము జేయన్!9

పూర్వమందు అనాటి యుద్ధమున బొలుపుగ పరివారముతోడన్
మీరిద్దఱునూ వజ్రముతోడను మేల్మి బిడుగుతో సనూనమున్,
బాణజాలమును బ్రయోగింపగా బడితిరి నేలను మతిదప్పి
ఆ సంగ్రామము నా సంఘటనను నపుడె మఱచిపోయితిరి గదా! 10

నీ కా విషయము స్మృతి బథంబునను నిజముగ లేదా? మతిమఱుపా?
విషసర్పముతో సమానుండనూ వికట క్రోధమున నుండిన నే!
ఆహవమందున రణము సలుపగా నలరి యెందులకు వచ్చితివో!
నీవు దప్పకను యమక్షయమునకును నిజముగ బోయెదవని దలతున్! 11

అంతట రఘునందనుడు లక్ష్మణుడు వింతగ రాక్షసుడును బలుకన్!
విని భయబడకను గోపించియునూ వేగ యతనితో నిటు లనియెన్! 12

ఓ రాక్షసుడా! పొందజాలనీ వనర కార్య యంతంబులనూ
గర్వముగా మఱి దెలుపుచుంటివీ, కడు నిర్లక్ష్యముగను వానిన్,
జేయవలసినా బనుల యంతమును శీఘ్రము బొందెడి నాడు సుమా!
బుద్ధిమంతుడును, గార్యదక్షుడును బొలుపుగ యందఱి మెప్పుగొనున్! 13

ఓ దుర్బుద్ధీ! చెడ్డకార్యముల వొనరగ జేసెడి వాడవునూ!
ఎవ్వరు జేయగ జాలని పనులను నివ్విధి జేసెద ననుచు మదిన్!

మాటలతో జతురతను బలుకుచును మఱి కృతార్థుడను నైతిననీ,
అనుకొనుచుంటివి మది గర్వంబున యది ధీరత్వము గాదు కదా! 14

ఆ సమయంబున యావహమందున యంతర్ధానము నొందుచునూ!
ఆనుసరించినా మార్గ మెయ్యదియొ నది తస్కరులును, నీచులునూ!
అనుసరించెడి కుమార్గంబునుమ! యది వీరులు నిరసింతురుగా
వీరులు జరించు బథమదిగాదూ! వీర ధర్మ మది కాదు గదా! 15

ఓ రాక్షసుడా! యింద్రజితూ నిను! వనరగ నాదు సువాక్యములన్,
నీదు బాణ మార్గమునను నిలిచితి నిండు దేజమును జూపుమికన్!
మాటలలో గొప్పలు నెందుకు నిక మఱి క్రియ యందున జూపు మికన్! 16

విభీషణుని వాక్యములను విని మఱి వికటబలీయుడు విక్రముడున్
సమితింజయుడగు నింద్రజిత్తునూ సరగున ధనుస్సు స్పృశియించీ,
వాడియైన బాహు బణంబులనూ వరుస ప్రయోగించెను నేగన్! 17

రాక్షసు జేతను విడువబడిన యా రమ్యవేగమును గలవియునూ!
సర్పవిషముతో సమానమైనవి సరగున లక్ష్మణు జేరికొనీ!
నిట్టూర్చెడి సర్పంబులవోలెను నేలబడినవీ వేగముగన్! 18

ఇంద్రజిత్తు దా జేసిన కార్యము సాంద్రముగా సరిజూచుకొనీ
లక్ష్మణమూర్తికి ముందుకు జని మఱి లావుగ దా గర్జించుచునూ!
బరుషముగా నీ విధమున బలుకుచు బరుషాక్షరముల దోడుతనూ! 21

సౌమిత్రే! ఱెక్కలు గలవియునూ శతధారలు గలవియును మఱియున్,
మత్కార్ముకమున విడువబడినవీ మానుగ ప్రాణము దీయునవీ!
ఆవహమందున నాబాణంబులు నలరి నీదు ప్రాణము దీయున్! 22

రాముని తమ్ముడ! లక్ష్మణ! వినుమా! రయమున నాచే జంపబడీ
భూశయనంబున నుండిన నీపై నక్కల గుంపులు గ్రద్దలునూ!
డేగల గుంపులు వచ్చి వ్రాలునూ, దగ నీ మాంసము భుజియింపన్! 23

పరమ దుర్మతియునగు శ్రీరాముడు బన్నుగ క్షత్రియ బంధువుడున్!
సహా భక్తుడవు, అనార్యుండవును సరగున నే నిను వధియింపన్!
నీ సోదరుడగు రాఘవు డిపుడే నిన్ను గాంచి వేదన జెందున్! 24

సౌమిత్రీ! యీ రణరంగంబున చయ్యన నిన్ను వధింపగనే!
జారిపోయినా కవచము తోడను జారి నేల దూరంబుననూ!
పడిపోయిన యా చాపముతోడను బన్నుగ తల దెగి బడినట్టి
నిన్నుగాంచి నీయన్న రాఘవుడు నిష్ఠుర వేదన బడగలడూ! 25

ఈవిధమున బరుషముగా బలుకుచు నిమ్ముగ కోపించియు నున్నా
రావణాత్మజుడు నింద్రజిత్తునూ రహి గాంచుచు విజ్ఞత తోడన్!
అర్థజ్ఞుండగు లక్ష్మణుడప్పుడు నలరి హేతు సహితంబైనా
వాక్యంబులనూ నీ విధి బలికెను వనరగ బహు ధీరతతోడన్! 26

దుర్బుద్ధీ! ఓ యింద్రజితూ విను! దోరముగా నా వచనములన్!
వాగ్బలంబునూ విడువుము రాక్షస! వనర కార్యమును జూపింపూ!
క్రూరకర్మలును జేయువాడవును గుటిలాత్ముడవు! యనార్యుడవూ!
గొప్పలు జెప్పుట యెందులకూ మఱి? గూరిమి కార్యము జూపు మికన్! 27

ఉదాత్త కర్మలు జూపకుండగనె యూరక గొప్పలు బలికెదవూ!
రాక్షసుడా! నీ మాటల మీదను రహి నమ్మకమును గలుగునటుల్!
నీ చాతుర్యము రణకౌశలమును నీబలమును జూపుము నింకన్! 28

పురుషాధమ! మఱి పరుషవాక్యములు బూని బలుకకను నిష్ఠురతన్!
బడాయిమాటలు జెప్పికొనక మఱి బన్నుగ జంపెద నిన్నిపుడున్! 29

అనుచు బలికి యా లక్ష్మణ వీరుడు నాకర్ణితముగ లాగబడీ!
ఐదింటిని నారాచ బాణముల నలరి మహావేగము తోడన్!
ఆ రాక్షసు వక్షస్థలముననూ నా మహాహవము నందుననూ! 30

ప్రజ్వలించు సర్పంబులవోలెను బన్నుగ సుపత్ర భాజితముల్,
బాణంబులు మఱి యారాక్షసునీ బరగ మహావక్షస్థల మందున్!
సవితృ కిరణంబులకు వోలెనూ సరగున భాసించినవి యటన్! 31

సౌమిత్రీ బాణంబుల చేతను సరగున గొట్టగబడి పిదపన్!
రావణాత్మజుడు నింద్రజిత్తునూ రయమున రోషమునను గూడీ!
సుప్రయుక్తమగు మూడుబాణముల సూటిగ యాలక్ష్మణు గొట్టెన్! 32

ఆవహామందున యొకరిపై యొకరు నలరి జయంబును సాధింపన్!
నరశ్రేష్ఠుండగు లక్ష్మణునకునూ నయముగ రాక్షస శ్రేష్ఠుండున్!
ఇంద్రజిత్తుకును మహాభీమమగు సాంద్రమైన పోరాటంబున్!
ఆసమయంబున నచ్చట జరిగెను నలదేవతలును దిలకింపన్! 33

ఆయిరువురునూ బలసంపన్నులు నతుల పరాక్రమ వంతులునూ
పరమ దుర్జయులు వారిరువునూ బహురణ చతురులు నేర్పరులున్!
సాటిలేని బలమును గలవారును సహజ తేజమును గలవారున్! 34

సంగ్రామంబున దుష్ప్రధర్షణులు సహజ వీరులా యిరువురునూ!
ఆకాశంబున రెండు గ్రహంబులు నలరుచు దాకిన విధముగనూ!
ఇంద్రుడు వృత్రాసురుడు బోరినటు సాంద్ర రణంబును జేసిరటన్!
ఇంచుకంతయుసు భయములేక మఱి నంచితముగ బాణంబులతో! 35

అట్టిసమయమున యవస్థితులునగు నామహాత్ములును నిద్దఱునూ!
అనేకంబులగు శరజాలంబును నలరి విడుచుచును వేగముగన్!
రెండుసింహముల వలె నట బోరిరి నిండు బరాక్రమమును గూడీ! 36-37

అటుబిమ్మట యా శత్రుమర్దనుడు నా లక్ష్మణుడును వేగముగన్
బాణంబుల సంధించి చాపమున బరగ క్రుద్ధుడై రణమందున్!
వగబట్టిన సర్పంబువోలె మఱి బన్నుగ బుసలును గొట్టుచునూ!
ఇంద్రజిత్తుపై బ్రయోగించెనూ సాంద్ర వీర్యబలముల తోడన్! 38

రాక్షసాధిపుండైన యింద్రజితు రహి లక్ష్మణుడును జేసెడి యా
నారియొక్క టంకార ధ్వనియును నయముగ వినియును రాక్షసుడున్
వివర్ణవదనుండై లక్ష్మణునీ విలవిల బోవుచు దిలకించెన్! 30

వివర్ణవదనుండైన యింద్రజితు వికలత జెందుట గాంచి మఱిన్
రావణు తమ్ముడు విభీషణుండును రయమున గాంచియు వేవెంటన్!

నావహమందున లక్ష్మణజిత్తుడగు నా లక్ష్మణుతో నిటు లనియెన్!
మహాబాహు! ఓ లక్ష్మణవీరా! మానుగ రావణు సుతునందున్!
గానిపించు లక్షణములబట్టియు గలత బొందినటు యనిపించున్!
గాపున యీతడు ఉర్వులు డాయెను గడగి నీవు తొందరపడుమా!
సంశయంబు లేదింక రవంతయు భ్రంశమొందె నాతని బలమున్! 41

అటుబిమ్మట లక్ష్మణ వీరుండును నాశీవిషోపములును నగూ!
నిశిత శరములను సంధించియునూ నీరధి యలలకువోలె మఱిన్!
విషసర్పంబుల వలె రాక్షసుపై వేగ ప్రయోగించెను వానిన్! 42

ఇంద్రుని వజ్రాయుధము సమములగు సాంద్ర విక్రముడు లక్ష్మణునీ
బాణంబులచే గొట్టబడిన యా ప్రబల రాక్షసుడు నింద్రజితూ!
ముహూర్తకాలము రణరంగంబున మూర్ఛనొంది నట బడియుండెన్! 43

క్షణకాలంబున సంజ్ఞను బొందీ సరగున జాగృతి నందికొని,
తిరిగివచ్చినా యింద్రియములనూ దీరుగ గలవాడగుచు మఱిన్!
రణమున స్థిరముగ నిలిచియున్న యా రఘునందనునీ వీక్షించెన్! 44

రావణాత్మజుడు నింద్రజిత్తునూ రయమున క్రోధము గూడికొనీ
అరుణారుణ నేత్రంబులతోడను నా లక్ష్మణువైపుకు జనియెన్!
ఆ రణవీరుని సమీపించి మఱి నాతనితో నీవిధి బలికెన్! 46

మొదటిసారిగా నాతో జరిగిన హృదయ విదారకముగ యనిలో,
నీ సోదరుడగు రాఘవుతోడను నేలబడితివీ! దొరలితివీ!
నాపరాక్రమము నీకు దెలియదా? నా బలవిక్రమములు నీకున్! 46

మొదట జరిగినా యావహమందున కదిలి నీదు బరివారముతో
సోదరులగు మీ యిరువురి నప్పుడు శూరుడ! జ్ఞాపకమును లేదా?
ఇంద్రుని వజ్రముతో సమానములు సాంద్రశితములగు బాణములన్!
జైతన్యము లేకుండ జేసితిని సరినేలను బడవైచితినీ! 47

నీవు నన్ను నెదిరింపగ గోరుచు నిగిడి వచ్చితివి రణమునకున్,
నే కారణమున గోరివచ్చితో నెఱుకలేక పోవలె నీకున్!

లేదా యమసదనంబునకును మఱి లీలగ బోవలెనని మదిలో
గోరుకొనుచు నుంటివి యని మదిలో గూరిమి నే దలచుచు నుంటిన్! 48

మొదటి యుద్ధమున మత్పరాక్రమము మోదముగా జూడని యెడలన్
నా పరాక్రమము నిప్పుడు జూపెద! నలరి గనుము! లక్ష్మణ వీరా!
వ్యవస్థితుడవై నిలిచియుండుమా? వనర గనుము బలవిక్రమములున్! 49

ఇటుల బలుకుచును నింద్రజిత్తునూ, చటుల బాణములు యేడింటన్;
ఆ రామానుజుడగు సౌమిత్రిని యలరిగొట్టి బహు తీవ్రముగన్!
వాడియైన యంచులు గలిగిన యా వనరగ పది బాణంబులచే
వాయుసుతుండగు నా హనుమంతుని వరుసగ వేసెను రణమందున్! 50

అటువిమ్మట యా వీర్యవంతుడగు నా రావణ సుతుడును వేగన్,
క్రోధము వలనను తొందరబడుచును గూర్మి బాణమున సంధించి,
నూఱు వాడి బాణములను గొట్టెను శూరుడైన యా విభీషణున్! 51

అటు పిమ్మటనూ రాముని తమ్ముడు చటుల విక్రముడు లక్ష్మణుడున్
ఆవహమందున యింద్రజిత్తుచే నావిధి జేయగబడినట్టి
మహాత్కార్యమును గని లక్ష్మణుడును మానుగ గణింపకుండగనూ!
నవ్వుచు నాతడు ఇదేమి కాతని యలరి బలుకుచును వేవెంటన్!
అభీత వదనుండై క్రుద్ధుండై యటగల రాక్షసుపై వేగన్
భయంకరంబులు నగు శరంబులను బన్నుగ వదిలెను వేవెంటన్! 52-53

నిశాచరా! సంగ్రామమునందున నీరసములునగు శరములనూ
శూరులు వీరులు ప్రయోగింపరూ! శూరత్వంబును దెలిసినదీ!
నీవు ప్రయోగించిన బాణంబులు నీరసములు బహు తేలికయున్,
సుఖకరంబుగా నున్నవి రాక్షస! చూడముచ్చటగ నున్నవియున్! 54

జయకాంక్షా పరులెవ్వరు రణమున జయమును గోరుచు నిట్టి విధిన్
రణమును సేయరు రాక్షస వినుమా! రణవిశారదుడవుగావు మఱిన్!
అని బలుకుచు నా లక్ష్మణధీరుడు నఖండవీరుడు విక్రముడున్
ఆ రాక్షసుపై బాణవర్షమును నలరి గురిసె పటగజుల వలెన్! 55

ఆ రఘునందను బాణంబులచే నటు ధ్వంసము జేయగబడినా
కాంచన వికారమైనది మఱియును గడు మహత్తరంబై నదియున్!
కవచంబును నాకాశమునుండియు కదిలి జారు తారల వలెనూ!
ఆతని రథ మధ్యస్థమందునను నలరి జారిపడె ముక్కలుగన్ 56

రఘునందను బాణంబులజేతను రయమున కవచము ధ్వంసంబై
నేలబడుటయును శరీరమంతయు నిండు గాయములు దగులుటయున్!
ఇంద్రజిత్తు నా సమయమునందున సాంద్ర రక్తధారలచేతన్
ప్రత్యూషంబున భానునివలెనూ బన్నుగ రాక్షసు డపుడుండెన్! 57

అటుబిమ్మట యా భీమవిక్రముడు నలరు బరాక్రమ వంతుడునూ
రావణాత్మజుడు నింద్రజిత్తునూ రహి కోపించిన వాడగుచున్!
సమరమునందున వేయిబాణముల సరగున సౌమిత్రిని గొట్టెన్! 58

శక్రజిత్తుని బాణవర్షమున సరుగున లక్ష్మణవీరుని యా
దివ్యమైన కవచము వేగముగా దీరుగ భగ్నంబై పోయెన్!
వారిద్దఱునూ యొకరి కొకరు మఱి వనర బ్రతిక్రియ జేయుచునూ
యొకరిపైకి మఱియొకరు బోవుచును వికట రణంబును జేసిరటన్! 59

సంగ్రామంబున వారిద్దఱునూ సకల యుద్ధ బరికరములచే
యుద్ధముజేసిరి సకల పద్ధతుల యుద్ధతులై యా సమయమునన్
అంగాంగంబులు రక్తధారలను జెంగున జిందుచు నుండగనూ
శరీరమంతయు రక్తము జేతను సరగున దడిసెను వారలకున్! 60

మహాత్ములును మఱి రణకర్మములో మానుగ విశారదులునైనా
రాముని తమ్ముడు లక్ష్మణుండునూ రావణసుతుడగు నింద్రజితూ!
వీరులిద్దఱును వాడిబాణముల వరుసగ పోరాడిరి వేగన్
జాలనేపటుల ద్వంద్వయుద్ధమును జతురత జేసిరి రణభూమిన్! 61

భీమపరాక్రములగు వారిద్దఱు భీతిలేక రణరంగమునన్
విజయమునందున విశ్వాసంబును విపుల యత్నముల దోడుతనూ!
బాణంబుల మఱి ప్రయోగించుచును భవ్యకవచములు ధ్వజములునూ

నేలబడినసూ వారిద్దఱునూ నిజరక్తంబును స్రవించుచున్!
ప్రస్రవణా పర్వతమును వోలెను బరగనుండి రా సమయమునన్! 62

భయంకరంబగు ధ్వనులు గలిగినా బాణవర్షమును గురియుచునూ
ధారావర్షము గురియుచున్న యా దగ యాకాశము నందుగలా
ప్రళయకాల మేఘంబుల వలెనూ ప్రబలులైన వారిద్దఱునూ
చాల సమయ మటు యుద్ధము జేసిరి చవిజూసిరి యోటమి జయమున్
కానీ వారల రణమునందునను గలత నలత బొందగ లేదూ!
అవహమందున వైముఖ్యంబును నలసట నట నందగ లేదూ! 63 64

అస్త్రవిదులలో వీరులైన యా నలరు వీరులగు నిద్దఱునూ
మాటిమాటికిని యస్త్రంబులను మానుగ జూపుచు క్రోధమునన్
అంబరమందున యనేకవిధముల యాకారంబుల బాణములన్
బంజరములకును వోలె నల్లిరీ బహువిచిత్ర రూపంబులుగా! 65

ఆ నర రాక్షసు లిరువురు గూడను నలరు దోషములు లేకుండన్
బహు దేలికగా విచిత్రములుగా బాగుగ శరముల విడుచుచునూ
వ్యాకులంబుగా దుములముగా నట వనరగ జేసిరి యుద్ధంబున్! 66

వారిరువురి నుండియును జనించిన యా యిరువురి శబ్దంబు మఱిన్
వ్యాకులంబునగు ధ్వని వేర్వేరుగ వనరగ వినబడె నట్టియెడన్,
ఆ ధ్వని దారుణమైన యుఱుమువలె నటు కంపంబును బుట్టించెన్! 67

అవహమందున నాసక్తులునగు నా యిరువురి శబ్దంబు మఱిన్
గగన మందు ధ్వని జేయుచున్న యా కడు భయంకరము లైనట్టి
మేఘంబుల ధ్వని వోలె నుండెనూ మిగుల నల్గడల జెలగుచునూ! 68

బంగరు పొన్నులు గలిగినట్టి యా రంగుగ నారాచంబులతో
జయమునందు దృఢ నిశ్చయంబునూ జాగృతి కీర్తియు గలవాడున్
శరీరమంతయు గాయములేర్పడి స్రనియించిరి రక్తము వారున్! 69

రణరంగంబున వారి గాత్రముల పైబడి ఛేదించియు మఱియున్
రుక్మ పుంఖములు నగు బాణంబులు రక్తముచేతను బూయబడీ!
వెలుపలి కొచ్చియు ధరణీతలమున వేగ ప్రవేశించెను నపుడున్! 70

వారియొక్క బాణంబులు గొన్నియు వనరగ శిత శస్త్రంబులతో
ఆకాశంబునయందు క్షీణొనెను యతి వేగంబున శస్త్రములన్!
వేలకొలది ముక్కలు ముక్కలుగా విఱిచివేసే నాబాణములన్! 71

రణమునందు నాయిరుపురి యొక్కయు రయమున బడు శరజాలంబున్
ప్రోవులుగా పర్వలు బడినట్లుగ బొలుపుగ వారల బాణములన్
కుప్పలుగా బడియుండునట్లుగా కుదురుగ యావిధి నుండునటుల్! 72

మహాత్ములగు వానర రాక్షసులయును మానుగ గాయంబులతోడన్
నున్న దేహములు బుష్పించిన యా బన్నుగ పత్రంబులులేనీ
శాల్మలి కింశుక వృక్షంబులవలె సరిదూగుచు నుండెను నపుడున్!
సౌమిత్రియు మఱి లక్ష్మణుండునూ సరసత విజయము గోరుచునూ
పోటి మాటికిని దుముల యుద్ధమును మఱిమఱి జేసిరి ఘోరముగన్! 74

సమరమునందున లక్ష్మణుండునూ సరగున రావణు సుతుతోడన్!
రావణసుతుడగు నింద్రజిత్తునూ రయమున లక్ష్మణ వీరునితో!
బరస్పరంబును యుద్ధము జేయుచు బలువిధముల బోరాడుచునూ!
యలసట జెందగ లేదు వారచట యారాటము జెందగలేదూ! 75

మహావీర్యులును వేగవంతులును మహావిక్రములు వారలునూ,
దేహములందున లోతుగా దిగిన దీరుగ శరజాలంబులతో!
మొక్కలు మొలిచిన పర్వతములవలె మిక్కిలి భాసించిరి వారున్! 76

సమరమునందున లక్ష్మణుండునూ సరగున రావణు సుతు తోడన్
రావణసుతుడగు నింద్రజిత్తునూ రయమున లక్ష్మణ వీరునితో!
బరస్పరంబును యుద్ధము జేయుచు బలు విధముల బోరాడుచునూ!
అలసట జెందగ లేదు వారచట యారాటము నందగ లేదూ! 76

మహావీర్యులును, వేగవంతులును మహావిక్రములు వారలుమా
దేహములందున లోతుగా దిగిన దీరుగ శరజాలంబులతో!
మొక్కలు మొలిచిన పర్వతములవలె మిక్కిలి భాసించిరి వారున్! 76

అటుపిమ్మట రక్తముతో దడిసిన ఆటుల బాణముల గప్పబడీ!
వారిరువురి సర్వాంగములన్నియు వనర జ్వలించెడి యగ్నులుగా!
ప్రకాశించెనూ రణరంగంబున బన్నుగ జూచెడి వారలకున్! 77

ప్రళయకాల మేఘంబుల వలెనూ ప్రబలులైన వారిరువురునూ,
చాల సమయమటు యుద్ధముజేసిరి చవిజూసిరి యోటమి జయముల్
కానీ వారలు రణమునందునను గలత నలత నందగలేమా,
ఆవహామందున వైముఖ్యమునూ యలసట నట జెందగ లేమా! 78

అటుపిమ్మట యామహాత్ముడైనా యల విభీషణుడు వేగముగన్
నావహామందున యపజయ మెఱుగని యా లక్ష్మణు శ్రమ దొలగింపన్
అతనికి హితమును ప్రియమును గూర్చుచు నలరిజేరె రణరంగమునన్!

(యుద్ధకాండము నందు 88వ సర్గము సమాప్తము)

   

# శ్రీరామ కథా సుధా లహరి యుద్ధకాండము

## రెండవ భాగము

### యెనుబది తొమ్మిదవ సర్గము

[విభీషణుడు రాక్షసులను వధించుచు వానర నాయకులను బోత్స హించుట— ఇంద్రజిత్తు సారధిని లక్ష్మణుడు జంపుట—వానరులు రథాశ్వములను జంపివేయుట.]

అటుబిమ్మట చాపంబు ధరించిన నతిబలవంతుడు శూరుండున్!
రావణు తమ్ముడు విభీషణుండును రణరంగంబున యుద్ధంబున్!
జేయుచుండినా వారును మఱియును స్థిరసంకల్పులు నగువారున్!
మదముజిందు మాతంగములకు వలె మానుగ జయమును గోరుచునూ!
రణమును సలిపెడి నరరాక్షసులను రమ్యముగా గాంచుచు నతడున్!
ఇంకను వారల యుద్ధము గాంచగ శంకలేక రణరంగముననన్!
అగ్రభాగమున నిలబడి యుండెను నట దృష్టిని మఱి సారించీ! 1-2

అటుబిమ్మట యా విభీషణుండును యవస్థితుండై యట నిలిచీ!
మహాధనుస్సును జఱచెను నాతడు మానుగ నారిని సంధించీ!
రాక్షస సైన్యముమీద నాతడును రయమున బహు తీవ్రములైనా!
మహాశరంబుల విడిచె నాతడును మానుగ బటుతర వేగముగన్! 3

సమాహితంబై వచ్చిబడుచున్న సరసత యగ్నులకు వోలెన్!
స్పర్శ గలిగినా యాబాణంబులు సరగున వజ్రాఘాతముననన్!
మహాశైలముల జీల్చి వేసినట మానుగ రాక్షసులను జీల్చెన్! 4

ఆ విభీషణుని యనుచరులైనా యా రాక్షస శ్రేష్ఠులు గూడన్!
సమరమునందున వీరులైన యా సాహసవంతుల రాక్షసులన్!
శూలంబులచే, ఖడ్గంబులచే సూటిగ బట్టిసముల జేతన్!
వీరులైన యా రాక్షస వీరుల విలయముగా చేదించి రటన్! 5

ఆ సమయమునను యమాత్యులైనా యా రాక్షసులను గూడికొని!
ఆ విభీషణుడు ధైర్యము గలిగిన యలరు యేన్గు గున్నల మధ్యన్!
మహాద్వీపమువలె ప్రకాశించెనూ మానుగ రణరంగమునందున్! 6

అటుబిమ్మట మఱి కాలజ్ఞుండును నలరు రాక్షసుల శ్రేష్ఠుండున్!
విభీషణుండును దగిన సమయమున వివిధ విషయముల గుర్తించి!
రాక్షస వధ గావింప ప్రియముగల రయమున యాకపి వీరులనూ
పిలిచి దగ్గఱకు విన్నవించెనూ కలయ జూచుచును వారలనూ! 7

వానర నాయకులారా! వినుడో! వనరగ యా దశగ్రీవునకున్!
నీత డొక్కడే గతిగా నిలిచెను నీత డొక్కడే రావణుకున్!
శేషముగా మిగిలినవాడు సుమా! శీఘ్రము దలపడు డీతనితో
నిలబడు టెందుకు? మీదికి దుముకక గలయజూచుటయు నెందులకూ? 8

రణాగ్రమందున పాపాత్ముండగు రయమున యీతని వధియింపన్!
రావణాసురుడు నొక్కడు మిగులును రయమున నందఱు లేనటులే!
సైన్యమంతయును జంపబడినటుల సరగున దెలియుడు గపివీరుల్! 9

ప్రహస్తుండునూ నిహతుడయ్యెనూ బరగ వీరుడగు నికుంభుడున్!
మహాబలుండగు కుంభకర్ణుడును మానుగ కుంభుడు హతుడయ్యెన్!
ధూమ్రాక్షుండను నిశాచరుండును భూశిని గలిసెను గపులారా!
జంబుమాలియును, మహామాలియును, నశని ప్రభుడును మరణించెన్!

సుప్తఘ్నుండును, యజ్ఞకోపుడును వజ్రదంష్ట్రుడను రాక్షసుడున్!
సంహ్రాదీ, వికటుండు, దపనుడూ సాహసవంతుడు మందుడునూ
ప్రయాసుడును మఱి బ్రఘసుడు జచ్చెను ప్రఘుజండును మఱి జంఘుడునూ

దుర్ధర్షుండగు నగ్నికేతువును దోర్బల రశ్మి సుకేతువునూ!
విద్యుజ్జిహ్వుడు ద్విజిహ్వుండు మఱి వికట సూర్యశత్రువును దగన్!
అకంపనుండును సుపార్శ్వుండునూ యలరు జక్రమాలియు గూడన్!
కంపనుడను రాక్షసుడుగూడనూ కంపము జెందియు మరణించెన్!
దేవాంతకుడును నరాంతకుండును దివికేగిరి రణరంగమునన్ 10-14

అతిబలవంతులు నగు రాక్షసులను ననేకులను రణమున జంపి!
బాహువులను సంద్రంబును దాటి ప్రబలమైన రణమును సలిపి
మిగిలియున్న యీ చిన్నిగోష్పదము గడ దాటుటకును భయమేలా? 15

నా మాటలు వినుడో కపులారా! నయముగ నేనిట దెలుపునది!
ఇచట మీరలును జయింపదగినది యింత మాత్రమే గలదు సుమా!
బలముజేత గర్వించినట్టి యా ప్రబలరాక్షసులు రణమునకున్!
వచ్చినట్టి వారందఱు జచ్చిరి మచ్చికతో నీ రణభూమిన్! 16

తండ్రినైన నే బుత్రుని జంపుట దగదుగదా లోకమునందున్!
అయినను గూడను జాలి విడిచి నే నల శ్రీరాముని నిమిత్తమున్!
నా సోదరు బుత్రుని నే జంపెద నయముగ వీరులు హర్షింపన్! 17

ఇంద్రజిత్తునూ జంపవలయునని నిమ్మగ దలచుచు నుండినసూ!
నా నేత్రంబును బాష్పధారలను నయముగ గ్రమ్ముచు నుండె నిదే!
మహావీరుడగు లక్ష్మణమూర్తియె మానుగ నీతని శాంతింపన్!
జేయగలడు సుమ వానరులారా! శీఘ్రము మీరందఱు గలిసి!
సమీపమున గల రాక్షసులందఱ సరగున వధియింపుడు నింకన్! 18

ఈ విధమున బహు యశస్సు గలిగిన యిమ్మగ విభీషణుని జేతన్
ప్రేరేపింపగ బడి గపివీరుల ప్రీతి సంతసము నొంది మఱిన్!
లాంగూలంబుల గదిల్చి రప్పుడు చెంగుచెంగునా యెగురుచునూ! 19

తనసైన్యమునకు జెందిన వారిని దగ జాంబవంతు డట్టియెడన్
ఇంద్రజిత్తు సామీప్యంబునగల సాంద్రబలుల యా రాక్షసులన్!
శిలలతోని మఱి వృక్షంబులతో శిత నఖంబులను దంతములన్!
బీడించిరి వారిని వేగముగా వీడి చనగ రణరంగమునూ! 21

మహాబలీయులు రాక్షసులందఱు మానుగ యనేక విధములనూ!
యాయుధములు ధరియించినవారై యలరి మీదబడు యూథపుడున్!
జాంబవంతునీ జుట్టు ముట్టిరీ చయ్యన భయమును విడనాడీ! 22

సంగ్రామంబున రాక్షససేనను జంపు జాంబవంతుని బట్టి
వాడియైన బాణంబుల తోడను బడునగు బట్టిసములతోడన్!
యష్టుల తోడను దోమరములతో బట్టికొట్టిరి తీవ్రముగన్! 23

ఆ వానరులకు రాక్షసులకునూ యలరు క్రోధ చూర్ణితమైనా
దేవాసురులకు జరిగినట్లుగా ధీరుగ భయంకరమునైనా!
మహా ధ్వనులతో గూడినట్టిదియు మహాయుద్ధమును జరిగె నటన్! 24

మహా మనస్వియు నగు హనుమంతుడు మానుగ కోపించినవాడై
మూపునుండి యా లక్ష్మణమూర్తిని మోదమునను క్రిందికి దింపి
పర్వతమున నొక చరియను గైకొని బన్నుగ రాక్షస మూకలనూ!
కదనమునందున నాశము జేసెను గడు క్రోధంబును దీపింపన్! 26

పరవీరఘ్నుడు బలవంతుండును బన్నుగ రావణ తనూజుడున్,
బిన తండ్రియునగు విభీషణునితో ఘన సంగ్రామము జేసి మఱిన్!
లక్ష్మణ వీరుని పైకి బోయెనూ బన్నుగ యావహమును జరుపన్! 27

సంగ్రామంబున బహు దీవ్రముగా బరగ రణము జేయుచునున్నా
సౌమిత్రియు నా యింద్రజిత్తులును సారవంతమగు బాణములన్,
అభివర్షించుచు నున్నవారలై యలరి గొట్టికొని రట్టియెడన్ 28

మహాబలులు మఱి తరస్వినులునూ మానుగ లక్ష్మణ యింద్రజితుల్
గ్రీష్మాంతంబున మేఘంబులచే మేల్మి సూర్యచంద్రులకు వలెన్,
శరజాలంబుల జేత వారలును సరగున గప్పగబడి రచటన్! 29

ఆవహమందున వారు జూపెడి హస్తలాఘవంబును గానీ,
చాపంబును గ్రహియించుటగానీ సరసత శరములు దీయుటయున్,
సంధించుట మఱి విడుచుటగానీ సరగున నారిని లాగుటయున్,
ధనుస్సు నారియు బాణంబులనూ దగ వాని విభాగములు మఱిన్,
బిడికిలి జేతను బట్టుటగానీ విడి లక్ష్యంబును జేరుటయున్

గానిపించుటయు లేదు యెవరికిని గాంచు వారలకు రణమందున్,
ఆ నర-రాక్షసు లిట్టి యుద్ధమును నలరి జేసి రా రణభూమిన్! 30-31

చాపవేగమున ప్రయుక్తంబులై శరముల సముదాయము జేతన్
అన్ని వైపులను నాకాశంబును నాక్రమించి యుండుట జేతన్
ప్రకాశింప లేదచటి రూపములు ప్రాదుర్భావమును లేదూ! 32

ఒక్కమాఱు లక్ష్మణుడు రాక్షసుని వనర యాక్రమించును వేగన్,
నొక్కమాఱు నా యింద్రజిత్తునూ నిక్కముగా నా లక్ష్మణునీ,
యాక్రమించి మఱి యుద్ధము జేయుచు నలరి వారటుల యుండగనూ,
జయాపజయముల విషయము నందున జయ మవ్యస్థితిలో నుండెన్! 33

ఆ లక్ష్మణుడును, యింద్రజిత్తునూ యలరి విడిచినా శరములచే
ఆకాశము లేకుండునట్లుగా నలరి జేయబడు నంబరమున్,
జీకటి జేతను నాక్రమింపబడి చిమ్మచీకటులు గమ్మె నటన్ 34

వారిరువురునూ విడిచినట్టి యా వాడియైన బాణములు మఱిన్,
వందలు వేలును బడుటచేత మఱి చింది పడుటజేతను నచటన్!
దిక్కులు, దిశలును బాణంబులచే దీరుగ వ్యాప్తము లయ్యె నటన్! 35

ఆవరించె చీకటి రణభూమిని మహా ప్రతిభయం బట గలిగెన్!
సహస్రాంశుడట యస్తమింపగా సకలము దమసులు వ్యాపింపన్!
రక్తప్రవాహము నదు లనేకములు రవలు జేయుచును బయనించెన్! 37

మాంస భక్షకములగు జంతువులును మఱి భయంకరముగా నపుడున్,
ధ్వనులు జేసినవి రోదనములతో దగ భీతిల్లగ పురజనముల్!
ఆ సమయంబున చల్లగాలులును నలరి వీచగను లేదచటన్,
అగ్నులు మండగలేదు హోమముల యతి భయంబునను రాక్షసునీ! 37

'లోకంబునకు స్వస్తి గావుతను!' లోలత ఋషులును బలికి రటన్,
గంధర్వులు, చారణులు, బన్నగులు, గడు భయంబునను నచ్చటికిన్,
నేమగునో మఱి యెవరు గెలుతురో యిమ్ముగ మది భావించుచునూ! 38

అటుబిమ్మట యా లక్ష్మణ వీరుడు నా రాక్షస సింహుని వేగన్,
కనకభూషణములును గలవియు మఱి గడు నల్లని రూపము గలవియున్,
నాలుగు హయముల నాల్గు బాణముల నయముగ విడిచెను సంధించి! 39

అటుబిమ్మట శ్రీమంతుడైన యా బటు వీరుండగు లక్ష్మణుడున్,
దనదు హస్త లాఘవమును జూపుచు దగ బంగారము దోడుతనూ!
వాడియైన మఱి ఱెక్కలు గలిగిన వనర కాంతులను గలిగిన యా
ఇంద్రుని వజ్రమునకు మఱి సమమును సాంద్ర శబ్దమును ధ్వనించెడి,
భల్లమనియెడి మఱియొక బాణము బన్నుగ ప్రయోగమును జేసి
సారధి శిరమును దేహము నుండియు సరగున వేఱుగ జేసె మఱిన్!40-41

సారధి హతమై బోవగ నంతట సరగున మండోదరి సుతుడున్,
మహాతేజమును గలిగినట్టి యా మానుగ యింద్రజితుండు మఱిన్,
తన రథంబు మఱి తానే స్వయముగ దగ సారధ్యము జేయుచునూ,
ధనుస్సు గూడను నుపయోగించెను దగ లక్ష్మణ వీరునిపైని! 43

ఆ సంగ్రామము నందు లక్ష్మణుని యతి సామర్థ్యము జతురతయున్
జూచువారలకు యత్యద్భుతముగ జూడ ముచ్చటగ యుండె నటన్!
హయములయందున న్యగ్రహస్తుడగు నాతని శరములచే గొట్టెన్,
మఱల ధనుస్సున వ్యగ్రము కాగా మానుగ యాతని హయములనూ
బాణంబులచే గొట్టెను నాతడు బటుతరమగు జాతుర్యముతో! 44

అతి శీఘ్రముగా బనులను జేసెడి యా లక్ష్మణుడు సమరమునన్
నిర్భయంబుగా సంచరించెడి నిశాచరుండగు నింద్రజితున్!
ఆ యవకాశములందు లక్ష్మణుడు నలరి బాణములచే గొట్టెన్! 45

రణమందున సారధి మరణించుట రావణాత్మజుడు గాంచి మఱిన్
సమరమునందున యుత్సాహంబును సరగున విడిచెను రాక్షసుడున్,
దిగులు జెందినా వాడగుచును మఱి దీనత జెందెను మదియందున్! 46

హరియూథపులును, వానరవీరులు నా సమయంబున రణమందున్,
దిగులు జెందినా యింద్రజితును గని దీనత నొందిన ముఖముగని!
సంతోషించుచు లక్ష్మణవీరుని చెంతజేరి పూజించి రటన్! 47

అటుబిమ్మట్టి మఱి ప్రమాది, రభసుడు చటుల ధీరుడగు శరభుండున్
గంధమాదనుడు నీ నలుపురునూ వింధ్యపర్వతవు నీడలుగా,
అతివేగంబును బ్రదర్శించిరీ యలరి యోర్పు లేకను వారున్! 48

సుమహావీర్యులు, భీమవిక్రములు సురుచిరముగ యా కపివీరుల్,
నలువురు యోధులు నొక్కసారిగా నయముగ శీఘ్రముగా నెగిరీ,
ఆ రాక్షసునీ మహాశ్వములపై నలరుచు వ్రాలిరి కేకలతో! 49

పర్వతములతో సమానమైనా బరువు గలిగినా కపియోధుల్
అధిష్టింపగా నా హయంబులును నడలి ముఖంబుల నుండియునూ,
ఎఱ్ఱని రక్తములను గ్రక్కుచును గిఱ్ఱున దిరుగుచు నేలబడెన్! 50

ఆ హయంబులును నలిగి తునిగి మఱి యడలి జీవములు గోల్పాయెన్!
నేలను బడినవి యా కపివీరులు నిలిచి యరదమును బడగొట్టీ,
మఱల వేగముగ బరుగెత్తుచునూ మానుగ సంతస మందుచునూ
లక్ష్మణ వీరుని పార్శ్వమునందున లాలితముగ నిలుచుండి రటన్! 51-52

సారధి మరణింపగను హయంబులును సరగున హతమగుటను గాంచీ
రావణాత్మజుడు నింద్రజిత్తునూ రయమున నేలకు దుమికి మఱిన్
బాణవర్షమును గుఱిపించుచునూ ప్రబలుడైన యా రాక్షసుడున్,
లక్ష్మణవీరుని పైకి బోయెనూ లావుగ గర్జించుచును మఱిన్! 53

అటుబిమ్మట యింద్రునితో సముడగు నాలక్ష్మణుడును వేగముగన్,
రథాశ్వములు మఱి గూలుటజేతను రహి సారథియును మరణింపన్,
కాలినడకపై పైకివచ్చెడీ కాలరాక్షసుని యింద్రజితున్,
బాణ జాలములచే వారించెను బన్నుగ ముందుకు రాకుండన్! 54

(యుద్ధకాండమునందు 89వ సర్గము సమాప్తము)

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### తొంబదియవ సర్గము

(ఇంద్రజిత్తు మఱియు లక్ష్మణుడు పోరాడుట—లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుట.)

రథాశ్వములు మఱి గూలుటజేతను రమ్యతేజమును గలిగిన యా
ధరణీతలమున నిలిచియున్న యా దారుణ నిశాచరుడు నప్పుడున్,
మహాగ్నులకు వలె ప్రకాశించెనూ మహాక్రోధమున జ్వలితుడై! 1

ధనుర్ధరులునై శరముల జేతను దారుణముగ వారొకరిన్
వధింపవలెనను దీవ్రకాంక్షతో వారిద్దఱు నా సమయమునన్
వనమునందు విజయము సాధింపగ వనగజములు బైటకు వెడలీ
పోరాడెడి గజములవలె నుండిరి పోరాడుచు నర రాక్షసులున్! 2

అన్నివైపులను యుద్ధము జేయుచు జెన్నుగ వానర రాక్షసులున్!
నశించుచున్నను బరస్పరంబును నయముగ వెనుకకు దిరుగకనూ!
తమ ప్రభువులతో గూడి యుండిరీ తత్పరులై యుద్ధమునందున్! 3

అటుబిమ్మట యా రావణాత్మజుడు నలరి సకల రాక్షసులను వే
సంతోషంబును గలుగజేయుచును సంస్తుతించుచును వారలనూ!
సంతసంబుననను నీవిధి బలికెను సకల రాక్షసుల గాంచుచునూ! 4

ప్రియమగు రాక్షసులారా! వినుడూ ప్రేమమీర నా వచనములన్
దిక్కులన్నియును జీకటితోడను దీరుగ వ్యాపించెను నిపుడున్!
తటవాడనియును బరుడనిగానీ దగ దెలియుడ లేదిపుడు మఱిన్! 5

మీరు వానరుల మోసగింపగా మిగుల ధైర్యమును గూడికొనీ!
రణరంగంబున యుద్ధము సేయుడు రయమున యా సమయమునందున్!
రథమునెక్కి నే రణభూమికినీ రణము సేయుటకు వచ్చెదనూ! 6

నగరమందు నే ప్రవేశింపగా నయముగ దురాత్ములగు వారున్!
నీ వనౌకసులు యుద్ధముజేయగ నిర్లక్ష్యంబుగ యుండునటుల్!
ఇంద్రజిత్తు వెనుకకు బోయెననీ సాంద్రముగా మది భావించీ!
నిస్సారముగా నుండునటులనూ నిశాచరులు! జేయుడు మీరున్! 7

అమిత్ర మర్దనుడైన యింద్రజిత్తు నావిధముగ బలుకుచు వేగన్!
వానరవీరుల వంచించియు మఱి వనరగ యాతడు రథమునకై!
లంకాపురమున బ్రవేశించెనూ శంక దక్కి మోసము జేయన్! 8

మహాతేజమును గలిగినట్టియును మహాత్ముడగు నా యింద్రజితూ!
రుచిరమైనదియు హేమ భూషితము సచిత్రములతో గూడినదీ!
ప్రాస ఖడ్గ బాణంబులజేతను బ్రబలాయుధముల గూడినదీ!
శ్రేష్ఠమైన హయముల గూడినదీ శ్రీకరమగు ధ్వజముల తోడన్!
గూడియున్నదియు యుత్తమసారథి కూర్మి హితము జెప్పెడి వాడున్!
గలిగిన యరదము సిద్ధముజేసీ గడగి బయలుదేరెను యనికిన్! 9-10

వీరుడైన మండోదరి సుతుడును వీరవరులతో గూడికొనీ!
రాక్షస గణముల గూడినవాడై రమ్యాయుధముల గూర్చికొనీ
కృతాంతబల చోదితుడై నంతట క్రూరకర్ముడగు నాతండున్!
నగరమునుండియు బయలువెడలెనూ నయముగ భయపడ భూతములున్!

శత్రుమర్దనుండైన యింద్రజితు సహచరులను మఱి గూడికొనీ!
నగరమునుండియు బయలు వెడలి మఱి నయముగ జవనాశ్వంబులచే!
గూడిన యరదము నెక్కి రణమునకు గూర్మి విభీషణ లక్ష్మణులన్
ఎదిరించుటకును రణభూమికినీ మది సంతసమున యరుదెంచెన్! 11-12

రథస్థుడగు నా రావణాత్మజుని రయమున గాంచియు లక్ష్మణుడున్!
మహావీరులగు వానరులును మఱి మానుగ విభీషణుడు గూడన్!
ధీమంతుండగు నా రాక్షసునీ తీవ్రమైన వేగంబునకున్!
చురుకుదనంబును గాంచి వారలును బరమ విస్మయము నంది రటన్! 13

యుద్ధమునందున సంక్రుద్ధుండై యుద్ధతుడగు నా యింద్రజితూ!
శరజాలంబున వానరవీరుల సరగున లెక్కకు మించియునూ!
వందలకొలదియు వేలకొలదియును జిందగ శౌర్యము రాక్షసుడున్!
వానర సేనానాయకులను మఱి వరుసను నేలను బడగొట్టెన్! 14

సమితింజయుడగు నింద్రజిత్తునూ సరగున తన చాపంబును వే
మండలీకృతము జేసి రాక్షసుడు మానుగ క్రోధము దోడుతనూ!
మహాలాఘవము ధోడుత కపులను మానుగ వధియించెను నపుడున్! 15

భయంకరములగు నారాచములను బన్నుగ చంపగ బడుచున్నన్!
భీమపరాక్రమమును గలిగిన యా భీతిలేని కపివీరులునూ!
ప్రజ ప్రజాపతిని శరణువేడినటు బన్నుగ యావానరు లపుడున్!
శరణుజొచ్చిరీ లక్ష్మణవీరుని కరములు మోడ్చియు దీనతనూ! 16

అటుపిమ్మట శ్రీరఘునందనుడును జటుల సమర క్రోధము తోడన్!
మండిపడుచు మఱి హస్తలాఘవము మెండుగ జూపుచు నట్టియెడన్!
నా రాక్షసు ఘనకార్ముకంబునూ యట్టె దునిమె తన శరములచే! 17

ఆ రాక్షసుడును త్వరితగతుండై యలరుచు మఱియొక కార్ముకమున్
సిద్ధ బఱచుకొని రణము నలుపుటకు సిద్ధంబాయెను రణమునకున్
కానీ లక్ష్మణ వీరుడంతటను గడిగి మూడు బాణంబులచే
ఆ కార్ముకమును గూడ విరిచెనూ యలరు దనదు చాతుర్యమునన్! 18

అటుపిమ్మట శ్రీ లక్ష్మణవీరుడు జటుల పరాక్రమ వంతుడునూ
ఆ మండోదరి సుతుని వేగముగ నలరు సర్ప విష సమానముల్!
ఐదు బాణముల ప్రయోగించియును నా రాక్షసు వక్షస్థలమందున్
దగులు నట్లుగా గొట్టెను వానిని దగ తన లాఘవమున వేగన్! 19

మహాకార్ముకము నుండి వెడలినా మహాశక్తి గల బాణములున్
ఆ రాక్షసు కాయము ఛేదించియు నలరి రక్తమున దడియుచునూ
యెఱ్ఱని సర్పంబులకు వోలెనూ యిమ్ముగ బడినవి రణభూమిన్! 20

విఱిగిన ధనుస్సు గలవాడగుచును విపరీతంబుగ వక్త్రిముచే
శోణితంబు నట నొలుకుచున్న యా శూరుడైన యా యింద్రజితూ!
పృథమగు నారియు గలిగినట్టియును గడు బలవత్తర మైనదియున్,
శ్రేష్ఠమైన మఱియొక కార్ముకమును శీఘ్రము నాతడు గైకొనియెన్! 21

ఆ రాక్షసుడును బరమ లాఘవము నాశ్రయించి బహు వేగముగన్
లక్ష్మణవీరుని యుద్దేశించియు లావుగ నల దేవేంద్రుడునూ;
వర్షంబును గురిపించినట్టులను వర్షించెను దన శరములచే! 22

అరిందముండగు లక్ష్మణ వీరుడు నల మండోదరిసుతు జేతన్
విడువబడినవియును దురాసదములగు విపుల బాణ సముదాయంబున్,
అసంభ్రాంతుడై యాలక్ష్మణుడును నా శతజాలము వారించెన్! 23

మహాతేజమును గలిగినట్టి యా మానుగ శ్రీ రఘునందనుడున్,
కంగారింతయు మదిని బొందకను సంగతిగా తన విక్రమమున్!
రావణాత్మజుడు నింద్రజిత్తునకు రహి జూపెను రణరంగమునన్
ఆ విక్రమమును జూచు వారలకు నాశ్చర్యంబుగ యుండె నటన్! 24

అటువిమ్మట యా రఘునందనుడును చటుల గోపమున చూర్ణుండై
శీఘ్రాస్త్రములను బ్రయోగించుచును శీఘ్రము రాక్షస సంఘంబున్,
ఒక్కొక్కనినీ మూడుబాణముల వొనరగ గొట్టెను రణమందున్!
రాక్షసేంద్రసుతుడును బహు చతురత రయమున శరజాలము విడిచీ
అనేక వానర వీర నాయకుల యలమటింప జేసెను యనిలో! 24-26

శత్రుమర్దనుడు బలవంతుండును శత్రువైన లక్ష్మణు జేతన్
గొట్టబడిన యా యింద్రజిత్తునూ కూరిమి సుమిత్రనందనునీ
అనేక విధముల వాడి బాణముల యలరుచు గొట్టెను దీవ్రముగన్!.. 27

పరవీరులనూ సంహరించెడి బరగసుమిత్రా నందనుడున్.
నా శరజాలము రాకుండగనే నడ్డుకొనుచు గణువులు గలిగీ.
భల్లబాణముల జేత యింద్రజితు బన్నుగ రథసారథి నవుడున్
దేహమునుండీ శీర్షంబును మఱి ధీరుగ వేఱుగ జేసె నటన్ 28

సారథిలేని యా హయంబులును సరగున యవ్యాకులములునై
మండలముల బరుగెత్తుచున్నవై ఘనముగ వహించె యరదమునూ!
జూచువారలకు నాశ్చర్యముగా జోద్యము నద్భుత మనిపించెన్! 29

దృఢవిక్రముడగు నా సౌమిత్రియు దిరముగ క్రోధము నందుచునూ,
యారణరంగము నందు నాతడును నా హయముల నదిలించుటకై,
బాణంబుల సంధించి వదిలెనూ, బటుతరమగు నా హయములపై! 30

రావణు సుతుడగు నింద్రజిత్తునూ రణమున లక్ష్మణు కార్యంబున్
సహింపజాలక యమర్షుండునగు సౌమిత్రిని వడి బాణములన్!
మహావేగమున విడిచెను పావని మానుగ తీవ్ర సువేగముగన్! 31

ఆ రాక్షసుడును బ్రయోగించినా యతి తీవ్రమునగు వజ్రముతో
సర్పవిషముతో సమానమైనా సరగున యా శరజాలంబున్,
కాంచన ప్రభలును గలుగు కవచమును నంచితముగ స్పృశియించుచునూ
విలయంబును బొందిన నా శరములు విరిగి నేలబడి పోయినవీ! 32

రావణాత్మజుడు నింద్రజిత్తునూ రయమున లక్ష్మణు కవచంబున్
వభేద్య కవచంబని మది దలచుచు నతికోపము గల వాడగుచున్!
నస్త్ర ప్రయోగమునందు జతురతను నలరి ప్రదర్శించుచు నతడున్,
సుపుంఖములుగల మూడు బాణముల సూటిగ లక్ష్మణు లలాటమున్,
దగులునట్లుగా విడిచెను శరముల దగ ధనుస్సునూ సంధించీ! 34

సమరశ్లాఘియగు రఘునందనుడు సరసత లలాట మందుసనూ,
నాటియున్న మూడగు శరములతో నయముగ మూడగు శిఖరంబుల్,
గలిగియున్న పర్వతమును వోలెను గదనరంగమున రాజిల్లెన్! 35

అంతట సంగ్రామంబునందునను నారాక్షసుచే గొట్టబడీ
యా లక్ష్మణుడును గ్రోధముతోడను నతివేగంబున చాపమునన్,
రణరంగంబున మండోదరి సుతు రమ్యమైన శుభకుండలముల్!
గలిగిన యాతని వదనమునందున గడగి యైదు బాణంబులనూ!
సూటిగ విడిచెను బహు దీవ్రముగా శూరుడైన యా లక్ష్మణుడున్! 36

వీరులు, ఘనబల శరాస్త్రజ్ఞులునూ, విపుల యశస్సును గలవారున్!
భయంకరంబగు విక్రమవంతులు బరగ లక్ష్మణుడు నింద్రజితుల్!
విశిఖంబులు నగు బాణంబులచే వీరవిహారము జేసిరటన్! 37

అటుబిమ్మట శోణిత దిగ్ధాంగులు జటుల బరాక్రమ వంతులునూ!
యాలక్ష్మణుడును, రావణాత్మజుడు నలరు నింద్రజిత్తులు నపుడున్!
పుష్పించిన మోదుగ వృక్షములను బోలె విరాజిల్లిరి నపుడున్! 38

జయమునందు నిశ్చయమును గలిగిన జయశూరులు నగు నిరువురునూ!
పరస్పరంబును సమీపించి మఱి బటు ఘన శరజాలంబులచే
అంగాంగంబుల గొట్టికొనిరి మఱి యంగారక బుధ గ్రహములనన్! 39

అటుబిమ్మట యా యింద్రజిత్తునూ జటుల యుద్ధ కోపంబుననూ!
శుభకరమగు వదనంబు నందునను శూరుడైన యా విభీషణున్!
మూడు బాణములజేత గొట్టెనూ మునిగి పోవగా వేదననూ! 40

అంతట యా రావణు తనూజుడును సుంత భయంబును లేకయునూ,
రాక్షసేంద్రుడగు విభీషణుని మఱి రయమున మూడగు బాణములన్!
గొట్టి సకల వానర యూథపులను గూరిమి యొక్కొక బాణముచే
గాయబఱచె నట వారల నందఱ గడు వేదనయును నందగనూ! 41

మహాతేజమును గల విభీషణుడు మానుగ గోపించియు మిగులన్!
దురాత్ముడగు నా యింద్రజిత్తు రథ దురాసదంబగు హయములనూ!
తన ఘన గద జేతను వధించెనూ దగ రాక్షసుడును వెఱగందన్! 42

మహాతేజుడగు నింద్రజితుండును మానుగ రథసారధి మఱియున్!
మహాశ్వంబులును మరణించుటచే మఱి గత్యంతరమును లేకన్!
అరదమునుండియు దిగి వేగముగా నట బినతండ్రిని దునుమాడన్!
శక్తిని విడిచెను శరవేగముగా చాపంబున సంధించి మఱిన్! 43

ఆ సుమిత్ర యానందవర్ధనుడు నడరి వచ్చి బడుచుండిన యా
శక్తిని గాంచీ నిశిత బాణముల సరగున భేదించెను దానిన్!
పదిముక్కలుగా నేలపై బడెను బటుతరమగు నా శక్తియునూ! 44

దృఢమగు శరీరమును గలవాడును ధీరుడు విభీషణుడు నంతన్!
జంపబడిన హయములు గలవానిని వంపగరానీ యింద్రజితున్!
వజ్రసమానములైన బాణముల వనరగ యైదింటిని వేగన్!
వక్షస్థలమున నాటునట్లుగా వనరగ గొట్టెను దీవ్రముగన్! 45

లక్ష్యములను ఛేదించు నట్టివియు లావగు బంగరు పొన్నులునూ.
ఆబాణంబులు నతని కాయమును నటు భేదించియు భీమగతిన్!
రక్తముజేతను బూయబడినవై రమ్యారుణ సర్పముల వలెన్!
నేలపై బడియె నిఖిల రాక్షసులు నిలిచి జూచుచుండగ యచటన్! 46

రావణ తనూజుడగు నింద్రజితుడు రహి పినతండ్రిని నిరసించీ!
మహాకోపమున బెదవులు గొఱుకుచు మహారాక్షసుల మధ్యమునన్!
యమదత్తంబగు మహాబలముగల నతిశ్రేష్ఠంబగు బాణంబున్!
గ్రహించి విడిచెను దన చాపంబున గడు చతురత సంధించి మఱిన్! 47

మహాతేజుడును భీమవిక్రముడు మానుగ సుమిత్ర నందనుడున్!
ఆ రాక్షసుచే సంధింపగబడి యలరి వచ్చు శరమునుగాంచీ!
మఱియొక శ్రేష్ఠంబగు బాణంబును మానుగ గ్రహించె వేగముగన్! 48

లక్ష్మణుండు జేపట్టిన బాణము లాలితముగ యా కుబేరుడున్
స్వప్నమందు మఱి దర్శనమిచ్చి స్వయముగ బహూకరించినదీ!
సురాసురలచే జయింపరానిది దుర్జయ మయ్యది లోకములన్,
అట్టి శరంబును విడిచె లక్ష్మణుడు నా బాణంబును ఛేదింపన్! 49

పరిఘుల వంటి మహాబాహువుల బన్నుగ లాగగ బడినట్టి
ఆ లక్ష్మణునీ యింద్రజిత్తులా నలరు శ్రేష్ఠమగు చాపములున్,
ధ్వనులు జేసినవి మిన్నులు మ్రోవగ దగ క్రౌంచంబుల ధ్వనుల వలెన్! 50

ఆ వీరులచే నా సమయంబున నలరు శ్రేష్ఠముగు జాపములన్
సంధింపగబడి లాగబడిన యా సరసత యాశరములు రెండున్
హోమవేదికను యగ్నుల వలెనూ విమల ప్రకాశము నందినవీ! 51

మహాకార్ముకముల నుండి జారినా మానుగ యా శరములు రెండున్,
అంబరమున మఱి ప్రజ్వరిల్లుచును అంబ వక్త్రి నాల్కల వోలెన్,
ముఖముజేత మఱి ముఖమును గొట్టీ ముదిత సంధ్య ముఖమును బోలెన్,
కాంతివంత నంఘర్షణ నొందెను కాంతి చింతనిప్పులు రాలన్! 52

భయంకరంబగు నాకారముగల బన్నుగ యా బాణంబులయున్,
సంఘర్షణమున సధూమంబుతో సరగున యగ్నులు రాలెనటన్!
దానివలన బుట్టిన జ్వాలయునూ దగ భయంకరముగా నుండెన్! 53

మహాగ్రహంబుల సమానంబులగు మానుగ యాశరములు రెండున్,
ఆవహ రంగమునందు రెండునూ యన్యోన్యము ఢీకొనియు మఱిన్,
నూఱు ముక్కలై రెండు శరములును నుర్విపైని బడిపోయినవీ! 54

ఆ సమయంబున వారిరువురునూ యా లక్ష్మణుడును నింద్రజితూ!
రణాగ్ర భాగమునందు గొట్టబడి రయమున ధాత్రిని బడినట్టి!
తమ మహాశరంబుల గాంచియునూ దగ పీడితులై వారలునూ!
మహారోషమును బొందిరి వారలు మహాయుద్ధ రంగము నందున్! 55

సౌమిత్రియు బహు సంరబ్ధుండై మానుగ దారుణ యంత్రమునూ,
గ్రహించి విడిచెను యింద్రజిత్తుపై ఘనచాపంబున సంధించీ,
యుద్ధ విష్టితుండైన శక్రజితు యుద్ధమునందున వేగముగన్
రౌద్రాస్త్రంబును సృజించె నంతట రయమున విడిచెను లక్ష్మణుపై! 56

రౌద్రాస్త్రముచే బరమాద్భుతమగు రయమున దారుణ యస్త్రంబున్
గొట్టివేయబడె రాక్షసులందఱు గూరిమి జయధ్వనులును జేయన్!
అటుబిమ్మట యా సమితింజయుడగు జటులవిక్రముడు నింద్రజితూ!
సకలలోకముల నశింపగజేయగ సంసిద్ధుడునై నట్లుగనూ!
ఆగ్నేయాస్త్రము సంధించెను మఱి యలరు దనదు ఘనచాపమునన్! 57-58

ధీరుడైన యాలక్ష్మణవీరుడు ధీరత సూర్యాస్త్రము జేతన్
ఆగ్నేయాస్త్రము నివారించెనూ యలరు దనదు చాతుర్యముతో,
తాను విడిచినా యస్త్రంబును మఱి దగ వారించుటయును గాంచీ,

క్రోధావిష్టుండై రాక్షసుడును గూర్మి శత్రుపుంఖ జీల్చెడిదీ,
నిశితమైన యొక యసురాస్త్రంబును నిర్జరవైరియు సంధించెన్! 59

ఆసమయంబున చాపమునుండీ యలరి ప్రజ్వరిలుచున్నట్టి,
కూటముద్గరంబులు, శూలంబులు గూరిమి భుశుండులును మఱియున్
ఘనమగు గదలును, గంద్రగొడ్డళులు ఖడ్గంబులు వెడలిన వపుడున్! 60

దుష్టపమంచమండగు లక్ష్మణవీరుడు నతిదారుణముగ రణమందున్,
సుదారుణంబును సకలభూతముల నూటిగ నాశము జేయునదీ,
నివారింప శక్యముగానిదియును నిఖిల శస్త్రముల జీల్చునదీ
దారుణమగు నా యస్త్రముగాంచి దగ లక్ష్మణుడును వేవేంటన్,
మహేశ్వరాస్త్రము ప్రయోగించి మఱి మానుగ దానిని వారించెన్! 61-62

వారిరువురికినీ రోమాంచమునూ వనరగ యద్భుత మైనట్టి
రణరంగంబున యుద్ధము జరిగెను రయమున దివిజులు దిలకింపన్,
గగనమందుగల భూతంబులుమా గాంచి నిలిచె వారల జుట్టున్! 63

ఆ వానర రాక్షసుల మధ్యమా నలరి భయంకర ధ్వని తోడన్,
జరుగుచున్న యుద్ధంబును గాంచీ సరగున యాశ్చర్యము తోడన్,
ఆవరింపబడె యాకాశంబును నలరు భూత గణముల తోడన్! 64

మునులు ఋషులు మఱి పితృదేవతలు మోదమునను దిథిజులు గరుడుల్,
గంధర్వులు, సురగులు, కిన్నెరలును జిందుచు నాశీస్సుల తోడన్,
సురరాజగు నింద్రుని ముందిడుకుని శూరుడైన యా లక్ష్మణునీ,
సమరమునందున జాగరూకులై సంరక్షించిరి యార్ద్రితతో! 65

అటుబిమ్మట యా రాఘవానుజుడు చటుల హుతాశన సమమైనా
స్వర్ణగలదియును నింద్రజిత్తునూ సరగున దారుణమైనదియున్!
మఱియొక బటుతరమైన బాణమును మానుగ సంధించెను వింటన్! 66

ధీరుడైన యా లక్ష్మణవీరుడు ధరియించిన చాపమునందున్
గూర్చినట్టి యా మహాశరంబును గూరిమి రెక్కలతో గూడీ
అనువృత్తంబగు నాకారముతో నందమైన పుంఖంబులతో

సుసంస్థితంబును సువర్ణ వికృతి సూటిగ యంతము జేయునదీ,
దురావారమును దుర్విషహమునూ దుర్మతులగు రాక్షసులకునూ,
భయమును గలిగించునది మఱియును బాధను గలిగించెడిది మఱిన్!
సర్ప విషముతో సమానమైనది సరసత దివిజుల జేత మఱిన్,
సమర్పితంబగు నా బాణంబును సౌమిత్రియు సంధించె నటన్! 67-68

ధీరవిక్రముడు హరివాహనుడును దివ్యతేజమును గలవాడున్,
దేవాసుర యుద్ధంబున పూర్వము దివిజవల్లభుడు నింద్రుడునూ!
యేశరమున దానవులను జంపీ యిమ్ముగ గాంచెనొ విజయంబున్,
ఆ బాణంబును లక్ష్మణవీరుడు నలరి చాపమున సంధించెన్. 69

సౌమిత్రియు శోభావంతుండును సలక్షణుండగు లక్ష్మణుచున్
నావహమందున యపరాజితమగు నైంద్రాస్త్రంబును వేగముగన్
శ్రేష్టమైన శరమందున గూర్చియు శ్రీకరమగు కార్ముకమందున్
సంధించియు లాగుచు దన కార్యము సాధించెడి వాక్యము బలికెన్! 70

దశరథ కుమారుడైన రాఘవుడు ధర్మాత్ముండగుచో మఱియున్
సత్యసంధుడగుచో మఱి జగమున సాటిలేని వీరుండగుచో!
ఓ శరమా! యీ యింద్రజిత్తునీ యొనరగ వధియింపుము వేగన్! 71

ధీరుడైన యా రాఘవానుజుడు ధీరత యీ విధమున బలికీ
యజిహ్మగంబగు బాణంబును మఱి యాకర్ణాంతము లాగి మఱిన్!
ఇంద్రజిత్తుపై ప్రయోగించెనూ సాంద్ర లాఘవము దోడుతనూ! 72

పరవీరుల సంహారము జేసెడి బరగ సుమిత్రానందనుడున్,
ఐంద్రాస్త్రమును గూర్చి శరంబును నలరు శిరస్త్రాణము తోడన్!
శోభాయుక్తములగు కుండలములు శోభన మగు నా శిరస్సునూ!
ఛేదించియు మండోదరి సుతునీ శీఘ్రము కాయము నుండియునూ
వేఱుజేసి మఱి మహీతలంబున వేగముగను దొరలగ జేసెన్! 74

ఛిన్నస్కంధపై పదిరోక్షితమును భీకర రాక్షస తనూజునీ,
మహత్తరంబగు నా శిరస్సునూ మానుగ సువర్ణ మయమైనా,

ముద్దవోలె నట గనబడుచుండెను నిద్దరిత్రి యాభరణముగా!
అటుబిమ్మట కవచము గలవాడును నలరు శిరస్త్రాణము గలిగి
విసరివేయబడి నట్టి ధనుస్సును వికట రాక్షసుడు నింద్రజితూ!
చంపబడినవాడై రణభూమిని బంపబడెను యమక్షయమునకున్! 76

అటుబిమ్మట యా విభీషణునితో నటగల వానర వీడులునూ
రావణాత్మజుండైన యింద్రజితు రహి వధింపబడినంతటనూ!
వృత్రాసుర వధయందు దేవతలు ప్రీతిని సంతస మందినటుల్!
వారును గూడను సంతోషించిరి వధింపబడుటను రాక్షసుడున్! 77

అటుబిమ్మట మఱి యంతరిక్షమున యటగల భూతంబులు గూడన్
మహాత్ములగు నా ఋషులు మునులు మఱి మానుగగంధర్వులుమఱియున్,
అప్సరసలు మఱి కింపురుషాదులు నట జేసిరి జయజయ ధ్వనులున్!

రాక్షస సంబంధము నగు సైన్యము రమ్యవిజయమును గూడిన యా
హరివీరులచే గొట్టబడుచునూ నా మండోదరి సుతు డంతన్!
వధియింపగ బడి నేలబడుటచే వనరగ భయభీతిని జెందీ
నాల్గుదిక్కులకు బరుగులు దీసెను రయముగ యాయుధములు నొదిలీ!

ఆ రాక్షసులును గపివీరులచే నావిధి వధింపబడువారై
శస్త్రములను రణభూమిని విడిచి భ్రష్ట సంజ్ఞ గలవారగుచున్,
బరుగులు దీయుచు లంకవైపునకు పారిపోయి రా సమయమునన్! 80

భయపడిపోయిన రాక్షసు లందఱు బలువిధముల యాయుధములనూ
పట్టిసముల మఱి గండ్రగొడ్డళుల బన్నుగ ఖడ్గంబుల విడిచీ
దిక్కుల బట్టియు పారిపోయిరీ దీనత జెందియు రణమందున్! 81

కపివీరులచే బీడింపగబడి గడు భీతిని యారాక్షసులున్,
లంకాపురిలో ప్రవేశించిరీ వంకర దారుల బయనించీ
కొందఱు రాక్షసులును బరుగెత్తుచు గందుచ సంద్రములో బడిరీ,
పర్వతముల మఱి యాశ్రయించిరీ బరగ రాక్షసుల గొందఱునూ! 82

రణరంగమున జంపబడియునూ రణభూమిని శయనించిన యా
రావణాత్మజుడు నింద్రజిత్తునూ రహి గాంచియు యా మొండెమునూ
వేఁకౌలదిగల రాక్షససైన్యము విడిచి యుద్ధభూమిని వారున్,
నొక్కడు గూడను నిలువకుండగా జక్కగబోయిరి లంకకునూ! 83

ఆదిత్యుడు మఱి యస్తమింపగా నలరు కిరణములు గనబడకన్
మాయములగునో యా విధముగనే మూసుగ యింద్రజితుండు మఱిన్
వధింపగాబడి నేలబడియెనో పనరగ రాక్షసులందఱునూ
రణభూమిని మఱి మాయమైరిగా రహి యెవ్వరికిని దెలియకనూ! 84

విగతజీవుడై జారపడిచినా వికటమైన యవయవములతో
మహాబాహువగు నింద్రజిత్తునూ మూసుగ రణభూమిని జూడన్
శాంతించిన కిరణములను గలిగిన కాంతిలేని సూర్యునివలెనూ
యారిపోయినా యగ్నికి వోలెను యాతడు నేలను బడియుండెన్! 85

అట్టిసమయమున రాక్షసేంద్రసుతు డిట్టె గతించిన లోకమునన్
మహాశత్రువును నశించినటులను మహాపీడ దొలగిన యటులన్
సంతసంబు మఱి వెల్లివిరిసినది సకలమైన భూతంబులకున్! 86

పాపకర్ముడగు నా రాక్షసుడును బన్నుగ నిహతుండగుచుండన్,
భగవంతుండగు నేవేంద్రుండును బన్నుగ మహర్షులను గూడి
సంతోషంబును బొందె నంతటను సకల పీడ తొలగిన యటులన్

అంబరమందున దివిజుల దుందుభి సంబరమున వినబడె నంతన్
నాట్యము జేసెడి యప్సర వనితల నయ నిస్వనములు వినబడియెన్
మహాత్ములగు గంధర్వుల పాటల మధుర స్వనంబులు వినబడియెన్ 88

క్రూరకర్ముడగు రాక్షసు డంతట కుదురుగ రణమున హతుడగుటన్
దివిజులు సౌమిత్రిని స్తుతియించుచు దీరుగ పువ్వుల వాసలనూ
కురిపించిరి లక్ష్మణునిపైని మఱి కూరిమి సంతసమున దేలి!
ఆశ్చర్యంబుగ నుండెను నచ్చట యట్టి పుష్పవృష్టియు బడుటన్! 89

లోకభయంకరుడగు రాక్షసు డట లీలత వధియింపగబడగన్
నుదకంబులును ప్రశాంతములయ్యెను నుర్వియు బుష్పంబులు బూచెన్!
ఆకాశంబును నిర్మలమైనది సలరిరి సురలును దానవులున్,
నా ప్రదేశమునకు వచ్చిరి వారలు సట్టి యద్భుతము దిలకింపన్! 90

దేవదానవులు గంధర్వులుసూ దీరుగ సంతుష్టులు నగుచున్!
శాంత కలుషులై బ్రాహ్మణు లింకను సంతసించెదరు గాత మఱిన్
భయము నాపదలు లేనివారలై బన్నుగ జీవింతురు గాతన్
అనుచు బలికిరీ వారలందఱును నతి శుభకరమగు వాక్కులనూ! 91

అటుబిమ్మట సంగ్రామమునందున యప్రతిబలుడగు రాక్షసుడున్
వధింపబడుటయును గని కపివీరులు వనరగ గాంచియు యోధవులున్
బహు సంతోషమునంది లక్ష్మణుని బన్నుగ యభినందించి రటన్! 92

విభీషణుండును హనుమంతుడును వీరుడు భల్లూకంబులకున్
ప్రభువు జాంబవంతుడును గూడి బన్నుగ సుమిత్ర నందనునీ,
విజయము జేతను నభినందించిరి విమల స్తుతులు గావించి రటన్! 93

లబ్ధ లక్ష్యులగు ప్లవంగవీరులు లావుగ గంతులు వేయుచునూ
సింహనాదములు జేయుచు నెగురుచు జిఱుగంతులతో దొరలుచునూ!
సౌమిత్రీనందను జుట్టును మఱి సరనత నిలుచుండిరి వారున్! 94

ఆ సమయంబున వానర వీరులు నలరు వాలముల నెత్తి మఱిన్
నేలగొట్టుచును, జబ్బలు జఱచుచు నిగిడి ముఖములను నెత్తుచునూ!
రాముని తమ్ముడు లక్ష్మణవీరుడు రహి జయమును గొనుచున్నాడూ!
యనుచు బలికిరీ యా కపివీరులు నంబరమంతయు ధ్వనియింపన్! 95

అంతట వానర వీరులందఱును నానందంబును బొందుచునూ
అన్యోన్యంబును గౌగలించుకొని యాలక్ష్మణు గూర్చిన గాథల్,
వివిధ గుణములను వివిధ ఘట్టముల విస్తృతముగ కీర్తించి రటన్! 06

అ సమయంబున దేవతలందరు నా దశగ్రీవుని కుమారుడున్,
ఇంద్రజిత్తు రణమున హతుడగుటను సాంద్ర శుభకరము వార్త విని,
తమ ప్రియమిత్రుడు లక్ష్మణ వీరుని దగ దుర్లభమగు కర్మంబున్,
రణరంగంబున జూచి వారలును రహి సంతుష్టులునై యపుడున్,
మహదానందము బొందిరి వారలు మానుగ గురిసిరి పూవానల్! 97

[యుద్ధకాండమునందు 90వ సర్గము సమాప్తము]

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధా లహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### తొంబది యొకటవ సర్గము

(లక్ష్మణ విభీషణాదులు రాముని వద్దకు వచ్చి యింద్రజిత్తు వధ వృత్తాంతమును దెలుపుట—రాముడు సంతోషించి లక్ష్మణుని కౌగలించుకొనుట—సుషేణుడు లక్ష్మణాదులకు చికిత్స జేయుట)

రుధిర క్లిన్నమగు గాత్రంబును మఱి రూఢమైన గాయంబులునూ
గలిగినట్టి యా లక్ష్మణవీరుడు కదనమందు నా యింద్రజితున్,
సంహరించియును వీరోచితముగ సంతోషంబును నందె నటన్! 1

ఆటుపిమ్మట యా వీర్యవంతుడును జటుల తేజుడగు లక్ష్మణుతోన్,
హనుమంతునకును జాంబవంతునకు నటగల వానర వీరులకున్,
నమస్కరించుచు వారల నందఱ నయముగ వెనుకను మఱల్చుచున్,
విభీషణుని మఱి వాయుపుత్రుడగు వీరుడైన హనుమంతు మఱిన్,
నూతగా గొనుచు రామసుగ్రీవులు నున్న స్థలంబునకును జనియెన్! 2-3

అటుబిమ్మట యా లక్ష్మణవీరుడు నటగల శ్రీరఘు నందనుడౌ
రామచంద్రుని సమీపించి మఱి రయమున యభివందనములతో!
ఇంద్రుని సమీపమున యుపేంద్రువలె సాంద్రబలుండగు లక్ష్మణుడున్
ఆ సోదరుని సమీపమునందున నట జని నిలిచెను నంజలితో! 4

వీరుడైన యా లక్ష్మణు డంతట విమల యశస్కుఁడు రాఘవువి,
సమీప్యంబునకు జెంది నెమ్మదిగ సహజ గభీరత విడనాడి,
అస్పష్టముగా బలుకు బలుకుచును నల మండోదరి సుతు వధనూ
విన్నవించెనూ నాసాంతముగా విపులమైన సంగ్రామమునూ! 5

ఆ సమయంబున విభీషణుండును నలరుచు రామునితో బలికెన్,
సంతోషించుచు బహు స్పష్టముగా జెంతజేరి యీ విధముగనూ!
మహాత్ముడగు లక్ష్మణవీరునిచే మానుగ రావణసుతు శిరసున్
ఖండింపగ బడినది రణమందున చండ యాహవము నందుననూ 6

మహావీర్యుడగు రామచంద్రుడును మానుగ సుమిత్రనందనుచే
నింద్రజిత్తువధ వృత్తాంతము విని సాంద్రప్రహర్షము నొంది మఱిన్!
ఈ వాక్యంబును గూడ బలికెనూ యిమ్ముగ లక్ష్మణు గాంచుచునూ! 7

మంచిపనియు జేసితివి లక్ష్మణా! యంచితముగ సంతుష్టుడనూ!
అసదృశమగు ఘన కార్యంబును మఱి యలరి జేసితివి నీవిపుడున్,
రావణాత్మజుని సంహారముచే రహి మనకును విజయంబు నికన్,
లభియించినదని నమ్ము లక్ష్మణా! లాలితముగ నిశ్చయ మిపుడున్! 8

వీర్యవంతుడగు రామచంద్రుడును విమల కీర్తివర్ధనుడైనా
లక్ష్మణ వీర్యుని శిరమును మూర్కొని లజ్జితుడగుచున్నను నతడున్,
బలాత్కారముగా వాత్సల్యముతో బన్నుగ యంకమునందుననూ!
యారోపింపగజేసి సోదరుని యలరుచు గూర్చుండగజేసి,
కౌగలించుకొని స్నేహపూర్వకము గాంచెను మాటికి మాటికినీ! 11

వరశ్రేష్ఠుండగు రామచంద్రుడును నయముగ శల్య సంపీడితుడున్,
శత్రువుజేతను బాధింపగ బడి నేత్రముననను నిట్టూర్చుచునూ!

దుఃఖముచే సంతాపితుండునూ ఘోరముగా నిశ్వాసితునీ
లక్షణవంతుండైన లక్ష్మణుని లాలితముగ యాతని శిరసున్,
వాసనజూచుచు శరీరమంతయు వనరగ ప్రీతి స్పృశించుచునూ!
యూరడించి సంభ్రమమును జెందుచు సరగున యీ రీతిగ బలికెన్! 12

దుష్కరమైనది మంగళకరమును దోర్బల కర్మము జేసితివీ,
మహావీర్యుడగు పుత్రు డింద్రజితు మానుగ మరణించుట జేతన్!
ఆవహమందున రావణాసురుని యలరి చంపబడు వానినిగా
దలచుకుంటినీ సౌమిత్రీ! మఱి దగ విజయము గలిగిన యటులన్! 13

దురాత్ముడగు నా శత్రువు నేడట దురమున వధియించుట జేతన్
విజయ వంతుడను నైతిని నే నిక వీరలక్ష్మణా! నీవలనన్,
సమరమునందున యా దశగ్రీవుని సరగున దక్షిణ బాహువునూ
నఱికి వేసితివి! యతడే కద మఱి నయముగ యా దశగ్రీవునకున్!

ఆశ్రయంబు మఱి యాధారంబును నాఅవప్రాణము నాతనికిన్!
ఆవహమందున విభీషణుండును హనుమంతుడును గపివీరుల్
మహత్కార్యమును జేసి రనుచునూ మానుగ దలచెద రణమందున్! 15

వీరుడైన యా యింద్రజిత్తునూ వీరోచితముగ మఱి నీవున్,
అహోరాత్రములు మూడింటను యని యలసిపోక బోరాడితివీ!
దేవశత్రువును వధించితివి మఱి దివిజులు మెచ్చగ సౌమిత్రీ!
శత్రువు లింకను లేకుండను నే మిత్ర! చేయబడితిని నేడున్!
పుత్రు డింద్రజితు మరణించుట విని బొలుపుగ సేనావాహినితో,
బయలు దేరి రావచ్చుగదా మఱి బన్నుగ వధియింతును నతనిన్! 16

పుత్రుని వధచే సంతాపితుడగు బొలుపుగ వచ్చెడి వాడు మఱిన్,
దుర్జయుడగు నా రావణాసురుని దోర్బలమున రణరంగమునన్,
అపూర్వమగు నా శర జాలముచే నడ్డగించి వధియించెదనూ! 17

నాకు రక్షకుడవైన లక్ష్మణా! నయముగ రణరంగము నందున్
రావణాత్మజుడు నింద్రజిత్తునూ రహి సంహారము జేసితివీ!

ఇంక నాకు నా జనకనందినియు నింకయు నీ ధాత్రియుగానీ,
యంద శక్యమును కానిదికాదూ! నందగలను సర్వస్వమునూ! 18

రఘువంశంబున జన్మించిన యా రామచంద్రుడును శీఘ్రముగా
సోదరుడగు లక్ష్మణ కుమారునీ సురుచిరముగ యోదార్చి మఱిన్,
కౌగలించుకొని సంతోషించుచు గడు వేగముగా సుషేణునిన్
బిలిపించియు సౌమిత్రిని జూపుచు ప్రీతితోని యీ విధి బలికెన్! 19

మహాప్రాజ్ఞుడును మిత్ర వత్సలుడు మానుగ లక్ష్మణ వీరుండున్,
శరీరమంతయు శల్యంబులతో సహజ శక్తి మఱి గోల్పోయెన్
బూర్తి స్వస్థుడగునట్లు జేయుమా! బొలుపుగ గాయములను మాన్పి! 20

వెనువెంటనె లక్ష్మణ వీరునికిని, విభీషణునికిని తీవ్రముగా
గ్రుచ్చుకొనిన శల్యంబుల నన్నిటి కూరిమి దూరము జేయవలెన్!
వానర భల్లూకంబుల సైన్యము వనరగ వృక్షంబులతోడన్!

రణము సలిపిరో శరీరములలో రహి శల్యంబులు నాటినవో
గాయపడియు శోణితమును నొలుకుచు గడు వేదన నొందిరొ వారున్!
ప్రయత్నపూర్వముగా జికిత్సయును బన్నుగ జేయుము! స్వస్థులుగన్!

రాఘవుచే నాజ్ఞాపింపగ బడి రయమున మహాత్ముడైనట్టి
హరియూథపుడగు సుషేణు డంతట నటు సుమిత్ర నందను గొఱకున్!
నాశిక నుండియు బరమౌషధమును నయముగ యిచ్చెను శీఘ్రముగన్! 23

ఆ సమయంబున యా సౌమిత్రియు యా యౌషధ గంధంబు మఱిన్!
నాఘ్రాణించియు నా వెనువెంటనె యతని శరీరమునందలి యా
శల్యము లన్నియు దొలగి పోయెనూ సరగున వేదనయును దగ్గెన్!
గాయము లన్నియు మానిపోయినవి కమ్మని స్వస్థత జేకూరెన్! 24

అటు బిమ్మట రాఘవుని యాజ్ఞనూ యావిభీషణుడు మొదలైనా
సమస్త వానర నాయకులకునూ సరగున జేసెను జికిత్సయున్!
స్వస్థుల జేసెను వారల నందఱ సకల బాధలను వారించెన్! 25

అటువిమ్మట యా లక్ష్మణ ధీరుడు నల శల్యంబులు దొలగినవై!
పోయిన యలసట గలవాడగుచును బోయిన వేదన గలవాడై!
క్షణకాలముతో స్వస్థత నందెను సంతోషముతో నుండె నటన్! 26

ఆ సమయంబున రామచంద్రుడును నల కపిరాజగు రవిసుతుడున్!
వీర్యవంతుడగు విభీషణుండును వీర విక్రముం డగునట్టి!
ఋక్షనాయకుడు జాంబవంతుడును భీషణమగు సైన్యంబులతో!
వేదన లేకను లక్ష్మణవీరుడు విమల భావమున నుండుటయున్!
గాంచి యందఱును సంతోషించిరి యంచితముగ యానందంబున్! 27

మహాత్ముడగు నా దశరథరాముడు మహావీరుడగు లక్ష్మణునీ!
సుదుష్కరంబగు ఘనకార్యంబును సురుచిరముగ కొనియాడె మఱిన్!
వానరేంద్రుడగు సుగ్రీవుండును వనరగ శక్రజితుండు ననిన్!
వధింపబడుటయు విని హృష్టుండై వాంఛ తీరెనని ముద మందెన్! 28

(యుద్ధకాండములోని 91వ సర్గము-సమాప్తము)

   

# శ్రీరామ కథా సుధా లహరి యుద్ధకాండము

## రెండవ భాగము

### తొంబది రెండవ సర్గము

(రావణుడు శోకించుట- సుపార్శ్వుడు ఓదార్చుటచే నతడు సీతను జంపుటనుండి విరమించుట)

అటుపిమ్మట రావణుని మంత్రులును జటుల బరాక్రముడైనట్టి
యింద్రజిత్తు వధ విని సత్వరముగ సాంద్రముగా నంతయు దెలిసీ!
దశ గ్రీవునకును దెలియ జేసిరీ తాము గనిన దంతయు వేగన్! 1

మహాద్యుతియుగల నీ తనూజునీ మానుగ రణరంగమునందున్!
మేమందఱమును గనుచుండగనే మిగుల విభీషణు సాయముతో
నా రాముని తమ్ముడు లక్ష్మణుడును నలరి జంపె మన యింద్రజితున్ 2

మహాపార్శ్వుడును, నపరాజితుడును మానుగ మహేంద్రు జయించినా
నీసుతుడగు నా యింద్రజిత్తు మఱి నీతిమంతుడగు లక్ష్మణుతో!
దలపడి యాసంగ్రామము నందున దగ ధర శయ్యాగతు డయ్యెన్!
అగణిత శరజాలమున యింద్రజితు నా సౌమిత్రిని బీడించీ!
యుత్తమ లోకములకును బోయెనూ సత్త్వము రణమున జూపించీ! 3

ఆవహమందున సుతుడు నింద్రజితు నటు వధింపగా బడె ననుచున్!
భయంకరంబును దారుణమైనా బన్నుగ ఘోరంబైనదియున్!
నావధ వార్తను విని దశగ్రీవుడు నలరి వ్యాకులత జెందుచునూ!
దీర్ఘమైన మూర్ఛను దా బొందెను దీనత ధాత్రిని బడిపోయెన్! 5

రాక్షసపుంగవుడైన రావణుడు రహి చిరకాలంబునకు మఱిన్!
సంజ్ఞను బొందెను యింద్రియంబులును సరి పనిజేయక యుండె నటన్!
పుత్రశోకమున వ్యాకులు డగుచును భూరి శోకమున విలపించెన్! 5

అయ్యో! కుమారా! యింద్రజిత్తుడా! హా బోయితివా స్వర్గంబున్!
రాక్షస ముఖ్యులలో ప్రధానుడా! రహి బలవంతుడ! మమవత్సా!
మహేంద్రునిగూడను జయించినాడవు మానుగ యీదినమున నీవున్!
మానవుడగు లక్ష్మణుని చేతిలో మానుగ యోడితివి యెటులన్? 6

కోపించిన యెడ నీవు శరములను కూరిమి కాలుని యముని మఱిన్!
మందరపర్వత శిఖరంబును మఱి చిందగ ధర భేదింతువుగా!
అట్టి నీకు సంగ్రామమునందును నిట్టె లక్ష్మణుడు నెంత మఱిన్?
మానవుడగు లక్ష్మణుని జేతిలో మానుగ యోటమి నొందితివీ! 7

సమస్త దేవాసుర గణములలో సకల మహాయోధులకు మఱిన్,
ఇదే ధర్మమును నిదే మార్గమును నిదియే స్వర్గ సుద్వారంబున్!
ప్రభువుకొఱకు ప్రాణంబులు విడిచెడి బన్నుగ యే మానవుడు ధరన్
స్వర్గంబును మఱి పొందగలడు సుమ! సకల జనులచే కీర్తి గనున్! 8

మహాబాహూ! ఏ యముని చేత మఱి మానుగ మరణము నొందితివో
ఆల సూర్యుని పుత్రుడు ధర్ముని పై యంతులేని బలవంతుడనీ,
యాతనిపై బహు గారవంబునూ యలరి గలుగు చున్నది యిపుడున్! 9

ఇంద్రజిత్తు మరణించుట జేతను నింద్రుడు మున్నగు దేవతలున్,
లోకపాలురును మహర్షులును మఱి లోలత సంతుష్టులు నగుచున్,
ఏభయంబునూ లేని వారలై యిమ్ముగ నిదురింపగ గలరూ! 10

ఇపుడు నాదు సుతు డింద్రజిత్తునూ యిమ్ముగ మరణించుట జేతన్!
సకాననంబగు ధాత్రియంతయును సర్వము శూన్యంబైనదిగా
కనబడుచున్నది మూడులోకములు గనబడుచున్నవి శూన్యముగా! 11

ఇక నిప్పుడు నే యంతఃపురమున నిమ్ముగ రాక్షస కన్యలయున్,
రోదన ధ్వనులను వినగల నిప్పుడు రోదసి ప్రతిధ్వనింపగనూ!
గిరి గహ్వరమున కరేణు సంఘము ఘీంకార ధ్వనులకు వోలెన్
రాక్షస వనితల విలాపంబులను రహి వినగల నిప్పుడు నేనున్! 12

పరంతపా! యీ యౌవరాజ్యమును బన్నుగ లంకను రాక్షసులన్
తల్లినైన మండోదరి నిప్పుడు దగ ద్యజించితివిగద పుత్రా!
నన్ను విడిచితివి! భార్యను గూడను నయముగ వారిని వదిలితివి!
మమ్ము విడిచి నీవెటు వోయితివి! ఘనుగ శోకమునను ముంచీ! 13

వీర! నేను మరణించిన దిమ్మట ప్రేతకార్యములు నీవు మఱిన్
జేయవలసియున్నది గద పుత్రా! చేయకుండగను బోయితివి!
అందుకు విరుద్ధమగు కార్యంబును బొందుగ యొనరించితి విపుడున్! 14

అల సుగ్రీవుడు బ్రదికి యుండగను నల లక్ష్మణుడును రాఘవుడున్,
భూమిమీద జీవించియుండగను భూరి వేదనల నాదు మదిన్!
దొలగింపకనే మము విడిచితివి! తొలగిపోతి వెటు హా పుత్రా! 15

ఈరీతిని బహు విలాపములచే నిమ్ముగ వికలత నొందిన యా
రాక్షసాధిపుండైన రావణుడు రహి పుత్ర వ్యసనము జేతన్!
మహాక్రోధమును బొందె నంతటను మానుగ దుఃఖముతో గూడన్! 16

స్వభావంబు జేతను గోపముగల సార్వభౌముడగు రావణునీ,
పుత్రుని మరణము వలన గలిగినా భూరి శోకమున మునుగుటనూ!
ఘర్మమునందున బ్రజ్వరిల్లెడీ సూర్యుని కిరణములకు వోలెన్,
మఱింత క్రోధము గలుగగజేసెను మానుగ పుత్రుని శోకంబున్! 17

లలాటమందున గలిసిన భ్రుకుటిని లావుకోపమున రావణుడున్
యుగాంతమందున నక్రంబులచే యుంవడి తరంగముల తోడన్,
మహాసంద్రమును బోలె నాతడుచు మానుగ ప్రకాశమును బొందెన్! 18

క్రోధము జేతను విజృంభించిన కూర్మి యతని వక్త్రమునుండీ
స్పష్టముగా మండుచున్నవి వలె సాహసుడగు వృత్రాసురునీ,
ముఖమునుండివలె ధూమము దోడుత ముదమున వెడలెను మహాగ్నులున్! 19

పుత్రునివధచే సంతాపితుడగు శత్రు మర్దనుడు రావణుడున్
క్రోధ వశంబును బొందినవాడై కూర్మి బుద్ధిచే యోచించీ
సీతను వధింపవలెనని మదిలో శీఘ్రము నిశ్చయమున కొచ్చెన్! 20

స్వభావంబుచేతను దశగ్రీవుని సహజ నేత్రములు నెఱ్ఱనివి
కోపాగ్నులచే మఱింత యెఱ్ఱని కూర్మి చింతనిప్పుల వోలెన్!
భయంకరముగా నతని నేత్రములు ప్రజ్వలించినవి నట్టియెడన్! 21

సహజముగా దశగ్రీవుని రూపము మహాక్రోధమున నుండు మఱిన్
క్రోధాగ్నులచే వ్యాప్తమైన యా కూర్మి రాక్షసుని రూపంబున్,
మహారుద్రుని రూపమువలెనూ మానుగ దురాసదం బాయెన్,

కోపించిన యాతని నేత్రములను కూర్మినుండు దీపంబులనూ
అగ్నిజ్వాలలను గూడినట్టియును నలరు తైలబిందువుల వలెన్!
అశ్రుబిందువులు రాలినవప్పుడు నా రావణు నేత్రంబులనూ! 23

దంతంబులనూ గొఱుకుచున్న యా దశగ్రీవుని దశన ధ్వనియున్
దానవ సమూహములచే లాగెడి పగ మహోన్నతంబగువట్టి
యంతక ధ్వనివలె వినబడుచుండెను వింతగ గఱగఱ ధ్వనిజేతన్. 24

ఆ రావణుడును కాలాగ్నికి వలె నట సంక్రుద్ధుండై మఱియున్!
నే యే దిక్కుల జూచెనో నతడు నాయా దిక్కుల యందుననూ!
రాక్షసులందఱు భయస్తులునై రహి మాటాడక యుండి రటన్! 25

స్థావరజంగమ రూపమైన యీ సకల జగంబును దినివేయన్
సంకల్పించుచు కోపించిన యా శంకలేక మృత్యువు వోలెన్
సకల దిక్కులను గాంచుచున్న యా సార్వభౌముడగు రావణుని
రాక్షసు లందఱు భయపడిపోయిరి రహి యాతనిని సమీపింపన్! 26

అటుబిమ్మట బహు కోపించిన యా చటుల రాక్షసాధిపుడైనా
రావణాసురుడు యుద్ధమునందున రహి నిలువగ దలచిన వాడై
ఆ రాక్షస వీరుల మధ్యంబున యతి ప్రతాపమున నిటు బలికెన్! 27

వేలకొలది వర్షంబులు మఱి నే విమల తపస్సును జేసితిని
ఒక్కొక్క తపస్సు ముగిసినపుడు మఱి చక్కగ స్వయంభువదేవుమఱిన్!
పరితోషితునిగా జేసితి నప్పుడు ప్రబలమైన నా దీక్షలచే! 88

ఆ తపస్సు ఫలి మీయుట వలనను నా స్వయంభువుని దయచేతన్
అసురుల నుండియు దివిజుల నుండియు నలరి నాకు నెన్నడును మఱిన్,
ప్రమాదంబు మఱి భయమును లేదూ బరగ నాదు ప్రాణంబులకున్! 29

బ్రహ్మదత్తమును నాదిత్యునితో బరగ సమప్రభ గలిగినదియున్
కవచమేది గలదో మఱి దానిని కడగి దివిజులను నసురులతో
బరిగిన సంగ్రామంబుల యందున సరగున వజ్రాయుధముననూ
ముష్టి ఘాతముల జేతను గానీ యెట్టి బాధగలుగగ లేదూ! 30

ఇహ ప్రస్తుతమున యుద్ధము నందున యిమ్ముగ యా కవచము తోడన్,
రథస్థుండనగు మము నెవ్వండును నూనుగ యెదిరింపగ గలరూ?
సాక్షాత్తుగ మఱి మహేంద్రుడైనను సరి నిలువగ లేడిక మీదన్! 31

దేవాసుర సంగ్రామములందున దీరుగ యా సమయములందున్
నతిప్రసన్నుడై స్వయంభువునిచే నలరు శరముతో గూడిన యా
మహా కార్ముకము నిచ్చెను నాకును మానుగ యీ యావహమందున్,
రామలక్ష్మణుల వధించెదను నే రమ్యమైన యా బాణమునన్,
మంగళ వాద్యంబుల తోడను మఱి సంగతి పైకిని దీయుడికన్! 32-33

పుత్రుని వధచే సంతాపితుడగు భూరిక్రోధమున రావణుడున్,
క్రోధ వశంబును బొందినవాడై కూర్మి బుద్ధి యోజించి మఱిన్,
వైదేహిని మఱి వధింప వలెనని వనరగ నిశ్చయమును జేసెన్! 34

తామ్రాక్షుండును భయంకరుండును ఘోర దర్శనము గలవాడున్
దీరుడైన యా రావణు డంతట దీనమైన కంఠ ధ్వనితో
రాక్షసులందఱ కలయ జూచుచును రయమున యీ విధమున బలికెన్!35

నాదు కుమారుని యింద్రజిత్తుచే నయముగ మాయను వానరులున్
వంచనార్థమై యచ్చట యేదో యంచితముగ చంపగ బడియెన్!
ఈమె సీత యని యచటను జూపెను నిమ్ముగ యందఱు నమ్మగనూ!36

అట్టి కార్యమును నిపుడు జేసెదను నిట్టి నాకు ప్రియమైనదియున్,
యధార్థమైనదిగా జేసెద నే తథా జనులు వర్ణింపగనూ,
దుష్ట క్షత్రియుండైన రాముని దారముగా ననువ్రతయైనా
వైదేహిని నే వధించివేసెర వనరగ వారలు జూడగనూ
నిటుల పలికి తన మంత్రుల తోడను చటుల ఖడ్గమును గ్రహియించెన్!

పుత్రశోకమున బహు వ్యాకులమగు వ్యధిత మనస్సును గలవాడున్,
ఆ రావణుడును సంక్రుద్ధుండై యలరి యెగిరి యతి వెగమునన్,
విమలాంబర వర్చస్సును గల యా పుల ఖడ్గమును గ్రహియించి
మంత్రుల తోడను గూడిన వాడై మైథిలి యెటగలదో యటకున్,
సభ నుండియు బహు వేగము తోడను బయలుదేరె యతి తీవ్రముగన్! 40

బోవుచున్న యా రావణుగాంచి పౌలుపుగ యాతని యనుచరులున్
సింహనాదములు జేసినట్లుగా శీఘ్రముగా నడచిరి వారున్,
కోపించిన యారాక్షసు గాంచి కూర్మి పరస్పరమును వారున్!
కౌగలించుకొని యీ విధి బలికిరి కనలుచు మనసున బహురీతిన్! 41

ఈ సమయంబున యాతని గాంచి! యిమ్ముగ యా రఘునందనులున్!
వ్యథను జెందెదరు మానసములనూ వనరగ యాక్రోశించుచునూ!
కోపించిన యా దశగ్రీవునిచే కూర్మిలోకపాలురు గూడన్,
నలువురు గూడను భయపెట్టగబడ నయముగ యనేక శత్రువులున్!
యుద్ధములందున బడగొట్టగబడి యుద్ధతు డీతడు లోకములన్! 42

మూడు లోకముల శ్రేష్ఠ వస్తువుల ముదమున గైకొని వచ్చి మఱిన్!
అనుభవించు చుండెను రావణుడును యడ్డెదియు మఱి లేకుండన్!
విక్రమమందున బలమునందునను వీరవిహారములందుననూ!
ఇతనిని బోలిన వాడు భూమిలో నిమ్ముగ లేడు గదా మఱియున్! 43

ఆ రాక్షసు లిటు ననుకొనుచుండగ యా రావణుడు క్రోధమునన్!
అశోకవనమున గల వైదేహిని యలరి బోయె భర్త్సింపగనూ! 44

సుసంక్రుద్ధుడై కోపించిన యా శూరుడైన యా రావణుడున్!
హితబుద్ధియు గల మిత్రులచేతను హితముగ వారించుచు నున్నన్!
క్రూరమైన యంగారక గ్రహమును గూరిమి యాకాశము నందున్!
రోహిణి నక్షత్రమును గూర్చి వలె రోషముతో జనె వైదేహిన్! 45

రాక్షసాంగనలచే జుట్టగబడి రహి రక్షింపగ బడుచున్నన్!
అనిందితమునగు జనకనందినియు నలరు శ్రేష్ఠమగు ఖడ్గంబున్!
ధరించి వచ్చుచున్న రాక్షసుని దగ జూచెను బహు దూరముగా! 46

ఖడ్గముతో గూడిన రావణుడును కమ్మని మాటల మిత్రులచే
నివారింపబడుచున్నను గూడను నిర్లక్ష్యముతో మఱలకనూ!
వచ్చుచున్న యారాక్షసు గాంచి వనరగ సీతయు వ్యథజెందెన్! 47

దుఃఖముతో గూడినదై సీతయు దురపిల్లుచు ననుకొనెను మదిన్!
దుష్టబుద్ధియును నీరావణుడును దోరముగా నతిక్రుద్ధుండై!
నాపై పునకే వచ్చుచుండె మఱి నయమ్ముగ ఖడ్గముతో గూడీ!
సనాథనగు నను ననాథకువలె, సరగున వధించునని దోచున్! 48-49

భర్తకు ననువ్రతనగు నన్నును మఱి భార్యవు గమ్మని యీతండున్!
అనేకమారులు ప్రేరేపించెను నతనికి నేనును ధ్రువముగనూ!
ప్రత్యాఖ్యానము జేసి మఱియునూ బన్నుగ నిరాకరించితినీ!

అట్టి రాక్షసుడు నే జేఱక మఱి నిట్టి నిరాశయు జెందియున్నా!
క్రోధ మోహములతో గూడికొనీ కూర్మి నిశ్చయము గలవాడై
నడు వధించుటకు ఖడ్గము తోడను నయముగ యిటు వచ్చుచునుండెన్! 51

లేదా యీదినమున యుద్ధంబున లీలగ పురుషశ్రేష్ఠులునూ
సోదరులైనా రామలక్ష్మణుల శూరుడు యనార్యుడగు వీడున్!
మన్నిమిత్తమున యాహవమందున మానుగ వధించి యుండు నటన్! 52

ఇచా యిచ్చట హృష్టులు నగువారలు నిమ్ముగ ప్రియ విషయంబుననూ!
యఱచుచున్న వారలు ననేకులగు నా రాక్షసుల భయంకరముల్!
మహా-నాదమును వినిపించినదీ మానుగ యీ ప్రదేశమునన్! 53

అయ్యో! అయ్యో! రాజపుత్రులకు నలరి నావలన వినాశమున్!
కలిగెగదా మఱి కాలగతులనూ యిల దప్పింపగ లేరు గదా!
లేదా మఱి యా పాప నిశ్చయుడు లీలగ యా సోదరుల మఱిన్!
వధింపకుండగ పుత్రశోకమున వధింప నన్నే మది దలచి!
వచ్చుచున్నవాడని మది దలతును వసరగ ఖడ్గము ధరియించి! 54

అల్ప బుద్ధినగు నాచేతను మఱి హనుమంతుని మాటను వినకన్!
చేటు దెచ్చుకుంటిని హనుమంతుని చెప్పిన మాటను వినకుండన్!
రాముడు తన బలమును జూపించి రయమున నను గొనిపోకున్నన్!

ఆ మారుతి పృష్ఠమున గూర్చొనియు నలరి నేను బోయిన యెడలన్!
భర్తృయంకమున యుండెడిదానను బహు సంతోషమునను గూడి!
దుఃఖముతో గూడక నేనిట మఱి దుఃఖపిల్లెడి దాననుగానూ! 56

ఏకపుత్రుడును గల కౌసల్యయు, నేకపుత్రుడగు రాఘవుడున్
రణమునందు మరణించిన వానిగ రహి వినగలదో యామెయునూ
మది విషాదమును బొంది గుండెయును మాడుగ బగులును నని దలతున్

ఆ కౌసల్యయు నేడ్చుచున్నదై యా శ్రీరాముని జన్మంబున్
బాల్య యౌవనములందు జేసినా బహుకార్యములను రూపంబున్
మదిని దలచుకొని వేదన జెందును మానుగ రోదన జేయుచునూ 58

పుత్రుడు మరణింపగ కౌసల్యయు బూని నిరాశకు లోనగుచున్
శ్రాద్ధోదకముల నిచ్చి వెంటనే సరసత స్మృతి ధృతి గోల్పోయి!
అగ్నిని యైనను ప్రవేశించునో, యలరి జలములను దుముకు మఱిన్
ధరణియందు జీవించి యుండదూ దగ యిది నిశ్చయమని దలతున్! 59

పాప నిశ్చయము గలిగియు కుటిలయును బన్నగ గూనిది మంథరయున్
ఎంత పెద్దదో దెలుపలేము గద! యెంత యనర్థమును దెచ్చినదీ!
ఆమె మూలమున కౌసల్యకు మఱి యట్టి శోకమును గలుగు నికన్! 60

ఈ విధముగ విలపించుచున్న యా యిమ్ముగ తపస్వినియు నైనా
చంద్రుడు లేకుండగ యంగారక చండగ్రహము పొందినయట్టి
రోహిణివలె నట నున్న సీతనూ రోషపూర్ణుడౌ రావణుని
మంత్రుల యందున శీలవంతుడును మహామేధయగు సుపార్శ్వుడున్!

మాటలాడవద్దని మఱి బలుకగ మౌనమూను మని బలికి మఱిన్
ఇతరులైన యా సచివు లందఱును నిమ్ముగ వారించిన గూడన్
రాక్షసప్రభువగు దశగ్రీవునితో రయముగ బలికెను నీరీతిన్! 62

రాక్షసేంద్ర! ఓ దశగ్రీవా! విను! రహి నా సువాక్యములను మఱిన్
సాక్షాత్తుగ వైశ్రవణానుజాతవు సరసత పులస్త్య వంశమునన్
జన్మించితివి! అట్టి నీవు మఱి సరగున క్రోధమునను గూడి
పరమధర్మమును బరిత్యజించియు బరగ జానకిని జంపగనూ
గోరుచుంటి వెటు? లోకము మెచ్చున? గోపింతురు నిను ధర్మవిదుల్! 63

రాక్షసేంద్ర! ఓ దశగ్రీవా విను! రహి నా సువాక్యములను మఱిన్
వేదవిద్య యభ్యసనము గొలకును విమల బ్రహ్మచర్యాశ్రమమున్
ముగించుకొని మఱి స్వకర్మనిరతను మోదమునను యుగ్మలపూజల్
గృహస్థ ధర్మములందు నిలిచినా గృహస్థుడవు! మఱి పూజ్యుడవున్
అట్టి నీవు నొక స్త్రీని వధింపగ నీట్టి గోరితివి యెంరులకున్? 64

రాక్షసేంద్ర సౌందర్యతిలకయగు రాముని భార్యను జానకినీ
యేమాత్రంబును హానిజేయకుము! నీసడింపకుము బతివ్రతనూ!
మాతో గలిసియు రావణామందున మానుగ శ్రీరాఘవు పైనీ
జూపింపుము! నీ క్రోధమంతయును శూరుడవై రణమున గెలిచీ 65

నేడు కృష్ణపక్షంబు జతుర్దశి యేగిరమున యుద్ధంబునకై
సన్నాహంబును ప్రారంభింపుము! నరగున సేనల గూడికొని,
అలరు నమావాస్యయు తిథి రేపే యలరి వెడలు విజయంబునకై! 66

శూరుడవును మఱి ధీమంతుడవును శూర! ఖడ్గధారియు నీవున్
మహారథికుడవు బలవీర్యుండవు! మానుగ మహాస్త్రముల తోడన్
శ్రేష్ఠమైన రథమున గూర్చుండీ శ్రీకరుడగు దశరథ రామున్
సంహరింపుమా! సంగ్రామంబున సాధ్వి సీత నీవశమగునూ! 68

దురాత్ముడగు నా రావణు డంతట తోరముగా స్నేహితు జేతన్
సుధర్మంబులగు వచనములను విని సురుచిరముగ గృహమును బోయెన్!
అటుబిమ్మట మఱి వీర్యవంతుడగు బటు బలవంతుడు రావణుడున్
సహచరులను మఱి గూడి శీఘ్రముగ సభకు బోయె యచ్చటినుండీ! 68

(యుద్ధకాండమునందు 92వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి (యుద్ధకాండము)

## రెండవ భాగము

### తొంబది మూడవ సర్గము

[రాముడు రాక్షస సేనను సంహరించుట]

ధీమంతుడును మఱి పరమ దుఃఖితుడు ధీరుడు యా లంకేశ్వరుడున్
సభయందున మఱి ప్రవేశించియును బరగ క్రోధ సింహంబు వలెన్
నిట్టూర్చుచు ముఖ్యాసనమందున బిట్టులుకుచు గూర్చుండె నటన్ 1

మహాబలీయుడు బుత్రశోకమున మానుగ కృశింపబడినట్టి!
ఆ రావణుడును సేనావాహిని యధినాయకులను బోధించి!
అంజలి ఘటించి యిటులను బలికెను నలరు ధీరతను జాటుచునూ 2

మీరందఱునూ సమస్తమైనా మిగిలిన గజాశ్వ సేనలతో
రథ సముదాయంబులను గూడుకొని రయమున సైనికులను గూడి!
యుపశోభితులై బయలుదేరుడూ యుర్వియంతయును గప్పుచునూ! 3

అవహమందున రాముని యొక్కవి యలరి చుట్టిముట్టియు వేగన్!
ప్రావృట్కాలమునందు మేఘములు బన్నుగ వర్షించిన రీతిన్!
బాణవర్షమును గురిపింపుడు మఱి బన్నుగ వధియింపుడు నతనిన్!
నేడు బొండు రాముని వధియింపుడు! విఖిల సైన్యముల గూడికొని! 4

లేదా సంగ్రామంబునందు మఱి లీలగ శిత శరముం జేతన్!
భిన్నగాత్రమును జేసిన బిమ్మట భీకరమగు నాబాణములన్!
నేను రేపు లోకము గనుచుండగ నిర్వహించెదను సమరంబున్!
అట్టి సమరమున వధియించెద నే నిట్టి రామచంద్రుని వేగన్! 5

ఆ రాక్షసులును రాక్షసేంద్రుని యా మాటలు విని వేగముగన్!
రథముల తోడను గజములతోడను రయమున యనేక సేనలతో!
గూడినవారై బయలుదేరిరీ కూరిమి రణరంగంబునకున్! 6

ఆ రాక్షసవీరులు నందఱునూ యలరి శరీరాంతకములునూ!
యైన పరిఘలును బట్టిసములనూ యలరు ఖడ్గముల శరములునూ!
ఆ కపివీరులపై రణమందున యలయక విసిరిరి వేగముగన్!
కపివీరులునూ శిలలు వృక్షములు కదిలి విసిరి రా యసురులపై! 7

సూర్యోదయమున నుండి మొదలుకొని శూరులు కపిరాక్షసులకు మఱిన్
భయంకరంబగు సంగ్రామంబును బన్నుగ జరిగెను వ్యాకులతన్! 8

ఆ వానర రాక్షసులు యుద్ధమున యన్యోన్యంబును చిత్రములౌ!
గదలతోని మఱి ప్రాసలతోడుత కఠిన గండ్రగొడ్డళ్ళతోన్!
ఖడ్గంబులతో యుద్ధము జేసిరి కదనరంగమున ధీరతతోన్! 9

ఈ విధముగ యా మహాయుద్ధమును నిష్ఠుగ ప్రారంభము నయ్యెన్!
నద్భుతంబునగు నధిక పరాగము నా కపివీరుల రాక్షసులా
రక్తస్రావముచే శాంతించెను రణరంగమునం దంతటనూ! 10

గజరథములు దీరంబులుకాగా కదులు గుఱ్ఱములు మత్స్యములున్!
ధ్వజములు వృక్షములుగా గలవియును దగ రక్తము నది ప్రవహించెన్!
శరీరంబులను దెప్పలు నదిలో సరగున బోవుచు నుండె నటన్! 11

అటుబిమ్మట యా నిఖిల వానరులు నట శోణితమున బరిప్లుతులై
వానరవీరులు సంగ్రామంబున వనరగ యెగురుచు దూకుచునూ!
ధ్వజముల, కవచంబుల, రథంబులను దగ యశ్వంబుల విరిచి రటన్!
అనేక విధముల యాయుధంబులను నలరుదు ధ్వంసము జేసి మఱిన్!

ప్లవంగ వీరులు నా యుద్ధంబున బదునగు నఖ దంతంబులతో!
ఆ రాక్షసులయు కేశంబులనూ, యలరెడి కర్ణ లలాటములన్!
నాశికంబులను మఱి భేదించిరి నయముగ బొబ్బలు బెట్టగనూ! 12-14

ఫలవృక్షంబుల పైకి పక్షులను బన్నుగబోయిన యట్లుగనూ!
ఆ యుద్ధంబున వానరవీరులు నలరుచు నొక్కొక్కని పైకిన్!
నూర్గురు నూర్గురు బరుగులెత్తిరీ నుఱుముచు కేకలు వేయుచునూ! 15

ఆ సమయంబున బర్వతసములగు నా రాక్షసులును వేగముగన్!
గదలజేత మఱి ప్రాసలజేతమ ఘన ఖడ్గంబుల తోని మఱిన్!
బరశ్వథంబులతో గపివీరుల బలముగ గొట్టిరి రణమందున్! 16

రాక్షసవీరులు గపివీరులనూ రయమున జంపుచునుండగనూ!
వానరసేనయు దాశజాలకను వనరగ బరుగెత్తుచు దిశలన్!
శరణాగత రక్షకుడునైన యా సకల శత్రు మర్దనుడైనా!
దశరథాత్మజుండైన రాముని దగ శరణంబును నందినదీ! 17

అటుబిమ్మట యా మహాతేజుడును జటుల వీర్యవంతుడునైనా!
రఘునందనుడగు రామచంద్రుడును రహి కార్ముకమును గ్రహియించి! 18

రాక్షస సంబంధమునగు సైన్యము రయమున జొచ్చియు శీఘ్రముగన్
బాణవర్షమును గురిపించెను మఱి బన్నుగ యసురులు భయమందన్! 18

ఆ సైన్యంబున ప్రవేశించి మఱి యలరు శరాగ్నులచేత నటన్
గాల్చివేయుచుండిన శ్రీరాముని గడగి భయంకరు లైనట్టి,
యారాక్షసులును నంబరమందున నలమేఘంబులు నాదిత్యున్,
సమీపింప జాలక బోయినటుల సహింప జాలకబోయి రటన్! 19

ఆ రజనీచరులును యుద్ధంబున యా రామునిచే జేయబడూ
సుఘోరంబులగు మహత్కార్యములు సురుచిరముగ గాంచిరి వారున్,
నితరు లెవ్వరును జేయగజాలని యిమ్ముగ ఘనమగు కార్యములున్! 20

మహాసైన్యమును నూపివేయుచును మానుగ కదిల్చి వేయుచునూ,
మహారథంబుల నెగురగొట్టుచును మానుగ రాముని వనమందున్
నున్న వాయువును వలె రాక్షసులును జెన్నుగ గనలేకను వాతున్! 21

రాముని బాణంబులను జీల్చబడి రయమున బ్రద్దలు గొట్టియునూ,
కాల్చివేసి ముక్కలుగా జేసియు కదనమందు శస్త్రంబులచే
బీడింపగబడినట్టి సైన్యమును బ్రీతిని గనుగొనుచుండి రటన్!
శీఘ్రకారిణుండైన రామునీ శ్రీకరముగ గాంచగ లేదూ! 22

దేహములందున గొట్టుచున్ననూ దీరుగ రాముని రాక్షసులున్
ఇంద్రియ విషయములందు నిలిచినా సాంద్ర వస్తువగు జీవాత్మన్,
జూడజాలనట్టులుగా రాముని జూడలేక బోయిరి వారున్! 23

ఇదిగో! రాముడు జంపుచు నుండెను నిచ్చటి గజసేనలను మఱిన్,
ఇదిగో! యిచ్చటి మహారథంబుల నిటు ధ్వంసము జేయుచు నుండెన్,
ఇదిగో! శత శరముల వాజులనూ నిట్టె వధించుచు నున్నాడున్,
ఇదిగో! యిచ్చటి పదాతిదళముల నిలపై గూల్చుచు నున్నాడున్!
ఈరీతిని యా రాక్షసు లందఱు నిమ్ముగ రణరంగము నందున్!
రామునకును మఱి యనేక రాముల రయమున గాంచుచు క్రుద్ధులునై!
ఆ శ్రీరాముని సాదృశ్యముగా నట గనుగొని దమలో దామే!
కొట్టుకొనిరి మఱి యాయుధములతో కూరిమి వధించుకొనిరి యనిన్, 24-25

మహాత్ముడగు నా రఘువీరునిచే ఘనముగ గాంధర్వాస్త్రముచే
మోహింపగబడి రాక్షసులందఱు మోహంబునకును వశులగుచున్!
ఒకవైపున రాక్షసవాహినిని వనర గూల్చుచుండిన స్వామిన్,
గాంచలేకపోయిరి రఘురాముని సంచితముగ రణరంగమునన్! 26

అట్టి మహాసంగ్రామమునందున యా రాక్షసులును రణమందున్,
వేలకొలది శ్రీరామచంద్రులను వేగిరముగ గాంచిరి యచటన్,
మరుక్షణ మందున గనబడుచుండెను మాన్యుగ శ్రీరాముండొకడే! 27

ఆ రాక్షసులును మహాత్ముడైనా యా శ్రీరాముని కార్ముకమున్
తిరుగుచున్న కాంచన వికారమును దీరుగ యలాతచక్రంబున్,
సమానమైనా యగ్రభాగమును సరసత గనబడుచుండె నటన్,
కానీ యా రఘువీరుడు మాత్రము గనబడుచుండుట లేదు మఱిన్! 28

శరీర మనియెడి నాభి గలవియును. సత్త్వంబనియెడి జ్వాలలునూ,
బాణము లనియెడి యాకులు గలదియు, నేమి యనెడి చాపముగలదీ,
నారి ధ్వనియను తల ధ్వని గలదియు నయముగ తేజము, బుద్ధియునూ,
గుణంబు లనియెడీ కాంతి గలిగినది కూరిమి దివ్యాస్త్రంబులయున్,
గుణము లనెడి ప్రాంతంబులు గలదియు గూర్మి యట్టి రణరంగమునన్,
రాక్షసులను మఱి వధించుచుండిన రమ్య కాలచక్రంబువలెన్,
ఉన్న రామచక్రంబును గాంచిరి జెన్నుగ యా రాక్షసులు మఱిన్! 29-30

ఇష్ట రూపములు ధరింపగలిగిన యిమ్ముగ రాక్షస సేనలకున్
సంబంధించిన వాయువేగమును సరసత బోయెడి రథములనూ!
పదివేలను గూల్చెను శ్రీరాముడు బన్నుగ యా రణమందుననూ,
యేనుగులను బదు నెనిమిదివేలను నిమ్ముగ గూల్చెను రణమందున్.

రౌతులతో బదునాలుగు వేలను రయమున బోయెడి గుఱ్ఱములన్
రెండులక్షలకు మించినట్టి యా నిండగు బదాతిదళములనూ,
అగ్నిశిఖలకును సమానములునగు నలరు దనదు బాణంబులచే
ఒక్కజాము కాలములో జంపెను దిక్కటిలగ రణరంగమునన్! 31-32

గుఱ్ఱంబులు మఱి జంపబడినవీ కూర్మి రథంబులు ధ్వస్తములై
ధ్వజ పతాకములు నేలబడినవీ దగ రణభూమిని యంతటనూ,
హతశేషులు నగు నిశాచరులునూ మతి భీతిని మఱి బొందుచునూ
లంకాపురి వైపునకు బోయిరీ శంకలేక యోటమినందీ, 34

చంపబడిన యాగజములతోడను జంపబడిన యశ్వంబులతో
మరణించిన యా కాలిబంట్లతో, మానుగ యాయుధములతోడన్
మహాత్ముడగు కోపించినట్టి యా మానుగ రుద్రునిభూమి వలెన్
నా రణరంగం బంతయు నుండెను మానుగ భయంకరంబుగనూ! 35

అటుపిమ్మట యాగంధర్వులునూ నలరు దివిజులును సిద్ధులునూ
పరమఋషులు రాముడు జేసినపని 'బాగు!' 'బాగు' ననుచును నింగిన్
పూజా పుష్పంబులను రాల్చిరి బొందుగ పువ్వుల వాన వలెన్! 36

అంతట ధర్మాత్ముండు రాఘవుడును దన సమీపమ్మున నిలిచిన యా
సుగ్రీవునితో విభీషణునితో సురుచిరముగ హనుమంతునితో!
వీరుడైన మైందునితోడను మఱి విమలుడైన ద్వివిదుని తోడన్,
నలరు జాంబవంతులను గాంచుచును నా శ్రీరాముడు నిటు లనియెన్!
'ఇట్టి దివ్యమగు శస్త్రబలంబును నిమ్మగ నాకును నీశ్వరుకున్
మాకు మాత్రమే గలిగియున్నదీ మానుగ ప్రయోగ శక్తి మఱిన్! 37-38

శక్రసముండును, మహాత్ముండునూ, శత్రుమర్దనుడు వీర్యుండున్,
అస్త్ర శస్త్రముల ప్రయోగిందుటను నలసట నొందనివాడు మఱిన్!
అట్టి రాఘవుని యా సమయంబున యిట్టి రావణుని సైన్యంబున్
దుడిచి వేసినా యా రఘువీరుని దొరముగా దివిజులు మఱియున్,
దేవతా గణము లన్ని స్తుతించెను దీరుగ యానందము తోడన్! 39

(యుద్ధకాండము నందు 93వ సర్గము సమాప్తము)



# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### తొంబదినాల్గవ సర్గము

(రాక్షస స్త్రీలు విలపించుట)

అక్లిష్టకర్ముఁడైన రాఘవుడు నా దశగ్రీవుడు బంపిన యా
వేలకొలది గజములను మఱియునూ వేలకొలది యశ్వంబులనూ,
వాని మీదగల మహా యోధులను వనరగ పతాక ధ్వజములతో
అగ్నితుల్యమగు తేజముగలిగిన నలరు మహారథములగూడీ
గదలతోని మఱి పరిఘలతోడను ఘన సమరము జేసెడి వారున్
కాంచన ధ్వజములతోవి మఱియునూ కాంచన భూషలు గలవారున్
శూరులు, వీరులు, స్వేచ్ఛారూపులు, క్షుద్ర రూపములు గలవారున్,
అట్టి రాక్షసుల వేలకొదియును నిట్టె దీప్త శర జాలమునన్,
సంహరించె నా రాక్షససేనల సకల దేవతలు హర్షింపన్! 1-2-3

హతశేషులునగు నిశాచరులునూ యా రాక్షసవధ గని వినియున్
సంభ్రాంతులునై, దీనవదనులై సంతాపంబున గూడికొనీ,
తమ భార్యాపిల్లలను గూడికొని దగ నేడ్చిరి దిక్కులు మ్రోగన్! 4-5

భర్తలు మరణించిన విధవలునూ బరగ సుతులు బోయినవారున్,
బంధువులను గోల్పోయిన వారును, బరగ రక్షకుల గోల్పోయీ!
అనాధలగు నా రాక్షస స్త్రీలును నందుఱ నొకచో గుమిగూడీ,
దుఃఖంబున మఱి నేల బొరలుచును దురపిల్లుచు నేడ్చిరి యచటన్! 6

వికృతమైనా రూపము గలదియు వికృత యుదరము గలదియునూ,
ముసలి శూర్పణఖ దుష్టురాలు మఱి ముసలము దెచ్చిన దండఱకున్
కందర్పునితో సమమగు రూపము గల రాముని దగ్గఱకు మఱిన్!
వనము లోపలికి యెటుల బోయెనో వన్నెలెటుల జూపించినదో! 7

లోకనింద్యయును గురూపిణియునగు లోల, దుశ్చరిత, వృద్ధయునూ
సుకుమారుండును మహాసత్త్వుడగు సురుచిర గుణ సంహితుడైనా,
సర్వభూత హితరతుడగు వానిని సార్వభౌముడగు శ్రీరామున్,
ఎటుల జూచినది దండక వనమున యెటుల మోహమున కామించెన్?

ముడతలు గలదియు శ్వేత మూర్ధజయు ముదిమిమైన యాకారమునన్
నా శూర్పణఖయు మన స్త్రీ జనముల యల్పమైన భాగ్యము వలనన్!
నా రాక్షసులును ఖరుడు దూషణుడు నటు మరణించుటయును గూడన్
ఈ రాక్షసియే కారణ మనియును నిమ్మగ జెప్పగవచ్చు మఱిన్
సర్వలోక గర్హితమును నింద్యము సకలలోక యపహాస్యమునూ
రామునితో యుద్ధమును దెచ్చినది రట్టు దెచ్చినది లంకకునూ! 10

అట్టి శూర్పణఖ మాటల జేతను నిట్టి రావణుడు దుర్మతినీ
మహా వైరమును దెచ్చిబెట్టెనూ మానుగ లంకకు ననురులకున్!
దన చావునకే సీతను దెచ్చెను దరలి పోవ యమక్షయమునకున్! 11

దశగ్రీవుండును జనకాత్మజనూ దగ బొందగ జాలడు గానీ
బలవంతుడు మఱి గుణశీలుడునగు బన్నుగ శ్రీరాముని తోడన్
అంతులేని వైరమును మూఢుడును బంతంబున మఱి దెచ్చుకొనెన్! 12

వైదేహిని గోరుచు నుండిన యా వనరగ యొక రాముని జేతన్
జంపగబడినా రాక్షసుడైనా కంపిత గాత్రుని విరాధునీ!
జూచినచో యా నిదర్శనంబును జూడజాలదా వాస్తవమున్! 13

జనస్థానంబున నా రాఘవుడును జ్వలించు బాణంబుల జేతన్
భయంకరంబగు వేలకు పైబడి ప్రతాపవీరుల మర్దించెన్!
పదునాలుగు వేలకు పైబడినా ప్రతాపవీరుల మర్దించెన్! 14

అట్టి మహాసంగ్రామమునందున యాదిత్యునితో సమమైనా
శరములచే ఖరుడును హతమయ్యెను సరగున దూషణుడు మఱియున్
త్రిశిర రాక్షసుడు గూడ జంపబడె దీరుగ చోద్యము గాదు గదా!
ఆ నిదర్శనము జాలును మనకును నా శ్రీరాముని దీరతకున్! 15

క్రోధమువలనను ధ్వనులు జేయుచును ఘోరమై భీషణ రూపమైనా
మహా బాహువులు గలవాడును మఱి మానుగ రుధిరాననముగలా!
ఆ కబంధుడును హతమాయెను గద! యా రఘువీరుని శరములన్నా!
యీ నిదర్శనము జాలును మనకును నిమ్ముగ రాముని బలమునకున్! 16

బలవంతుడును నింద్రుని పుత్రుడు బన్నుగ మేఘ సమానుండున్,
నయిన వాలినీ శ్రీరఘువీరుడు హతమార్చెను దనే బాణమునన్
ఈ నిదర్శనము జాలును మనకును నిమ్ముగ రాముని బలమునకున్! 17

ఋష్యమూక పర్వతము నందునను కష్టములకు మఱి భాజనుడై
బరగ వసించుచు నున్నవాడు మఱి భగ్న మనోరథుడైనట్టి
దీనుడైన యా సుగ్రీవునకును దీరుగ పట్టముగట్టె మఱిన్
నీ నిదర్శనము జాలును మనకును నిమ్ముగ రాముని ధీరతకున్! 18

ధర్మార్థంబులతో గూడినదీ దగ సమస్త రాక్షసులకునూ
హితమైనది మఱి యుక్తమైనదియు నీతివంతమైనది శుభమున్!
అజ్ఞానముచే రాక్షసేంద్రుడును నతని మాట వినుటయు లేదూ! 19

ధనదుని సోదరుడగు రావణుడును దగ విభీషణుని వచనములన్
వినియుండినచో నీ లంకాపురి విపరీత స్థితి నొందెడిదా?
శోక పీడితము స్మశానంబు వలె శోకించుచు మఱి యుండెడిదా?
పెద్ద కష్టములు వచ్చెను లంకకు నెట్టి యాపదలు మన కొచ్చెన్? 20

మహా బలముగల కుంభకర్ణుండును మానుగ శ్రీరాముని చేతన్
వధింపబడినటు వినియు గూడ మఱి వదరగ మౌనము వహియించెన్
మద్దర్షుండగు నతికాయుని మఱి దౌర్బల్యుండు ప్రియపుత్రుండున్,
ఇంద్రజిత్తునూ లక్ష్మణవీరుడు నింపై గూల్చిన యట్లుగనూ
వినియుగూడ మఱి దెలియుటలేదూ యిన వంశోత్తమ ధీరతనూ! 21

బ్రహ్మ యిచ్చినా వరముల వలనను మహాబలవంతుండైనట్టి
శూరుడైన యా రావణు డిప్పుడు శరవరుడగు రాముని చేతన్!

పుట్టినట్టి యా మహాదారుణము బుట్టినట్టి భయమును మఱియున్,
దెలియుటలేదూ యజ్ఞానంబున దీరుగ రాముని శక్తియునూ! 22

సమరమునందున నాదు పుత్రుడును సమసె ననుచు నొక తల్లియునూ!
సోదరుండు జంపగబడె నంచును సుదతి యొకతె యేడ్చుచు నుండెన్,
పతి మరణించెను రణమందున యని పడతి యేడ్చుచుండెను మఱియున్!
నీ విధి రాక్షస స్త్రీల రోదనము నింటింటను వినబడుచుండెన్! 22

శూరుడైన యా రఘు వీరునిచే శూరులు రాక్షసవీరులునూ
సంగ్రామంబున జంపగబడిరీ సరసత పదాతి దళములునూ!
వేలకొలది రథములు గుఱ్ఱంబులు వేలకొలది గజములునూ నటన్,
సమరమునందున సంహరించెనూ సరగున తన బాణంబులచే! 23

ప్రళయకాల రుద్రుడా! మఱి విష్ణువా! బన్నుగ శతక్రతువో లేదా?
స్వయముగ యంతకుడగు యముడో మఱి సరగున రాముని రూపముతో
వచ్చినను నలి జంపుచు నుండెను జెచ్చెర తన శరజాలమునన్! 24

మహావీరులను నందఱ రణమున సూనుగ రాముడు జంపుటచే
జీవితమందున యాశ లేమిచే జీవిత భ్రంశత్వము నందీ!
భయమున కంతము గానలేకనూ భయవిహ్వల చిత్తంబులతో
అనాథలముగై విలపించుచునూ యలత నొందుచుంటిమి యిచటన్! 25

సంగ్రామంబున శ్రీరామునితో సామీప్యంబును బొందిన యా
దశగ్రీవుని మఱి దివిజులుసైతము దగ రక్షింపగ లేరుసుమా!
గంధర్వులు మఱి పిశాచంబులును ఘనులగు రాక్షసులును గూడన్!
రామబాణమున నుండి రావణుని రక్షింపగ జాలరు జగతిన్! 27

రాక్షసేంద్రునకు సంబంధించిన రాక్షసవీరులు జను తప్పుడున్,
ప్రతియుద్ధమునను నపశకునంబులు బన్నుగ యగబడుచుండె మఱిన్
అవి శ్రీరాముడు రాక్షసాసురుని నలరి వధింపగ గల సమయమున్,
తెల్పుచు నున్నవి యపశకునంబులు దీరుగ యని మానకునూ దెలియన్!

పితామహుండగు స్వయంభువునిచే ప్రీతిని యా దశగ్రీవునకున్,
దేవదానవులనుండి మఱియునూ దీరుగ రాక్షస వీరులచే
అభయ మివ్వబడె కానీ యాతడు నలరి మనుష్యులజేత మఱిన్
నభయంబును మఱి గోరలేదుకద యలరుచు నిర్లక్ష్యంబుననూ! 29

రాక్షసులకు మఱి రావణునకునూ రహి ప్రాణాంతక మైనదియున్
భయంకరంబగు మనుష్యువలనను బన్నుగ యాపద వచ్చినదీ!
సందేహంబును నింతలేదు మఱి సాక్షాత్తుగ యది వచ్చినదీ! 30

వరదానంబులజేత తపస్సుల వనరగ బలవంతుడు డైనా
యా రావణుచే బీడింపగబడు నలరు స్వర్గవాసులు వేగన్!
మహా తపంబులజేత బితామహు మానుగ యారాధించి మఱిన్! 31

మహాత్ముండునగు బితామహుండును మానుగ సంతోషించి మఱిన్
దివిజుల హితమును మది గోరుచునూ తీరుగ యింద్రాదుల తోడన్,
నీ విధముగ యుత్తమ వాక్యంబును నిమ్ముగ బలికెను యుక్తముగన్!32

ఆద్య ప్రభృతి సమస్తమైనా యల దానవులును రాక్షసులున్
నిత్యము భయమును గూడిననారై నిఖిల లోకముల యందుననూ!
దిరుగుచునుందురు దివి భువియంతయు ధీర్ఘయాత్రికులు దిరుగునటుల్!33

సురరాజగు నింద్రుని ముందిడుకొని సురలందఱు మఱి పయనించి,
వృషభ ధ్వజుడును మూడుపురములను వికలము జేసిన వాడు మఱిన్
ఆ పరమేశ్వరు నారాధించిరి యనుగ్రహంబును నందుటకున్! 34

ప్రసన్నుడైనా మహాదేవుడును బరగ సురలతో నిటు బలికెన్!
మీ హితంబు కొఱకును మఱియును యా మీరిన రాక్షస క్షయమునకున్
ఒక స్త్రీ బుట్టును భూమి యందునను నొనర రాక్షసుల క్షయమునకున్!35

పూర్వకాలమున యాకలి దేవత బొలుపుగ దానవు లందఱినీ,
దినివేసిన పక్షమున విధజులచే దీరుగ ప్రయుక్తమైనట్టీ,
రాక్షస వినాశమునకు బుట్టినా రమ్యమైన యా సీతయునూ
రావణాసురునితో మనందఱిని రయమున భక్షింపగ గలదూ! 36

దుర్వినీతుడును దుష్టబుద్ధియును దోషి రావణుని యవినీతిన్
శోకముతో పరిపూర్ణమైన యా శోచనీయమగు స్థితివచ్చెన్,
భయంకరంబగు వినాశంబునూ బలు బాధలు సంప్రాప్తించెన్. 37

ప్రళయకాలమున మృత్యువువోలెను బరగ రామచంద్రుని జేతన్!
నాక్రమింపబడి యుండినార మిట యాశలేదు బ్రతుకుట కింకన్!
లోకములో రక్షణము జేయుచును లోలత కాపాడెడి వాడున్
ఎవ్వండును గనిపించుటలేదూ! యెవ్వడు దిక్కిక లంకకునూ! 38

వనమునందు దావాగ్నులజేతను వనరగ జుట్టగబడినట్టి
కరేణువులవలె మహాభయంబున గడగి యుంటిమీ యందఱమున్!
ఆపదయందున జిక్కిన మనకును నాదుకొనెడి వాడును లేడూ! 39

మహాత్ముడగు నా విభీషణునిచే మఱి కాలమునకు దగినపనీ,
చేయబడినదీ యెవనిచేత మఱి భయము గలిగెనో యారీతిన్!
ఆ శ్రీరాముని శరణువేడెనూ యాతని దావునకును జేరెన్!
ఆ సమయమునకు ననుకూలముగా సరసత వర్తించెను నతడున్! 40

ఆ సమయంబున రాక్షసస్త్రీలును నందఱు బరస్పరముగూడీ,
కరములతో గౌగిలిని జేర్చుకొని గాఢముగా దుఃఖిత లగుచున్
అతి భయపీడితలై యీవిధమున యతి మిక్కిలి దిగులును జెందీ
సుదారుణముగా నుచ్చస్వరమునను క్రుక్కుచు రోదన జేసి రటన్! 41

(యుద్ధకాండమునందు 94వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి యుద్ధకాండము

## రెండవ భాగము

(తొంబది అయిదవ సర్గము)

(రావణుడు తన యమాత్యులను నందఱినీ బిలిపించి తన యుద్ధోత్సాహ
మును ప్రకటించుట—వారంతఱునూ యుద్ధరంగమును జేరి
తమ పరాక్రమమును జూపుట)

ఆ దశగ్రీవుడు లంకాపురంబునను నలరి ప్రతి గృహమునందుననూ
దుఃఖితలగు నా రాక్షస వనితల దురపిల్లుచు బహు విధములుగా
దీనమైన యావేదనమును మఱి దీనమైన రోదనయు వినెన్! 1

ఆ లంకేశ్వరుడైన రావణుడు నతిదీర్ఘముగా నిట్టూర్చి
ముహూర్తకాలము సమాధిస్థితుడై అహో! పరమక్రుద్ధుండగుచున్!
భీమదర్శము గలవాడాయెను భీతిని సమస్త భూతములున్! 2

దంతంబులచే పెదవులు గొఱుకుచు నంతులేని కోపంబుననూ,
యరుణారుణ నేత్రంబులతోడను నలరు ప్రళయ కాలాగ్నివలెన్!
రాక్షస సంఘముచేత గూడ మఱి రహి దుర్దర్శముగా నుండెన్! 3

క్రోధముచేతను నవ్యక్తములగు కూరిమి వాక్యంబుల తోడన్,
ఆ రావణాసురుడు నేత్రంబులతో నలరి కాల్చుచున్నట్లుగనూ,
అచట నిలిచినా యా మహోదరుని యలరు మహాపార్శ్వుని మఱియున్,

విరూపాక్షునీ సమీపమునగల వీరులు రాక్షసులను గాంచీ,
యావహంబునకు బయలుదేరవలె యాలస్యంబుమ లేకుండన్,
నాదు నాజ్ఞగా సైన్యముతోడను నయముగ దెలుపుడు నని బలికెన్! 5

ఆ రాక్షసులును నాదశగ్రీవుని యావచనము విని భయపడుచున్
ఆతని యాజ్ఞలను ననుసరించి మఱి యలరి సావధానము తోడన్,
ప్రభు విజయంబును గోరుచుండి మఱి బన్నుగ నిలిచిరి యంజలితో! 6

భీమదర్శనులు సమస్తమైనా భీకర రాక్షస వీరులునూ
'అటులే!' యని పలుకుచు వా రందఱు చటులాయుధములను గూడి!
స్వస్త్యయనంబును జేసికొనియు మఱి సరగున యుద్ధమునకు జనిరి! 7

మహారథులునగు నా రాక్షసులును మాడుగ న్యాయ విధానముగా
లంకేశ్వరుడగు నా రావణునీ శంకలేక పూజించి మఱిన్,
ప్రభువిజయంబును గోరుచుండి మఱి బన్నుగ నిలిచిరి యంజలితో! 8

అటు బిమ్మట యారావణాసురుడు జటుల క్రోధ మూర్ఛితు డగుచున్,
పకపక నవ్వుచు మహారాక్షసుల బన్నుగ వీక్షించుచు మఱియున్,
మహోదరుని యా మహాపార్శ్వునీ మానుగ విక్రమవంతుడగు!
విరూపాక్షుతో నీ విధి బలికెను వీరవాక్యముల ధ్వనించుచున్!

సహచరులారా! రాక్షసులారా! సరిగ వినుడు! నా వాక్యములన్,
ఈరోజున నా ధనుస్సునుండీ యిమ్ముగ విడువగ బడినట్టి
ప్రళయకాల యాదిత్యుని సమమగు బన్నుగ శరజాలముతోడన్,
ఆ సోదరులను రామలక్ష్మణుల నల యమక్షయమున కంపెదనూ! 10

ఈ సమయంబున రామలక్ష్మణుల యిమ్ముగ యని జంపుట వలనన్
అల ఖరునకు మఱి కుంభకర్ణునకు నల ప్రహస్తేంద్రజితులకు నే,
ఆత్మశాంతి మఱి గూర్చగలను నుమ! నలరు నాడు బలవీర్యములన్! 11

మద్బాణములను మేఘంబులచే మానుగ యాకాశంబు మఱిన్
ప్రకాశత్వమును నందగ నేరదు బన్నుగ దిక్కులుగూడ మఱిన్
ఆకాశము పైనున్న లోకమును నా సముద్రమును గూడ మఱిన్,
స్పష్టముగా గనిపింపగ నేరవు సరగున నా శరజాలమునన్! 12

ఇపుడు నాదు కార్ముకము జేత మఱి యిమ్ముగ తెక్కల బాణములన్
వానరవీరులలో ప్రధానులగు వనరగ గుంపుల నన్నిటినీ
వేలువేలుగా వధించి వేసెద వికటముగా రణరంగమునన్! 13

వాయువు వంటి తేజంబును గల వనరగ రథంబుజేత మఱిన్
కార్ముకమనెడి సంద్రమునుండి కదలెడి బాణతరంగములన్
వానరసేనను దుదముట్టించెద వనరగ నే నీ దినముననే! 14

వికసించిన పద్మంబుల వంటి విపుల ముఖంబులు గలిగిన యా
పద్మకేసరములను బోలిన యా బల్లిదులగు కపివీరులనూ
గుంపులనెడి చెఱువులకు వేగ నే కూర్మి యేనుగునవను వోలెన్
మథించివేసెద రాక్షసులారా! మానుగ వినుడీ యీ దినమున్! 15

ఆవహమందున నేడు నేను మఱి యా వానర యూథపులు మఱిన్
నాఱు బాణములతోని గూడినా నయముగ ముఖముల జేత నటన్!
కాడలతో గూడిన పద్మంబుల కమనీయముగా నింపి నటుల్
యుద్ధభూమినీ యలంకరింతును యుద్ధతి దివిజులు దిలకింపన్! 16

సంగ్రామంబున నేను నేడు మఱి సరి నే నొక్కొక బాణమునన్
గుంపులతోగూడిన వానరులను కూరిమి వృక్షంబుల తోడన్
సమరము జేసెడివారిని శీఘ్రము సరగున నూర్గురు నూర్గురనూ!
యావహమందున సంహరించెదను నలరి యమక్షయమునకు జనన్! 17

యుద్ధమునందున శాత్రవ వధచే యుద్ధతి రణరంగమునందున్
నెవని సోదరుడు జంపబడియెనో, యెవని సుతుడు హతమైనాడో
వారియొక్క కన్నీళ్ళు దుడిచెదను వనరగ వీరవిహారమునన్! 18

ఆవహమందున నేడు వానరుల యలరు నాదు బాణంబులచే
జీర్ణివేసెదను వారి దేహముల దిరముగ ప్రాణములును బోవన్
మరణించిన యా కపివీరులచే మానుగ బరుపగ బడినట్టి
మహీతలము పై భాగమంతయును మానుగ గప్పెద శవములచే! 19

నేడు యుద్ధమున నాశరములచే నేలబడిన శాత్రవులను వే
కాకులు, గ్రద్దలు మాంసంబుల దిను, గల పక్షులకును శీఘ్రముగన్
బరితృప్తిని గలిగించెద జూడుడు బన్నుగ రణరంగమునందున్! 20

శీఘ్రముగా నారథమును దెండూ సిద్ధము జేసియు రణమునకున్
నా కార్ముకమును దెండు వేగమున నయమ్ముగ శరజాలంబులతో
ఇచట గలిగినా నిశాచరులు మఱి యిమ్ముగ నాతో రణమునకున్
బయలుదేరు డిక యాయుధములతో బటుతర బరాక్రమము జూపన్! 21

దశగ్రీవుని యా వచనములను విని దారుణ భయంకరుడునైనా
మహాపార్శ్వుడును నచ్చట నిలిచిన మహాబలాధ్యక్షుల తోడన్
సైన్యమంతయు సిద్ధము జేయుడు! సరగున సంగ్రామంబునకున్! 22

మహా విక్రమము గలిగినట్టి యా మహాబలాధ్యక్షులు వేగన్
సంరబ్ధులునై లంకాపురమున సారెకు దిరిగుచు బ్రతిగృహమున్
రాక్షసులందఱ బ్రేరేపించుచు రయమున దిరిగిరి ప్రభువాజ్ఞన్! 23

అటుపిమ్మట మఱి భీమదర్శనము నలరు భీమ వదనంబులునూ
గలిగినట్టి యా రాక్షసులందఱు గలిగల ధ్వనులను జేయుచునూ
ఖడ్గంబులతో బట్టిసములతో గదలతోని శూలంబులతో
ముసలంబులతో హలములతోడను ముద్గరముల శక్తులతోడన్! 24-25-26

కూటంబులతో యష్టులతోడను గూరిమి యనేక విధములగూ
చక్రంబులతో గండ్రగొడ్డళుల శతఘ్నులను మఱి గూడికొనీ,
అన్య వరాయుధములను ధరించి యనేక ప్రహరణములతోడన్
ముహూర్తకాలము నందు సిద్ధమై మోరనెత్తి కేకలతోడన్!
రణరంగమునకు సాగిపోవుటకు రయమున వచ్చిరి ప్రభునాజ్ఞన్! 26

అటుపిమ్మట యా బలాధ్యక్షుడును నతి త్వరితంబును గూడికొనీ
రావణాసురుని యాజ్ఞ ప్రకారము రయమున సారథితో గూడన్!
ఎనిమిది గుఱ్ఱంబులను గట్టినా యిమ్ముగ రథమును గొనివచ్చెన్!
భయంకరుడగు రావణాసురుడు బన్నుగ తన తేజస్సులచే
ప్రకాశించుచుండిన యా రథమును బన్నుగ యధిరోహించె మఱిన్! 27

అటుపిమ్మట యా రావణాసురుడు జటుల రాక్షసుల గూడికొనీ
బలాధిక్యమున మహీతలంబును బన్నుగ చీల్చుచు నున్నాడా?
అనునట్లుగ వెడలెను నాతండుగు నలరు శంఖధ్వనులును మ్రోగన్! 28

అటుపిమ్మటను మృదంగంబులతో నలరు జటుల శంఖధ్వనులన్!
రాక్షస వీరుల కలకలములతో రహి తూర్యముల మహాధ్వనియున్!
నా యా ప్రదేశమును నిండియునూ యలరి వెడలె నాసమయమునన్! 29

ఛత్ర చామరములను గూడికొని సాహసవంతుడు నగువాడున్!
సీతాపహారి యగువాడును మఱి పెద్దప్రవర్తనయు గలవాడున్!
బ్రహ్మఘ్నుండును దేవకంటకుడు బన్నుగ రాక్షస రాజు మఱిన్!
రఘువీరునితో రణమును సలుపగ రయమున విచ్చేసెను ననుచున్!
కోలాహలధ్వని వినబడె నప్పుడు గురిమి భేరీ ధ్వనితోడన్! 30-31

మహాఘనంబగు నాధ్వని జేతను మానుగ భూమియు గంపించెన్!
వానర సేనయు నాశబ్దము విని మహాభయంబును జెందుచునూ!
దిక్కులబట్టియు బరుగులు దీసిరి దీనత ప్రకటించుచు నపుడున్! 32

మహాబాహువులు గలవాడును మఱి మహాతేజమును గలవాడున్!
రావణుడైతే మంత్రులతోడుత రయమున రాక్షస సైన్యముతో!
విజయంబును సాధింపగా దలచి వీరవిహారంబును సలుపన్!
రణరంగమునకు వచ్చి చేరెనూ రమ్య రథం బారోహించి! 33

ఆ సమయంబున రావణు నాజ్ఞను నలరు మహాపార్శ్వుండును మఱిన్
మహోదరుండును, విరూపాక్షుడును, మానుగ యెక్కిరి రథములనూ! 34

ఆ రాక్షసులును నుత్సాహముతో నలరు మహాధ్వని జేయుచునూ!
మేదిని బ్రద్దలు గొట్టుచున్నటుల మిగుల యడుగును బెట్టుగనూ!
జయాభిలాషను బయలు దేరిరి జయింప రఘువీరుని వేగన్! 35

అటుపిమ్మట తేజోశాలియునూ చటుల రాక్షసుల బలగముతో!
గూడినవాడును గాలాంతక యమ సూర్య సమానుండగువాడున్!
భయంకరుండగు రావణాసురుడు బన్నుగ యెత్తిన ధనుస్సుతో!
రణరంగమునకు బయలుదేరెనూ రాక్షస సైన్యము నడువగనూ! 36

అటుపిమ్మట యా మహారథుండును జటుల విక్రముడు రావణుడున్!
జవనాశ్వంబులు గట్టబడిన యా సరగున బోయెడి దురగములున్!

గలిగిన రథమును నధిరోహించియు బలవీర్యులునగు సోదరులున్!
రామలక్ష్మణులు నెచ్చటగలరో రయమున యా ద్వారము జేరెన్! 37

అటుపిమ్మట యాసూర్యుని కాంతియు నట తగ్గెను నంధ్యలు దొలికెన్!
దిక్కులు జీకటి వ్యాప్తిజెందెనూ దిశలు గాటుకలు వ్యాపించెన్!
భయంకరంబగు పక్షులు నఱచెను బిమ్మగ భూమియు గంపించెన్! 38

మేఘంబులు రక్తంబును గురిసెను మిగుల హయములును దొట్రువడెన్!
ధ్వజాగ్రమందున గృధ్రము వ్రాలెను దగ యమంగళము లైనట్టి!
నక్కలుగూడను గూసె నచ్చటను మిక్కిలి రోదన ధ్వనితోడన్! 39

ఆ రావణుని వామనేత్రమును నదిరెను మాటికి మాటికినీ.
వామబాహువును నాకంపితమై వడివడి ధనుస్సుబడె నేలన్!
వివర్ణ వదనుం డాయె రాక్షసుడు వికృత స్వరమును గలిగె నటన్! 40

అటుపిమ్మట నాదేవశత్రువగు చటుల రాక్షసుడు రావణుడున్!
రణభూమికి మఱి వచ్చుచునుండగ రణమునందు ఘటి యాతనికిన్!
మరణంబును సూచించు శకునములు మానుగ గనబడె నట్టి యెడెన్! 41

కాలచోదితుండై రావణుడును గడు భయంకరములగునట్టి!
సమరస్థిత యుత్పాతంబులనూ సరకు గొనక యజ్ఞానమునన్!
వినాశమునకే బయలుదేరెనూ విపులమైన క్రోధముతోడన్! 42

ఆ సమయంబున యంతరిక్షమున యతిభయంకరంబగు ధ్వనితో
ఉల్కానేలపై బడియెను నగ్నులు జిల్కుచు రణమార్గమునందున్!
అమంగళములగు రాబందులునూ యలరి కాకులను గూడికొనీ,
యఱచుట వినబడె యామార్గంబున యారావణుడును బయనింపన్! 43

మహాత్ములగు నా రాక్షసవీరుల మానుగ రథముల ధ్వనిజేతన్!
వానరవీరులు విని యాధ్వనులను వనరగ రణరంగమునందున్!
ఎదుర్కొనుటకును సంసిద్ధులునై కదిలి రందఱును మార్కొనగన్! 44

పరస్పరము రా! రమ్మని బిలుచుచు బహుక్రోధమ్మున రేగుచునూ!
జయాభిలాషులునై కదనమ్మున బయ శబ్దంబులు బలుకుచునూ!
వానర రాక్షస వీరుల మధ్యను వనర తుములరణమును జరిగెన్! 45

ఆటుదిమ్మట యాదశగ్రీవుండును జటుల క్రోధమున శీఘ్రముగన్!
కాంచన భూషణములు గలిగిన యా యంచితమగు శరజాలముచే!
వానరసేనల యందు జొచ్చి మఱి వనరగ యత్యధికమునైనా
శత్రువులను మఱి సంహరించెనూ సహచరులందఱు ముదమందరన్! 46

ఆ సంగ్రామమునందు రావణుడు అనేక వానర వీరులనూ!
శిరస్సులను ఛేదించివై చెనూ శీఘ్రము తన బాణంబులచే!
కొందఱి వక్షస్థలముల జీల్చెను గొందఱి బాహువులను నఱికెన్!
కొందఱి కర్ణంబుల ఛేదించెను కొందఱి పాదంబులను మఱిన్! 47

ఆవహమందున యా రావణుడును నా కపివీరుల గొందఱినీ
శ్వాసలేని వారినిగా జేసెను సరగున పార్శ్వములను జీల్చెన్!
కొందఱి శిరసులు బ్రద్దలు జేసెను గొందఱి నేత్రములను రాల్చెన్! 48

క్రోధ వివృత్తంబగు నేత్రములను గూరిమి రావణుడును మఱియున్,
సంగ్రామంబున యే వైపునకును సరగున బోవునో యా వైపున్!
వానర సైన్యము కపియూథపులును వనర రావణాసురు నెదుటన్,
నిలిచి యుద్ధమును జేయజాలకను నేలబడిరి వందలు వేలున్! 49

(యుద్ధకాండములోని 95వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### తొంబది యాఱవ సర్గము

[సుగ్రీవుడు రాక్షససేనను సంహరించి, విరూపాక్షుని సంహరించుట]

ఆ విధముగ యా దశగ్రీవుండును నలరు దనదు బాణంబులచే
ఛేదింపగబడి యవయవంబులను ఛేదించిన కపి వీరులచే
వసుధ యంతయును గప్పబడియెనూ వనర సందు లేకుండగనూ! 1

సహింప శక్యముగాని రావణుని సరగున విడువగ బడినట్టి
శరజాలంబున వానరవీరులు సరగున యగ్నిని మిడతలుగా!
సహింప శక్యముగాని వారలై సరగున బోయిరి దిక్కులకున్! 2

నిశిత బాణజాలంబుల జేతను నీరసులై యా వానరులున్
పావకార్చులను జుట్టుముట్టబడి బన్నుగ గాల్పగ బడుచున్నన్,
గజములవలె యఱచుచు గేకలతో కదిలి పాఱిపోయిరి వేగన్! 3

ఆ సంగ్రామము నందు రావణుని నలరు బాణముల గపిసేనల్
మహా వాయువును మేఘంబులునూ మానుగ జెఱిగిన యట్టులనూ,
ఆ రావణు శరములు గపిసేనల యటునిటు జెదరగ జేసె మఱిన్! 4

ఆ రావణుడును సమరము నందున యలరు దనదు బలవీర్యములన్!
వానరవీరుల సంహరించి మఱి వనరగ రణరంగము నందున్!
శీఘ్రముగా రఘువీరుని వైపుకు దిరముగ బోయెను నెదిరింపన్! 5

సుగ్రీవుడు మఱి రణమునందునను శూరులైన కపివీరులునూ
పీడింపగబడి పాఱిపోవుటను గాడి దప్పుటను గాంచి మఱిన్,
దన గుల్మంబున సుషేణునుంచీ తా రావణుతో పోరాడన్
మదిని నిశ్చయముజేసి యాతడును మానుగ దుమికెను రణమందున్! 6

సుగ్రీవుడు దనపును సదృశుడౌ సుషేణు నచ్చట నిలిపి మఱెన్,
మహా వృక్షమును జేత గ్రహించి మానుగ శత్రువు కభిముఖుడై
ఎదిరింపగ మఱి బయలుదెరెనా మది ధీరత్వము బెనుగొనగన్! 7

సమస్తమైనా కపియూథపులును సరగున ద్రుమముల ధరియించి,
మహాశిలల ధరియించియు మఱియును మహావిటపముల బట్టుకొని,
ఆ సుగ్రీవుని పార్శ్వములందున నలరి వెనుక భాగములందున్,
ననుసరించి రణమునకు జనిరి యా సుగ్రీవుని వెనువెంటన్! 8

మహాకాయమును గల సుగ్రీవుడు మహాస్వరముననును గర్జించెన్
నాహవమందున నా రాక్షసులను నటునిటు గమ్ముచు శీఘ్రముగన్!
మహారాక్షసుల రణరంగంబున మథించి వేసెను గర్వముగన్! 9

మహావీర్యుడగు సుగ్రీవుండును మానుగ యుగాంత సమయమునన్
మహావాయువున బెరిగిన తరువుల మానుగ గూల్చినయటు విధిని,
ఆ రాక్షసులను కదనమునందున యణచివేసె మర్దించె మఱిన్! 10

కాననమందున మహామేఘమును గనల పక్షి సంఘము లందున్,
అశ్మవర్షమును గురిసినట్లుగా నా రాక్షస సేనలపైని,
శిలావర్షమును గురిపించెను మఱి శిరములు బ్రద్దలు యగునటులన్! 11

కపిరాజగు సుగ్రీవుని జేతను గదనమందు యా రాక్షసులున్,
శిలావర్షమున దలలు బ్రద్దలై చెదిరిబడిరి రణరంగమునన్!
జిమ్మగ బడినా పర్వతమును వలె చెదిరి వసుధబడి పోయి రటన్! 12

అటువిమ్మట సుగ్రీవుని జేతను జటుల శిలలచే గొట్టబడి,
మోడింపగబడి, పీడింపగబడి యొనరగ నేలను బడుచున్నా
అస్మి వైపులను బరుగులెత్తుచును నడచుచున్న యసురుల గాంచి,
మద్దర్షుండును రాక్షసుడైనా దూర్త విరూపాక్షుడు మఱియున్,
మహాకార్ముకము ధరించి వేగము మానుగ తన నామముదెలిపి,
రథమునుండి మఱి క్రిందికి దుమికి రయమున గజమును నెక్కె నటన్!

మహాబలుండగు విరూపాక్షుడును మానుగ ద్విపమును నెక్కి మఱిన్,
బిమ్మట మహాభయంకరంబునగు బిట్టుగ ధ్వనులను జేయుచునూ,
వానర వీరులపైకి బోయెనూ వనరగ వారల మర్దింపన్; 15

సేనాముఖమున నిలిచినట్టి యా శీఘ్రము సుగ్రీవునిమీదన్
భయంకరములగు బాణంబులనూ బన్నుగ విడిచెను రాక్షసుడున్,
దిగులు జెందినా యా రాక్షసులకు ధీరత్వంబును గలిగించీ,
యుత్సాహముతో నిలబడునట్లుగ యుసికొల్పెను గపివీరులపై! 16

ఆ రాక్షసుడును వాడిబాణముల నలరుచు గొట్టగ రవిసుతుడున్,
బాధతోని బిట్టుగ దా నఱచెను బన్నుగ రోదసి ధ్వనియింపన్!
బిమ్మట క్రోధముతో సుగ్రీవుడు భీమ బలుడు నా రాక్షసునీ,
వధియింపగ మది నిశ్చయించుకొనె వనరగ దన బలవీర్యములన్! 17

అటుబిమ్మట శూరుడు బలీయుడును నలరు సమరమున నేర్పరియున్
నగు సుగ్రీవుడు యుద్ధభూమిలో నా రాక్షసు వే వధియింపన్,
మహావృక్షమును గ్రహించి జేతను మానుగ సమీప్యమును జనియున్,
రాక్షసు డెక్కిన మహాగజంబును రయమున గొట్టెను ముఖమందున్! 18

సుగ్రీవునిచే గొట్టబడిన యా సురుచిర మహాగజంబు మఱిన్
ధనుర్మాత్ర దూరముతో నిలిచియు దగ దూలియు నేలను బడియెన్!
మరణించుచు ఘోరముగా నఱచెను మానుగ దిక్కులు ధ్వనియింపన్! 19

అటుబిమ్మట మఱి వీర్యవంతుడగు జటుల విక్రముడు రాక్షసుడున్
జంపబడిన యా గజమును వదిలీ కంపము నొందుచు వేగముగన్
శత్రువైన యా సుగ్రీవునకును నాత్రమునను మఱి యభిముఖుడై
ఎద్దు చర్మమున జేసిన డాలును బద్దుగ ఖడ్గంబును దాల్చి
నేర్పరితనమును జూరుకు దనమునూ నిజ విక్రమమును జూపుచునూ,
నిలిచియున్న యా సుగ్రీవునిపై యులుకులేక మీదికి జనియెన్! 20-21

సుగ్రీవుండును విరూపాక్షుపై సురుచిరముగ సంక్రుద్ధుండై
మేఘము వంటిది విశాలమైనా మేటి శిలను జే గ్రహియించీ,
విరూపాక్ష రాక్షసుపై విసిరెను వికటముగా నఱచుచు నపుడున్! 22

ఆ సమయంబున సువిక్రాంతుడగు నా రాక్షస పుంగవుడు మఱిన్
మీదికి వచ్చెడి శిలను గాంచి మఱి మెలకువతో బక్కకు దొలగీ,
ఖడ్గముతో గపిరాజును గొట్టెను గఠినముగా రణరంగమునన్! 23

బలవంతుండగు నా రాక్షసుచే ప్రబలమైన ఖడ్గము జేతన్
గొట్టబడిన యా సుగ్రీవుండును గూరిమి ముహూర్త కాలంబున్!
భూమియందు బడె సంజ్ఞలేకనూ బొరలుచు గలతను బొంది మఱిన్! 24

ఆ సమయంబున యావహమందున యా సుగ్రీవుడు శీఘ్రముగన్
పైకి యెగిరియును బిడికిలి బిగించి బన్నుగ నిజబల శక్తులతో
ఆ రాక్షసునీ వక్షస్థలమున యలరి గొట్టె బహు దీవ్రముగన్! 25

ముష్టిప్రహారముజేత రాక్షసుడు నష్ట సంజ్ఞగల వాడగుచున్!
మఱల గోలుకొని విరూపాక్షుడును మఱిసేనాగ్రము నందుననూ!
నిలిచిన యా సుగ్రీవుని కవచము నేలను బడగొట్టెను వేగన్!
ఖడ్గప్రహారము దిన్న రవిసుతుడు గలత నలతలను బొంది మఱిన్
దొట్రుబడుచు మఱి పాదంబులచే దోరముగా నేలను బడియెన్! 26

నేలబడిన యా సుగ్రీవుండును నిలిచి బిడుగునకు సమానమున్
నరచేతను బహు భయంకరధ్వని యలరి గలుగు విధమున నపుడున్
ఆ రాక్షసునీ యుద్దేశించియు నలరి గొట్టగా యత్నించెన్! 27

ఆ రాక్షసుడగు విరూపాక్షుడును నా సుగ్రీవుని ప్రహారమున్
నతి ఐతురత దప్పించుకొనియు మఱి యాతని వక్షస్థలమందున్
ఓడికిలిచేతను గొట్టి వేగమున గడగి తనదు బలవీర్యములన్! 28

అటుపిమ్మట యా వానరేశ్వరుడు నా సుగ్రీవుడు రణమందున్
తనదు ప్రహారము నా రాక్షసుడును దగ దొలగుటయును గమనించీ,
మహాక్రోధమున మండిపోయెనూ మానుగ కన్నులు నెఱ్ఱబడన్! 29

అ సుగ్రీవుడు విరూపాక్షుడును నసావధానముగా నున్నా!
యవకాశంబును నొనర గాంచి మఱి యా రాక్షసు కణతల పైనన్!
బలముగ తన యఱచేత గొట్టెనూ బన్నుగ రక్తము నొలుకగనూ! 30

ఆ దేవేంద్రుని వజ్రసముండును నఱజేతను గొట్టగబడినా!
విరూపాక్షరాక్షసుడు వేగమున వికలత సంజ్ఞను గోల్పోయెన్!
జలపాతమునగు మార్గమునుండీ జలమును ప్రవహించుటను వలెన్!
నాశికాది రంధ్రములనుండియును నయముగ రక్తముగార్చుచునూ!
రక్తముజేతను దడిసి ధరణిపై శక్తియు పీడియు మరణించెన్! 31-32

అచటగలుగు వారందఱు గాంచిరి యా నమయంబున రాక్షసునీ!
వివృత్త నయనములును గలవాడును విపరీతములగు నురుగులునూ!
గూడిన వాడును రుధిరంబులతో కూరిమి నిండిన వాడు మఱిన్!
వికృతంబులగు నేత్రంబులతో వివరీతమునగు రూపమునన్!
నున్నవానిని విరూపాక్షునీ చెన్నుగ గాంచిరి యట్టియెడన్! 33

కాళ్ళుచేతులును గొట్టుకొనుచునూ గడగి పార్శ్వముల సాయమునన్!
నేల బొరలుచున్నట్టి వానినీ కాలముచే వంచింపబడీ!
రక్తముజేతను దడిసిన వాడును రహి కరుణాపూర్ణముగ నటుల్!
యఱచుచున్న యా భీమరాక్షసుని యలరి గాంచి రా వానరులున్? 34

అ విధముగ సంగ్రామమునందున యలరి కలిసి వేగముగలుగా!
భయంకరమునగు వానర రాక్షస బటు సేనాసంద్రంబులునూ!
భిన్నసేతువులు గల యుదధులవలె భీకర ధ్వని జేసినవి యటన్! 35

కపిరాజగు సుగ్రీవుని జేతను గడగి వినాశము నైనట్టి!
మహాబలము గల విరూపాక్షుగని మానుగ సమేతమై యున్నా!
వానరరాక్షస సైన్యంబులునూ వనరగ విజృంభించిన యా
గంగానదివలె గనబడుచుండెను గల్లోలిత మగు దరగలతో! 36

(యుద్ధకాండమున తొంబదియారవ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామ కథా సుధా లహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### తొంబది యేడవ సర్గము

(సుగ్రీవుడు మహోదరుని సంహరించుట)

ఆహవమందున యా సైన్యంబులు నా వానర రాక్షసవీరుల్!
యన్యోన్యంబును జంపుకొనుచు మఱి యా విధమున బోరాడుచునూ!
మహా గ్రీష్మమున సరస్సులకువలె మానుగ క్షీణత్వము నందెన్! 1

రాక్షసాధిపుండైన రావణుడు రథి దన సేనలు జచ్చుటయున్!
విరూపాక్షరాక్షసు వధజేతను విపరీతమునగు క్రోధమునన్!
అరుణ నేత్రములు గల వాడాయెను నలరి పెదవులను గొఱుకుచునూ! 2

వలీముఖులచే సంగ్రామంబున వధ్యమానమును క్షీణించి
యున్న తనదు సైన్యమును గాంచియును జెన్నుగ దైవ విపర్యయమున్!
మనసున యాలోచించి రావణుడు మఱి బహువిధముల వ్యథజెందెన్! 3

అటుపిమ్మట యా రావణాసురుడు నతి సమీపమున నుండిన యా
అరిందముండగు మహోదరుని నట యఱచి బిలిచి యిటులను పలికెన్!
'అరిందమా- ఓ మహోదరా' విను! నాలకింపు నా వచనములన్!
నీసమయంబున నా జయంబు స్థితి యిమ్ముగ యాశలు నీపైనే
నిలిచియున్నవి నా జీవితమును నీ భుజములపై గలదు సుమా! 4

మహావీరుడా! మహోదరా విను! మానుగ జంపుము శత్రువులన్!
నీ పరాక్రమము బ్రదర్శింపగా నిజమగు సమయము నిదియె సుమా!
ప్రభువుబెట్టినా యన్నమునకు మఱి బన్నుగ ఋణమును దీర్చుటకున్!

సమయ మిదే సుమ! యుద్ధము సేయుము సాగి శత్రువుల గూల్చు ధరన్
ఆ రావణుని వచనములను విని యా మహోదరుడు దలవంచి!
'అట్లే జేసెద!' ననుచు బలుకుచును నలరి పతంగము నగ్నులలో
ప్రవేశించినటుల శత్రుసైన్యమున బరగ బోయె శత్రుల దునుమన్! 6

అటుపిమ్మట యా మహాబలియుడు చటుల తేజమును గలవాడున్
ఆ మహోదరుడు ప్రభువాక్యములను నలరు దనదు వీర్యము జేతన్!
ప్రేరేపింపగబడి వానరులను బిట్టుగ సంహారము జేసెన్! 7

మహాసత్త్వులగు వానరులును మఱి మహా శైల శిఖరంబులనూ!
ఎత్తిబట్టుకొని భయంకరంబగు నిమ్మగ శత్రుల సైన్యములో!
ప్రవేశించి రాక్షసుల నందఱను బన్నుగ జంపిరి రణమందున్! 8

మహోదరుడు సంగ్రామమునందున మానుగ సంక్రుద్ధుండగుచున్
కాంచన భూషణములు గల శరముల యంచితముగ కపివీరులయున్!
పాణిపాదములు నూరువులను మఱి బన్నుగ ఛేదించెన్ వేగన్! 9

అటుపిమ్మట యా సమస్త కపులును జటుల రాక్షసుల పీడనలన్!
సహింపజాలక కొందఱు కపులును సరగున బోయిరి దిక్కులకున్!
మఱికొందఱు మఱి యాశ్రయించిరీ మానుగ సుగ్రీవుని యపుడున్! 10

సమరంబునను బరాజితమునై సరగున వానర సైన్యంబున్
బరుగెత్తుటను గాంచి రవిసుతుడు బన్నుగ సుగ్రీవుం డపుడున్!
సమీపంబునను గల మహోదరుని సరగున యెదురుగ బరుగెత్తెన్! 11

మహాతేజమును గల హరీశ్వరుడు మహీధరముతో సమానమున్!
భయంకరంబును విశాలమైనా బరగ శైలశిల గ్రహియించీ!
మహోదరుని సంహారముజేయగ మానుగ యాతనిపై విసిరెన్! 12

అటుపిమ్మట యా మహోదరుడునూ హఠాత్తుగా వచ్చుచునున్నా
దురాసదంబగు నా మహాశిలను తోరముగా గాంచుచు దానిన్!
మనసునందు భయపడక వేగమున మానుగ శరముల ఛేదించెన్! 13

ఆ సమయంబున నా రాక్షసుచే యలరి వేయివ్రక్కలు గాగన్!
ఛేదింపగ బడినట్టి యా శిలయు శీఘ్రము నంబర మందుననూ!
గృధ్రచక్రముగ మహీతలంబున ఛిద్రమునై వేగము రాలెన్! 14

ఛిన్నాభిన్నముజేసిన శిలనూ ఖిన్నుగ సుగ్రీవుడు గాంచీ
క్రోధమూర్ఛితుండై యాతండును గూరిమి సాలము నొకదానిన్,
బెరికి విసెరెనూ మహోదరునిపై భీకరుడగు నా రాక్షసుడున్
అనేక విధముల దానిని ద్రుంచెను నలరి వ్రయ్యలుగ వ్రయ్యలుగా! 15

శూరుండును నగు మహోదరుండును సూది మొనలుగల బాణములన్
నా సుగ్రీవుని జీల్చివేసెనూ నా రాక్షసులును ముదమందన్!
నా సమయంబున గోపించిన యా యతిసాహసుడగు రవిసుతుడున్!
మహీతలంబున బడియుండిన యొక మహాపరిఘనూ గాంచె నటన్! 16

ప్రకాశించు చున్నట్టి పరిఘనూ ఖిన్నుగ గ్రహించియును నతడున్,
నేలమీద గొట్టుచు నా బరిఘను వలరి రాక్షసుకు జూపి మఱిన్!
ఉగ్రవేగమున బరిఘజేత మఱి యురుతరమున నగు హయంబులన్!
రణరంగంబున జంపివేసెనూ రయమున ధన బల వీర్యములన్! 17

అటుపిమ్మట యా మహోదరుండును జటుల హయంబులు మరణింపన్!
రథమునుండి మఱి క్రిందికి దుమికెను రయమున గోపించియు వేగన్!
మహాగదను గ్రహియించి రాక్షసుడు పూనుగ రవిసుతు పైకి జనెన్! 18

మహావృషభములవోలె నిద్దఱును మానుగ గర్జించుచును మఱిన్
గదను పరిఘలను హస్తములందున కదనము నందున గ్రహియించీ,
ఉఱుములతో మెఱుపులతో గూడిన యురుతర మేఘంబుల వోలెన్!
మహాధ్వనులు జేయుచు వారప్పుడు మానుగ యుద్ధము సలిపిరటన్! 19

అటుపిమ్మట యా మహోదరుండును నటు రవి సుతుపై గోపించీ
జ్వలించుచుండిన భాస్కరకాంతిని సరగున యా ఘన గద బట్టీ
కపిరాజగు సుగ్రీవునిపైకిని కఠినముగా విసిరెను సపుడున్! 20

ఆవహమందున వచ్చిపడుచున్న యట్టి మహాగద గాంచి మఱిన్,
మహాబలీయుడు, రోషముజేతను మానుగ తామ్రాక్షుడునైనా,
హరీశ్వరుండగు సుగ్రీవుండును నలరు మహాపరిఘను నెత్తి

ఆ మహోదరుని గదను గొట్టెనూ యతిబల వీర్యములును వెలయన్!
కానీ యా సుగ్రీవుని బరిఘము గడు వేగము గద ఢీకొనియున్
బరిఘ భూతలమునందు బడియెనూ బరగ విరుగగొట్టగ బడియున్!21-22

అటుబిమ్మట దేజస్వియునైనా యా సుగ్రీవుడు వేగముగన్,
వసుధాతలమున హేమభూషితము పనరగ భయంకరమునైనా!
ఆయస వికారమైన ముసలమును నలరి గ్రహించెను హస్తమునన్! 23

రవిసుతుండు మఱి యా ముసలమునూ రయమున నెత్తియు నటు విసిరెన్
నారాక్షసుడును రవిసుతుపైకిని నలరెడి మహాగదను విసిరెన్,
రెండును నన్యోన్యము ఢీకొనియును బిండి బిండిగా నేలబడెన్! 24

అటుబిమ్మట తేజోబలములతో నలరెడి వీరులు నిరువురునూ
బిన్నాయుధములు గలవారగుచును భీమబలాఢ్యులు నిరువురునూ
మండుచున్న యగ్నులకును బోలెను మెండుగ బిడికిళ్ళను బట్టీ
ముష్టియుద్ధమునకును దలబడిరీ జేష్టలు దక్కక రణమందున్! 25

వారిరువురునూ మాటిమాటికినీ పనరగ కేకలు వేయుచునూ
పరస్పరంబును బాహాబాహీ బన్నుగ పోరాడిరి వారున్,
సరజేతులతో బాదుకొనుచునూ యలసి మహీతలమున బడిరీ 26

ఆసమయంబున వారిరువురునూ యలరుచు శీఘ్రము బైకెగిరీ
బరస్పరంబును గొట్టికొనిరి మఱి బన్నుగ ముష్టితలంబులతో!
భుజముల జేతను నన్యోన్యంబును బొలుపుగ ద్రోసిరి నెట్టుచునూ! 27

శత్రు వినాశకులైన వీరులును శత్రుత్వంబున బోరుచునూ
బాహు యుద్ధమున బహుశ్రమ నందిరి బన్నుగ రణరంగమునందున్,
అట్టి సమయమున మహాజవముగల జట్టియైన యా రాక్షసుడున్
సమీపమున బడియున్న ఖడ్గమును సరుగున డాలును గ్రహియించెన్! 28

ఆవిధముననే మహాజవముగల యల రవిసుతుడును రణభూమిన్
ధరణిపైనిగల మహాఖడ్గమును దగ డాలును వే గ్రహియించెన్! 29

అటుబిమ్మట రోషముతో గూడిన బటు దేహంబులు గలవాడున్,
ఎత్తబడిన ఖడ్గంబులు గలిగిన సత్త్వంబులు గలవారు మఱిన్
శస్త్రవిశారదులైన వారలును శత్రు మర్దనులు నగువారున్!
వారిరువురునూ యుద్ధమునందున వనరగ సంతస మందుచునూ!
మహాధ్వనులు జేయుచు వారిరువురు మూనుగ బోయిరి యభిముఖులై! 30

అన్యోన్యము నభి సంక్రుద్ధులునై నలరి విజయమును గోరుచునూ!
యేకాగ్రులు నగు వారివురునూ యిమ్మగ బ్రదక్షిణంబులుగా!
మండల భ్రమణము జేసి తప్పుడును మెండుగ దొడలను గొట్టుచునూ! 31

శూరుండును మఱి వీర్య శ్లాఘియును దుష్కృతి మహోదరుండప్పుడున్
మహావేగమును గలవాడగుచును మూనుగ రవిసుతు హస్తమునన్!
గలిగిన డాలును దన ఖడ్గంబును జెలగి వేసె బహు తీవ్రముగన్! 32

డాలుపైని నాటిన ఖడ్గంబును జెలగి లాగు నా రాక్షసునీ
కపి కుంజరుడగు సుగ్రీవుండును గఠినమైన దన ఖడ్గమునన్!
శిరస్త్రాణమును గూడియుండినా శ్రీకరమగు కుండలములతో,
కూడియుండినా యాతని శిరసును గూరిమి దెగవేసెను వేగన్! 34

నికృత్తశిరసును గల రాక్షసుడును నేలమీద బడిపోవగనూ,
కదనమందుగల రాక్షస మూకయు గనలుచు దానిని జూచి మఱిన్!
ఒక్కడు మిగులక జక్కగబోయిరి దిక్కులకును మఱి దిశ ఢకునూ!
ఆ రావణునీ సైన్యమంతయును నారిన దీపమువలె నాయెన్! 33

వానరేంద్రుడగు సుగ్రీవుండును వనరగ మహోదరుని జంపి
సంతసించుచును గపి వీరులతో జింత దీరె ననుచును బలికెన్!
విజయ నాదములు జేసెను నాతడు వీరులందఱును సంతసిలన్,
రావణునకు మఱి క్రోధముగలిగెను రామచంద్రునకు సంతసమున్! 35

సమస్తమైనా రాక్షసవీరులు సరగున విషణ్ణవదనులునై
దీనమైన చిత్తముగలవారై దిశలు గాంచుచును వేగముగన్!
భయవిత్రస్త జేతసులై వారలు బరుగులు దీసిరి లంకకునూ! 35

సూర్యాత్మజుడగు సుగ్రీవుండును సురుచిరముగ నొక పర్వతమున్,
దూరముగా బడవేయబడిన యా తోరమైన భాగంబు వలెన్,
నుండినట్టి యా మహారాక్షసుని చండి నేలపై బడవేసి,
అప్రధృష్యుడగు సూర్యదేవుడును నలరి ప్రకాశించిన యటులన్
సుగ్రీవుండును విజయలక్ష్మితో సురుచిరముగ నట విలసిల్లెన్! 37

ఆ సమయంబున యుద్ధరంగమున నటవిజయము సాధించిన యా
భానుసుతుని దేవతలు, సిద్ధులును బన్నగ యక్షులు, కిన్నరులున్
భూమిమీదగల భూత సంఘముల భూరి సంతసము నొంది రటన్,
తనివిదీర యా వీరుని గాంచిరి దగ కీర్తించుచు బహుళమునన్! 38

(యుద్ధకాండములోని 97వ సర్గము-సమాప్తము)

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి (యుద్ధకాండము)

## రెండవ భాగము

### తొంబది ఎనిమిదవ సర్గము

(అంగదుడు మహాపార్శ్వుని జంపుట)

సుగ్రీవునిచే మహోదరుండును గ్రుక్కూలుట గమనించియు వేగన్,
మహాబలముగల మహాపార్శ్వుడును మానుగ గాంచియు దిమ్మటనూ!
క్రోధరక్త నేత్రంబుల దోడుత క్రూరిమి బాణసమూహమునన్,
వాలి సుతుండగు నా యంగదుని వనరగ భయంకరమునైనా
సైన్యంబును క్షోభింపగ జేసెను సహజ తనదు బల వీర్యములన్!

ఆ రాక్షసుడును ముఖ్యులైన యా యలరు రాక్షసుల శిరస్సులన్,
వాయువు చెట్టుమలనుండి ఫలములను వరుసగ రాల్చిన యట్టులనూ,
దేహంబుల నుండియు మఱి రాల్చెను దీరుగ తన శర జాలమునన్! 2

అటుబిమ్మట యా మహారాక్షసుడు నలరుచు విజృంభించి మఱిన్
బహు తొందరబడుచును గపి వీరుల బాహువులను ఛేదించియునూ,
కొందఱి పార్శ్వములను ఛేదించెను కూరిమి తన బాణంబులచే! 3

మహాపార్శ్వునీ బాణవేగమున మానుగ బీడింపగబడినా,
యా వానర సేనయు సమస్తమును నట విషాద విముఖత నొందీ,
గత చేతసులై పోయి రందఱును కాంతి దక్కి రణరంగమునన్, 4

అత డంతటను రాక్షసు చేతను భంగపడిన సేనన గాంచీ
పర్వములందున సాగరమును వలె బన్నుగ జవమును గలవాడై
మహోత్సాహమును జూపె నంతటను మానుగ దీరత విలసిల్లెన్! 5

వానర శ్రేష్ఠుడు నంగదు డంతట వనరగ రవి కిరణంబులతో
సమానమైనా కాంతిగలిగినా సరసత యాయస వికారమున్
గలిగిన బరిఘను గ్రహించి యాతడు కదనరంగమున శీఘ్రముగన్
మహాపార్శ్వుపై బడవేసెను మఱి మానుగ తన బల వీర్యములన్! 6

ఆ రాక్షసుడగు మహాపార్శ్వుడును నా ప్రహరణమున వేదనతో
సంజ్ఞను గోల్పోయిన వాడగుచును సారథి సహితముగా నతడున్
రథమునుండి మఱి క్రిందికి బడెనూ రయమున రక్తము గ్రక్కుచునూ 7

తేజస్వియు మఱి నీలాంజనచయ దీరుగ సమానుడగు వాడున్
సుమహావీర్యుడు జాంబవంతుడును శూరత కోపముజెంది మఱిన్
మేఘసమానము నగు సైన్యంబును మేటి వీరులను నటవిడిచీ,
ఎగిరివచ్చి బహుక్రోధముతోడను నిమ్ముగ పర్వత శిలవంటీ
విశాలమైనా శిలను గ్రహించీ, వీరత్వంబున రాక్షసునీ
హయముల జంపెను, రథమును గూడను నలరుచు ముక్కలుగా జేసెన్ 8

ముహూర్తకాలములో రాక్షసుడును మోదమునను జేతన నందీ
అనేకంబులగు శరముల జేతను నాయంగదునీ గొట్టెనటన్!
ఋక్షరాజునగు జాంబవంతునీ భీషణ బాణంబుల జేతన్
వక్షస్థలమున గొట్టె మఱియునూ వనరగ యటగల గవాక్షునీ
బహుబాణంబులజేత గొట్టెనూ బాధ నొంద రణరంగమునన్! 10-11

అంగదు డంతట శరపీడితులగు సంగతి జాంబవంతు మఱిన్
నా గవాక్షునీ బరికించియునూ యనంత కోపావేశముతో!
భయంకరంబగు బరిఘ గ్రహించెను బన్నుగ శత్రుని హతమార్పన్! 12

వాలి సుతుండగు నంగదు డంతట వనర సరోషాక్షంబులతో
గూడినవాడై రవిరశ్మలతో గూరిమ సమాన కాంతులునూ
గలిగియు నాయస వికారంబునగు గల బరిఘను చే ధరియించీ
రెండు భుజములను ద్రిప్పుచు దాని మెండుగ దూరస్థితుడైనా
రాక్షసుడగు నా మహాపార్శ్వనీ రయమున వధింపగా దలచీ
విసిరె దనదు భుజవీర్యంబులనూ విచ్చి బడగ రాక్షసు శిరసున్! 13-14

బలవంతుండగు నంగదు జేతను బన్నుగ విసిరిన బరిఘయునూ
యా రాక్షసుడగు మహాపార్శ్వనీ హస్తమునుండియు వేగముగన్
శరమును గూడిన మహాధనుస్సును శిరస్త్రాణమును బడగొట్టెన్! 15

ప్రతాపవంతుండైన యంగదుడు బన్నుగ క్రుద్ధుండై మిగులన్
వేగముగా రాక్షసు నమీపమును డేగ వోలె మఱి జేరి మఱిన్
కుండలంబులను గూడిన యాతని మండితమగు ముఖమందుననూ
కర్ణమూలమున దన యఱచేతను గడు బలమున గొట్టెను నతనిన్! 16

మహాజవంబును మహాద్యుతియుగల మహాపార్శ్వడును గ్రుద్ధుండై
ఒక హస్తమునను సుమహాంతంబగు నొనర గొడ్డలిని గ్రహియించెన్! 18

పరమక్రుద్ధుడగు రాక్షసుడంతట బన్నుగ శైలముజేత మఱిన్
శుభ్రము జేయగబడినది మఱియును సురుచిర విమలం బైనదియున్

శైలసారమైనదియును మఱియును జలనము గలిగినదియు మఱియున్
దృఢమైనది యా గండ్రగొడ్డలిని ధీరుడైన యంగదు పైకిన్
ఆ రాక్షసుడును విసెరె నంతటను నటునిటు ధ్వనులును గలుగంగన్! 18

క్రోధముతో గూడిన యంగదుడును గూరిమి రాక్షస వీరునిచే
వామభుజమునను ప్రయోగించినా వసరగ యా పరశువును మఱిన్
చాకచక్యమున ప్రక్కకు దొలగెను జతురతో దప్పించుకొనెన్ 19

పితృ తుల్యమగు బరాక్రమముగల వీరుడైన యాయంగదుడున్
నుసంక్రుద్ధుడై వజ్రసమానము సుతీవ్రంబునగు బిడికిలినీ
దృఢముగ బిగించి సాగె ముందునకు ధీరత యా రాక్షసు కడకున్ 20

మర్మజ్ఞుండగు నంగదు డంతట మానుగ రాక్షసు వక్షమునన్
ఇంద్రుని వజ్రమువంటి స్పర్శగల సాంద్రమైన దన పిడికిలినీ
ఒక్కపోటు బొడిచెను రాక్షసునీ బిక్కటిలగ ధ్వనిజేసి మఱిన్ 21

అట్టి మహాసంగ్రామమునందున యిట్టి బిడికిలీ పోటునకున్!
ఆ రాక్షసునీ వక్షస్థలమును నటబ్రద్దలు బ్రద్దలు నయ్యెన్!
మరణించియు మఱి నేలనుబడెను మానుగ యమక్షయమునకు జనెన్! 22

ఆరణ భూమిని యారాక్షసుడును నటబడి మరణింపగ నతడున్,
రాక్షససైన్యము క్షోభను జెందెను రావణునకు రణరంగమునన్,
మహాక్రోధమును గలిగెను మఱియును మానుగ జింతాక్రాంతుండై! 23

సంతోషించిన వానరవీరులు సంతసమున గంతులువైచీ
సింహనాదమును జేసి రంతటను స్థిరముగ దిక్కులు ధ్వనియింపన్!
ఆధ్వనులును బురుజులతోడను మఱి యలరు గోపురములనుగూడీ,
యున్నలంకనూ బ్రద్దలు జేయుచు నున్నవి యనునట్లుగ నిండెన్!24-25

ఇంద్రశత్రువగు రాక్షసేంద్రుడును సాంద్రమైన యా రణభూమిన్,
దివిజుల యొక్కయు, వనౌకసులయును దీవ్రమైన ధ్వనులను వినియున్!
సరోషుండునై మఱల రణమునకు సంసిద్ధుడునై నిలిచె నటన్! 26

[యుద్ధకాండమునందు 98వ సర్గము సమాప్తము]

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటయొకటవ సర్గము

(రాముడు విలపించుట- హనుమంతుడు దీసికొనివచ్చిన ఔషధిని సుషేణుడు నివ్వగా లక్ష్మణుడు మూర్ఛనుండి దేరుకొనుట)

బలవంతుడగు రావణు జేతను బరగ శక్తిచే గొట్టబడీ
రణరంగంబున రక్తముజేతను రయమున దడిసినవాడు మఱిన్!
శూరుడైన యాలక్ష్మణ వీరుని జూచుచు నారఘువీరుండున్
దశగ్రీవునితో భయంకరంబగు ధగ యుద్ధంబును జేయుచునూ!
శరజాలంబుల విడుచుచునే మఱి సావధాన చిత్తుం డగుచున్
సుషేణుతోడను నీరీతిగనూ సువ్రతుడగు రాముడు వలికెన్! 1-2

రావణు పరాక్రమమును నేలపై రహి బడినట్టియు వాడు మఱిన్!
వీరుడైన యా లక్ష్మణుండు నా విలక్షణంబగు శోకంబున్!
వృద్ధిని పెంపొందిందుచు నుండెను వికలత నొందెడు నా మనసున్,
ఘన సర్పంబును వోలె ధరణిపై కదులుచు బొరలుచు నుండె గదా! 3

ప్రాణంబులతో సమానమైనా ప్రాణము ప్రియతముడును నైనా
లక్ష్మణుండు రక్తముతో దడిసియు లావువేదనను బడియుంటన్,
జూచుచున్న నా హృదయమంతయును సూదులు గ్రుచ్చిన యట్లుగనూ!
యున్న నాకు మఱి రణమును సలుపగ బన్నుగ శక్తియు నెక్కడిదీ? 4

సమర శ్లాఘియును శుభలక్షణములు సరసత గలిగిన లక్ష్మణుడున్
అట్టివాడు పంచత్వమునొందిన యట్టి నాకు సుఖమెందులకూ?
నా కెందుల కీ రాజ్యము బోగము నాకెందుల కీ ప్రాణములున్? 5

నా పరాక్రమము ధలను వంచి మఱి నయ్యముగ సిగ్గును బొందినట్టుల్
యవిపించుచు నున్నది కపులారా! కార్ముకంబు మఱి కరముననూ!

జారిపోవుచున్నట్లున్నది గద! సాయకములు గూడను మఱియున్!
దుర్బలంబు నగుచున్నది దృష్టియు దోరముగా భాష్పంబులతో
గప్పుచున్నదీ యచేతనత్వము గరమున నను నింపుచు నుండెన్! 6

స్వప్నమునందున నడుచు సమయమున సరగున మానవగాత్రములున్,
సరిగా పనిచేయని విధముననూ సరగున నా యవయవములునూ,
దుర్బలంబు లగుచున్నవి జింతయు దోరముగా వర్తిలుచుండెన్!
మరణింపగ వలెనను నిశ్చయంబునూ మఱి మదిలో గలుగుచునుండెన్! 7

దురాత్ముడగు రావణుని జేతనూ దోరముగా గొట్టగ బడియున్,
దుఃఖార్తుండై మూలుగుచుండెను దురపిల్లుచు నుండెను ధరణిన్!
మర్మప్రదేశములందు దగిలెనూ మానుగ రావణు బాణములున్
ననుచు బలికె కపివీరులతోడను నా రాముడు నని సలుపుచునూ! 8

నైట సంచరించెడి ప్రియమైనా ప్రాణమైన యా లక్ష్మణునీ
తనుల గాంచి శ్రీరామచంద్రుడును ఘనమగు శోకముననను మునిగీ,
ధ్యాన శోకముల కధీను డాయెను దగ రణరంగము నందుననూ! 9

కొట్టబడిన సోదరుడు లక్ష్మణుడు గూరిమి రణ పాంసువులందున్
బడియుండుటయును గాంచి రాఘవుడు బన్నుగ విషాదమును బొందీ,
వ్యాకులమగు నింద్రియములతోడను వనరగ విలపించెను నచటన్! 10

ఓ శూరుడ! విజయంబుగూడ మఱి యొనరగ లభించినను గూడన్
సంతసమును మఱి గలిగింపదుగా సరసత కంటికి కనబడనీ,
చంద్రుని వలనను సంతోషంబును సాంద్రగతిని మఱి గలిగించున్? 11

నాకు యుద్ధమును జేయుటవలనను నయముగ యేమి ప్రయోజనమూ?
యీ ప్రాణంబులు నెందుల కింకను నీధాత్రిని జీవింపగనూ?
సౌమిత్రియు రణ పాంసువు లందున సరగున శయనించిన మఱియున్,
ఇంక రణముననను యేమి లాభమును నేమి ప్రయోజన మిక యుండున్? 12

మహాద్యుతియు గల లక్ష్మణుండునూ మానుగ నే వనవాసమునన్
వెడలునపుడు నను వెంబడించెనో వడివడి నే నా విధముగనే
యమక్షయమునకును ననుసరించెదను నలరి లక్ష్మణునితోగూడి! 13

బంధుజనుల ప్రేమించెడి వాడును వింధ్య పర్వతము సముడు మఱిన్
నిత్యంబును నను ననుసరించెడి నేమంబునుగల వాడితడున్,
అట్టి లక్ష్మణుని కపట యుద్ధమున యిట్టి రావణుడు రాక్షసులున్
నిట్టి యవస్థను దెచ్చిపెట్టిరీ యెట్టి కష్టమును వచ్చె మఱిన్? 14

దేశదేశమున యందున భార్యలు దీరుగ లభించెదరు మఱియున్,
దేశ దేశమున బంధులు గూడను దీరుగ దొరుకుదు రిక మఱియున్,
కానీ సహోదరులు మాత్రంబును గానరారు వెదికిన గూడన్
యే దేశంబున గానరారు మఱి యే ప్రదేశమున యందైనన్; 15

ఈ విధముగ శ్రీరామచంద్రుఁను నిమ్ముగ దుఃఖముజేత మఱిన్
శోక విహ్వలిత యింద్రియముతో చుట్టుకొనుచు బోవుచు నతడున్,
దీనముగా నిట్టూర్పులు విడిచెడి ధీరుని రాముని జూచి రటన్
వానరవీరులు ఋక్షనాయకులు వనరగ గాంచిరి వేదనతో! 16

ఎదిరింపగ మఱి శక్యముగానీ యిమ్ముగ సౌమిత్రియు లేనీ
రాజ్యముజేతను లాభమేమి మఱి రహి ప్రయోజనంబేమి మఱిన్
పుత్రవత్సలయు నగు సుమిత్రకును బొలుపుగ యేమని దెలుపుదునూ? 17

తల్లి సుమిత్రాదేవిచేత మఱి దగ నిందల నెటు సహింతునూ?
తల్లియైన కౌసల్యాదేవికి దగ యేవిధమున దెలుపుదునూ?
మాతృమూర్తి యా కైకేయికినీ మఱి యేమని నే దెలుపుదునూ? 18

ఆ లక్ష్మణుతో గూడి పోయితివి యా వనములకును క్షేమముగా
ఆ సౌమిత్రియు లేకుండగ మఱి యలరి యెటుల వచ్చితివి యిటుల్?
అని ప్రశ్నించెడి యా భరతునకును నల శత్రుఘ్నునకును నెటులన్?
ఏమి సమాధానమును దెలుపుదును? నెటులోదార్తును వారలనూ? 19

నే నిచ్చట మ...ణించుట శ్రేయము నేబంధుజాలను నింధలనూ!
ధర్మాత్ముడు నగు నా సోదరుడును ధగ జంపగబడి నిచ్చోటన్
నా యెదుటను బడియున్నవాడు గద! నయముగ మఱియొక జన్మమునన్
దుష్కృత కర్మము జేసితినో మఱి దోషమాచరింపగ బడెనో! 20

అయ్యో! సోదర! లక్ష్మణవీరుడ! యలరు శూరవర! శ్రేష్ఠుడవున్!
సమస్త...పగు చిన్నతమ్ముడా! సరగున నా బంధము విడిచీ,
...పరలోకంబునకును కందుచు దోవుచు నుంటివిదే! 21

...దరుడా! విలపించుచున్న నను శూరుడ! బలుకవు నెందుకనీ?
...మ్మ! లెమ్ము! నను జూడుము తమ్ముడ! యిమ్ముగ శయనించితి ధరన్
...కో మఱి తెలియజెప్పుమా! కందిపోతి వేదనతోడన్!
దీనుడనగు నను కనులజూడుమా! ధీరత నేత్రములను దెఱచీ! 22

మహాబాహూ! పర్వతముల యందును మానుగ వనముల యందుననూ!
శోకార్తుడనై యుండినప్పుడును శూరుడ! యేమరిపాటుననూ
దిగులు జెంది యున్నపుడును నన్నును దీరుగ యోదార్చుదువు గదా! 23

శోకవ్యాకులిత ఇంద్రియములలో శూరుడు రాముడు బలుకగనూ!
యా రాఘవ వీరుని యోదార్చుచు యాసుషేణుడును వినయముగా
ఉత్తమమైనా వాక్యంబును మఱి హత్తుకొనగ నీ విధి బలికెన్! 24

నరశార్దూలా! రఘునందన విను! నయముగ నాదు సువచనములన్
మనోవ్యాకులత్వము గలిగించెడి మానుగ యీబుద్ధిని మఱియున్
సేనాగ్రమునందలి బాణములను స్థిరముగ సరిబోలెడి వానిన్
శోకహేతువగు చింతను వీడుము! శూరుడ! ధీరత వహింపుమా! 25

లక్ష్మీవర్ధనుడైన లక్ష్మణుడు లాలితముగ యున్నాడు మఱిన్
మరణంబును మఱి పొందగ లేడూ! మఱి జీవించియె గలడుసుమా!
ఎందుచేతననగా మఱి యాతని సుందర శ్రీముఖమందుననూ
ఏ వికారమును లేదుగదా మఱి యిమ్ముగ శరీరమందుననూ
శ్యామలత్వంబును రాలేదుగదా! సరసత యవయవములయందున్! 26

ఈతని ముఖమును సుప్రభతోడుత యిమ్ముగ నుండెను ప్రసన్నతన్ !
అరచేతులు పద్మములు రేకులుగ యలరుచునున్నవి జూడగనూ
లోచనరుటులును గనుగొనగా మఱి లోలత నుండెను ప్రసన్నతన్! 27

మరణించిన వారల రూపంబును మానుగ యీవిధి నుండదుగా!
రాజకుమారా! యరిందయా విను! రమ్యమైన నా వచనములన్!
ప్రాణంబులతో లక్ష్మణు డుండెను ఓన్నుగ దిగులును జెందకుమా! 28

సకలాంగంబులు ధరణిమీద మఱి జారవిడిచి నిదురించుచునూ
ఈతని హృదయము శ్వాసనుగూడీ యిమ్ముగ మాటికి మాటికినీ,
కదులు చున్నదది యట్టి హృదయమే కలదు ప్రాణమని దెలిపెడినీ! 29

మహాప్రాజ్ఞుడగు సుషేణుండునూ మానుగ రాఘవుతో బలికి
సమీప్యమునగల మహావానరుడు సరగున హనుమంతుని తోడన్
నీవిధముగ బలికెను సుషేణుడును నిమ్ముగ యాలోచించి మఱిన్ 30

ఓ సౌమ్యుడ! ఓ పవనకుమారా! ఓ బలవంతుడ వీరవరా!
యే పర్వతమును గూర్చి పూర్వమున యిమ్ముగ ఋక్ష సునాయకుడున్
దెలిపినాడొ యౌషధ పర్వతమును దీరుగ శీఘ్రముబోయి మఱిన్
దక్షిణ శిఖరమునందు బుట్టినా దగ విశల్యకరణిని మఱియున్
సావర్ణ్య కరణి, సంజీవకరణినీ సంధానీ యను యౌషధులున్,
మహాత్ముండు మఱి వీర్యవంతుడగు మానుగ లక్ష్మణ కుమారునిన్!
జీవింపగ జేయుటకొఱకునునై శీఘ్రము నిటకును గొనితెమ్మా! 32-32-33

సుషేణుండు మఱి హనుమంతునితో సురుచిరముగ యిటు బలుకగనూ
శ్రీమంతుండగు హనుమంతుండును శీఘ్రము నౌషధిపర్వతమున్
జేరి యచట మఱి యౌషధంబులను శీఘ్రము గుర్తింపగ లేకన్!
మనసున జింతించెను హనుమంతుడు మాట పక్క లేదనుచు మఱిన్! 34

అమిత తేజమును గల హనుమంతుడు నాలోచించెను హృదయమునన్
ఔషధముల గుర్తింపజాలకను నాలస్యము నే జేసితినీ!

పర్వతశిఖరము నే గొనిపోదును బన్నుగ వెదుకగ వచ్చు నటన్,
అని మది యందున పవనసుతుండును నాలోచించెను శీఘ్రముగన్! 35

సుఖావహంబగు నా యౌషధమును సురుచిరముగ యీ శిఖరమునన్
మొలిచియుండునని నే భావించెద మోద మలర యా సుషేణుడున్!
అటులే తెలియగ జేసినాడుగద! యాకపివీరులు వినునటులన్! 36

విశల్యకరణిని గ్రహింపకుండగ వెళ్ళినచో మఱి లంకకునూ!
కాలంబును మఱి గడచిపోవునూ గలుగు దోషమును నందఱికిన్,
మహాదుఃఖమును గలుగును మఱియును మానుగ వేదనయును గలుగున్!37

మహాబలముగల హరిశార్దూలుడు మానుగ హనుమంతుడు మఱియున్,
ఈవిధముత మది యాలోచించియు నిమ్ముగ యాగిరి జేరికొనీ,
గిరిశిఖరంబును హస్తంబులచే సరగున గ్రహించి బలముననూ!
మూడుమారులును నటునిటు నూపుచు మోదముననను బుష్పించిన యా
అనేక విధముల తరువులుగలిగిన యా శిఖరంబును బెకలించీ,
మహాబలీయుడు హనుమంతుండును మానుగ దానిని బైకెత్తెన్! 38-39

మహాబలీయుడు హరిశ్రేష్ఠుండును నా హనుమంతుడు వేగముగన్.
తోయపూర్ణమగు నీలమేఘముగ తోరముగా గనిపించెడి యా
పర్వత శిఖరంబును గ్రహించియును బైకెగిరెను గగనము నందున్! 40

మహాజవంబును గల హనుమంతుడు మానుగ వచ్చియు శిఖరంబున్
పదిలముగా నటు నుంచి కొంచెముగ పరిశ్రమను బాయుట కొఱకై!
విశ్రమించి యా సుషేణుతోడను వినయముగా నీవిధి బలికెన్! 41

హరిపుంగవ! ఓ సుషేణుడా! విను! అలరి నాదు వచనంబులనూ!
నేనా యోషధి పర్వతంబునను నిలిచి వెదికితిని గాని యటన్,
నా యోషధులును నెఱుంగజాల్కక బొందుగ యెత్తుక వచ్చితినీ! 42

ఈ రీతిని యట బలుకుచున్న యా యిమ్ముగ మారుతి వచనములన్,
వినియు నాతనిని బ్రశంసించియును వివిధౌషధముల శీఘ్రముగన్
లాగి బైకిదీసెను సుషేణుడును లాలితముగ యామూలికలన్! 43

సురలకుగూడను సుదుష్కరంబగు చోద్యమైన యా పనికి మఱిన్
ఆ హనుమంతుని ప్రశంసించిరీ యలరుచు వానర పుంగవులున్
నద్భుత కర్మంబును గాంచియును యాశ్చర్యంబును బొందిరటన్! 44

అటుబిమ్మట యా వానరోత్తముడు జటుల మహాద్యుతి గలవాడున్
నా సుషేణుడును నా యోషధినీ యలరి నలుగగొట్టియు మఱియున్
నాశికద్వారా యా లక్ష్మణునకు నయముగ యిచ్చెను నోషధినీ! 45

శల్యంబులతో గూడిన వాడును శత్రువీర సంహారకుడున్
లక్ష్మణుండు నా యోషధివాసన లాలితముగ మఱి జూడగనే
శల్యములన్నియు దొలగి పోయినవి సకల బాధలును దొలగినవీ!
ధరణీతలమున నుండి లేచెనూ దగ స్వస్థతతో గూడికొనీ! 46

భూతలమున నుండియు లేచిన యా బుద్ధిబలుడు లక్ష్మణుగాంచీ
వానరవీరులు 'బాగు!', 'బాగు' నని వనరగ సంతసమంది మఱిన్!
అభినందించిరి యా లక్ష్మణునీ యలరుచు గంతులు వేయుచునూ, 47

పరమవీరులను భంగముజేసెడి బాహుబలుడు శ్రీరాఘవుడున్
రమ్ము! రమ్ము! రా! లక్ష్మణ! యనుచును రయముగ కన్నీరును రాల్చి!
వ్యాకులమైనా నేత్రంబులతో వనరగ స్నేహమునను గూడీ,
గాఢముగా మఱి కౌగిలించుకొనె కమ్మని పలుకుల నిటు లనియెన్,
అదృష్ట వశమున మరణము నుండీ యలరి దిరిగి వచ్చితివి సుమా!
నిన్ను జూచుచున్నాను లక్ష్మణా! నిజముగ యిదియొక కలయేమో!48-49

పంచత్వంబును నీవు నందుచో నంచితముగ జీవితమేలా?
సీతచేత మఱి విజయము జేతను శ్రీకరమగు సంపద వలనన్!
నేమి ప్రయోజనమో మఱి దెలుపుము నిమ్ముగ వీటన్నిటి వలనన్? 50

మహాత్ముడగు శ్రీరామచంద్రుడును మానుగ బలుకగ యీ రీతిన్
ఖిన్నుడైన యా లక్ష్మణ మూర్తియు సన్నగ యీ రీతిని బలికెన్! 51

సత్యపరాక్రమమును గలవాడా! సహోదరా! ఓ శ్రీరామా!
రావణ సంహారము జేసెదనని రయమున బలికితి వానాడున్!

ప్రతిన జేసితివి పూర్వము నందున బన్నుగ యరిదళ ముంచరనూ!
ఇప్పుడు నెవ్వరో సామాన్యునివలె యిమ్ముగ బలుకుట యిది తగునా? 53

సత్యము బలికెడి వారు ప్రతిజ్ఞను సారత వ్యర్థము జేయరుగా
ప్రతిజ్ఞలను పాలించుటయే కద బరగ మహాత్ముల సులక్షణమూ! 53

అనఘా! శ్రీ రఘువీరా! వినుమా! యలరు నాదు వచనంబులనూ!
నా నిమిత్తమున నిరాశ నొందుట నయముగ యిది యుక్తముగాదూ!
దురాత్ముడగు రావణు వధకును తోరము ప్రతినను జేసితివీ
దానిని బరిపాలింపుము నేడూ! దగ లోకము సంతస మందన్! 54

నీదు బాణ మార్గంబును బొందిన కదిరి శత్రువును తీక్షణమౌ
కోరలు గలిగిన సింహము బారిని కూరిమి బడిన గజంబు వలెన్!
ప్రాణంబులతో దిరిగిపోడు గద! పదిలముగా నిజ గృహమునకున్! 55

దివాకరుడు కృతకర్ముండై మరి దీరుగ యస్తాద్రికిని మరిన్
జేర గలుగునో యంతటిలోపల శీఘ్రము యిట్టి దురాత్మకునీ!
వధింపవనెనని గోరుచుంటినీ వనరగ దీర్పుము నా కోర్కెన్! 26

మహావీర! ఓ పూజ్యుడ! వినుమా! మానుగ నాదు సువాక్యములన్
దురాత్ముండు నగు రావణు వధనూ దోరముగా వాంఛించినచో!
నీవు జేసినా నిజప్రతిజ్ఞనూ నెఱవేర్పగ దలచిన మరియున్,
రాజకుమారియు జానకిపైనీ రమ్యమైన కోరిక యున్నన్,
ఈనాడే నామధుర వచనమును నిమ్ముగ జేయుము సత్యముగన్! 58

[యుద్ధకాండమునందు 101వ సర్గము సమాప్తము]

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట రెండవ సర్గము

[ఇంద్రుడు బంపిన రథమును నారోహించి రాముడు రావణునితో యుద్ధము జేయుట ]

శత్రువీర సంహారకుండునూ సత్య పరాక్రమ వంతుడునూ
యైన రాఘవుడు లక్ష్మణవీరుడు నలరుచు బలికిన వచనములన్
విని రాఘవుడును నటు శీఘ్రముగా విమల కార్ముకము గ్రహియించి
శరజాలము నట సంధించెను వే శత్రుమూకలను జెండాడన్! 1

సేనాముఖమున రామచంద్రుడును శీలరహితుడగు రావణుపై
వేతాక రథమును యధిష్టించియును వేగముగా రాహువు రవిపై
బోయిన యటులను రామచంద్రుపై బోయెను చాపము సంధించి! 2

రథస్థుడగు నా దశగ్రీవుండును రాముని వజ్రాయుధములతో
సమానమైన శరజాలముతో సరిమేఘము జలధారలతో!
మహా శైలమును గొట్టినట్లుగా నూసుగ గొట్టెను వేగముగన్! 3

సావధాన చిత్తముతో రాముడు ప్రజ్వల పావక సమానముల్
కాంచన భూషణములును గలిగినా యంచితముగ శతశరములనూ
రణరంగంబున రావణుపైనీ రయమున వర్షించెను నచటన్! 4

రాముడు భూమిని నిలిచియు మఱియును రావణుండు రథమునసుండీ
యుద్ధము సేయుట సరిగాదనుచు ప్రతీతి యిది సరి గాదనుచున్
దివిజులు గంధర్వులును కిన్నరులు దీరుగ బలికిరి గగనమునన్!

అటుబిమ్మట యాదేవతా ప్రభువు నల శ్రీమంతుడు మహేంద్రుడున్,
వారల వచోమృతములను వినియును వెనర మాతలిని విలిపించి,
ఆ సూతునితో నీ విధి బలికెను నలరు మధుర వాక్యాలతోడన్! 6

ఆ రథంబుతో బహుశీఘ్రముగా నయముగ ధరణికి బోయి మఱిన్
శ్రీరామునకును విషయము దెలుపుము శీఘ్రము నర్పింపుము రథమున్,
దివిజులకును హితమైన కార్యమును దీరత సేయుము వేగముగన్! 7

దేవరాజుతో నిటుల బలుకబడి దేవ సారథియును మాతలియున్,
శిరస్సు జేతను నామహేంద్రునకు శీఘ్రము వందనమును జేసీ
యీవిధముగ బలికెను నింద్రునితో నిమ్ముగ మాతలియును నపుడున్! 8

దేవేంద్రా! నే స్యందనోత్తమము దీరుగ హరిత హయంబులతో
సిద్ధముజేసియు స్వర్గమునుండీ యుద్ధభూమికిని బోగలనూ!
అట శ్రీరామున కర్పించెదనూ యలరెడి యాస్యందనము మఱిన్!
రణమున సారథ్యంబున గూడను రమ్యముగా నే జేసెదనూ! 9

ఆటువిమ్మట దేవేంద్రుని యాజ్ఞను నా మాతలియును వేగముగన్
కాంచన చిత్రాంగములును గలదియు కింకిణి శత భూషితమునునై
తరుణాదిత్య సమానమైనదియు దగ వైదూర్యమయంబు నగూ
కూబరంబునూ గలదియు మఱియును గూరిమి స్వర్ణవిభూషణముల్
శిరసున గలదియు దెలిచామరములు గరమున యలంకరింపబడీ!
యాకుపచ్చనీ వర్ణముగలవియు నలసూర్యుని సంకాశములున్,
హేమజాల భూషితములును మఱియును విమలోత్తమ యశ్వంబులతో
గట్టబడినదియు, బంగరుధ్వజముల కమనీయంబును, సుందరమున్,
అయిన యట్టి దేవేంద్రుని రథమును నా మాతలి యధిరోహించీ
త్రివిష్టపమునుండియు దిగివచ్చెను దీరుగ రాముని దగ్గఱకున్, 10-13

సహస్రాక్షుని సారథి మాతలి సప్రతోదమున రథముననూ,
యున్నవాడునై ప్రాంజలితోడను సన్నుతించుచును శ్రీరామున్,
ఈవిధమున బలికెను మాతలియును నిమ్ముగ రఘునందను తోడన్! 14

శ్రీమంతుడ! ఓ మహాసత్త్వుడా! శ్రితజన పాలన శ్రీరామా!
అరిందమా! యీమహారథంబును నాకాంక్షించుచు విజయంబున్!
సహస్రాక్షుచే బంపగబడినది! సాహసవంతుడ గొను మిదిగో! 15

ఇంద్రుని సంబంధమునైనదియును నింద్రచాపమును గొను మిదిగో!
అగ్ని సన్నిభంబైన కవచమును నాదిత్యునితో సమానముల్
యైనబాణములు నివిగో గొనుమా! నతి నిర్మలమును శుభకరమున్,
శక్తియుగూడను బంపినాడు సుమ! సరసరీతి గొనుమా రామా! 16

వీరుడవగు ఓరాజా వినుమా! వినతి సేయు చున్నాడను నే
సారథిగా నేనున్న రథంబును సావధానముగ యెక్కి మఱిన్!
దేవరాజునగు దేవేంద్రుడు మఱి దివిరి దానవుల జంపినటుల్,
రాక్షసమూకను రావణాసురుని రయమున వధింపు శ్రీరామా! 17

ఆసమయంబున రామచంద్రుడును నలరి ప్రదక్షిణమును జేసీ,
యారథంబునకు నమస్కారమును నటుల జేసి లోకంబులనూ!
ప్రకాశింపగా జేయుచు మఱియును ప్రబలుని జంపగ రథమెక్కెన్! 18

మహాబాహువులు గలిగిన వారలు మానుగ శ్రీరామునకు మఱిన్
దశగ్రీవునకును దుములమైనదియు దగరోమాంచము గలుగునదీ!
భయంకరంబగు యుద్ధము జరిగెను బన్నుగ ప్రాణులు భయమందన్! 19

మహాస్త్రవిదుడగు రామచంద్రుడును మఱి రావణుడును విడిచిన యా
గాంధర్వము నను నస్త్రరాజముషు గాంధర్వము జేతను గొట్టెన్,
దైవాస్త్రంబును దానిని రాముడు దైవాస్త్రముచే బడగొట్టెన్! 20

రాక్షసాధిపుండగు రావణుడును రయమున గోపించినవాడై
పరమఘోరమగు రాక్షసాస్త్రమును ప్రయోగించె శ్రీరామునిపై! 21

రావణాసురుని ధనుర్ముక్తములు రమ్య సువర్ణ విభూషణముల్,
గలిగినట్టి యామహాశరంబులు గడువిషంబు గలిగిన యట్టి
సర్పంబులుగా రూపముదాల్చి సరుగున రాముని పైకొచ్చెన్! 22

దీప్తవదనములు గల సర్పంబులు దీరుగ భయంకరములైనా
ముఖముల తోడను నిప్పులు గ్రక్కుచు ముట్టడించె రఘునందనునీ! 23

వాసుకితో సమమగు స్పర్శయుగలి వనరగ నుండెడి పడగలునూ
మహావిషంబును గలవై మఱియును మానుగ దిక్కులు దిశలు మఱిన్
ఆవరింపబడినవి యంతటనూ యలవిగాదు లెక్కింపగనూ! 24

రాముడంతటను నావహమందున రహి మీదను బడుచుండిన యా
భయంకరములగు బన్నగములనూ బారజూచి శ్రీరాఘవుడున్
భయావహంబును ఘోరమైనదియు బన్నగ గరుత్మతాస్త్రంబున్
సృజించె విడిచెను రణరంగంబున శీఘ్రము ఫణులను ఛేదింపన్! 25

శ్రీరాముని కార్ముకమునుండి మఱి శీఘ్రము విడువగ బడినట్టి
రుక్మపుంఖములు, శిఖిప్రభలునుగల రూఢిగ యాబాణములు మఱిన్
సర్పంబులకును శత్రువులైనా స్వర్ణవికారము లైనట్టి
గరుత్మంతులుగ సంచరించినవి కదనమునందు సుభీమములై! 26

కామరూపములు గలిగినవియును మఱి గరుత్మంతు రూపము గలవి
రాముని జేతను విడువబడిన యా రమ్యబాణములు వేగముగన్
సర్పరూపములు నగు బాణంబుల సరగున గొట్టెను నన్నింటిన్! 27

ఆ యస్త్రము మఱి ప్రతిహతమగుటను నారావణుడును గోపించి
రక్తనేత్రములు గలవాడగుచును రయమున బెదవులు గొఱుకుచునూ!
ఆ సమయంబున రామచంద్రుపై యలరుచు భయంకరమునైనా
శరవర్షంబును గురిపించెను నట స్వాతికార్తె వర్షము రీతిన్ 28

అటుబిమ్మట యాదశగ్రీవుండును జటుల బాణజాలము జేతన్
అక్లిష్ట కర్మణుడగు శ్రీరాముని యలరుచు బీడించియు మఱియున్
దనదు బాణసముదాయము జేతను దగ మాతలినీ నొప్పించెన్! 29

రావణుడంతట యొక బాణముచే రయమున గుఱిజూచియు మఱియున్
ఇంద్రరథముపై గలుగు ధ్వజంబును సాంద్రబలంబున బడగొట్టెన్
అటుబిమ్మట యా రావణుండునూ చతుర బాణ సముదాయముచే
ఇంద్రుని యశ్వంబులను గొట్టెనూ సాంద్ర బలియుడు రావణుడున్! 30

ఆ సమయంబున పీడితుడైనా యా శ్రీరాముని గాంచి మఱిన్
దేవదానవులు గంధర్వులు మఱి ధీరుగ సిద్ధులు మహర్షులున్
దిగులును జెందిరి రావణు డనియెడి దీరుగ రాహువు జేత మఱిన్
రాముం డనియెడి చంద్రుని మ్రింగుట రయమున జూచుచు గపివీరుల్
వ్యథను జెందిరీ సంభ్రాంతులునై వనర విభీషణుతో గూడన్ 31-32

ప్రాజాపత్యంబగు నక్షత్రము బరగ చంద్రునకు ప్రియురాలున్
అట్టి రోహిణిని బుధుడును జేరీ యుట్టె యాక్రమించిన యటులన్!
ప్రజలకు నశుభమును గలిగించెడిదీ బన్నుగ యాగ్రహ కూటంబున్
అట్లే రావణుడిటు చెలరేగుట యశుభంబని దలచిరి వారున్! 32-33

ధూమరాశితో నెగురుచున్న యా దూర్త తరంగములను గూడీ
మండుచున్నదా యనునట్లుండెను మెండుగ యల సాగరము మఱిన్
ప్రకోపించి మఱి భానుబింబమును బన్నుగ స్పృశించుచున్నదియా
యన్నటులను మఱి పైకి లేచెనూ యంబరమును చుంబించునటుల్! 34

ఖడ్గవర్ణమును గలిగి మఱియునూ కాంతి హీన ప్రభలును గలిగీ
పరుషముగా కనిపించుచున్న యా బరగ సూర్యమండలమునకున్!
దాపున కనిపించెను మొండెంబును దాపు దోకచుక్కయు బొడిచెన్! 35

ఇక్ష్వాకుల వంశీయులదియు మఱి యింద్రాగ్నులు దేవతలుగనూ!
గలనక్షత్రము విశాఖ యిప్పుడు గగనమందు నంగారకుడున్
ఆ సమయంబున యాక్రమించుకొని యలరియుండె బహుదాపుననూ! 36

దశాస్యంబులును గలవాడును మఱి దగ వింశతి భుజముల వాడున్
రణరంగంబున నిలిచియున్న యా రావణాసురుడు గన్నులకున్!
పర్వతంబు మైనాకము వలెనూ బన్నుగ కనబడుచుండె నటిన్!

రాక్షసుడగు నా రావణుచేతను రహి యుద్ధాగ్రమునందుననూ
ఈవిధముగ మఱి యాక్రమించియును నిమ్ముగ గొట్టుచు నుండగనూ!
రాముడపుడు శరముల సంధింపగ రహి సమర్థుడును గాలేదూ! 38

రాము డపుడు గనుబొమ్మరి విరిచియు రహి బహుక్రోధమునను గూడీ
యరుణారుణ నేత్రంబుల తోడను నా రణరంగము నంతటినీ
కాల్చివేయుచున్నాడా యనునటు గడగి కోపమును జెంది మఱిన్! 39

కోపించిన మఱి ధీమతుడైనా కూరిమి రాముని వదనమునూ
గాంచి సర్వభూతంబులు నచటను నంచితముగ భయమును జెందెన్!
మహీతలంబును గంపించినదీ మాచు మ్రోగుచును ధ్వనితోడన్! 40

సింహములు శార్దూలంబులుగల సిరులు జిందు వృక్షంబులునూ!
గల పర్వతమును చలించె నప్పుడు గలగల మనియెడి పక్షులునూ!
నదీభర్తయగు సముద్రుండునూ నయముగ క్షోభించెను నపుడున్! 41

గాడిద చర్మపు రంగును గలిగియు గటువగు మఱుములు గలవియునూ!
పరుషములగు ఘన మేఘంబులు మఱి పన్నుగ భావి యుపద్రవమున్!
సూచించుచు నాకాశమంతయును సాక్షిగ మ్రోగుచు నెగిరినదీ! 42

సంక్రుద్ధుండై కోపించిన యా శూరుడు రాముని గాంచి మఱిన్!
దారుణమగు నుత్పాతంబులనూ దగ జూచియు భూతంబులునూ!
భయపడినవి మఱి రావణునకునూ బన్నుగ భయమును గలిగె నటన్! 43

ఆ సమయంబున భయంకరంబగు ననేకవిధ యాయుధములతో!
యుద్ధముజేసెడి శూరులగాంచియు యుద్ధతి ప్రళయము బోలుచునూ!
మహాయుద్ధమును విమానములతో మానుగ దివిజులు గంధర్వుల్
మహారథులు, ఋషులును, దానవులును, మఱి ఖేచరులును, దైత్యులునూ,
గరుత్మంతుడును నాశ్చర్యముతో నతి యాసక్తిని గాంచిరటన్! 44-35

ఆ సమయంబున యా సంగ్రామము నలరు గాంచు సురలును, నసురుల్
వారందఱునూ యొకరితో నొకరు వనరగ కలహించుచును మఱిన్!
సంతసించుచును గడు నాసక్తిని సరసత బలికిరి యీరీతిన్! 46

సమవస్థితులై యున్న యసురులును సరగున దశగ్రీవుని గూర్చి.
"జయింపు! జయింపు!" మనుచు బలికిరీ చయ్యన యుత్సాహము తోడన్!

అటులే దివిజులు రాముని తోడను నటుచు నుత్సాహముతోడన్!
"నీవు జయింపుము!' జయింపుమనుచును నింగి మ్రోగునటు బలికి రటన్! 47

అట్టి సమయమున దుష్టాత్ముండును అట్టి రావణాసురు డంతన్!
బహుకోపంబున శ్రీరాఘవునీ బరిమార్చెడి గోరిక తోడన్!
మహాయుధంబును స్పృశించి యాతడు మానుగ వజ్రసమానంబున్!
సారముగలదియు మహాధ్వనియునూ శత్రునిబర్హణ మైనదియునూ?
అట్టిశూలమును గ్రహించి యాతడు నిట్టి భూతములు గంపింపన్!
శైలశృంగ నిభమైనది మఱియును సరసత భూతములును జూడన్!
చిత్తమునకు మఱి దృష్టికి గూడను స్థిరభీతిని గలిగించునదీ,
ధూమము తోడను గూడియున్నదియు తీక్ష్ణాగ్ర భాగంబులతో
యుగాంతాగ్నిచయ సమానంబునూ దగ రౌద్రంబున ప్రాణులకున్!
సమీపింప శక్యముగానిదియునూ సాహసుడగు యమునికి గూడన్!
ఎదిరింపగ శక్యము గానిదియును నెల్ల భూతములకును భయమున్
గలిగించునదీ జీల్చివేయునది విలయము జేయునది మఱియున్!
ప్రదీపితంబగు మహాశూలమును బన్నుగ బట్టెను రావణుడున్! 48-51

సంగ్రామంబున రాక్షస శూరులు సైన్యంబులతో గూడికొనీ
వీర్యవంతుడగు నా రావణుడును వికట క్రోధమున కూడికొనీ
యా శూలంబును మధ్యభాగమును నలరి బట్టుకొనె హస్తమునన్! 52

మహాకాయమును గలరావణుడును మహాకోపమున చూర్ణుండై
ఎఱ్ఱనైన నేత్రంబులతోడుత యిమ్ముగ తన సేనలకు మఱిన్
సంతోషంబను గలిగించుచునూ సంగ్రామంబున శూలంబున్!
హస్తంబున గ్రహియించి యఱచెనూ యాకాశము జిల్లులు వడగన్! 53
ఆ సమయంబున రాక్షసేంద్రుడును నలరి జేసినా శబ్దంబున్
దారుణంబునగు నా ధ్వనియును మఱి దగభూమియు నాకాశంబున్
దిక్కులు దిశలును గంపము జెందెను దీనత నందెను భూతములన్!

మహాకాయుడగు దురాత్ముండునగు మానుగ రావణు ధ్వనిచేతన్!
సకల భూతములు భయము జెందినవి సాగరంబు క్షోభించె మఱిన్! 55

మహావీర్యుడగు నా దశగ్రీవుడు మహోన్నతంబగు శూలంబున్
గ్రహించి సుమహానాదము జేసెను గదనరంగమును మార్మోగన్!
బరుషముగా రామునితో బలికెను బరుషాక్షరముల తోని మఱిన్! 56

ఓ రామా! రోషముతో నెత్తియు నొనరగ నేను బ్రయోగింపా
వజ్రమువంటి శక్తిగలిగినా వనరగ యీశూలంబు మఱిన్
నీ ప్రాణంబులు నీ సోదరుని నిండు ప్రాణములు హరియించున్! 57

రణశ్లాఘీ! ఈ సమయమునందున రణమున నా బల వీర్యములన్
నిను వధించెదను చమూముఖంబున నిహతులైన శూరులు నైనా
నీచే వధింపబడినట్టియు మఱి నేలబడియు మృతిజెందిన యా
రాక్షసవీరులకును సమానముగ రహి జేసెద జూడుము నిన్నున్! 58

'రామా! నిలుపుము! నిలబడు మచ్చట రయమున యీ శూలము జేతన్
నిన్ను జంపెదను!' నిఖిల భూతములు జెన్నుగ సాక్ష్యము యిదె గనుమా!
అనుచు బలికి యా లంకేశ్వరుడును నా శూలము రాముని పైనన్
మహాబలంబున విసిరి వేసెనూ మానుగ ప్రాణులు భయమందన్ 59

రావణు హస్తము నుండి విడిచినా రమ్యమైన యా శూలంబున్
విద్యున్మాలా సమావృతంబుగ విమల కాంతులను నున్నదియున్
అష్ట ఘంటికలు గణగణమనుచును స్పష్టముగా ధ్వనియించునదీ
మహానాదమును గలదియునైనా మానుగ యా ఘన శూలంబున్!
యాకాశంబును బొందినదై మఱి యలరి బ్రకాశించుచు నుండెన్! 60

రఘువంశంబున బుట్టిన వాడును రమ్య పరాక్రమ వంతుడునూ
యగు రాఘవుడును భయంకరంబును నయముగ బ్రజ్వలితమునైనా
యా ఘన శూలము గాంచి శీఘ్రముగ యలరుచు కార్ముకమును వంచీ,
బటుతరమగు బాణములను వదిలెను జటుల భయంకరు రావణుపై! 61

అవతంతంబగు నా శూలంబును నా రఘురాముడు వేగముగన్,
నుత్పతంతమగు యుగాంతాగ్నినీ యురుజలధాల యింద్రువలెన్
తగ ఘన శర జాలముచే దానిని ధగ వారించెను చతురతనూ! 62

ఆ దశగ్రీవుని మహత్తరంబగు నా శూలంబును వేగముగన్
రాముని ధనుస్సునుండి వెడలినా రాటుదేలినా బాణములన్
అగ్ని హోత్రుడా పతంగముల మఱి యలరి కాల్చినటు గాల్చె మఱిన్! 63

ఆకాశము నందుండగనే మఱి యలరి గమ్యమును జేరకనే
శూల స్పర్శచే చూర్ణితములునై వ్రాలి భస్మమై పోయిన యా
శరజాలంబును గాంచి రాఘవుడు సరగున కోపించియు మఱియున్! 64

రఘునందనుడగు నా శ్రీరాముడు రయమున గోపించినవాడై
మాతలి జేతను గొనిరాబడినా మానుగ యింద్రుని జేత మఱిన్,
గారవింపబడినట్టి శక్తినీ గ్రహించె రాముడు వేగముగన్! 65

బలవంతుండగు రామచంద్రుడును బన్నుగ యెత్తిన శక్తియునూ,
మహానాదమును జేయుచు మఱియును మానుగ ప్రళయము నందుననూ
బడుచుండిన ఘన కాంతివంతమగు బరగ యగ్నిపిండము వోలెన్
ఆకాశము నందున జ్వలియించుచు నారని మంటలు బుట్టించెన్! 66

ఆశక్తియునూ విసరజడినదై యారావణు శూలంబు పయిన్,
మహావేగమున మహానాదమున మహాజ్వాలతో గూడికొనీ,
పడెను మహాశూలంబును మఱియును బరగ శక్తిచే భిన్నంబై
కాంతిహీనమై కళలుదప్పి మఱి కటిక నేలపై బడిపోయెన్! 67

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నతి తీక్షణములు వేగమునూ,
ధ్వనులు గలిగినవి, దీన్నగ బోయెడి దగ శరములచే రావణునీ.
మహాజవముగల హయముల గొట్టెను మఱి రావణుపై గురిజూచెన్! 68

ఆ సమయంబున రామచంద్రుడును నతి నిశితములగు శరములచే
రావణాసురుని వక్షస్థలమును రహి నిర్భేదించెను వేగన్!
పరమాయత్తుండై శ్రీరాముడు బరగ మూడు బాణంబులచే
రావణాసురుని లలాటమందున లావుగ గొట్టెను రణమందున్! 69

బాణంబులచే యంగములన్నియు బన్నుగ భేదింపగ బడినా
గాత్రప్రశ్రుత శోణితంబుచే నాత్ర మంతయును మాయంబై
రాక్షసేంద్రుడగు రావణుండునూ రమ్య వృక్ష సంఘమునందున్
పుల్లాశోకము పలెను నుండెనూ స్ఫూర్తి ప్రకాశించుచు ననిలో! 70

రాముని శరములజేత గొట్టబడి రయమున యంగము లన్నియునూ!
రక్తము జేతను దడిసిపోయెనూ రహి దేహంబంతయును మఱిన్
ఆ లంకేశ్వరుడగు రావణుడును నా రాక్షసవీరుల మధ్యన్.
ఖేదంబును బొందెను నాతండును క్రోధంబును జిందెను నతడున్! 71

(యుద్ధకాండయందు 102వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూ ట మూ డ వ స ర్గ ము

(రాముడు రావణుని యధిక్షేపించుట— యుద్ధములో అలిసి పోయిన రావణుని యతని సారథి యుద్ధరంగమునుండి దూరముగా తీసి కొనిపోవుట)

ఆ సమయంబున రఘునందనుచే నా విధమున బీడింపబడీ
సమరశ్లాఘియగు రావణాసురుడు సరగున కోపంబును బొందెన్! 1

వీర్యవంతుడును, ధీరుండును మఱి విక్రముండు నగు రావణుడున్
క్రోధమువలనను దీప్తనయనుడై కూరిమి రాఘవుపై చాలన్!
కోపముతోగూడినవాడై మఱి కార్మి ధనుస్సును నెత్తి మఱిన్!

ఆకాశమునుండియు దోయదములు నలరి తటాకము నింపినటుల్!
వేలబాణధారల చేతను మఱి పీడించెను రాముని వేగన్! 2-3

వీర్యవంతుడగు రామచంద్రుడును విపులమైన సంగ్రామమునన్!
ధనుర్ముక్తమగు శరజాలముచే దగ నింపగబడి నప్పటికిన్!
ఆ శ్రీరాముడు మహాగిరికివలె యదరక బెదరక యటులుండెన్!
కంపము జెందరుగా బలవంతులు కార్యము లెటు జరిగిన గూడన్! 4

విపుల పరాక్రమవంతుడైన యావీరుడు రాముడు యుద్ధమునన్
నిలిచి బాణ సముదాయంబులనూ నిలుపుచు దన శరజాలముచే
సూర్యకిరణములకును వలె శరముల సూటిగ గ్రహించె రణమందున్! 5

అటుపిమ్మట మఱి క్షిప్రహస్తుడగు జటుల రాక్షసుడు రావణుడున్!
బహు కోపించియు మహాత్ముడైనా బన్నుగ రాముని వక్షమునన్!
వేలకొలది బాణములను వదిలెను జాలము సేయక వేగమునన్! 6

రణమున శోణిత సమాదిగ్ధుడగు రాముడు ఘనమగు వనమందున్
వికసించిన గడు గొప్పదైన యొక విమల కింశుకము వోలె మఱిన్!
గనబడుచుండెను రణాగ్రమందున ఘన వానర వీరుల మధ్యన్! 7

శరములజేతను గాయబడుటచే సరగున సంరబ్ధుం డగుచున్
సుమహాతేజుండగు శ్రీరాముడు సురుచిరముగను యుగాంతమునన్!
ఆదిత్యునితో సమానమైనా యమిత తేజమును గలిగిన యా
మహాశరంబులు గ్రహించె నంతట మానుగ రావణుపై విడువన్! 8

అటుపిమ్మట బహు సంరబ్ధులునై యాశ్రీరాముడు రావణుడున్
ఆ సమయంబున శరాంధకారము నలరెడి సంగ్రామము నందున్!
అన్యోన్యంబును గానలేకనే యలరి జేయుచుండిరి రణమున్! 9

అటుపిమ్మట యా దశరథాత్మజుడు నలవీరుడు శ్రీరాఘవుడున్!
క్రోధముతో గూడినవాడగుచును గూరిమి నవ్వుచు రావణుతో!
పరుషముతో నీవిధమున బలికెను బరుషాక్షరములతోని మఱిన్! 10

రాక్షసాధమా! వివశురాలునగు రమణిని నాభార్యను సీతన్
నాకు దెలియకుండగనే యామెను నయముగ జనస్థానమునుండీ
హరించి గైకొనివచ్చినావుగద! నలుద చోరునకువలె నీవున్!
అందువలన నీవొక వీరుడవని పొందుగ బలుకగ లేముగదా! 11

నేను సమీపమునందులేని తఱి దీనురాలు వనముల యందున్!
పతిహీనయగు వైదేహిని మఱి ప్రసభముగా గొనివచ్చితివీ!
అట్టి నీవు మఱి వీరుడనంచును గట్టిగ దలచుచు నుంటివిగా! 12

రక్షకులెవ్వరు మఱిలేని యట్టి యా రమణుల విషయమునందుననూ
హా పతిత! పరదారాభిమర్శకా! చోరులు జేసెడి పనిజేసీ!
'నేను శూరుడను!' నని లోకంబున యనుకొనుచుంటివి యిది తగునా! 13

మర్యాదల జెడగొట్టిన వాడా! మఱి నిర్లజ్జయు గలవాడా!
సచ్చరిత్ర మఱి యనుసరింపకను విచ్చలవిడి దిరిగెడి వాడా!
గర్వము జేతను మృత్యుదేవతను గడగి బిలిచితివి దగ్గఱకున్!
అట్టి నీవు నే శూరుడనంచును నిట్టె జెప్పుకొను చుంటివిగా! 14

శూరుండవు! మఱి ధనదుని భ్రాతవు శూరసేన గలవాడవునూ!
యఖిల లోకమున వీరుడవంచును నలరి పొందితివి ఖ్యాతి మఱిన్!
అట్టి నీవు శ్లాఘింపదగినదీ, నిట్టె యశస్సును గూర్చునదీ
మహా ఘనంబగు కార్యముజేసీ మన్నన నొందితివీ జగతిన్:
ఛీ! ఛీ! లోకము నిందసేయు నిను చిరకాలము మది దలచుకొనీ! 15

గర్వముచేతను జేసినట్టి యా కడు నింద్యము నీచము నైనా
ఆ కర్మమునకు గొప్ప ఫలంబును ననుభవింపు మిపుడే! నేడే! 15

దుష్టబుద్ధి గలవాడా! మఱి విను! దోరముగా నే శూరుడనూ!
వీరుడ నంచును నిన్ను గూర్చి మఱి వికలముగా మఱి దలచెదవూ!
దొంగవోలె సీతను హరియించీ రంగుగ లంకకు దెచ్చితివీ!
నీకే మాత్రము సిగ్గులేదుగద! నీతియు లేదుగదా! మఱియున్! 17

మత్సన్నిధిలో జనక నందనిని మానుగ నీ బలమును జూపీ,
సీతను నవమానించి యున్నచో శ్రీరఘు మప్పుడు నా బాణముచేన్!
చంపబడెడి వాడవు మఱి నీవును చంపగబడి సోదరుడైనా
ఖరుని జూచి యుండెడి వాడవు మఱి కర్మవశమునను దప్పితివీ! 18

మందాత్ముడ! ఓ రావణాసురుడ! మానుగ విధి వశమున నీవున్!
నాదు కంటబడితివి దురాత్ముడా! నయముగ యెట కిక బోగలవూ?
నా శత శరములచే నిన్నిప్పుడు నయముగ బంపెద యమపురికిన్! 19

ఇపుడు నిన్ను నా బాణంబులచే నిమ్ముగ భేదింపగ బడగా
రణ పాంసువులను బడిన యట్టి నీ రమ్య కుండలములను గూడీ,
యున్న నీదు శిరసును క్రవ్యాదులు జెన్నుగ లాగుచు దిను గాతన్! 21

రావణాసురుడ! భూతలంబునను రహిబడగొట్టగ బడినట్టి
నీ వక్షస్థలమునను వ్రాలి మఱి నిఖిలమైన పక్షులు మఱియున్!
బాణశల్యముల మధ్యనుండి మఱి పైకి వచ్చు రుధిరంబులనూ
యానక్తిని మఱి ద్రాగును గాతను! నా గ్రద్దలు మఱి కాకులునూ! 21

నేడు నాదు బాణంబుల జేరను నెగడి బద్ధలుగ జేయబడీ
ప్రాణంబులు మఱి పోయి క్రిందబడి బరగ పాంసువులలో నున్నా
నీ ప్రేవులు మఱి కాకులు గ్రద్దలు నిర్దయగా మఱి దిను గాతన్!
గరుడ పక్షులును ఘన సర్పంబుల కనలి లాగినటు లాగు మఱిన్! 22

శత్రు నిబర్హణుండు వీరుడును బాతృవత్సలుడు రాఘవుడున్,
నిటుల బలుకుచును సమీపమున గల చటుల బలీయుడు రావణుపై
బాణ వర్షముల గురిపించెను నట బన్నుగ ప్రాణులు భయమందన్! 23

యుద్ధమునందున శత్రువధను మఱి యుద్ధతి రావణు జంపగనూ
నిశ్చయించినా రాముని బలమును హెచ్చుగ పరాక్రమంబు మఱిన్
ఉత్సాహము మఱి యస్త్రబలంబును నురుతరముగ ద్విగుణము లయ్యెన్!

విదితాత్ముండగు రామచంద్రునకు విమలమైన సర్వాస్త్రంబుల్
స్ఫురించెనప్పుడు నతని హృదయమున స్ఫూర్తి నిచ్చె నా యస్త్రంబుల్!

మహాతేజమును గల శ్రీరాముడు మానుగ సంతోషము వలనన్
హస్త లాఘవము నధికం బాయెను నల రణరంగము నందుననూ! 25

రాక్షస సంహారకుడు రాముడును రహి తనలో గ పడుకట్టీ
యీ శుభ చిహ్నములను గుర్తించీ యిమ్ముగ లంకేశ్వరుని మఱిన్
అధికముగా బీడించెను శరముల నలరుచు నుత్సాహముతోడన్! 26

హరివీరుల యా శిలావర్షమున యా రాముని శర వర్షమునన్
గొట్టబడిన రావణుని హృదయమును గూరిమి దిరిగిన యట్లయ్యెన్! 27

అట్టి సమయమున యా రావణుడును నిట్టి శస్త్రముల ప్రయోగమున్
ప్రారంభింపగ లేకపోయెనూ పగతుర హతమార్పగ వేగన్!
కార్ముకంబు మఱి సంధింపగనూ కరములు పైకిని పోతేదూ!
ఆ శ్రీరాముని విక్రమంబునకు నలరి ప్రతిక్రియ జేదుకనూ
యంతరాత్మ వ్యాకులమై యుండెను ననంతమగు వ్యథతో గూడీ!
మట్టిబొమ్మవలె నిలిచియుండెనూ యెట్టి ప్రతిక్రియ లేకుందన్! 28

శీఘ్రముగా రావణుడు విసిరినా స్థిరమగు బాణంబులు మఱియున్,
అనేక విధముల యాయుధంబులును నలరి యుద్ధ కార్యంబులనూ,
సాధింపక జాలక పోయినవీ చతికిలబడె యత్నంబులునూ!
మృత్యుకాల మది సమీపించుటను నత్యుత్సాహము సన్నగిలెన్! 29

రావణు రథమును నడుపు సూతుడును లంకేశ్వరు స్థితి గాంచి మఱిన్
యసంభ్రాంతుడై మెల్లమెల్లగా నారథమును దోలుచు మఱియున్,
యుద్ధ భూమినుండియు దప్పించెను యుద్ధతుడగు నా రావణునీ
దూరముగా గొనిపోయెను నతడును దురపిల్లుచు దన మదియుందున్! 30

అటుపిమ్మట యా రథసారథియును జటుల రాక్షసుడు దన ప్రభువున్,
విక్రమంబు మఱి యుడిగిబోయినటు వీరుడు ఓడిన రీతిగనూ,
గాంచి, భయపడియు భయంకరంబగు నంచితమగు మేఘమువంటీ
ధ్వనియు గలదియు నైన రథంబును దగ మరల్చుచును నెమ్మదిగా!

యుద్ధ భూమినుండియును దప్పించెను యుద్ధతుడగు నా రావణునీ!
దూరముగా గొనిపోయెను నతడును దురపిల్లుచు దన మదియందున్! 31

(యుద్ధకాండమున 103వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి (యుద్ధకాండము)

## రెండవ భాగము

### నూట నాల్గవ సర్గము

(రావణుడు సారథిని నిందించుట-సారథి రావణునకు దగు కారణమును జెప్పి, నచ్చజెప్పి, రథమును మఱల యుద్ధభూమికి గొనిపోవుట)

మోహము వలనను సుసంక్రుద్ధుడై కృతాంత బల చోదితుడైనా
యారావణుడును క్రోధముజేతను నరుణారుణ నేత్రంబులతో
నా సూతునితో నిట్టుల బలికెను నతి బరుషాక్షరముల తోడన్! 1

అస్త్రశస్త్రముల నన్ని విడిచినా యనామకునివలె నను దలచీ
రణరంగమునకు దూరముగా నను రయమున దెచ్చితి విటకు మఱిన్
నన్నవమానము జేసినావుగద! నలుగురిలో దల నెటునెత్తీ
సంచరించెదను? నా విక్రమమును సారథీ! మఱచితివా యేమీ?
నీ యాలోచన యనుసరించి మఱి నీతిలేని పని జేసితివీ! 2-3

శత్రు సమక్షంబున నన్నిట్టుల సరగున యవమానము జేసీ
నా యభిలాషను దెలియకుండగా నా రథమును రణమున నుండీ
ఎందుల కిట్టుల బహుదూరంబును బొందుగ దెచ్చితివో సూతా? 4

ప్రఖ్యాతంబగు బరాక్రమంబును బన్నుగ గలవారును మఱియున్
విక్రమములచే సంతోషింపగ వినతి జేయ దగువాడు మఱిన్

అట్టి శత్రువును గాంచుచుండగా నిట్టె యుద్ధలుబ్ధుఁడ నన్నున్,
నీచపురుషుగా జేసినావు మఱి నిన్నే మనవచ్చును నింకన్! 6

ఓరీ! దుర్మతి! సూతుఁడ వినుమా! నొనరఁగ నీవీ యరదమునూ!
యజ్ఞానంబున దోలికొనుచు మఱి నలరి యిటకు రాకుండినచో!
శత్రువుజేతను నుపహృతినందీ సత్కరింప బడితివి నీవున్!
నీ ప్రతి తర్కము సత్యమైనదీ యిమ్ముగ యట్లే జరిగినదీ! 7

ఓయనార్యుఁడా! సూతుఁడ! వినుమా! యలరి నేను బహుకాలంబున్
సంపాదించిన కీర్తి వీర్యములు సారత తేజము, నమ్మకమున్,
'మహాశూరు'డను కీర్తి యశస్సును మానుగ నశింప జేసితివీ! 5

ఓరీ సూతుఁడ! దుష్ట! దుర్మతీ! యొనరఁగ యీ సమయమునందున్
నీచే నే పని చేయబడినదో నిజముగ నా శత్రువులు మఱిన్
చేయదగినదీ నిజముగ సూతా! శ్రీకరముగ హితమును గోరూ
మిత్రుఁడు జేసెడి బృహత్ కర్మగా మేలుగ భావించుట లేదూ! 8

చిరకాలము నాతోని కలిసి మఱి స్థిరముగ కాలము గడిపినదీ,
మదిలో జ్ఞాపకముండినచో మఱి మానుగ నా గుణములును మఱిన్
నుపకారాదులు స్మరించుచో మఱి యున్నతుఁడగు నాశత్రువునూ
దూరముగా దరలక ముందుగనే త్వరిత గతిని జేర్చుము రథమున్! 9

బుద్ధిహీనుఁడగు రావణాసురుఁడు యుద్ధతి బలికిన పరుషములన్
విని హిత బుద్ధియు వివేకియునునగు విమల మనస్కుఁడు సారథియున్,
సానునయంబున వినయము దోడుత సావధానముగ యిటు బలికెన్! 10

లంకేశ్వర! విను! నాదు వచనములు శంకలేక సద్భావమునన్
రణమునందు నే భయపడలేదూ! రహి నే మూఢుండనుగానూ!
శత్రువుజేతను లంచములను దిని క్షాత్రధర్మమును మఱువనుగా!
పరగ స్నేహ రహితుండను గానూ ప్రమత్తుండ నే కాదుసుమా!
నీవుజేసినా సత్క్రియలను మఱి నేను మఱచిపోలేదు ప్రభూ! 11

నీ హితంబు మదిలో గోరుచునూ నీ యశస్సు గాంక్షించుచునూ,
స్నేహము జేతను బ్రసన్నమైనా స్థిరమగు మనస్సు గల నాచే
హితమనియెడి కారణము జేతనూ మఱి సహింపవని తెలిసిననూ!
శ్రేయస్కరమని తెలిసి జేసితిని స్థిరబుద్ధిని యోచించి మఱిన్! 12

మహారాజ! నీ ప్రియమునందు మఱి మానుగ హితమందున మఱియున్,
నీ కార్యంబును నేను జేసితిని! నిమ్ముగ ప్రసన్న స్నేహమునన్!
ఈ విషయంబున లఘుబుద్ధియు మఱి యిమ్ముగ యనార్య రీతిగనూ!
దోషంబును నే జేసినట్లుగా దోరముగా భావింపకుమా! 13

ఉన్నతగిరి శిఖరములనుండి మఱి యున్నతమగు జలధార వలెన్
రణరంగంబున నుండి యరదమును రయమున యేకారణముననూ!
మఱలించితినో తెలిపెద వినుమా! మానుగ సుస్నేహము తోడన్! 14

మహత్తరంబగు రణకర్మంబున మానుగ నీ శ్రమ కష్టంబున్
దెలిసికొంటినీ, పరాక్రమంబును దీరుగ జూపుటలోగానీ,
శత్రువుకంటెను నాధిక్యంబును మిత్రుడ! కనిపింపగలేదూ! 15

నా రథ హయములు గూడ రథంబును నయముగ లాగుట యందు మఱిన్
నలసిపోయినవి! భగ్నములైనది! యటు నిటు గదలక యుండెనటన్!
వర్షము జేతను గొట్టబడిన యా వసరగ గోవులవలె నుండెన్
ఘర్మ పరిక్రాంతములై హయములు గడు దీనముగా నుండె నటన్! 16

ఏ శకునంబులు మనకు నధికముగ యిమ్ముగ గనబడుచునున్నవో
పరిశోధింపగ చాలవఱకు నవి ప్రతికూలముగా నున్నటులన్,
కనబడిన వి మఱి కనబడుచున్నవి వినబడినవి మఱి వినబడుచున్! 17

మహాబలా! ఓ దశగ్రీవా! విను! మానుగ నాడు సువచనములన్
సారథిగా యుండిన వాడును మఱి సకలంబును దెలియగ వలయున్!
దేశకాలముల దెలియగ వలయును దీరుగ రథికుని లక్షణముల్,
భావంబుల సూచించునట్టి యా భవ్యముఖ వికారాదులనూ,
దైన్యంబును మఱి హర్షఖేదముల దగ సారథి తెలియగ వలయున్! 18

భూమిస్వభావము గల యెత్తు పల్లములు పొలుపుగ సమప్రదేశములున్,
సమములుగాని ప్రదేశంబులును సమరంబునకును సమయంబున్,
వీటన్నిటినీ తెలియగ వలయును విమల హృదయుడగు సారధియున్
పరుల లోపముల గూడ తెలియవలె బన్నుగ సారధి విజ్ఞతనూ! 19

రథసంరక్షకుడైన సారథియు రయమున దగ్గఱ జేరుటయున్,
దూరముగా బోవుట మఱి నిలుచుట దూరముగా మఱి బోవుటయున్,
ఇవి యన్నియు మఱి సారథిదెలిసియు నింపుగ రథమును నడుపవలెన్!20

భయంకరంబగు నీదు నలసటయు బన్నుగ దప్పించుట కొఱకున్!
నీకును మఱి యీ రథాశ్వములకును నిమ్ముగ శ్రాంతిని సమకూర్చన్!
నేనీ కార్యంబును లంకేశ్వర! నీతిని జేసితి యుక్తముగన్! 21

ఓ వీరుడ! ఓ లంకేశ్వర విను! నొనరగ నే నీ యరదమునూ,
నా యిష్టమునను స్వేచ్ఛారీతిని నయముగ దొలగింపగ లేదూ!
ఏది చేయవలెనో మఱి నాచే నిమ్ముగ రణరంగము నందున్,
భర్తృ స్నేహమున జరగ జేసితిని బరికింపుము సాలోచననూ! 22

అరిమర్దన! మఱి యాజ్ఞాపింపుము! నలరి నీవు జెప్పిన రీతిన్
ఆ విధమున నే నాచరించెదను! నడ్డు మాట మఱి దెలుపకనూ!
నీ ఋణమును నే దీర్పగవలయును నిశ్చిత స్థిర భావంబులతో! 23

సారథి పలికిన వాక్యంబులకును సంతోషించిన రావణుడున్!
అనేక విధముల ప్రశంసించెనూ యా సారథినీ మెచ్చుకొనీ!
యుద్ధలుబ్ధుడగు దశగ్రీవుండును యుద్ధతి నీవిధముగ బలికెన్! 24

సారథి నీ వీ రథమును వేగము సరగున రాముని కెదురుగనూ
గొనిపొమ్ము! యాలస్యము జేయకు! గూర్మి యాతడును నుండగనే
రావణుండు సంగ్రామమునందున రిపు శత్రువులను జంపకనూ
తిరిగి పోడు! ఆ సంగతి నీకును దెలియునుగదా! చిరమిత్రుడవున్! 25

రాక్షసప్రభువగు రావణాసురుడు రహి సారథితో నిటు బలికీ
ఆటుపిమ్మట యా సారథికిని మఱి సంతోషించిన వాడగుచున్

శుభకరమగు నొక హస్తాభరణము సురుచిరముగ బహుమతి నిచ్చెన్
ఆ సారథియును ప్రభు వాక్యంబుల నటు విని జనె రణభూమికినీ! 26

అటుపిమ్మట యా లంకేశ్వరుచే యలరి ప్రబోధింపగ బడుచున్!
ఆ సారథియును హయముల దోలెను నా రణరంగమునకును మఱిన్
అటుపిమ్మట యా రాక్షసేంద్రునీ యలరు మహారథమును గూడన్
రఘువీరుని యారథము ముందఱను రయమున నిలిపెను రణమునకున్

(యుద్ధకాండము నందు 104వ సమాప్తము)

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట అయిదవ సర్గము

(అగస్త్యుడు వచ్చి యుద్ధములో జయము సంపాదింప యాదిత్య హృదయమను స్తోత్రమును బఠింపుమని రామునకు నుపదేశించుట,]

సంగ్రామంబును జూచుటకొఱకై సరసత దివిజుల గూడికొనీ
వచ్చినట్టి భగవంతుండును నగు సచ్చరిత్రుడగు నగస్త్యుడున్,
యుద్ధ పరిశ్రాంతుండును మఱియును యుద్ధమునకు మఱి వచ్చిన యా
దశగ్రీవుని యెదుటను గాంచియు మఱి దగ యా సమయము నందుననూ!
చింతాక్రాంతుండై యుండిన యా శ్రీరాముని సరసను జేరీ!
అమృత వాక్కులను నీవిధ బలికెను నలరుచు వాత్సల్యము దొలుకన్! 1-2

మహాబాహువులు గలిగి నట్టి ఓ మహానుభావా! శ్రీరామా!
రామారామా! రఘుకులసోమా! రమ్య మహాగుణ రఘువీరా!
సనాతంబును రహస్యమైనది సాధువత్సలా! యదివినుమా!

చేనిజేత సంగ్రామమునందున ధీరత శత్రుల జయింతువో!
ఆస్తోత్రంబును నుపదేశించెద యలరి వినుము శ్రద్ధాభక్తిన్! 3

పుణ్యప్రదమును శత్రునాశమును జయావహంబును నక్షయమున్
పరమ శివంబును పావనంబునూ సర్వమంగళం బైనదియున్!
సర్వపాపముల ప్రణాశనంబును సరగున చింతా శోకములన్!
శాంతింపగ జేయునది యుత్తమము సరసత యాయుర్వర్ధనమున్!
అట్టి మహాలక్ష్యముల సాధనకు నాదిత్యహృదయం బను పేరన్
దివ్యమైన యొక స్తోత్రమున్నదీ దీనిని జపింపవలె నిపుడున్! 4-5

ప్రశస్తంబులగు కిరణంబులతో నుదయాద్రిని యుదయించు మఱిన్!
దివిజులచే మఱి యసురులజేతను దీరుగ పూజింపగ బడునూ!
ఇతర తేజముల గప్పివేయుచును నిమ్మగ కాంతిని దయచేయున్
భువనంబుల బాలించు భాస్కరుని పూజింపుము శ్రద్ధాభక్తిన్! 6

సకలదేవతల స్వరూపు డీతడు సహజ తేజమును గలవాడున్
తన కిరణంబుల సకలజీవులను దగ రక్షించెడివాడు మఱిన్,
దేవాసుర గణములను లోకులను దీరుగ తన కిరణంబులచే
రక్షించుచు నున్నాడు రాఘవా! రహి పూజింపుము భాస్కరునీ! 7

ఈ భాస్కరుడే బ్రహ్మదేవుడును నితడే విష్ణువు శివుడు మఱిన్,
స్కందుండును మఱి ప్రజాపతియునూ సకల దేవతల కధిపతియున్!
మహేంద్రుండు,మఱి ధనదుడు కాలము మానుగ యముడును చంద్రుండున్
సోముండును మఱి వరుణుం డితడే సురుచిరముగ సర్వము నితడే
అట్టి భాస్కరుని యారాధింపుము, ననితర శ్రద్ధాభక్తులతో! 8

పితృదేవతలు, అష్టవసువులును, జేరెమి సాధ్యులు నశ్వినులున్.
మరుత్తులును మఱి మనువు వాయువును మానుగ యగ్నియు ప్రజలు మఱిన్
ప్రాణవాయువును నీ సూర్యుడు సుమ! బరగ ప్రకృతియు నీతండే!
ఈతడు ఋతువుల నిర్మించును మఱి యీతడు వెలుగును దయసేయున్,
అట్టి భాస్కరుని యారాధింపుము! ననితర శ్రద్ధా భక్తులతో! 9

అదితి కుమారుడు నఖండ ధాత్రికి నధిపతి యీ భాస్కరుడు సుమా!
సవితుడు, సూర్యుడు, ఖగుడు, పూషుడును, నరసత గభస్తిమాన్ నితడే!
సువర్ణ సదృశ సమానుండునూ సురుచిరముగ భానుం డితడే!
హిరణ్య రేతస్సును గలవాడును మఱి బరగ దివాకరు డితడు సుమా!
అట్టి భాస్కరుని యారాధింపుము ననితర శ్రద్ధాభక్తులతో ! 10

హరి దశ్వంబులు గలవాడును మఱి వేయికిరణములు గలవాడున్,
సప్తహయంబులు గలవాడును మఱి సరసత మరీచిమాన్ యితడే!
తిమిరోన్మథనుడు శమ్బు డితడే త్వష్టయు మార్తాండుండితడే
అంశుమంతుడును నితడే రాఘవ! కాంతి కిరణములు గలవాడున్!
అట్టి భాస్కరుని యారాధింపుము ననితర శ్రద్ధాభక్తులనూ? 11

హిరణ్యగర్భుడు, శిశిరుడు, దపనుడు బరగ యహస్కరుడును మఱియున్
రవియును మఱియును నగ్ని గర్భుడును నదితి పుత్రుడును శంఖుడుసూ!
శిశిర నాశనుడు, తేజోవంతుడు శ్రీకరుడును మంగళకరుడున్,
అట్టి భాస్కరుని యారాధింపుము ననితర శ్రద్ధాభక్తులతోన్! 12

వ్యోమనాధుడును, తమోభేదియును విమల ఋగ్యజుః సామములన్
పారము బొందిన వాడును మఱియును ఘనవృష్టిని యిచ్చెడి వాడున్
అట్టిభాస్కరుని యారాధింపుము ననితర శ్రద్ధాభక్తులతో ! 13

ఆతపి మండలమును గలవాడును నల మృత్యువునూ, పింగలుడున్
సర్వాలాపనుడు కవి పండితుడును, విశ్వంబును నడిపెడి వాడున్,
మహాతేజమును గలవాడును మఱి యంతటి సంసారంబునకున్,
భవోద్భవుండగు వాడు నీతడును! భవ్య రూపమును గలవాడున్! 14

నక్షత్రములకు, గ్రహతారలకును నయముగ యధిపతి నితడుసుమా!
విశ్వభావకుడు దేటస్సులతో విమలతేజమును గలవాడున్,
అట్టిసూర్యునకు నమస్కార మిదె నట్టి భానునకు వందనమూ!
ద్వాదశ రూపములును గలవాడా! దగ నీకిదె మా వందనముల్! 15

పూర్వ పర్వతపు స్వరూపునకునూ పొందుగ మా వందన మిదిగో!
జ్యోతిర్గణముల పతియగు రవికీ ప్రీతిని మా వందనములునూ!
ధనాధిపతికిని నమస్కృతులు నివె! దీప్తిమంతునకు యంజలులున్! 16

ఉపాసకులకును జయము నిచ్చుచును నూహింపని శక్తులనిచ్చూ!
జయునకు జయ భద్రునకును మఱియును సరసత హర్యశ్వునకు మఱిన్
అడుగడుగున గాపాడువానికిని సుంబర మందున యుండి మఱిన్!
అట్టి సూర్యునకు వందనములు మఱి యాదిత్యున కివె వందనముల్! 17

ఉగ్రుడైన మా యాదిత్యునకును సురుతరమగు వందనము లివే!
వీరునకును నిదె నమస్కారములు విమల తేజునకు వందనముల్!
సారంగునకును వందనంబు లివె! సరసిజముల మేల్కొలిపెడి యా
మహాకాంతి వంతునకు వందనము! మానుగ ప్రచండుడవు నైనా
సూర్యదేవ! నీ కివె వందనములు సురుచిరమగు శ్రద్ధాభక్తిన్! 18

అజ యీశ్వర యచ్యుత రూపునకును నా సూర్యునకును వందనముల్
ఆదిత్య స్వరూపమైన యా యమితకాంతి గలవానికినీ,
మహా మహస్సులు గలవానికినీ మానుగ సర్వము భక్షించూ
రౌద్రరూపమును గలవానికినీ రమ్యమైన మా వందనముల్! 19

చీకటిమంచును శత్రువులను మఱి జేరగరానీ కృతఘ్నులన్
నశింపజేసెడి భాస్కరునికి యివె నయముగ నా వూదండలునూ!
యమితాత్మునకును, కృతఘ్నులను మఱి హతమొనరించెడి వానికినీ
యపరిచ్ఛిన్న స్వరూపంబుకు మఱి యలరు వానికిని వందనమూ,
ప్రకాశించు వానికి, జ్యోతిస్సుల బరగ యధిపతికి వందనముల్ 20

కఱిగించిన బంగారము వంటీ కాంతిగలిగినా వానికినీ,
అజ్ఞానము హరియించు వానికివి యఖిల సృష్టికర్తకు మఱియున్,
తమోవినాశకునకు వందనమిదె! దగ ప్రకాశరూపునకు మఱిన్!
తపింపజేయును వర్షించును మఱి దగ స్వర్గము ధరణిని జేయున్!
అట్టి భాస్కరుని నారాధింపుము అనితర శ్రద్ధాభక్తులనూ! 21

ప్రభువగు నీతడు నీసూర్యుండే బరగ జగంబును నశియింపన్
సర్వభూతముల నశింపజేయును సకల భూతముల సృజియించున్
తన కిరణంబులజేత సర్వమును దగ శుష్కింపగ జేయు మఱిన్
తపింపజేయును వర్షించును మఱి దగ స్వర్గము ధరణిని జేయున్
అట్టిభాస్కరుని యారాధింపుము ననితర శ్రద్ధాభక్తులనూ! 22

ఇతడు భూతములు నిద్రింపగ మఱి యిమ్ముగ యా భూతంబులలో
నున్నవాడునై మెలకువ నుండును జెన్నుగ యాత్మేశ్వరుని వలెన్!
ఈ సూర్యుండే యగ్నిహోత్రుడును నితడే వారల ఫలము సుమా!
అట్టిసూర్యునీ యారాధింపుము! నలరు భక్తి శ్రద్ధల తోడన్! 23

అలదేవతలును, నలక్రతువులునూ యాక్రతువుల ఫలములు గూడన్!
నితడే! యితడే! యీ సూర్యుండే! యిమ్ముగ లోకమునందుననూ!
ఏకృత్యంబులు యజ్ఞయోగములు, నిలగల బహు విషయములందున్
నితడు సమర్థుడు నితడే ప్రభువును, నితడే నిర్ణయకర్తయునూ!
అట్టిభాస్కరుని యారాధింపుము! నధిక భక్తి శ్రద్ధల తోడన్! 24

శ్రీరామా! యాదిత్య స్తోత్రమును స్థిరముగ నాపదలందుననూ
కష్టంబులలో భయ సమయంబుల కాంతారంబుల యందుననూ
ఆదిత్యుని స్మరియించు మానవుడు నలరి నశింపడు నెన్నటికిన్!
భూరిశుభంబుల నందును నాతడు బొలుపుగ భాస్కరు కృపవలనన్! 25

జగత్పతియు మఱి దేవదేవుడును సర్వేశ్వరుడగు భాస్కరునీ
యేకాగ్రతతో బూజింపుము మఱి యేకష్టములును రాకుండన్
ఈ భాస్కరు హృదయంబును రామా! యిమ్ముగ ముమ్మారులును మఱిన్
జపించినను మఱి యుద్ధము నందున జయము నందగలవాడవునూ! 26

మహాబాహు! ఈ ముహూర్తమందే మహారాక్షసుని వధింతువూ
అని యీ విధముగ యగస్త్యుండునూ యలరి రామునకు బోధించీ,
వచ్చిన విధముగనే బోయెను నా సచ్చరిత్రుడగు మహర్షియున్; 27

అటుపిమ్మట యా శ్రీరాఘవుడును నా ఋషి జెప్పిన స్తోత్రంబున్
విని శోకంబును వదిలినవాడై విమల మనస్సును గలవాడై
సుప్రీతుండై నిశ్చల మనసున శ్రీయాదిత్యుని స్తుతియించెన్! 28

వీర్యవంతుడగు రామచంద్రుడును విమలహృదయమున యాదిత్యున్
గనుగొనుచును నట మూడు మాఱులును కరమున యాచమనము జేసి
శుచిర్భూతుడై జపించి రాముడు, సురుచిర సంతోషము నందెన్
మహాకార్ముకము గ్రహించి రాముడు మానుగ హృష్టాత్ముడు నగుచున్
రణమును జేయగ రణరంగమునకు రయమున సముపాగతుడయ్యెన్! 30

అటుపిమ్మట మఱి ముదితహృదయుడై యా భాస్కరుడును వేగముగన్
ప్రహృష్టమానుండగుచు రాముని బరగ నిరీక్షించుచు మఱియున్,
రావణుడు మరణింప నుండెనని రహి మదిలో నది తెలిసికొని
దేవగణము మధ్యను మఱి యుండియు దీరుగ తొందర పడు మనుచున్
ఆశ్రీరాముని తోని బలికెను నా సూర్యుడును బ్రసన్నుండై! 31

(యుద్ధకాండమునందు 105వ సర్గము-సమాప్తము)

* * * *

# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట యాఱవ సర్గము

[రావణుని రథమును జూచి, రాముడు మాతలికి దగు విధముగా జెప్పుట—రావణుని పరాజయమును రాముని విజయమును సూచించు శకునములు కనబడుట]

ఆరావణునీ సారథి మఱియును నలరి సంతసించిన వాడై,
పరసైన్యంబును నెదురించునదై, ఐన్నగ మాయా కల్పితమౌ
నగరమువంటీ యాకారముతో నయముగ చిత్ర పతాకలతో
నుత్తమగుణముల తోని గూడినా యున్నత బంగరు మాలలచే
నలంకరింపగబడిన హయములను నలరి కట్టగా బడినదియున్
యుద్ధసాధనలతో నిండినదీ యుద్ధతి పతాక ధ్వజములతో
గూడియున్నదియు, యాకాశంబును గూర్మి ప్రమింగుచున్నది వలెనూ
వసుంధరను ధ్వనియింపజేయుచును వనరగ పరసైన్యములకునూ
ప్రణాశనంబును స్వసైన్యములకును ప్రహర్షణము గలిగించుచునూ
రావణు రథమును నతిశీఘ్రముగా రమ్యముగా సారథి నడిపెన్! 1-2-3

ధ్వని గలిగినదియు; మహాధ్వజంబును దగ గలిగినదియు నారథమున్
నల్లని గుఱ్ఱములను గూడినదీ, నయముగ భయంకరంబైనా
తేజస్సులతో గూడియున్నదీ, దీరుగ యాకాశమునందున్,
దీప్యమాన మగుచున్నది మఱియును దివిరి విమానము వోలె మఱిన్
నున్నట్టిదియు, సూర్యవర్చసము తటిత్పతాకా గహనంబున్!
ఇంద్రధనుసులా కాంతి గలిగినది సాంద్రవేగమున వచ్చునదియున్
రాక్షసరాజగు రావణాసురుని రథమును రాముడు గనుగొనియెన్! 4-5-6

శరధారల విడుచుచు నున్నదియును ధారాసారము గురియుచునూ,
యంబుదమునకును వలెనున్నదియును నంబుద సమానమైనదియునూ,

వజ్రముచేతను గొట్టబడిన యా వనరగ బ్రద్దలు నగుచుండూ!
పర్వతంబునకు సమానమైనది బన్నుగ ధ్వనియును గలదైనా,
యాపతంతమగు రథమును గాంచీ యా శ్రీరాముడు వేగముగన్,
బాలచంద్రునికి వలె వంచిన యా బన్నుగ ధనుసును జరచుచునూ,
సహస్రాక్షునీ సారథియైనా సరసత మాతలితో ననియెన్! 7-8

ఇంద్రసారథీ! మాతలి వినుమా! సాంద్ర ధ్వనితో వచ్చెడి యా
శత్రురథంబును జూడుము! మఱలను శరవేగము నపసవ్యంబున్!
వచ్చుచునుండెను దీని బట్టి మఱి చచ్చుట కొఱకే యీరీతిన్,
వచ్చుచున్నాడని నా మదిలో మచ్చిక దోచుచు నుండె మఱిన్! 9-10

అకారణమున య ప్రమాదమున యలరి యుండు మాతలి నీవున్
శత్రురథమునకు బ్రత్యుద్గతముగ సాగుము! రథమును బోనిమ్మా!
పైకి లేచినా మహామేఘమును బన్నుగ వాయువునకు బోలెన్!
ధ్వంసము జేసినయట్లు వీనినీ ధ్వంసము జేసెద జూడు మికన్! 11

అవిక్లమంబుగ యసంభ్రాంతమున యలరి దిగులు జెందని మదినీ,
కళ్లెము బాగుగ బట్టి రథంబును గదనమందు నాధీనమునన్!
నుంచుకొనియు శీఘ్రముగా గొనిపొమ్మా! యంచితముగ శత్రువు కడకున్!

పురంధరునికిని రథము దోలుటకు బూర్తిగ యలవడితివి నీవున్
నీకువాస్తవము జెప్పదగినదియు నిజముగ లేదుగదా మఱియున్!
నేకాగ్రముతో సంగ్రామంబును నిమ్ముగ చేయగ దలచితినీ,
అందువలననే గుర్తుజేసితిని పొందుగ బోధించుట లేదూ! 13

ఉత్తముడును, సుర సారధియైనా యున్నతుడగు నా మాతలియున్
నా శ్రీరాముని వచనంబులకును నలరుచు బరితుష్టుండై మఱియున్,
రాముడు జెప్పిన రీతిగా రథము రయమున నడిపెను ముందునకున్! 14

అటుబిమ్మట యా సుర సారథియును నాదశగ్రీవుని యరదంబున్
అపసవ్యముగా నుండునట్లుగా నలరి జేయుచును వేగముగన్!
రథచక్రంబుల బయలుదేరినా పథ పరాగముల జేత మఱిన్!
రావణాసురుని గప్పుచు దెరవలె రథమును నడిపెను ముందునకున్! 15

అటులిమ్మట కోపించి రావణుడు జటుల తామ్ర విస్ఫారితముల్
నేత్రంబులతో రథమున కెదురుగ యాత్రతతో రాముని గాంచీ,
శితసాయకముల గప్పివేసెనూ శీఘ్రముగా శ్రీరామునిపై! 16

ఎదిరింపగబడి రావణుజేతను మదిక్రోధము జెందియును మఱిన్!
ధైర్యంబును మఱి రోషముతోడను దగబొందుచు రణరంగమునన్!
సుమహావేగము గలిగినట్టి యా సురుచిర యైంద్రాస్త్రంబు మఱిన్!
గ్రహించె నంతట రామచంద్రుడును కదనమునందున వేగముగన్! 17

సుమహావేగము గలిగినట్టి యా సూర్యకిరణముల సమానమున్!
కాంతి గలిగినా శరజాలంబును కాంతిమంతుడగు రాఘవుడున్!
గ్రహించె నంతట యన్యోన్యంబును గడు దీక్షణమగు యుద్ధంబున్!
గర్వించిన సింహంబుల వోలెను గదనము జరిగెను వారలకున్! 18

అటులిమ్మట దివిజులు, గంధర్వులు నల మహర్షులును సిద్ధులునూ
రావణు వినాశమును గోరుచును రాముని విజయము గోరుచునూ!
యిద్దఱి రథికుల సంగ్రామంబును నొద్దిక వచ్చిరి దిలకింపన్! 19

అటులిమ్మట రావణు నాశంబును నల రాముని యభివృద్ధికినై
దారుణంబులును, రోమాంచములును దగ గలిగించుచు నంతటనూ!
యుత్పాతంబులు, బయలుదేరినవి యుభయుల యని జరుగుచునుండన్! 20

రావణు యదరము పైభాగంబున రక్తము పర్జన్యుడు గురిసెన్!
మండలములుగా దిరుగుచు గాలులు మెండుగ రథమును జుట్టుచునూ!
ప్రదక్షిణముగా గాలులు వీచెను బ్రకటించుచు యపశకునములన్! 21

ఆకాశంబున భ్రమణము నొందుచు నటగల గృధ్ర సమూహంబున్
రావణాసురుని మహారథంబును రహి యేవైపుల బోయెడినో
యామార్గంబుల నెగురుచుండెనూ నాయరదము జుట్టును దిరిగీ! 22

ఆ లంకాపురిపై వ్యాపించెను నలరి జపా పుష్పంబులతో
సమానమైనా సంధ్యలు నప్పుడు సరగున వసుమతి యంతటనూ
పగలుగూడ మఱి మండుచున్నటుల బిమ్మగ గనబడు చుండె నటన్! 23

ఆ సమయంబున యుబుములతోడను నలరు మహాధ్వనులును గలుగా!
ఘనమగు నుల్కలు బడినవి లంకను గనగన మండుచు నంతటనూ!
అహితములైనవి రావణునకు మఱి యలరి రాక్షసులకును గూడన్!
విషాదమును మఱి జెందునట్లుగా వికలత గలుగగ జేసినవీ! 24

ఆ దశగ్రీవుడు రణరంగంబున యెచరి యుండునో నచ్చోటన్
వసుంధరయు మఱి కంపము జెందెను నానరగ యుద్ధము జేసెడి యా
ప్రబల రాక్షసుల మహాబాహువుల బట్టుకొనిన యటులుండె మఱిన్!
విషాదమును మఱి జెందునట్లుగా వికలత గలుగగ జేసినవీ! 25

ఆ మండోదరి ప్రియుడు రావణుని నగ్రభాగమున జిత్రముగా
ఎఱ్ఱని పచ్చని తెల్లని నల్లని యిమ్ముగ సూర్యుని కిరణంబుల్!
గనబడు చుండెను బర్వతమందలి కరిగిన ధాతువులకు వోలెన్!
రంగురంగులను గనబడుచుండెను రమ్య సూర్య కిరణంబులునూ! 26

గృధ్రములను మఱి యనుసరించుచును కీచులాడుచును నక్కలునూ!
యాదశగ్రీవుని ముఖమును గాంచుచు యడలుచు నిప్పులుగ్రక్కుచునూ!
అమంగళముగా సంరబ్ధముగా నఱచిన వచటను వికటముగా! 27

రాక్షసేంద్రుడగు రావణాసురుని రహి దృష్టివిలోపము గూర్చి!
రణరంగంబున పరాగంబునూ రయమున జిమ్ముచు నాతనిపై
ప్రతికూలముగా వీచెను వాయువు బన్నుగ వేడిమి గూడికొనీ! 28

జలధరోదయము లేకుండగనే సహింప శక్యంబునుగానీ
భయంకరంబగు ధ్వనితో గూడను బన్నుగ రాక్షస సైన్యమునన్,
పిడుగులు బడినవి యగ్నులగూడుక పేరిమి జ్వాలలతో గూడన్! 29

సమస్తములునగు దిక్కులన్నియును సరగున తిమిరముతో గూడి!
చీకటి తెరలును గప్పివేసినవి భీకరముగ యా సమయమునన్!
పాంసుపరాగము జేత నభంబును బన్నుగ కప్పగ బడియు మఱిన్!
యాదళక్యమును గాకుండెను నట చోద్యముగా నా సమయమునన్! 30

దారుణ రుతములు గలిగినట్టి యా దారుణ గోరింకల గుంపుల్
భయంకరముగా నఱచుచు మఱియును బలమున బోరాడుచు మఱియున్
రావణాసురుని రథముపై బడెను రణగొంఙధ్వని మఱి జేయుచునూ! 31

ఆ దశాననుని యశ్వంబులు మఱి నటు జఘనంబుల నుండియునూ
అగ్నికణములను, కన్నులనుండీ యలరు భాష్పములు విడిచినవీ,
యీరీతిని మఱి యగ్నిని నీటిని యిమ్మగ సమముగ విడిచినవీ! 32

ఈవిధములునగు ననేకమైనా యిమ్మగ భయావహంబైనా
అనేకమైనా దుర్నిమిత్తములు నా లంకను రణరంగమునన్!
రావణాసురుని వినాశమునకును రహి సూచించుచు గనబడెనూ! 33

ఆ విధముగనే సౌమ్యంబులు మఱి యల మంగళప్రదములునైనా
నిమిత్తంబులును నలరుచు గనబడె నీరజాక్షుడగు రామునికిన్!
వినయంబును సూచించుచు మఱియును సరసత శుభకరములునైనా
అంతట గనబడె యారాఘవుడును సంతసమందిరి కపివీరుల్ 34

రాఘవుండు దన విజయము కొఱకును రహి సూచించెడి సౌమ్యములున్
శుభకరమగు శకునంబుల గాంచియు శూరుడు రాముడు దన మదిలో,
సంతసమందెను నా రాక్షసుడును నంతరించి నటు భావించెన్ 35

అటుబిమ్మట యా నిమిత్తకోవిదు డగు శ్రీరాముడు రణమందున్
నాత్మగతములగు నిమిత్తంబులను సలరి గాంచి హర్షముతోడన్
అధికమైన సుఖమును మఱి బొందెను నా సంగ్రామము నందుననూ!
అధికమైన విక్రమమును జూపెను నత్యుత్సాహము తోడుతనూ! 36

[యుద్ధకాండమునందు 106వ సర్గము సమాప్తము]

   

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూ ట ఏ డ వ స ర్గ ము

(రామరావణులు భయంకరముగా పోరాడుట)

అటువిమ్మట యా యోధులిద్దఱికి యా రాముడు రావణులకునూ
సుక్రూరంబును, మహత్తరంబును సురలోకంబును గాంచగనూ
సర్వలోకముల భయావహంబును సరసత రెండిటి రథములకున్
సంబంధించిన క్రూరమైనదియు సంగ్రామంబును జరిగె నటన్! 1

అటువిమ్మట రాక్షససైన్యంబును జటుల వానరుల సైన్యంబున్
ప్రగృహీత ప్రహరణములు గలదై బన్నుగ యాశ్చర్యముతోడన్,
నిలిచి యుండెనట రణరంగంబున నిరతము హృదయము గంపింపన్! 2

బలశాలురు నా నరరాక్షసులును బన్నుగ సమరమునకు దిగుటన్,
గాంచి యచటగల కపిరాక్షసులును యంచితముగ రణమును జూడన్!
వ్యాక్షిప్తమునను హృదయంబులతో బరమాశ్చర్యముతోని మఱిన్,
వారల రణమును గాంచ కోరికను వనరగ నిలిచిరి ప్రేక్షకులై 3

అటగల సైనికులందఱు గూడను హస్తంబులలో నాయుధముల్
ధరించి జూచుచు నిలబడి పోయిరి దగ నర రాక్షస యుద్ధంబున్,
విస్మితబుద్ధులు గలవారునునై విమల తేజులగు వారలునూ!
పరస్పరము యుద్ధము జేయుటకును బన్నుగ వారలు బోలేదూ! 4

లంకేశ్వరుడగు రావణుగాంచుచు మంకుతనము నింతయు లేకన్,
ఆశ్చర్యముగల నేత్రంబులతో నారాక్షసులును నిలిచియునూ!
రఘువీరుని గాంచెడి కపిసేనయు రమ్యమైన నేత్రంబులతో
చిత్తరువునకును వోలె నచ్చటను జిత్రముగా మఱి భాసించెన్! 5

ఆ రాఘవ రావణులు నిద్దఱును నచటి శకునములు గాంచియునూ
కృతబుద్ధియు మఱి గలవారునునై మతిస్థిరమగు కోపముతోడన్!
భయపడకుండగ రణమును సలిపిరి బన్నుగ ధీరత విక్రమతన్! 6

జయింపవలెనని యా రఘువీరుడు సరగున నిశ్చయమును జేసీ
మరణింపగవలె ననుచు రావణుడు మానుగ దృఢనిశ్చయములతో!
ఆ సమయంబున యుద్ధమునందున యలరుచు రాఘవ రావణులున్,
స్వవీర్య సర్వస్వమును జూపిరీ సకల సైన్యమును దిలకింపన్! 7

అటుపిమ్మట యా వీర్యవంతుడగు నా దశగ్రీవుడు గ్రోధమునన్,
శరజాలంబును సంధించియు మఱి సరగున రాముని రథముననూ!
పైనిగలిగినా ధ్వజమునందునను బరగ ప్రయోగించెను వేగన్! 8

ఆ శరజాలంబులు పురందరుని యాధ్వజమును మఱి పొందకయే
లక్ష్యంబును మఱి సాధింపకనే లక్ష్యసిద్ధి మఱి పొందకనే!
రథశక్తిని మఱి స్పృశించి మాత్రము రయమున ధరణీతలము బడెన్! 9

అటుపిమ్మట మఱి వీర్యవంతుడగు జటుల విక్రముడు రాఘవుడున్,
సంక్రుద్ధుండై చాపంబులతో సరగున చేసిన దానికినీ,
ప్రతిక్రియను జేయుటకొఱకై దా బరగ మదిని ప్రారంభించెన్! 10

అంతట శ్రీరఘురామచంద్రుడును స్వాంతంబున కోపించి మఱిన్,
రావణు ధ్వజమును నుద్దేశించియు రమ్య మహాసర్పము వోలెన్,
సహింప శక్యముగానిదియైనా సరగున తన తేజస్సులతో
మండుచున్నదా యనునట్లుండిన మహా నిశిత శరమును విడిచెన్! 11

తేజస్వియునగు రామచంద్రుడును దీరుగ ధ్వజమును గురిజూచీ,
సాయకమును విడిచెను వేగముగా సరగున ధ్వజమును చేదింపన్!
ఆ బాణంబును నా దశగ్రీవుని నలరు ధ్వజంబును చేదించీ,
మహీతలంబున బడెను ధ్వజముతో మానుగ యందఱు దిలకింపన్! 12

ఆ దశగ్రీవుని స్యందన ధ్వజమును నట ఛేదింపగ బడినదియై
మహీతలంబున బడిపోయెను నది మానుగ యందఱు దిలకింపన్,
రావణుండు పఱి ధ్వజఖండనమును రహి గాంచుచు గ్రోధముతోడన్,
నవ్వుచు బెద్దగ యమర్షంబునను నయముగ ప్రజ్వలితుం డగుచున్,
రోషవశంబును బొందినవాడై రూఢమైన శరవర్షంబున్
నా శ్రీరామునిపై గురిపించెను నటగల వారలు దిలకింపన్! 13-14

అ రావణుడును దీప్త శరంబుల యా రాముని రథ తురగములన్,
గొట్టెను గానీ యా తురగములును గూరిమి భ్రాంతిని బడలేదూ!
తొట్రుపాటు మఱి యటబడలేదూ! తోరముగా నాశరములచే
పద్మనాళములు దగిలినట్లుగా బాధ నింత మఱి బడలేదూ!
స్వస్థమైన హృదయముతో నుండెను అస్థిరతను నందగ లేదూ! 15

ఆ సమయంబున యా రావణుడును నా యశ్వంబులు నిర్భయతన్
నుండుట గాంచియు సుసంక్రుద్ధుడై మెండుగ శర వర్షంబు మఱిన్,
నట గురిపించెను నా రాఘవుపై చటుల భయంకర వీర్యమునన్! 16

గదలను, బరిఘల, చక్రంబులనూ గడు దీవ్రములగు ముసములన్,
నట గురిపించెను నా రాఘవుపై చటుల భయంకర వీర్యమునన్! 17

ఆ సమయంబున యా రావణుడును నలసట జెందని హృదయమునన్,
ప్రయత్నమందున నిరాశజెందక ప్రబలమైన బల వీర్యములన్,
ఆ రణమున మాయాకల్పిత మగు నాయుధ వర్షము గురిపించెన్
వేలకొలది శరములు రామునిపై విడచెను విరామము లేకన్! 18

రాముని రథమును విడిచిపెట్టి మఱి రావణుండు మఱి వేగముగన్,
చుట్టును గల వానరసైన్యముపై నూటిగ శరజాలము విడిచీ,
యంతరిక్షమును నవకాశంబును నట లేకుండగ నింపె నటన్! 19

ఆ సంగ్రామమునందు దుముులమును నలరి భీతి గలిగించునదీ,
భీమంబును మఱి భయంకరంబగు భీకర ధ్వనియును గలదియునూ!

అనేక యస్త్రంబులతో గూడిన నట ఘన వర్షము గురిపించెన్!
వేంకొలది శరములు రామునిపై విడిచెను దశగ్రీవుడు నంతన్! 20

ప్రాణాశయు మఱి లేని మనస్సున బన్నుగ యాదశగ్రీవుడునూ!
అనేక విధముల యాయుధంబులను నచట ప్రయోగించెను నతడున్,
తుది ప్రయత్నమును జేయుచునున్నా మది రణ తత్పరుడునునైనా
యా దశగ్రీవుని గాంచి రాఘవుడు నలరి నవ్వుచును రణమందున్!
నిశిత బాణముల సంధించెను నట నిఖిల గగనచరులును గాంచన్!
అనాయాసముగ వందలు వేలును నలరి ప్రయోగించెను శరముల్! 21-22

రావణుండు యాశరముల గాంచీ రయమున తన బాణంబులచే
నాకాశంబును నంతను నింపెను నవకాశము లేకుండగనూ
వారిద్దఱునూ బ్రయోగించినా ప్రకాశించు శరవర్షముచే
బాస్వదమ్బరము శరబద్ధంబగు బన్నుగ రెండవ నింగి వలెన్!
ప్రకాశించు చుండెను గనువారికి బన్నుగ కపిరాక్షసుల కటన్! 23-24

రణమునందు నా రామ రావణులు రహి శరములు విడుచుచు నుండన్
లక్ష్యములేనీ బాణమొక్కటియు లక్ష్యము భేదించనిది మఱిన్,
వ్యర్థమైన బాణంబును లేదూ! సిద్ధము పరస్పరంబు మఱిన్,
కొట్టుకొనుచునూ ఢీకొట్టుచునూ కూరిమి నేలను బడినవటన్! 25

వారిద్దఱునూ రామ రావణులు వనర యెడమ కుడివైపులునూ
నిరంతరముగా శరముల వదులుచు నీరధి యలలకువోలె నటన్!
రణమును సలిపిరి వీరిద్దఱును రహి యాకాశంబును మఱియున్
నూపిరి సలుపని దానిని జేసిరి యూహింపగ లేకుండగనూ! 26

రావణు రథ హయములను రాముడును రాముని హయముల రావణుడున్
కొట్టిరి యీవిధమున వారలనూ కూరిమి బదులునకును బదులున్!
ఒక్కరు జేసిన దాని వేరొకరు జక్కగ యనుకరణమును మఱిన్
విక్రమముగా జేసియు యుద్ధంబును జిక్కక యోడక యిద్దఱునూ! 27

సంక్రుద్ధులును వారలిద్దఱును సుదుచిరముగ యీ విధముగనూ
సంగ్రామంబును జేసిరి వారలు సాటిలేని బహు రీతులనూ!
ముహూర్తకాలము దుముల మైనదియు ముదమును రోమాంచమును మఱిన్
గలిగించునదీ యైన యుద్ధమును గలిగె జరిగె రణరంగమునన్! 28

మహాబలాఢ్యులు రామ రావణులు మానుగ సంగ్రామమునందున్,
శిత శరజాలముజేత వారలును శీఘ్రము రణమును సలిపి రటన్!
రాక్షసాధిపుండైన రావణుడు రథ ధ్వజమును బడిపోవుటచే
రఘూత్తమునిపై కోపము జెందెను రావణుండు నధికాధికమున్! 29

రణరంగంబున యీ విధముగనూ రణము సలుపుచుండెడి వారిన్
రామ రావణుల సకల భూతములు రమ్యభావమున గాంచి రటన్
ఆశ్చర్యంబును నద్భుతంబునగు నలరెడి మనసుల గాంచి రటన్! 30

వారిద్దఱునూ రామరావణుల వసర స్యందనోత్తములునూ
పరస్పరము పీడించు కొనుచునూ, బన్నుగ ఢీకొనుచును మఱియున్
గోపించినవై యన్యోన్యంబును గూర్మి యెదురెదురు బోయినవీ! 31

పరస్పరము వధయందు యుక్తమగు బరగ మండలంబుల గతులున్
ప్రసిద్ధ మార్గములందు గతులనూ, బరగ దూరముగ బోవుటనూ!
తిరిగి వచ్చుటయు బహు విధంబులగు దీరుగ సూతుల బలములనూ!
సామర్థ్యంబున యనేక విధముల సరస గమనముల జూపుచనూ!
భయంకరముగా నుండె రణంబును భయభీతులు మఱి గొలుపుచునూ! 32

రఘువీరుడు నా రావణ రాక్షసు రావణుండు మఱి రఘువీరున్,
పీడించుచు, దాడించుచు రణమును పేరిమి జేసిరి దీవ్రతనూ!
ఒకరి గతిని వేరొకరు నడ్డగా వసరగ గతి వేగంబులనూ
ప్రదర్శించిరీ యందఱు గనుగొన బన్నుగ రాక్షస కపివీరుల్! 33

శరజాలంబుల జిమ్ముచున్న యీ సరసత వారల రథములనూ,
జలధారలు వర్షించుచున్న యీ జలదంబులవరె రణమందున్!
యుద్ధ భూమిలో సంచరించినవి యిద్ధాత్రియు గంపింపగనూ! 34

అటుబిమ్మట యా రథములు రెండును జటులముగా విహరించి మఱిన్
అనేక విధముల గమనంబులనూ యనేక విధముల గతుల మఱిన్,
జూపి మఱల యొకదాని కొకటియును నూటిగ యెదురుగ నిలిచినవి! 35

అటుల యెదురుగా నిలిచిన రథముల నలరు ధురముతో ధురము మఱిన్
వాజిముఖంబుల వాజిముఖములను వనరగ యెగిరెడి పతాకముల్!
పతాకములతో గలిసిన వప్పుడు బన్నుగ నిలువగ యా రథముల్! 36

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును జటుల ధనుస్సును వంచి మఱిన్,
నాల్గుగు బాణంబులను విడిచె మఱి నయముగ రావణ రాక్షసునీ,
ప్రకాశించు నాలుగు గుఱ్ఱములును బరగ గొట్టె వెనుకకు మఱలన్! 37

హయములు వెనుకకు బోవునట్లుగా నా రాముడు జేయుట చేతన్,
గోపించిన యా రావణాసురుడు గ్రోధముతో నా రాఘవునీ,
వాడియైన బహు బాణంబులనూ ప్రయోగించె బలవీర్యములన్ 38

బలవంతుండగు దశాననునిచే బన్నుగ బాణంబుల చేతన్!
అధికముగా మఱి కొట్టబడిననూ యా శ్రీరాముడు రవంతయున్!
వికారమును మఱి పొందలేదుగా వికలత వ్యథ పొందగ లేదూ! 39

ఆ దశాననుడు వజ్రహస్తుడగు నా యింద్రుని రథ సారథినీ
యా మాతలినీ యుద్దేశించియు నలరు బిడుగుతో సమానమున్!
ధ్వనియు గలిగినా బాణములనూ దగ బడవైచెను నాతనిపై! 40

ఇంద్రసూతుడగు నా మాతలినీ సాంద్రముగా నొప్పించుటచే!
నా రఘువీరుడు గోపము జెందెను నలవిగాని చందమున నటన్!
అంత కోపమును గలుగ లేదు మఱి యింత దనను బీడించిననూ!
బాణజాలమును బ్రయోగించి మఱి బరగ శత్రువును నొప్పించెన్! 41

వజ్రహస్తు సారధియగు మాతలి వనర శరీరముపై బడినా!
మహావేగమును గల శరములునూ మానుగ సుసూక్ష్మమును గూడన్!
సమ్మోహంబునగాని వ్యథయునూ సరసత గల్పింపగ లేదూ! 42

రఘువీరుండగు రామచంద్రుడును రావణాసురుని రథముపయిన్,
ఇరువది, ముప్పది, నలుబది వందలు నిమ్ముగ వేలును బాణములన్,
నీ విధముగ బాణములను విడిచెను నిమ్ముగ బల శౌర్యంబులచే! 43

అటుపిమ్మట గోపించి నట్టి యా పటుబల రాక్షసేంద్రుడు గూడన్!
సంగ్రామంబున రామచంద్రునీ సరగున గదలను ముసలములన్,
వర్షించుచు బీడించె రాఘవుని వనరగ సేనలు గనుచుండన్! 44

మఱల తత్ప్రయుక్తమునగు యుద్ధము మానుగ తుములముగా నుండెన్,
రోమహర్షణము గలిగించుచునూ రూఢిగ భీకరముగ నుండెన్.
గదలు, ముసలములు బరిఘులచేతను ఘన శరజాలపు గాలులచే
సప్తసాగరములును క్షుభితములై సాటిలేని ధ్వనులును గలిగెన్! 45-46

సాగరములును మఱి క్షోభ జెందగా సరసత వానికి యడుగుననూ!
పాతాలంబున వసించువారలు బన్నుగ దానవులును మఱియున్,
వేలకొలది పన్నగులు గూడనూ విలపించిరి వ్యథజేత మఱిన్! 47

పర్వతములతో వనముల తోడను బన్నుగ యరణ్యముల తోడన్,
గూడియుండినా సమస్తమైనా కూరిమి మేదిని గంపించెన్!
మహాసూర్యుడును నిష్ప్రభుడయ్యెను మారుతమును వీచగ లేదూ! 48

అటుపిమ్మట గంధర్వులు, దివిజులు నట సిద్ధులు నల మహర్షులున్
కిన్నరులును మఱి మహోరగులునూ కిమ్మనకుండగ భయభీతిన్!
చింతాక్రాంతులునై మనసులలో వంతనుబొందిరి యట్టి యెడన్! 49

ఆ సమయంబున ఋషిగణములతో నలరు దేవతాగణములునూ
గో బ్రాహ్మణులకు శుభమగు గాతను! కుదురుగ లోకము లన్నియునూ!
శాశ్వతంబులై యుండెడిగాతను సరగున రఘువీరుండు మఱిన్!
రణమునందు రాక్షసరాజైనా రావణాసురుని జయించుతన్
అనుచు మెల్లగా జపించుకొనుచును నటు ఘోరమును భయంకరమున్!
రోమహర్షణమునైన యుద్ధమును రూఢిగ నట జూచిరి వారున్! 50-51

గంధర్వాప్సర సంఘంబులు మఱి గగనంబున విహరించుచునూ!
సాటిలేని యా రణమును గాంచి సన్నుతించుచును వారలునూ!
ఆకాశము నాకాశమువంటిది జలధి జలధి వంటిది సుమ్మా!
రామ రావణుల యుద్ధముగూడను రామరావణుల యుద్ధంచే!
యనుచు నొకరితోనొకరను కొనుచును నలరి జూచి రా యుద్ధంబున్!

అటుపిమ్మట యా మహాబాహువును నల రఘువంశీయుల కీర్తిన్
వృద్ధిని బొందించెడి వాడయినా విమల మతియు శ్రీరాముండున్?
క్రోధము వలనను జాపమువంటి కూరిమి విషసర్పము వంటి!
శరమును వేగము సంధించియునూ సరసత శోభా యుక్తమునూ!
జ్వలిత కుండలములునుగల రావణు సరసత శీర్షము ఛేధించెన్!
ఆ సమయంబున నేలమీదబడి యట దొరలెడి యాశీర్షమునూ
మూడులోకములజేత జూడబడె మోదముగా నా సమయమునన్!

అ శిరసునకును సదృశమైన యన్యమైన యారాక్షసుని
శిరసు నచ్చటను నుద్భవించినది శ్రీకరముగ యథారీతిన్!
హస్తలాఘవముతో శీఘ్రముగా నలరి కార్యముల జేసెడి యా
రఘువీరునిచే నాశీర్షంబును నలరి నేలబడగొట్ట బడెన్! 56

యుద్ధమునందున రెండవదైనా యుద్ధతుడగు రావణు శిరసున్
సాయకములచే ఛేదింపగ బడె సరగున యాశీర్షంబు మఱిన్
ఛేదింపగబడు నా క్షణమందే జెలగి యదియు మఱి కన్పించెన్
చిత్రమాయె శ్రీరామచంద్రునకు చిత్రమాయె సేనలకు మఱిన్! 57

అదిగూడను మఱి వజ్రసమంబగు నలరు రామ బాణంబులచే
ఛేదింపగబడె నీ విధముగనే శీఘ్రము సమాన కాంతియునూ!
గలిగినట్టి మఱి నూరు శిరస్సుల ఖండించెను రఘు నాయకుడున్!. 58

ఇన్నిమార్లు ఛేదించినగూడను జెన్నుగ రావణు ప్రాణములున్
విడిచి యంత మొందుటలేదుకదా! విడివడి యుండదు శీర్షంబున్!
అటుపిమ్మట సర్వాస్త్ర విదుండును జటుల పరాక్రమ శాలియునూ!

కౌసల్యా యానందవర్ధనుడు కరమున యనేక బాణములన్
గలిగినట్టి యా రాఘ వేంద్రుడును గడు వ్యాకులతను జింతించెన్! 59

వేనిచేత మారీచ రాక్షసుడు విమల గతికి బంపగ బడెనో,
వేనిచేత ఖరదూషణాదులును విగతజీవులై బడినారో,
క్రౌంచ వనంబున కబంధుండునూ కరమున దండక వనమందున్,
విరాధుండు మఱి జంపగబడెనో విమల ప్రవాసముజేత మఱిన్
వేనిజేత మఱి సాలవృక్షములు విమల గిరులు బ్రద్దలు నయ్యెన్
వాలికూడ మఱి జంపగబడెనో వనర సముద్రముగూడ మఱిన్
క్షుభితమైనదో నలరునట్టి యీ శూరవంతమగు బాణములున్,
సంగ్రామంబుల యందున నాకును సరసత విశ్వాసంబులునూ,
వేనివలన యీరావణు విషయము దీరుగ మంద సుతేజమునన్!
వర్తిలుచున్నవో తత్కారణమును వనరగ దోచుట లేదుగదా! 60-61

రామచంద్రుడును సంగ్రామంబున రయమున యీవిధి మది యందున్,
చింతలోని మఱి గూడినవాడై యింత యప్రమత్తత లేకన్!
నా దశగ్రీవుని వక్షస్థలమున యలిరి బాణ వర్షంబులునూ
ప్రావృట్కాలపు జలధాలవలె బన్నుగ గురిసెను శీఘ్రముగన్! 62

అటుపిమ్మట కోపించినట్టి యా జటుల రాక్షసేంద్రుడు గూడన్,
సంగ్రామంబున రామచంద్రునీ సరగున గదలను ముసలములన్
వర్షించుచు పీడించె రాఘవుని వనరగ సేనలు గనుచుండన్! 63

తుములంబును మఱి ప్రహర్షణంబును దోరముగా భీకరమైనా
అట్టి మహా సంగ్రామము జరిగెను యంబరమున భూతలముననూ
సుపర్వతంబులపైని జరిగినది సుభీకరంబగు సమరంబున్! 64

దేవతలును దానవులును యక్షులు దీరుగ పిశాచములు నురగుల్
రాక్షసులును మఱి గాంచుచుండగను రహి యా సంగ్రామంబు నటన్!
సప్తరాత్రములు జరిగెను నచ్చట సరసత కపిరాక్షసులు మఱిన్! 65

అల శ్రీరాముని రావణాసురుకు నట జరిగిన సమరంబునకున్
రాత్రిగాని మఱి వగలునుగానీ రహి ముహూర్తమును క్షణంబునూ,
విరామంబు మఱి పొందలేదుగా విస్తృతమగు నా రణమందున్! 66

దశరథసుతుడగు రామచంద్రునకు ధగ రాక్షసరాజునకు మఱిన్,
జరుగుచున్న యా సంగ్రామంబున సరసత రాముడు విజయంబున్,
పొందకుండుటను గాంచి మహాత్ముడు గుందుచు సురవర సారథియున్
మాతలి రణరతుడైన రామునీ మానుగ గాంచుచు నిటు పలికెన్! 67

(యుద్ధకాండయందు 107వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

నూ ట యె ని మి ద వ స ర్గ ము

(రాముడు రావణుని సంహరించుట)

అటుపిమ్మట యా సమయమునందున యా మాతలి శ్రీరామునకున్
స్మరింపజేసెను ఓ రామా! విను! సరగున తెలియని వాని వలెన్!
యెందువలన యీ రాక్షసుతోడను నింతసేపు అని జేసెదవూ? 1

ప్రభూ! వీని సంహారము గొఱకును బ్రహ్మాస్త్రంబును విడువుమికన్,
సురలజేత యే వినాశకాలము సూటిగ వీనిని గూర్చి మఱిన్
జెప్పబడినదో యట్టి కాలమును జేరువ వచ్చెనా వీనికినీ! 2

అటుపిమ్మట యా మాతలి జేతను నట ప్రేరేపింపగబడినా
వీర్యవంతుడగు రామచంద్రుడును విమల బ్రహ్మదత్తమును మఱిన్

సమరమునందున యమోఘమైనది సరసత మఱి గురి తప్పనిది!
ఏ మహాశరము పూర్వమునందున యిమ్ముగ భగవంతుడునైనా
యగస్త్య ఋషిచే నర్పింపగ బడి యలరి బుసలు గొట్టుచునున్నా
యురగము బోలెను ప్రకాశించెడి యుదుతర శరమును గ్రహియించెన్!

పూర్వకాలమున నింద్రార్థంబై బొలుపుగ స్వయంభువుడు దానున్ .
స్వయముగ దీనిని నిర్మించెను మఱి స్వయముగ దివిజాల రక్షణకై
త్రిలోక జయకాంక్షితుడగు నింద్రుని దీరుగ జయమును గోరుచునూ
యాతని కిచ్చెను యీ బ్రహ్మాస్త్రము నలరుచు క్షేమము గోరుచునూ!
అట్టి యస్త్రమును గ్రహించె రాముడు నిట్టె రావణుని వధియింపన్! 5

వేగ సాధనములైన రెక్కలును విమల వాయువును నుండు నటన్,
ములికి యందు పావక భాస్కరులును మోదము దోడుత నుండు రటన్,
బరువున మందర మేరువు గిరులును బరగ యధిష్టింతుర వారున్,
దాని శరీరము బ్రహ్మమయంబయి నలరి యుండు జ్వాలల తోడన్,
అట్టి వస్త్రమును గ్రహించె రాముడు నిట్టె రావణుని వధియింపన్! 6

దేహముజేతను బ్రజ్వలించునది దీరుగ సుపుంఖములు గలదీ,
హేమ భూషితము సమస్త ప్రాణుల విమల దేజమును గూర్పబడీ
భాస్కరు వర్చస్సును గలిగినదియు బ్రహ్మమయంబై యున్నదియున్,
అట్టి యస్త్రమును గ్రహించె రాముడు నిట్టె రావణుని వధియింపన్! 7

ధూమము దోడను గూడినట్టిదియు ఘోరముగా బ్రళయాగ్ని వలెన్
బ్రజ్వలించునది విషసర్పమువలె బరగ బుసలు గొట్టుచునున్నా
నర నాగాశ్వ సుసముదాయములను నయముగ బ్రద్దలు గొట్టునదీ
శీఘ్రముగా వనిజేయునట్టిదియు స్థిరముగ లక్ష్యము గొట్టునదీ,
అట్టి యస్త్రమును గ్రహించె రాముడు నిట్టె రావణుని వధియింపన్! 8

ద్వారంబుల మఱి కోటగడియలకు దగ సరి భేదన జేసినదీ,
అనేకవిధముల రక్తముజేతను నలరి స్పృశింపగ బడినదియున్,
క్రౌంచ్యజేత మఱి పూయగబడినది కూరిమి భీకరమైనదియున్,
అట్టి యస్త్రమును గ్రహించె రాముడు నిట్టె రావణుని వధియింపన్! 9

వజ్రము వంటి సారము గలదియు వనర మహాధ్వని గలదియునూ,
అనేక సంగ్రామములందున మఱి యలరి జీల్చివేసినదియునూ,
యందఱికిని భీతిని గలిగించి నలరి బుసలు గొట్టెడిదియునూ,
పన్నగంబు వలె నున్న బాణమును బన్నుగ రాముడు గ్రహియించెన్! 10

యుద్ధమునందున డేగలకును మఱి యుద్ధతి గ్రద్దలు కొంగలకున్,
నక్కల గుంపుకు బాక్షసులకు మఱి నయముగ యాహారము నిచ్చున్,
యముని వంటి రూపముతో నుండును నలరుచు భీకరముగ నుండున్,
అట్టి యస్త్రమును గ్రహించె రాముడు నిట్టె రావణుని వధియింపన్! 11

కపివీరులకును నానందంబును గలిగించెడిదియు నసురులకున్,
అవసాదనమును గలిగించెడిదియును నల వినతా సుతు చిత్రములా
అనేక విధముల వర్ణంబులతో నలరెడి ఱెక్కలజేత మఱిన్,
వేగము గలదిగ జేయబడినదీ విమలము, సునిసిత మైనదియున్,
అట్టి యస్త్రమును గ్రహించె రాముడు నిట్టె రావణుని వధియింపన్! 12

మహాబలము గల విక్రమవంతుడు మానుగ యా రఘు వీరుండన్
లోకంబులలో నుత్తమ శరమును లోలత రఘు వంశీయులయున్!
భయనాశంబును గలుగజేయునది బన్నుగ శత్రుల యశస్సునూ!
హరించునది మఱి తనకు ప్రహర్షము నమితము గలుగగ జేయునదీ,
అట్టి మహాబాణంబును రాముడు నిట్టి వేదప్రోక్తమునైనా
విధానమున మఱి యభిమంత్రించియు విమల ధనసునను సంధించెన్! 14

శ్రేష్ఠమైన యా మహాబాణమును శ్రీరాముడు సంధింపగనూ!
సకల భూతములు భయమునందినవి సరగున పశుమృగ పక్షులునూ,
మహీతలంబును గంపించెను మఱి మానుగ భీమ సుశబ్దమునన్! 15

సంక్రుద్ధుండై యా రఘువీరుడు సరగున ధనుసును వంచి మఱిన్
సావధాన చిత్తుండై యాతడు సరసత మర్మస్థానములన్!
జీల్చివేయు నా మహా శరంబును శీఘ్రము రాక్షసుపై విడిచెన్! 16

సురపతియగు నా మహేంద్రుజేతను సూటిగ విడువగ బడినట్టి
వజ్రాయుధమును వలె దుర్ధర్షము వనరగ కృతాంతునికి వోలెన్!
నివారింప శక్యముగానిదియును నిరంతరంబగు వేగమునన్
రావణు వక్షస్థలమున బడెనూ రాముడు వదిలిన బాణంబున్! 17

శరీరాంతకరమైనది మఱియును సారవంతమగు నా శరమున్,
ఆ విధముగ యది విడువబడినదై యా దురాత్ముడగు రావణునీ,
హృదయంబును మఱి బ్రద్దలు గొట్టెను మదిని సంతసిల భూతములున్ 18

శరీరమును నంతము జేసెడి యా శరమును వేగమునను గూడీ,
యా రావణునీ యా రాక్షసునీ యలరు ప్రాణముల హరించుచున్
రక్తము జేతను బూయబడినదై రహి మహీతలంబున బొచ్చెన్! 19

ఆ మహాశరము నా దశగ్రీవుని హతమొనర్చి యా వెనువెంటన్,
రుధిరార్ద్రీకృత చ్ఛవితో గూడుక ర్యూఢిగ కార్యము నెఱవేర్చి.
రహస్యముగ మఱి చప్పుడు లేకను రయమున యంబుల పొది జేరెన్! 20

ఈ విధముగ మఱి వధింపబడియును నిమ్ముగ మధుర సుజీవితమున్
ప్రాణంబులనూ గోల్పోయెడి యా ప్రబలుడు రావణు హస్తమునన్
బాణముతో గూడిన ధనుస్సునూ బరగ బడెను వసుమతి పైనీ,
ప్రాణంబులు మఱి విలీనమయ్యెను బరగ మహావాయువు లందున్! 21

భయంకరంబగు వేగంబును మఱి ప్రబల తేజమును గలవాడున్
అయిన యట్టి యా రాక్షసేంద్రుడును నంజీవము వదిలినవాడై
వజ్రాయుధమున గొట్టబడిన యా వనరగ వృత్రాసురుని వలెన్
రథమునుండి మఱి మహీతలంబున మానుగ బడె యాశ్చర్యముగనూ! 23

వసుంధరను బడినట్టి రావణుని వనరగ గాంచియు మిగిలిన యా
హతశేషులు నగు నిశాచరులునూ హతనాథులు గలవారునునై,
భయాక్రాంతులై యన్నివైపులను బరుగులు దీసిరి వేగముగన్! 23

ద్రుమ యోధులునగు వానరవీరులు దూకుచు బరుగులు దీసెడి యా
రాక్షసులను మఱి యన్నివైపులను రయమున యెదిరించిరి వేగన్,
దశగ్రీవుని వధ గాంచి వానరులును జయమున యానందించిరటన్! 24

కపి వీరులచే బీడింపగబడి కలతను నారాక్షసులు మఱిన్,
బరుగులు దీసిన వారగుచును మఱి భయభీతులతో జిక్కుపడీ!
ఆశ్రయహీనులు నగుటజేత మఱి యడలుచు కరుణా భాష్పములున్,
గలిగిన ముఖములతోని లంకకును గడగి పోయి రా రాక్షసులున్! 25

అటుబిమ్మటను జితాకాశినులై చటుల వానరులు హృష్టులునై
రాఘవు విజయము రావణ వధయును రహి యన్యోన్యము దెలుపుకొనీ,
హర్షధ్వానములను జేసిరి మఱి యానందంబును బొందుచునూ 26

అటుబిమ్మట యా యంతరిక్షమున యలరు సౌమ్యులగు దివిజులయున్
దుందుభి మ్రోగెను మంగళకరమగు ఘోరముగా సుస్వనములనూ,
దివ్య గంధవహుడును వీచెను నట దీరుగ సుఖకర వాయువులన్! 27

ఆ సమయంబున నింగి నుండి మఱి యా రఘునందను యరదముపై
పుష్పవర్షమును గురిపింపగ బడె పున్నమి వెన్నెల మొలకలుగా!
మనోహరంబగు బువ్వుల వానయు మానుగ గురిసెను వసుమతినీ! 28

మహాత్ములగు నా దివి దేవతలయు మానుగ శుభకార్యంబులునూ
రాఘవ స్తవ సంయుక్తంబులు నగు రమ్యమైన శుభ వచనములన్,
అంబర మందున వినబడె నప్పుడు సంబరమున యప్సరసలయున్! 29

సర్వలోకముల భయంకరుండును సరౌద్రుండు మఱి దురాత్ముడున్
రావణుండు మఱి వధింపబడగా రమ్యాప్సరసలు దేవతలున్
గంధర్వులు, చారణులు, కిన్నరులు గడు సంతసమును నొంది రటన్! 30

అటుబిమ్మట యా రాక్షసపుంగవు నటుల వధించియు హర్షముతో
నున్న రాఘవుడు సుగ్రీవుని మఱి జెన్నుగ యంగదు విభీషణున్!
గోరిక దీరిన వారినిగా మఱి గూరిమి జేసిరి సంతసిలన్! 31

అటుబిమ్మట యా మరుద్గణంబులు నట ప్రశాంతినీ బొందినవీ!
దిక్కులు ప్రసన్నములు నైనవి మఱి దీరుగ నభమును నిర్మలమున్!
బొందెను భూమియు జలింపలేదూ బొలుపుగ వాయువులును వీచెన్
దివాకరుని యా కాంతులు నైతము దీరుగ నుండెను శాంతముగా 32

ఆయుష్మంతు సుగ్రీవ విభీషణ యంగదుండు మఱి లక్ష్మణుడున్,
నిరత మిత్రులును సంగ్రామంబున యిమ్మగ రాముని విజయముచే
సంతోషించియు, సప్తీపించియును సరస వాక్యముల గూడికొనీ
యిట్టిరాముండగు రామచంద్రునీ యథావిధిని పూజించి రరిన్! 33

దశరథుని నృప నందనుడు రాఘవుడు రహి శత్రువు నట వధియించీ,
స్థిరప్రతిజ్ఞను నిలుపుకొనియు మఱి స్థిరముగ రణరంగమునందున్!
మిత్రామరులతో సైన్యము తోడను మేలిమి తమ్ముని తోడ మఱిన్
దేవగణములను గూడిన యింద్రుని దీరుగ భాసించెను నచటన్! 34

(యుద్ధకాండము నందు 108వ సమాప్తము)

* * * *

## శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట తొమ్మిదవ సర్గము

(విభీషణుడు విలపించుట—శ్రీరాముడు నతనిని యూరడించి రావణునకు యంత్య సంస్కారమును జేయుమని యతనిని యాదేశించుట.)

అవరాంబునను జయింపబడియును నట నిహతుండగు నట్టియునూ
నేలపైని శయినించిన సోదరు నలరి గాంచి శోకముతోడన్,
గూడినట్టి మది గలవారగుచును గూర్మి విభీషణుడును నవుడున్.
కంత వంత బొందియు విలపించెను గనుల భాష్పములు దొలుకగనూ! 1

వీరుడ! ఓ విక్రాంత పరాక్రమ! విఖ్యాతుడవు! సమరుడవున్!
నయ కోవిదుడవు! మహార్హ శయనోపేతుండవు వధియింపబడీ,
నేలమీద శయనించితి వెందుకు? నేల వచ్చె నీ కష్టములున్? 2

బాహుపురులచే భూషితమగు నీ బన్నుగ కదలని భుజములనూ,
నేలమీద బడవేసితి వెందుకు? నలరు భాస్కరుని కాంతిగలా!
ముకుటంబును మఱి నేలజారగను మోదంబున శయనించితివీ!
నేలమీద శయనించితి వెందుకు నేధిలవచ్చె నీ కష్టములున్? 3

మహావీర! నా చేత పూర్వమును మానుగ యెది జెప్పగ బడెనో!
కామ మోహములతో గూడికొనీ కాంక్షను గూడిన మనసునకున్,
యేది నీకు నిష్టము కాలేదో యదియే యీ నా దొచ్చినదీ 4

గర్వముజేతను బ్రహస్తుండునూ గడగి యింద్రజిత్తును మఱియున్
ఇతర జనులు మఱి కుంభకర్ణుడును నిమ్మగ యతిరథ యతికాయుల్,
నరాంతకుడు మఱి స్వీకృతి జేయరొ నయముగ స్వయముగ నీవు మఱిన్
అంగీకారము దెలుపలేదొ మఱి సంగతిగా నా ఫల మిపుడున్
ననుభవించు చున్నారు మండలము నఖిల యసుర సముదాయంబున్! 5

శస్త్రధారలను శ్రేష్ఠుడైన యీ సమరవీరుడును పాంసువులన్,
బడిసవాడు నగుచుండ సునీతుల బరగ సేతువును బోయినదీ,
ధర్మము యొక్కయు విగ్రహంబునూ దగపోయెను వికలంబునునై,
సత్త్వము యొక్కయు సంక్షేపంబును సరగున బోయెను లుప్తంబై
ఉత్తమగతి ప్రస్తావనంబులును సత్తువ బోయెను మఱి యింకన్,
నాదిత్యుడు మఱి నేలపై బడెను నల చంద్రుడు బడె జీకటినీ,
చిత్రభానుడును బ్రశాంతార్చితో శీలము గోల్పోయెను నేడున్
వ్యవసాయంబును నిరుద్యమంబై వన్నెలు జిన్నెలు మానినవీ! 6-7

రాక్షసశ్రేష్ఠుడుడు రణరంగంబున రమ్య పాంసువుల నిదురింపన్,
రాక్షసేంద్రునీ రమ్య యశస్సును రయమున దిక్కుల గలియగనూ!
గత సత్త్వంబగు లోకంబున కిక గలది మిగిలినది యేముందీ? 8

ధృతి యనియెడి చిగురును గలదియునూ దగ సహనమనే పుష్పంబున్!
తపస్సు ననియెడి ఫలముగలదియును దగశౌర్యము మొదలును గలిగీ
రాక్షసరాజను వృక్షంబును మఱి రాఘవు డనియెడి వాయువునూ!
నేలను బడగా కొట్టివేసినది నిఖిలము మాయగ కనిపించున్! 9

తేజస్సునియెడి దంతంబులునూ దీరుగ కుల వంశంబులనూ
వెన్నెముకయు నటు గలది మఱియునూ విమల ప్రసాదము గోపములున్
ననియెడి శరీర వెనుక భాగమును నలరు తుండమును గలదియునూ
రావణుడనియెడి మదగజంబునూ రాఘవుడనియెడి సింహంబున్,
శరీరమును మఱి యాక్రమింపగా సరగున నేలను నిద్రించెన్! 10

పరాక్రమము నుత్సాహము లనియెడి బరగ విజృంభించిన జ్వాలల్
గలదియు నిట్టూర్పులు యనియెడి యా బన్నుగ ధూమము గలదియునూ
తన బల మనియెడి ప్రతాపంబునూ దగ గలిగినదియు యుద్ధమునన్
ప్రతాపంబు గలదయిన రావణుడు నను నగ్నిని బహు శీఘ్రమునన్!
రాముండనియెడి పయోధరముచే రయముగ యార్పగ బడె యనిలో! 11

రాక్షసు లనియెడి తోక, మూపు మఱి రమ్యమైన కొమ్ములు గలదీ
శత్రువులను మఱి సంహరించునది యుత్సాహముననను మదగజమూ!
చాపలత్వమును కర్ణనేత్రములు చతురతలను గూడినదయినా
రక్షో వృషభము క్షితీశ్వరుండును రయమున వ్యాఘ్రము జేత మఱిన్
హతముజేయబడి నాశము నొందెను నతి భీకర యుద్ధంబుననూ! 12

శోకముతో బలుకుచునుండిన యా శూరుడు విభీషణుని తోడన్,
హేతుమంతమును బరిదృష్టమునగు నీతి కార్య నిశ్చయమైనా
వివేక వంతమునైన వాక్యమును విశదముగా రాముడు బలికెన్! 13

ఏ చేష్టయు మఱి లేనివాడునై యిమ్ముగ నీ సోదరుడు మఱిన్
ఘనిష్టతను మఱి పొంతలేదుగా విపుల భయంకర యుద్ధమునన్!
చండ విక్రమము జూపి మఱియునూ మెండుగ యుత్సాహము జూపీ,
యశంకితుడై యాహవమందున నలరుచు బడిపోయెను నితడున్! 14

ఎవరు క్షాత్ర ధర్మంబున నిలిచి యిమ్ముగ వృద్ధిని గోరుచునూ
యాహవమందున బడిపోవుదురో అట్టి వీరులను గూర్చియిటుల్!
శోకింపరు మఱి వేదనతోడుత శూరులు విలపింపరు జగతిన్! 15

ధీమంతుండగు నెవని జేత మఱి ధీరత యుద్ధము నందుననూ
యింద్రుని తోడుత మూడులోకములు సాంద్రరీతి భయపెట్టి మఱిన్,
అట్టివాడు కాలమును జెందగా నిట్టె విచారించుటకు మఱిన్
దుఃఖించుటయును సమయముగాదూ దురపిల్లుట సరికాదు గదా! 16

కదనమందు నే కొంత విజయమును గలుగు ననెడి విషయంబు మఱిన్
పూర్వమెన్నడును జరుగలేదుగా బొలుపుగ ముందును జరుగ దికన్
వీరుడు సంగ్రామంబు నందునను వికటముగా జంపగబడునూ,
లేదా శత్రువు నతిక్రమించుచు లీలగ జంపును శత్రువులన్! 17

ప్రాచీనులచే దెలుపగబడినది బన్నుగ క్షత్రియ సమ్మతమూ
సంగ్రామంబున మరణించిన యా సాహసవంతుల గూర్చి మఱిన్,
విచారింపగను రాదు విభీషణ! వికలత నందగ రాదు సుమా! 18

ఆ కారణమున మన పూర్వులయును నలరు నిశ్చయము గమనించీ,
తత్త్వంబును మఱి దెలిసికొనియునూ దగ శోకంబును త్యజియించీ,
యనంతరంబగు గార్య మేదియో యది యోజింపుము ప్రస్తుతమున్! 19

విక్రమవంతుడు, రాజపుత్రుడును వీరుడు రాముని వాక్యములన్,
శోకముతో గూడిన వాడును మఱి శూరుడు విభీషణుడు నెపుడున్!
విని యనంతరము తన సోదరునకు విమల హితంబగు కార్యంబున్!
గూర్చి మదిని యోజించుచు నాతడు కూర్మి రాఘవునితో బలికెన్! 20

ఇతడు పూర్వమున యుద్ధరంగమున యిమ్ముగ యింద్రునిజేత మఱిన్,
దివిజుల జేతను నపజయ మెన్నడు దీరుగ నందగలేదు మఱిన్!
అట్టివాడు మఱి నిన్నెదిరించీ, అలరి సముద్రము తీరమునన్,
జేరి భగ్నమై పోయినరీతిని పోరున నీచే భగ్నుడయెన్! 21

[illegible]లకు మఱి దానముజేసెను నలరి భోగముల నందె మఱిన్,
భృత్యుల [illegible]విధముల పోషించెను భూరి ధనంబుల మిత్రులకున్!
[illegible] బహు త్యాగనిరతితో, యన్ని కార్యములు జేసె మఱిన్,
[illegible] వైరముతో జూచెను నాత్రముతో శిక్షించె మఱిన్! 22

[illegible]పడైన రావణుడు నిమ్ముగ యహితాగ్నియు మఱియున్
మహా తపస్సులు జేసిన వాడును మహా వేదముల నన్నిటినీ,
[illegible] జేసినవాడును నల వైదిక కర్మల నితడున్,
[illegible] వారలలో ప్రథముడు జేయగ వలసిన కృత్యమునూ,
[illegible]తో జేయవలయునని నిక్కము గోరుచు నున్నాడన్! 23

[illegible]హారితమైన వాక్యముల గడు వినయంబున గూడికొనీ,
[illegible]డును శ్రీరామునితో వినయాక్షరముల బలుకగనూ!
[illegible] రఘునందనుడును మఱి యీవిధి యాజ్ఞాపించెన్! 24

[illegible]ములు మరణముతోడను వనర సమసిపోవును మఱియున్,
[illegible] ప్రయోజనము బూర్తియైనదీ మానుగ యిక సంస్కారంబున్,
[illegible]దెడి గాతను! నీతడు మఱి స్థిరబంధువు నీ కెట్లగునో!
[illegible] నష్టే నని భావింపుము! నయముగ యిపు డాతనికి మఱిన్
[illegible] హేతువగు నంత్యకర్మలను సరగున జేయుము నిశ్చలతన్! 25

(యుద్ధకాండయందు 109వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటపదియవ సర్గము

### (రావణుని స్త్రీలు విలపించుట)

మహాత్ముడగు శ్రీరామునిజేతను రావణుండు మఱి హతుడగుటన్,
గాంచి వేగమున రాక్షసస్త్రీలును, గడుశోకంబున గూడికొనీ
యంతఃపురమున నుండి వెడలిరీ సంతాపంబున వెలుపలకున్, 1

ఎంత విచారించినను గూడనూ సుంత వినక క్షితి పాంసువులన్,
విముక్త కేశములను మఱి దొరలుచు వేదనతో మఱి గూడికొనీ,
దూడలుబోయిన యావులవలెనూ దురపిల్లుచు బహు శోకమునన్
అంతఃపురమున నుండి వెడలిరీ సంతాపంబున వెలుపలకున్! 2

రాక్షసులును మఱి ముందు వెడలగా రహి యుత్తర ద్వారమునుండీ
బయటకు వెడలీ నేలను బడినా భర్తను వెదుకుచు వారలునూ!
భయంకరంబగు యుద్ధభూమిలో బరగ ప్రవేశించియు మఱియున్,
అయ్యో! నాథా! ఆర్యపుత్రుడా! అని విలపించుచు నా స్త్రీలున్,
మొండెంబులతో రక్తపు బురదయు మొరటుగ నిండిన రణభూమిన్!
అన్నివైపులను వచ్చి పడిరి యట చెన్నుగ దీనాలాపములన్! 3-4

బాష్ప పూర్ణ నేత్రంలులతోడను భర్తృశోకమున జిక్కిన యా
రాక్షసస్త్రీలును యూథనాయకుడు రహి బడిపోవగ కరేణువులున్,
అఱచి యఱచి ధ్వని జేసినయట్టుల యాస్త్రీలును రొద జేసి రటన్! 5

మహాకాయుడును, ద్యుతిగలవాడును మహావీర్యమును గలవాడున్,
నీలాంజనచయ సమానుండునూ నిహతుడైన యా రావణునీ,
నేలమీదబడి యుండుట గాంచిరి నేలనుబడినా తమ భర్తన్! 6

రణ పాంసువులను శయనించిన యా రావణాసురుని తమ భర్తన్!
నాకస్మికముగ గాంచి వారలును నల ఛేదింపగబడినట్టి

ఎవడు దేవతలకును, దానవులకు నిమ్ముగ రాక్షసులకు, మఱియున్,
అవధ్యుఁడో మఱి యట్టి మనవిభుడు నల మానుషుచే రణమందున్,
వధింపబడి యీ మహీతలముపై వనరగ యుండెను శయనించీ! 15

ఎవడు దేవతల వలనగాని మఱి నిమ్ముగ యక్షులుగాని మఱిన్
నసురులుగానీ యలరి వధింపగ యలవిగాని యతడో యితడున్!
ఒక సామాన్యపు వ్యక్తివోలె మఱి దగ మర్త్యునిచే మృత్యువునూ!
పొందబడియు భూమిని శయనించెను నందము చందము విడనాడీ! 16

ఆ రావణునీ స్త్రీలందఱునూ యడలుచు బలుకుచు నీ రీతిన్,
దుఃఖముతో రోదించిరి వారలు దురపిల్లిరి వేదన తోడన్!
మఱల మఱల దుఃఖార్తులు నగుచును మధుర స్మృతులనూ దలచుకొనీ! 17

సతతము హితమును బలుకు మిత్రులను సరస వచనములు వినకుండన్!
మరణముగొఱకే సీతను దెచ్చి మాపి వేసితివి యీ లంకన్!
రాక్షసులందఱ జంపివేసితివి రయమున నీవును గూడ మఱిన్
భూశయనంబును యాశ్రయించితివి భూరి భోగముల త్యజియించీ,
నీతో బాటుగ మేముగూడ మఱి నిఖిల వేదనల మునిగితిమీ! 18

హిత వాక్యములను బలుకుచున్న యా హితుడును ప్రియ సోదరుడైనా
ఆ విభీషణుని యహంకారమున యాత్మవధను మది గోరుచునూ!
నీ యజ్ఞానముజేత నాతనిని నిరసించియు దూషించితివీ! 19

మిథిల రాజ సుతయైన మైథిలిని మేదిని పతి యగు రామునకున్
తిరిగి యిచ్చివేసినచో మనకును దీరుగ మన కీ మూలమునే!
హరించునట్టియు భయంకరంబగు నాపద వచ్చెడిదియు గాదా!
పిల్లలు, పాపలు, లంకానగరము ప్రియముగ వర్ధిల్లెడిని గదా! 20

నీవు జానకిని దిరిగి యిచ్చుచో నిజముగ నీ సోదరుడైనా
విభీషణుని మదిలో గోరికయును వికలము గాకను యుండెడిదీ!
మిత్రపక్షమున యుండెడివాడూ మేదిని పతియగు రాఘవుడున్,

మాకును వైధవ్యమును వచ్చి మఱి మానుగ శోకము నందముగా!
నీ శత్రువులగు చెలిజుల కోరిక నెరవేరెడిదియు గాదు గదా! 21

క్రూరుడవై యా జనకనందినిని కూరిమి బహు బలవంతముగా
బంధించితివీ నీవు రాక్షసుల బన్నుగ మమ్మును నిన్ను మఱిన్!
నీ మూడింటిని తుల్యన్యాయముగ యిమ్ముగ నశింప జేసితివీ! 22

రాక్షస పుంగవ! సత్యముగా మఱి రహి నీ స్వేచ్ఛాచరణంబే
కారణంబు నాకను బోవచ్చును గల సమస్తమును దైవంబే!
నడిపించును మఱి దైవము జేతను నశింపబడు గొట్టగ బడియున్! 23

మహాబాహుః సంగ్రామము నందున మానుగ కపి రాక్షసులయినా,
నీ యొక్కయు యీ వినాశనంబును నిక్కముగా దైవము జేతన్,
నుపాగతంబైనవి యని దలతును నూహకు నందని శక్తియిదీ! 24

ఫలోన్ముఖంబగు దైవగతిని మఱి బన్నుగ లోకమునందుననూ
ధనముజేత మఱి మఱల్చుటకునూ మానుగ శక్యము కాదు మఱిన్!
కామముజేతను బరాక్రమంబున కఠినమైన యాజ్ఞల జేతన్!
మఱలింపగ మఱి శక్యముగానిది మహాబలీయంబైనదియున్! 25

ఆ రాక్షసపతి యోషిత లందఱు నడలుచు దుఃఖార్తులు నగుచున్!
మధురస్మృతులనూ స్మరించుకొనుచును మానుగ గత కాలమును మఱిన్!
బాష్పవ్యాకులంబగు నేత్రములను బరగ కురరి పక్షుల వోలెన్!
నీవిధి యా రణభూమి యందునను నిమ్ముగ విలపించిరి వారున్! 26

(యుద్ధకాండము నందు 110వ సర్గము సమాప్తము)

* * * *

# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటపదునాకొండవ సర్గము

(మండోదరి విలపించుట— విభీషణుడు రావణునకు అంత్య సంస్కారమును గావించుట.)

ఆ సమయంబున రాక్షసస్త్రీలును నడలుచు విలపించుచు నుండన్!
ప్రియురాలును, మఱి జ్యేష్ఠపత్నియును జేరిమి దండోదరి యపుడున్!
దీనురాలునై భర్తనుగాంచెను దీరుగ క్షితి పాంసువులందున్! 1

అచింత్య కర్మణుడగు రాఘవుచే హతుడగు దన భర్తను గాంచీ!
ఆ మండోదరి దీనురాలునై యా రణభూమిని విలపించెన్!
కంటికి మంటికి యేకధారగా గన్నీ రొలుకుచు నా సతియున్! 2

మహాబాహు వైశ్రవణానుజుడా! మఱి క్రుద్ధుడవగు నీయెదుటన్!
నిలబడుటకు మఱి భయపడుచుందురు నింగి దేవతలుగూడ మఱిన్!
నల దేవేంద్రుడుగూడ భయపడును నగ్ని గూడ మఱి భయపడునూ! 3

నీ జవంబునకు భయపడియును మఱి నిఖిల మహాంతులు దేవతలున్!
గంధర్వులు చారణులు గూడనూ యంధకారమున బడియు మఱిన్!
దిక్కులు బట్టియు పారిపోయిరీ దీనవదనముల నల్దిశలన్! 4

మహారాజ! ఓ రాక్షసేశ్వరా! మహా విక్రముడవును నీవున్!
అట్టి నీవు మానుషమాత్రునిచే నిట్టి యుద్ధమున రామునిచే
నపజయంబు బొందితివి. యిదేమీ? నలరి సిగ్గుబడుటయు లేదా! 5

త్రైలోక్యంబుల యాక్రమించియును దగ సకలైశ్వర్యంబులతో!
పరాక్రమముతో గూడికొనియు మఱి బరగ సహింపగ రాని నినున్!
వనగోచరుడగు మానుష మాత్రుడు మఱి నిను నేరీతిని జంపెన్! 6

మానవులకు గోచరము గానిదియు మరు భూముల జరియించుచునూ
స్వేచ్ఛారూపములను ధరింపగల సమర్థుండవగు నీవు మఱిన్!

సంగ్రామంబున పాదచారియగు సరళ మానవుని చేత మఱిన్!
మరణించుట యుక్తముగా లేదా మఱి విధి నిర్ణయ మిది యేమో! 7

సమరాముఖంబున యా శ్రీరాముడు సరగున జేసిన యీపనికి
నమ్మజాలకున్నాను మఱియు నే నయముగ సమస్తమైనట్టి
రణసామగ్రిని బరిపూర్ణుడవగు రాముడు నిన్నెదిరించుటయున్!
నమ్మజాలని విషయంబులు మఱి నాథ! యెటుల నే నమ్మెదునూ! 8

జనస్థానములో బహురాక్షసులను జతకూడిన నీ సోదరునీ!
ఖరుని రాక్షసుల జంపినాడనియు కరమున రాఘవుడని వింటిన్!
అట్టి మహా బలవీరుడు రాముడు నిట్టి మానవుడు కాడు సుమా! 9

ఎపుడు వాయుసుతుడగు హనుమంతుడు నిమ్మగ సురలకుగూడ మఱిన్
దుష్ప్రవేశమగు లంకానగరిని ఘోరముగా దోర్బలముననూ
ప్రవేశించినాడో మఱి మేమును బన్నుగ బహువ్యథ జెందితిమీ!
లంక కేదో యాపద రాగలదని శంకలేక యోజించితినీ! 10

భయంకరులగు గపివీరులచే బరగ మహార్ణవమందుననూ
సేతువు గట్టిరా యానాడే నే శ్రీరాముని యొక మానవుగా!
మదిలో నే భావింపగలేనూ మహా మనీషిగ దలచితినీ!
లంక కేదో యాపద రాగలదని శంకలేక నే దలచితినీ! 11

లేదా మఱి నిను జంపుటకొఱకై లీలగ కృతాంతుడే మఱియున్,
నెవరూహింపని మాయాజాలము నిమ్మగ కల్పించియును మఱిన్,
యముడే స్వయముగ రాముని రూపము సలరి ధరించియు వచ్చె నిటుల్,
అని భావించుచు నుంటి ప్రియతమా! యాత్మయందు సంభ్రమముననూ! 12

ఓ బలవంతుడ! మహావీరుడా! యొనర నీవు సంగ్రామమునన్,
దేవేంద్రునిచే నెదిరింపగబడి ధీరత గెలిచితి వాతనినీ.
అట్టి మహేంద్రుడు యుద్ధమునందున నిట్టె గాంచుటకుగూడ మఱిన్,
శక్తి యెచ్చటిది యా శచీపతికి సరగున యోచిన వానికినీ,
యా మహేంద్రుడును గాదీ రాముడు నల సురపతియును గాడు సుమా!

నిశ్చితముగ యీ రాముడు యోగియు నిత్యుడు నాదియు మధ్యంబున్,
నంతంబును మఱి లేనివాడు సుమ! యమిత మహత్తును గలవాడున్,
పరమోత్తముడును, నజ్ఞానమునకును, బరముడు, ధాతయు, బోషకుడున్,
శంఖు చక్ర గదలను ధరించినా యంకితముగ శ్రీవత్సంబున్,
వక్షస్థలమున ధరించు వాడును వనర నిత్యశ్రీ గలవాడున్,
జయింప శక్యముగానివాడునూ శాశ్వితుండు, ధ్రువుడును, స్థిరుడున్,
పరమాత్ముడు మఱి సత్యపరాక్రమ శౌర్యంబును మఱి గలవాడున్ ,
సర్వలోకములకును నీశ్వరుడును శ్రీమంతుడు ద్యుతిగలవాడున్,
విష్ణువు జగతికి హితముజేయగా విపుల కోరికను గూడికొనీ,
మానుషరూవంబును ధరించియును వానరత్వమును బొందిన యా
సమస్త దివిజుల తోని గూడికొని సకల రాక్షసులతో నున్నా,
నిన్ను వధించెను నారాయణుడే నిక్కముగా పరివారముతో! 13-17

పూర్వము నీచే యింద్రియంబులును బొలుపుగ జయింపగా బడెమున్,
ముల్లోకంబుల సముదాయంబును మోదముతోని జయింపబడెన్,
ఆ వైరంబును మదిని స్మరించుచు నలరుచున్నవా యన్నటులన్,
నిపుడు నీదు యింద్రియములజేతనూ యిమ్ముగ యోటమి నందితివి! 18

జన స్థానంబున బహురాక్షసులను జతగూడిన నీసోదరునీ
ఖరుని రాక్షసుల జంపినాడనియు కరమున రాఘవుడని వింటిన్!
అట్టి మహాబలవీరుడు రాముడు నిక్కమై మానుషుడు కాదు సుమా! 19

ఎపుడు వాయుసుతుడగు హనుమంతుడు నిమ్ముగ సురలకు గూడ మఱిన్
దుష్ప్రవేశమగు లంకానగరిని దోరముగా వోర్పులముననూ!
ప్రవేశించినాడో మఱి మేమును జన్నుగ బహువ్యథ నందితిమి!
లంకకేదొ యాపద రాగలదని శంకలేక యోజించితిమి! 20

రామునితోడను మైత్రి సేయుమా! రమ్యమైన యా జానకినీ,
రామునికర్పింపుము నసుచును నే రమ్యహితంబును జేసితిని!
కానీ నా మాటలు గ్రహింపకను గఠినముగా వర్తించితివి!
అందుణకే యీ ఫలితము గలిగెను జిందెను నీ యాపదలు మఱిన్! 21

రాక్షసేంద్ర! నీయైశ్వర్యంబును రమ్య శరీరము బంధువులున్,
వినాశనంబునకే వైదేహిని విమలవనిత నిటు దెచ్చితివీ!
అంతలకే యీ జానకి యందున బిండెను నీమది కోరికతో! 23

ఓ దుర్మతి! యా వసిష్ఠసతి యగు నానసు యరుంధతికంటె మఱిన్
రోహిణి కంటెను నుత్తమురాలును రూఢిగ పతివ్రతా మణియున్!
అట్టి భూమిసుత నవమానించి యసదృశమగు జెడు జేసితివీ! 23

ఆత్మస్వభూషణ! నాదు ప్రియతమా! నలుపు బతివ్రత జానకియున్,
వసుధకు వసుధయు నొప్పుగలదియును వసపగ లక్ష్మికి లక్ష్మి మఱిన్,
భర్తయందు ననురాగముగలదియు బరగ సుందరియు, సుకోమలీ!
మంగళప్రదయగు నట్టి జానకిని యంగన తపస్వినియు నైనా
జనశూన్యంబగు నరణ్యమందున జానకి యొంటరియై యున్నా
సమయమునందున ఛద్మ వేషమున సరగున లంకకు దెచ్చితివీ!
సీతను బొందగ యత్నించితివీ ఛీ! నీకోరిక వ్యర్థంబై
మహా పతివ్రత తపసు జేతనే మానుగ దగ్ధంబైతివిగా
ఇదినిజంబు మఱి యిది నిశ్చయమూ! యిందసత్యమును లేదు సుమా! 24

ఆ తనుమధ్యను జనకనందినిని యవమానించెడి తరుణమునన్
అపుడే గాల్పగ బడవలసినదీ యందుకు కారణమును గలదూ!
నీవు జేసినా పాపంబునకును నీవు జేసినా క్రూరతకున్!
ఫలము నీయవలసిన దేవతలును బన్నుగ యింద్రుడు నగ్నియునూ
నీకు భయపడియు నీకు దూరముగ నిలిచియుండిరీ నిశ్చేష్టన్! 24

కర్తజేసినా పాపకర్మమును గడు ఘోరంబగు ఫలములనూ
కాలము వచ్చిన దగుచుండగ మఱి కర్మ యనుభవించును వాడున్
దీనియందు సంశయములేదు మఱి దీరుగ సుశాస్త్ర సారంబున్ 25

శుభకర్మంబులు జేసినవానికి శుభములు గలుగును నిశ్చయమున్
పాపకర్మలును జేసినవానికి పాపఫలంబులు గలుగు మఱిన్,

నీ తమ్ముడునగు విభీషణుండును నిఖిల శుభంబులు బొందె మఱిన్
ఈ దృశములు నగు నశుభంబులునూ యిమ్మగ ప్రాప్తంచెను నీకున్! 26

రూపముజేతను జానకి కంటెను రూపవతులు గలరును నీకున్
నభ్యధికంబగు నందక త్తెలును నలరు భార్యలును గలరు మఱిన్
కానీ నీవు యనంగవశుడవై గానగ లే దజ్ఞానమునన్! 27

కులముజేత మఱి రూపము జేతను గుదురుగ విద్యాదుల యందున్.
చతురత యందును నేర్పునందుమా సలలిత కళలందున గానీ,
నా కంటెను మఱి యధికురాలునూ నయముగ సమానురాలు మఱిన్
కాదు; కాని నీ యజ్ఞానంబున గాంచలేదు నీ విషయంబున్! 28

సర్వ భూతములకును నీ వసుధను నరగున కారణమును కానీ
మృత్యువు సంప్రాప్తింపదు ప్రియతమ! మరి నిమిత్త మేదో యుండున్
నీకీ మరణము సీత నిమిత్తము నిశ్చయముగ వచ్చినది సుమా! 29

సీత నిమిత్తంబైన మృత్యువును శీఘ్రము దూరము నుండియునూ
తెచ్చుకొంటివి! యనుభవించితివి! తీరని కోరికతో గూడన్!
భూసుత యికపై శోకరహితయై భువనేశ్వరుతో విహరించున్! 30

అల్ప పుణ్యమును గలదానను నే నలరి శోక సాగరమందున్
బడిపోయితి గద! మహావీరుడా! బరగ పుణ్యఫలమును దరిగీ,
ఎట్టి నేను చిత్రాంబరములతో నిట్టి పుష్ప మాల్యంబులతో,
ధరించి సుందర విమానములపై దగ కైలాసము నందునసూ,
మందర సుమేరు పర్వతంబులను నందమైన తీరములందున్!
వైశ్రవణుని యా చైత్ర రథమునను వసరగ దివిజ సువనములనూ!
విహరించుచు మఱి దేశదేశముల వింతలు గాంచుచు నతులమునొ!
శోభల గూడియు సంచరించితినొ! శూరుడ! నీ మరణముజేతన్
కామ భోగములకును దూరంబై కడు విషాదమున మునిగితినీ!
అన్యమైన యొక ప్రమదకు వోలెను నలరియుంటి యీనాడు మఱిన్,

ఛీ! ఛీ! రాజుల భోగభాగ్యములు సిరి సంపదలును గౌరవమున్,
చంచలమైనవి క్షణభంగురములు నంచితముగ చందురుని కళల్! 31-33

అయ్యోరాజా! మహావీరుడా! హా! నా ప్రియతమ సుందరుడా!
సుకుమారంబును సుంధరమైనా సుభ్రువులును గలదియునైనా!
సుత్వక్కును మఱి సమున్నతంబగు సుందర నాశిక గలదియునూ!
కాంతిచేత మఱి శోభచేతనూ కడు తేజస్సులచేత మఱిన్
చంద్రుని లోడుత పద్మము తోడుత సాంద్ర దివాకరు లోడుతనూ
సమానమైనది కిరీటకూటపు నగ్రభాగముల జ్వలితంబై
తామ్రాస్యంబును, దీప్తకుండలము దగ యనేక విధములునైనా
మాలికలను మఱి ధరించునదియును మధురము సుందరమైనదియున్
అలరునట్టి యా ముఖారవిందము నందము జిందుచు నుండెడిదీ!
పానభూములను మదవ్యాకులములు బన్నుగ చంచల నేత్రములున్
గలదియు వల్గుస్మితమును గలదియు మధురవాక్యములు గలదియుమూ,
అదేవక్త్రి మీ సమయమునందున యారాముని సాయకములచే
గొట్టబడియు మఱి రక్తముజేతను కూరిమి దడిసియు ముద్దయునై 34-37

విశీర్ణ మేదో మస్తిష్కమునై వికటస్పందన రేణువులన్,
రూక్షమునై కనిపించుటలేదూ రూడిగ నీముఖ తేజంబున్! 37

అయ్యో! నాకుమ వైధవ్యమునూ యలరి యిచ్చు నంతిమ దశయున్
సంప్రాప్తించిన దిప్పుడు దైవమా! సరసత మఱి నే నెప్పుడునూ
మందబుద్ధిచే దీనిని గూర్చియు చంధముగా నే నెప్పుడునూ
మనసున నేమూహింపలేదు మఱి ధూసుగ యోజింపగలేదూ! 38

నాదు తండ్రి దానవ రాజనియును నాదు భర్త రాక్షస ప్రభువున్,
నాదు కుమారుడు నల దేవేంద్రుని నయమ్ముగ యణచిన వాడనియున్!
ఈ విధముగ నే గర్వించితినీ యీరీతిని భావించితినీ! 39

నా రక్షకులును మహావీరులని నయమ్ముగ రిపు మర్దను లనియున్
శూరులు ప్రసిద్ధ బలపౌరుషములు ధీరత గలవారనియు మఱిన్!

ఎవరినుండియును భయమునులేని భువన విజయులని మదియందున్
దృఢమగు నిశ్చిత యభిప్రాయమును రూఢిగ నాలో యుండెడిదీ! 40

ఓ రాక్షస రాజేంద్రులార! మఱి నొనరగ యట్టి ప్రభావంబున్
గలిగిన మీకును మానవునుండీ కాఱుజీకటిని గ్రమ్ముచునూ!
అసంబద్ధముగ యీ భయ మెటులను నలరి మీకు మఱీ వచ్చెనదీ? 41

రాక్షసేంద్ర స్నిగ్ధముగా నున్నది రమ్య నీల మాణిక్యమువా!
నున్నవియును మఱి యున్నతమైనా చెన్నుగ పర్వతపమంబునూ!
కేయూరాంగద వైడూర్యములను ముక్తాహార స్రగుజ్వలమున్,
విహార పమయములందు నధికముగ విమలమనోహార మైనదియున్
సమర భూములందున నధికముగా సరసదీప్తితో నొప్పునదీ
ఐన నీదు ఘన శరీరంబునూ యాభరణంబుల కాంతులచే
మెపుఱుల కాంతుల మేఘంబును వలె మిగుల ప్రకాశము నొందెడిదో
అట్టి నీదు ఘన శరీరమిప్పుడు నెట్టి దుస్థితిని బొందెనహా! 42-46

తీక్షణములునగు శరములజేతను దీరుగ వ్యాప్తంబై యుండెన్
ఏదుబంది ముళ్ళను బోలుచునూ, యిమ్ముగ సందుమ లేకుండన్,
మర్మస్థానములందు గ్రుచ్చబడి మానుగ బాణంబుల జేతన్
తెగగొట్టబడిన గ్రేవులు గలదై దీరుగ కౌగిలి జేర్చుటకున్
శక్యము గాకను నున్నది ప్రియతమ! స్పర్శ దీని దిక లభింపదూ!

మహీతలంబున బడినది మఱియును మానుగ శ్యామంబైనదియున్,
రుధిరచ్ఛవితో గూడి యుండినది రూఢిగ వజ్ర ప్రహారముచే
గొట్టబడియు మఱియు నేలనుబడినా కూరిమి పర్వతమును బోలెన్
నున్న నీదు ఘన శరీరంబునూ చెన్నుగ కౌగిలి జేర్చగనూ!

హానాథా! యిది స్వప్నమ? సత్యమ? నల రాఘవుచే నే విధమున్
వధింపబడితివి! యాశ్చర్యం బిది! వనరగ నమ్మగలేముగదా!
మృత్యువునకు మఱి మృత్యువు నీవును మృత్యువు వశమును బొందితివి!
యెటుల మృత్యువునకు లొంగిపోయితివి! ఘటుల పరాక్రమ మేమయ్యెన్!

మూడులోకముల సంపదలన్నియు ముదమున బొందినవాడు మఱిన్
మూడులోకములకును నధికముగా గడు భయమును గలిగించియునూ!
లోకపాలురను జయించి మఱియును లోలత కైలాసమునెత్తి!
మహాశంకరుని గదిపివేసెనూ మానుగ తన బలవీర్యములన్! 48

ఇట్టి ప్రభావము గలిగిన భర్తను నటు రాఘవుచే గొట్టబడీ
గాంచి వధింపగబడిన భర్తనూ గల నే యీ దేహంబు మఱిన్
ధరించియున్నానన స్థిరురాలను దాపనేల సిగ్గఱిదానన్! 49

గర్వించినవారిని తన బలమున కడకును ద్రోసినవాడు మఱిన్
నావిష్కృతమగు పరాక్రమంబును సందఱకును గనబఱచుచునూ!
లోకంబులకును క్షోభను గూర్చెను లోలత భీకర కర్మలచే
ధ్వనులచేత భూతలముల నన్నిటిని దగ యేడ్పించెను దండనలన్!
ఇట్టిప్రభావము గలిగిన భర్తను నటు రాఘవుచే గొట్టబడీ
గాంచి వధింపగబడిన భర్తనూ గల నే యీదేహంబు మఱిన్
ధరించియున్నానన స్థిరురాలను దాపనేల సిగ్గఱిదానన్! 49

రిపుసన్నిధిలో పరాక్రమంబున దృప్త వాక్యముల బలుకు మఱిన్
తనవారికి, తన సంఘమువారికి దన భృత్యులకును రక్షకుడున్,
భీమకర్మములు జేసెడి వారిని భీకరముగ జంపెడివాడున్,
అట్టి ప్రభావము గలిగిన భర్తను నటు రాఘవుచే గొట్టబడీ, 50

వేలకొలది మఱి దానవేంద్రులను చాల చాల యక్షులను మఱిన్
యమలోకమునకు బంపెడి వాడును విమల యశస్సును గలవాడున్
నివాత కవచుల యనెడి రాక్షసుల నిర్మలమతి జూచెడివాడున్
అట్టి ప్రభావము గలిగిన భర్తను నటురాఘవుచే గొట్టబడీ! 51

అనేకంబులగు యజ్ఞంబులనూ యలరి నాశమును గావించెన్,
స్వజనంబునకును దాతారుడు మఱి సరసత ధర్మ వ్యవస్థలనూ
ఛేదించిన ఘనుడును యుద్ధంబున భీకర మాయను సృజించునూ!
శత్రుపీడ గావించెడివాడును శాత్రవ సంహారకుడు మఱిన్
అట్టి ప్రభావము గలిగిన భర్తను నటు రాఘవుచే గొట్టబడీ! 52

అచటినుండి మఱి యిచటినుండియును నల దేవాసుర కన్యలనూ,
మానవ కన్యల దెచ్చెడివాడా మానుగ నిర్బంధించి మఱిన్!
శత్రుస్త్రీలకును శోకంబును మఱి శాత్రవులను అని సమయించున్!
స్వజనంబునకును నాయకు డీతడు స్వాధికారుడీ జగమునకున్;
అట్టి ప్రభావము గలిగిన భర్తను నటురాఘవుచే గొట్టబడీ! 53

లంకా ద్వీపమునకు గోప్తారుడు శంకలేక భీమములైనా
కర్మలకును మఱి కర్త, మాకునూ కామభోగముల దాతయునూ,
రథికులతోపల మహారథికుడును రణవిజయోత్సాహుండు మఱిన్,
అట్టి ప్రభావము గలిగిన భర్తను నటు రాఘవుచే గొట్టబడీ! 54

అట్టి ప్రభావము గలిగిన భర్తను నటు రాఘవుచే గొట్టబడీ,
గాంచి, వధింపగ బడిన భర్తగల గలిగిన నే దేహంబు మఱిన్,
ధరించియున్నానన స్థిరులాలను దాపనేల సిగ్గఱిదానన్! 55

రాక్షసరాజా! యమూల్యంబులగు రమ్య శయనముల శయనించీ
యీనాడిచ్చట కటికనేలపై యిమ్ముగ క్షితిపాంసులపైనీ
నిదురబోవుచుంటివి నాథా! మఱి నిఖిల దేవతలు గాంచగనూ! 56

నీకుమారుడగు నింద్రజిత్తునూ నీరజాక్షుడగు లక్ష్మణుచే,
రణమునందునను వధింపబడెనో రయమున నే గొట్టగ బడితిన్,
నీ మరణంబున జేత నిప్పుడో నేలబడితి పూర్తిగ నాథా! 57

బంధుజనముతో హీనురాలనై బ్రతుకే యొక బరువును కాగా
నాథుడవైనా నీవు లేకనూ నయముగ సుఖభోగంబులకున్
దూరముగా నే బ్రతుకు గడుపుచును దోరముగా శోకించుచునూ,
అనేక వత్సరములును గడపవలె నాత్మబంధువులు దూరగనూ! 58

నాథా! యిప్పుడు సుదుర్గమంబగు నయముగ సుదీర్ఘ మార్గమునూ
ప్రయాణమైతివి! దుఃఖార్తనగు బరగ నన్నుగూడను నీతో
వెంట దీసికొని పొమ్ము ప్రియతమా! జంటగ నుందును నీతోడన్,
నీవులేక నే జీవింపనునూ! నిజముగ నొక్క ముహూర్తంబున్! 59

దీనురాలనగు నన్ను విడిచియిటు దీరుగ యేకారణముననూ!
పోవుటకును మది నిశ్చయించితివి బొలుపుగ నాకంబునకు మఱిన్
దీనురాల విలపించు దాననూ దీరుగ మందస్థితి నుంటిన్
అయిన నన్ను బ్రీతిని గాంచవు మఱి యెలరి పలుకవెందులకు ప్రియా! 60

రాక్షసేంద్ర! నే నగర ద్వారమున రయమున దాటియు వెలుపలకున్
పాదచారిణిని నై వచ్చితినని బరగ మేలి ముసుగును తేకన్!
నిచట నుంటినని యందరి యెదుటను నిటు గోపింపగలేదు గదా! 61

భార్యలందు బద్ధానురాగమును బన్నుగ గలవాడా! రాజా!
నీ భార్యలగను! లజ్జయనియెడి నీలి మేలిముసుగులను మరిన్
జారవిడిచి వెలుపలకు వచ్చిరీ భారమైన శోకము తోడన్!
వెలుపలి కొచ్చుట జూచి వారలను వేగము గోపింపవదేమీ? 62

క్రీడయందు నీకును సహాయులై క్రీడించెడి స్త్రీలందఱునూ,
నాథుడు లేకను నేలను బడియును నయముగ నుండిరి శోకముతో!
వారి నేల యోదార్పవు ప్రియతమ! వనరగ యభిమానము లేదా? 63

రాజా! యనేకులగు పతివ్రతలును, రమ్యధర్మ నిరతలును మఱిన్
గురుశుశ్రూషల యందాసక్తియు కూరిమి గల కులస్త్రీలు మఱిన్
భర్తలేని వారినిగా జేసీ బన్నుగ విధవల జేసితివీ!
ఆ కులస్త్రీలను శపింపబడితివి వారల యుసురే దగిలినదీ!
భర్తృ వియోగము గలిగించిన యా ప్రమదలు యిచ్చిన శాపంచే
అదియే యిప్పుడు వచ్చి కూర్చొనెను నాలంకను నీపై మాపై! 64-65

మహారాజ! యీధాత్రిని బడియెడి మహాపతివ్రతల కన్నీళుల్
యూరకపోవను లోకోక్తియునూ యూహించినదీ నిజమాయెన్!
నీ విషయంబున సత్యమైనదీ నిక్కముగా నార్యుల పలుకుల్! 66

రాక్షసేంద్ర! నీ తేజస్సులచే రయముగ లోకము లన్నిటినీ,
జయించినాడవు! శూరుడ! ననియెడి సాహసాభిమానము గలదూ!

ఆట్టి నీవు మఱి క్షుద్రమైనదియు నిట్టి నీచమైనది మఱియున్,
నారీ చౌర్యము నెట్లు జేసితివి? నయముగ లోకులు నవ్వగనూ! 67

మృగమను వంకను నాశ్రీరాముని దగ యాశ్రమమున నుండి మఱిన్
దూరముగా దొలగించి యాతనిని దోరముగా నా పై దేహిన్!
దొంగిలించి దెచ్చితివి ప్రియతమా! రంగుగ లంకాపురికి మఱిన్!
నిది నీశౌర్యం బన బడదు సుమా! నిది భీరుడు జేసెడి పనియున్! 68

రణమునందు నేనెన్నడు నీదగు రహి భీరుత్వము వినలేదూ!
అనేక యుద్ధంబుల గెలిచితివీ యతిసాహస విక్రమములనూ!
అభాగ్యవశమున సీతను హరించి యపకీర్తిని మఱి బొందితివీ!
నీపాపము పండుటకుగూడ మఱి నిఖిలేశ్వరి సీతా తపమే! 69

అతీత, యాగత, యర్థజ్ఞుండును నలరు వర్తమానము నందున్,
సకల విషయముల యందును నేర్పను సత్యవాక్కు గలవాడు మఱిన్,
మరిదియైన యా విభీషణుండును మానుగ నీ గొనిరాబడినా
సీతను గాంచియు, నాలోచించియు మతి దీర్ఘము నిట్టూర్చి మఱిన్!
తెలిపినట్లుగా కామక్రోధముల దీరుగ గలిగిన దోషమునన్,
నీ స్త్రీ ప్రసంగ వ్యసనముజేతను నిఖిల సురాక్షస నాశంబున్,
పచ్చిపడినదీ లంకాపురినీ లావు క్షోభ ప్రాప్తించినదీ! 70-71-72

త్వత్కృతముననే యనర్థ మంతయు దగ జరిగెను సంపూర్ణంబున్
మూలమునే హరియించు నాపదయు వాలముగా జరిగిన దిపుడున్,
ఈ రాక్షస సంఘంబు నంతయును నిమ్ముగ యపకీర్తియు వచ్చెన్
రక్షకుండు లేకుండ జేసితివి రయముగ రాక్షస సంఘంబున్! 78

ప్రఖ్యాతంబగు బలపౌరుషములు బన్నుగ గలిగిన నినుగూర్చి,
విచారింపగూడదు గానీ మఱి విచారించుచుంటిని నేనున్,
స్త్రీస్వభావమున నాదు బుద్ధియును దీనత నొందుచు నుండి మఱిన్ 74

నీదు పుణ్యపాపములను గైకొని నీమార్గంబున బోయితివీ!
నీ సంబంధించిన గతి బోతివి! నీ మరణముచే నేను మఱిన్,

దుఃఖితురాలను దీనురాలనూ తోరముగా నను గూర్చి మఱిన్
విచారించు చుంటిని ఓనాథా! వికలత బొందుచు నుంటిని నే! 75

దశాననా! నీ హితమును గోరెడి దగమిత్రుల వచనంబులనూ!
వినలేవు గదా! సహోదరులయును విమలమైన హిత వచనములన్,
ఎంత జెప్పినను వారలమాటలు సుంతయైన వినలేదుకదా! 76

విభీషణుండును హేత్వర్థములను విమల శాస్త్ర సమ్మతమైనా
శ్రేయస్కరమును, నదారుణంబును శ్రీకరమగు యుక్తులుగలదీ,
విభీషణునిచే దెలుపగబడినది వినలేదుగదా దశాననా! 77

మారీచుని మఱి కుంభకర్ణులయు మాటలు మఱి వినలేదుకదా!
నామాటయు, నా పితరుని మాటయు నయముగ నిరాకరించితివీ!
వీర్యమత్తతను, నహంకారమున వినలేదుగదా మా పలుకుల్,
అందుకనే యీదృశమగు వ్యసనము నందుకున్నదీ పులి వలెనూ! 78

నల్లని మేఘముతో సమానుడా! నయముగ పచ్చని వస్త్రములన్
ధరించువాడా! సుందరమైనా దగ యంగదములు గలవాడా!
నీ యవయవముల మహీతలంబున నిర్దయగా బడవేసి నుఱిన్
శోణితమున మఱి దడిసియు ముద్దగ శూరుడ! పడియుంటివి యేలన్! 79

నిదుర బోవుచుండిన దానికివలె మదిశోకంబున బీడితనై
యున్నదాననగు నన్ను గూర్చి మఱి చెన్నుగ ప్రతిభాషింపవుగా!
మహాపరాక్రమమును గలవాడును! మానుగ రణరంగమునందున్
పలాయనంబును జేయనివాడవు బరగ మాల్యవంతునికి మఱిన్
దౌహిత్రుండవు నన్ను గూర్చి మఱి దగ ప్రతిభాషింపవదేలా? 80

లెమ్ము! లెమ్ము! ఓ దశగ్రీవా! యిక లెమ్ము వేగమున రణధీరా!
సరిక్రొత్తగ యీ పరాభవంబును జరిగిన పిమ్మటగూడ మరిన్!
ఎందుకింత శయనించుచు నుంటివి? యందముగను రవి రశ్ములునూ!
ఇప్పుడు నిర్భయముగా మఱి లంకను నిమ్ముగ ప్రవేశమొందినవీ! 81

ఘాను కాంతియును గలిగినదియు మరి శత్రుశత్రువుల రణమందున్,
వధియించెదవో యట్టిశ్రేష్ఠమును వనరగ పూజింపగ బడియున్,
సంగ్రామంబున యనేకులను మఱి నరగున వధించునది మఱియున్
స్వర్గభూషితంబైనది మఱియును సరగున సురపతి వజ్రమునూ!
సరిబోలెడి యీపరిఘు రామునీ సారమహోన్నత శరములచే
వేయిముక్కలుగ జేయబడినదై విలవిల నేలను రాలినదీ! 82-83

రణభూమిని ప్రియురాలికి వలెనూ రయమున కౌగిలి జేర్చుకొనీ,
ఎందువలన శయనించి యుండిపి జిందపు నను ప్రియభాషణలన్!
ఆ ప్రియురాలికివలె నను గాంచుచు నలరి బలుకవది యెందులకూ? 84

నీవు మరణమును బొందియుండగా నిలిచి చూచుచుంటిని నేనున్
ఛీ! నా హృదయ మందెంత కఠినమో శిథిలమునై శోకముజేతన్!
వేయి ముక్కలుగ బ్రద్దలుగా నయి విరజిమ్మగ బడలేదు ధరన్!
నే పాపాత్మను! నే కఠినాత్మను! నీ మరణము జూచుచునుంటిన్! 85

ఆ మండోదరి యీవిధంబుగా నడలుచు విలపించుచును మఱిన్
కన్నీళులచే వ్యాకులమైనా కలత నలతలను బొందుచునూ!
స్నేహముజేతను, భావముజేతను స్థిరత లేక దుర్బలమైనా
హృదయము జేతను మూర్ఛనందెనూ సదయుని మదిలో దలచుచునూ! 86

దుఃఖము జేతను కొట్టబడిన యా దుర్బలురాలగు నా సతియున్
ఆరావణునీ వక్షస్థలమున నల సంధ్యలనే నరుణమునౌ,
మేఘము మీదను మెఱుపు దీవె వలె మిగుల ప్రకాశించెను నపుడున్! 87

అట్టి మూర్ఛలో నున్న యాసతిని యిట్టె సపతులును వే వేగన్!
లేవదీసి యా మండోదరినీ భావమునందున జింతిలుచున్,
పీడింపగబడి వారును నేడ్చుచు యేడ్చెడి యా మండోదరిపి,
యోదార్చుచు బలుభాషణములతో నేద దీర్చిరి సేవలతోన్! 88

దేవీ! నీకీ సూత్రము దెలియద? దీరుగ లోకముల స్థితియున్
అధ్రువమైనది దశావిభాగము నలరి జరుగునపుడును మఱియున్
రాజుల సంపదలు వైభవంబులును రహి చంచలములు దగ సఖియా! 89

వారలీ విధము బలుకుచుండగా వసరగ నామెయు కన్నీటన్,
స్తనములనూ మఱి సునిర్మలంబగు సరసత వక్త్రము దడుపుచునూ
మఱింక విగళగా నేడ్చినదీ మానుగ దిక్కులు ధ్వనియింపన్! 90

ఆ సమయంబున రామచంద్రుడును నా విభీషణుని బిలిచి మఱిన్
'నీ సోదరునకు సంస్కారంబును నిఖిలము జేయుము వేవెంటన్!
స్త్రీజనంబు నిక యోదార్పుము మఱి స్థిరతను బొందగ ధీరతనూ!
శాంతముగా మఱి సరస వచనముల చింత వీడుమని యిటు పలికెన్! 91

అటు పిమ్మట పరి ధీమంతుండును జటుల విక్రముడు ధర్మంబుల్,
తెలిసినవాడగు విభీషణుండును దీరుగ బుద్ధిని యోజించీ,
ధర్మసహితమగు హితవాక్యంబును దగ బలికెను నీవిధముగనూ! 92

త్యక్త ధర్మవ్రతుడును క్రూరుండును దగ నరహంతకుడును మరియున్
నసత్యంబు బలికెడి స్వభావమును నల పరదారల స్పృశించెడీ
దుర్గుణంబులును గలవాడీతడు దురభిమాని శఠుడును మరియున్
ఇట్టివాని సంస్కారంబును నే నెట్లు జేయుదును రఘురామా? 93

అందరికిని నపకారము జేసెడి యాసక్తియు గలవాడితడున్!
యీ రావణుడును పెద్దవాడనే యిమ్ముగ గౌరవ మర్యాదల్
పూజ్యుడయుననూ పూజకు దగడూ పొలుపుగ సంస్కారము జేయన్!
భ్రాతృరూపమున యున్న శత్రువూ బన్నుగ దూరము నే నుందున్! 94

రఘురామా! నే సంస్కారంబును రమ్యముగా జేయక యున్నన్!
భూలోకములో మానవులందఱు పొలుపుగ నను క్రూరుం డనుచున్!
నిందింతురు మఱి కాని రావణుడు జెందిన చెడుగుణములను వినీ!
మంచిపనిని జేసిన వానినిగా నంచితముగ మెత్తురు నన్నున్! 95

ఆ వాక్యములను శ్రీరాముడు విని నలరి ప్రీతి బొందినవాడై
ధర్మభృతులలో శ్రేష్ఠుండును మఱి మర్మ వాక్య కోవిదుడు మఱిన్!
నా రాఘవుడును వాక్యజ్ఞుండగు నల విభీషణునితో బలికెన్! 96

విభీషణా! ఓ రాక్షసరాజా! వినుము నాదు వాక్యంబులనూ!
నేను గూడనూ నీకు ప్రియంబును నెఱనేర్పగ వలసినది మహా
కార్యముగలదూ! నీ ప్రభావమున కయ్యమునందు జయించితినీ!
తగిన విషయమును నవశ్యంబునూ దగ దెలుపగ వలయును నిచటన్! 97

ఈ నిశాచరుడు నధర్మంబునూ యిమ్మగ మఱియు ననత్యంబున్
గూడినవాడే కావచ్చును మఱి కూరిమి నీతడు బలీయుడున్!
తేజోశాలియు సంగ్రామంబుల దీరుగ నీతడు శూరుండున్! 98

మహాత్ముడును మఱి బలసంపన్నుడు మఱి లోకంబుల నేడ్పించెన్!
అట్టి రావణుని దేవేంద్రుడును నిట్టిలోక పాలకులు మఱిన్!
జయింపలేకను బోయినారనుచు జగతిని గలుగు ప్రశస్తి మఱిన్! 99

వైరభావములు మరణముతోడను వనర సమసిపోవును మఱియున్!
మా ప్రయోజనము బూర్తియైనదీ మానుగ యిక సంస్కారంబున్!
జేయబడెడి గాతను! నీతడు మఱి స్థిరబంధువు నీకెట్లగునో!
నాకును నట్లే యని భావింపుము! నయముగ యిపు డాతనికి మఱిన్!
స్వర్గ హేతువగు నంత్య విధులనూ సరగున జేయుము నిశ్చలతన్! 100

దశగ్రీవుండును విధిపూర్వకముగ దగ నీ నుండియు నాతండున్
సంస్కారంబును బొందుటకును మఱి సకల ధర్మములచే గూడన్!
అర్హత గలిగియు యుండె నాతడును నటుపై నీకును సోదరుడున్
నీకు గూడ బహుకీర్తి లభించును నిఖిలజనులు మెత్తురు నిన్నున్! 101

విభీషణుండును రామచంద్రునీ విమల వాక్యముల విని వేగన్!
త్వరమాణుండై చంపబడిన యా దగ యన్నయునగు రావణుకున్!
సంస్కారంబును జేయుట కొఱకై సరగున సిద్ధంబాయె నటన్! 102

రాక్షసేంద్రుడగు విభీషణుండును రయమున లంకను జేరుకొనీ
బహుశీఘ్రముగా రావణాసురుని బరగ యగ్నిహోత్రంబు మరిన్!
అగ్ని గృహంబుననుండి వెలుపలికి యతిరి వెలుపలికి దెప్పించెన్! 103

అటుబిమ్మట యా విభీషణుండును నలరు శకటముల బారువుతో
జేసినట్టి యా సాధనంబులకును జెన్నుగ యగ్నుల ఋత్విజులన్!
చందన కాష్ఠంబులును మరియునూ యందమైన పరిమళములనూ
గుబాళించు నగురువులను మరియును గూరిమి సుగంధ ద్రవ్యములున్
బరిమళించు వస్తువులను మణులను బరగ ముత్తెములు బగడములున్!
దెప్పించెను వే బరిచారకులను దీరుగ బంపియు వేగముగన్! 104-105

రాక్షసవీరులతో గూడియు మరి యయమున ముహూర్తకాలమునన్
అటకు వచ్చి యామాల్యవంతునీ బటుతరముగ మరి కలిసికొనీ
చేయగ వలసిన కార్యమంతయును జేసెను నాతనితో గలిసీ! 106

అశ్రుపూర్ణ ముఖములుగలిగిన యా యలరు బ్రాహ్మణులు వేగముగన్!
పట్టుబట్టలును గలవారును మరి బరగతూర్య ఘోషంబులతో
స్తోత్ర పాఠకుల జేతను మరియునూ శూరత యభినందింపబడీ!
బంగరు వికారమైన మరియును రంగుల పల్లకి నెక్కించీ!
చిత్రవర్ణమగు బతాకములతో జిత్రవర్ణ పుష్పంబులచే! 107-108-109

జిత్రితమైనా యట్టి శిబికనూ జేరి యందఱును నెత్తి మఱిన్!
విభీషణుడు మఱి ముందు నడువగా విమల కాష్ఠములు గ్రహియించీ,
దక్షిణాభి ముఖులై శ్మశానమును దగ బోయిరి వారందఱునూ! 109

అపు డధ్వర్యువుజేత యగ్నులును నలరి ప్రజ్వలింపగ బడగా
అగ్నులన్నియును మండిన వప్పుడు విఘ్నము లేవియు లేకుండన్,
కుండల లోపల నుంపబడిన యా కూరిమి యగ్నులు రావణుకున్,
ముందుగ బోయెను శ్మశానమునకును మోదముగా విప్రులతోడన్! 110

అపు డంతఃపుర స్త్రీలందఱునూ నలరి యేడ్చుచును వేగముగా
అన్నివైపులను బడుచు లేచుచును జెన్నుగ గుండెలు బాదుకొనీ
కురులు విడగ యా రాక్షసస్త్రీలును కూరిమి బోయిరి వెనుకగనూ! 111

దుఃఖించెడి వారందఱునూ మఱి దోరముగా యా రావణునీ
యొక పవిత్ర స్థానము నందుంచియు నొనరగ వేగముతో వారున్,
చందన కాష్ఠంబులతోడను మఱి యందమైన పద్మకములనూ,

ఉశీర మనియెడి సుగంధములతో నుత్తమంబుగా దడుపబడీ,
యున్న యున్ని వస్త్రమున గప్పబడి యున్న చితను వేదోక్తముగనూ,
యేర్పరచిరి యా బ్రాహ్మణోత్తములు జరిపిరి బ్రాహ్మ్యవిధానమునన్ 113

ఆ రావణునకు ననుత్తమంబగు నలరు పితృమేధము జేసీ
ఆగ్నేయమునందునను వేదినీ యగ్నిని యుంచిరి యథావిధిన్! 114

పెరుగును నింపిన నేతిని కలిపిన పేరిమి స్రువమును వేగముగన్,
నాతని భుజముల పైని వేసిరీ యలశకటము పాదములందున్
నుంచి మఱియునూ యులూఖంబునూయుంచిరి యూరువులందుమఱిన్!115

సమస్తమైనా దారుపాత్రలును సరసత యరణీపైయరణిన్
రోకలి మఱియును నితర వస్తువుల రూఢిగ యాయా స్థానములన్
యుంచి మఱియునూ యా చితి చుట్టును యంచితముగ దిరిగిరివారున్ 116

ఆ చితి యొద్దను నా రాక్షసులును నలరు శాస్త్రదృష్టిని వారున్,
మహాఋషులచే విధింపబడినా మానుగ విధిచే శుచియైనా,
పశువును జంపీ దాని వసను మఱి బన్నుగ ఘృతమున దడిపి మఱిన్
రాక్షసేశ్వరుని ముఖము నుంచిరీ రమ్యశాస్త్ర విధిచేత నటున్! 117-119

విభీషణునితో గూడినట్టి యా వికలత బొందిన రాక్షసులున్,
దీనమైన హృదయంబుల తోడను ధీరుడైన రావణు జితిపై
గంధంబులచే మాల్యంబులచే ఘనమగు వస్త్రంబుల చేతన్,
నలంకరించియు కన్నీళులతో నాతనిపై జల్లిరి లాజల్! 119-120

అటుబిమ్మట యా విభీషణుండును యథాశాస్త్రముగ రావణునీ
మహాచితికి యగ్నిని ముట్టించీ నలరు స్నానమును జేసి మఱిన్,
తడిబట్టలతో నుదకము దర్భలు దగ కలిపిన నువ్వులతోడన్,
నాతని కంజలి సమర్పించియును నల జల తర్పణమును జేసీ,
శిరసుజేత మఱి నమస్కరించియు స్త్రీలను మాటికి మాటికినీ
యోదార్చియు గృహములకును బొండని యొనరగ బ్రతిమాలెను వారిన్
అటుబిమ్మట యా స్త్రీలందఱునూ యలరి ప్రవేశించిరి నగరిన్!

ఆ స్త్రీలందఱు లంకాపురినీ నలరి ప్రవేశించుచు నుండఁన్
రాక్షసేంద్రుడగు విభీషణుండును రయముగ వచ్చియు వినయమునన్!
రాముని పార్శ్వమునందు నిలబడెను రమ్య కరములును జోడించీ! 124

సుగ్రీవునితో లక్ష్మణుతోడను, సురచిరముగ కపి సైన్యముతో
గూడినట్టి యా రామచంద్రుడును కూరిమి తన శత్రువు జంపీ,
వృత్రాసురునీ సంహరించినా విభు దేవేంద్రునిలా భాసించెన్! 125

అటుబిమ్మట యా రిపు మర్దనుడును బటు విక్రముడగు రాఘవుడున్
శరజాలంబును, మహాధనుస్సును శక్రుడు నిచ్చిన కవచంబున్
విడిచి శత్రు సంహారంబును మఱి విధివడి పూర్ణంబగుటయునూ,
క్రోధము విడిచీ, సౌమ్యత్వంబును గూరిమి పొందెను సంతసమున్! 123

[యుద్ధకాండమునందు 112వ సర్గము సమాప్తము]

   

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటపదుమూడవ సర్గము

### విభీషణుని పట్టాభిషేకము (రాజ్యాభిషేకము)

### (రాముడు హనుమంతుని ద్వారా సీతకు సందేశమును బంపుట)

అల దేవతలును, గంధర్వులునూ యలదానవులును కిన్నరులున్
రావణు సంహారమును గాంచి మఱి రమ్యమైన శుభకరములునూ
ఆ యా వృత్తాంతములను గూర్చియును నాశువుగా చర్చించుచునూ
తమ తమ విమానములను బోయిరీ తమ తమ నెలవులకును మఱియున్ 1

మహాభాగులగు దేవతాదులును మానుగ రావణు వధ మఱియున్
రామచంద్రునీ పరాక్రమంబును రహి కపివీరుల సుయుద్ధమున్
సుగ్రీవుని యా యాలోచనలను సుసౌమిత్రి యనురాగంబున్
పరాక్రమంబును జనకనందినీ పతివ్రతా సుగుణంబులనూ
వాయుసుతుని యా ధీరత్వంబును వనరగ సుభీమ విక్రమమున్
జెప్పుకొనుచు గథలుగ వారలునూ యొప్పుగ సంతోషించుచునూ
వచ్చినట్లుగానే వారలునూ విచ్చ జనిరి తమ తావులకున్! 2-3

మహాబాహువులు గల రాఘవుడును మానుగ యింద్రుడు బంపిన యా
అగ్ని ప్రభలుగల యా రథంబునూ యలరు మాతలికి నిచ్చి మఱిన్!
పూజ్యభావమున గౌరవించెనూ పూనికతో నాకముబోవన్! 4

రామునిజేతను ననుజ్ఞాతుడై రయమున మహేంద్రు సారథియున్
నా మాతలియును దివ్యరథంబును నారోహించియు వేగమ్ముగన్!
స్వర్గంబునకును నెగిరిపోయెనూ సరసత వినతా సుతుపోలెన్! 5

ఆ సమయంబున యా సారథియును నరిగెను స్వర్గమునకుబోవన్
అటువిమ్మట రథికులలో శ్రేష్ఠుడు జట్టుల పరాక్రమవంతుడున్

రామచంద్రుడును సంతోషించుచు రయమున సుగ్రీవుని నపుడున్
గౌగలించుకొని యాత్మీయతతో గౌరవించుచును బహురీతిన్! 6

సుగ్రీవుని మఱి కౌగలించుకొని సురుచిరముగ లక్ష్మణుచేతన్
నమస్కరింపగ బడినవాడునై నయముగ వానర వీరులచే
బూజింపగ బడుచును సైన్యంబుల బొలుపుగ నివాసమున కొచ్చెన్! 7

అటుబిమ్మట యా రఘువీరుండును జటుల పరాక్రముడునునైనా
బలసంపన్నుడు సుమిత్రసుతుడును బన్నుగ శుభలక్షణుడైన
లక్ష్మణమూర్తిని గాంచి రాముడును లాలితముగ బలికెను నిటులన్ 8

ఓ సౌమ్యుడ! ఓ లక్ష్మణవీరుడ! యొనరగ మనయందున మిగులన్,
అనురక్తుండును భక్తుండును మఱి యలరి మంచి చేసిన వాడున్!
ఈ విభీషణుని లంకానగరికి నిమ్ముగ జేయుము నభిషిక్తున్ 9

ఓ లక్ష్మణ! రావణుని సోదరుడు నొనరగ విభీషణుడు వేగన్
లంకా రాజ్యమునందు రాజుగా శంకలేక పాలించుచునూ!
నుండగా మఱియు జూడవలయునని నిండు కోర్కె మది యున్నదియున్

మహాత్ముడగు నా రామునిజేతను మానుగ నిట్టుల బలుకబడీ
లక్ష్మణుండు మఱి సంతోషించుచు లలితరీతి యట్లే యనుచున్!
స్వర్ణఘటంబును గ్రహించి యంతట సరసత కపివీరుల బిలిచెన్! 11

మహాసత్త్వమును గల లక్ష్మణుడును మానుగ సువర్ణఘటమును వే
వానరవీరుల హస్తములందున వసరగ యిచ్చుచు బహుప్రీతిన్
సముద్ర సలిలంబుల మఱి దెమ్మని సరగున యాజ్ఞాపించె నటన్! 12

అటుబిమ్మట యా వానరవీరులు చటుల వేగమున శీఘ్రముగన్
నల సంద్రమునకు బోయి జలంబును నలరి గ్రహించియు దెచ్చిరటన్! 13

అల సౌమిత్రియు మిత్ర గణముతో నలరి గూడికొనువాడగుచున్
నొక ఘటమును గ్రహియించి విభీషణు నొనరగ సింహాసనము పయిన్
గూర్చుండగ బెట్టియును ఘటముచే గుదురుగ రాక్షసులకు మధ్యన్

మంత్రదృష్టితో విధివిధానమున మానుగ శ్రీరాముని యాజ్ఞన్!
లంకా రాజ్యమునకును రాజుగా శంకలేక యా లక్ష్మణుడున్
ఘటోదకంబున యభిషేకించెను కనుబండువుగా విభీషణున్! 14-15

అట్టి సమయమున సమస్తమైనా యారాక్షసులును గపివీరుల్
యమృత వాక్కులను బలికి విభీషణు నభిషేకించిరి వత్సలవతన్!
ఆ రాక్షసులును, నా కపివీరులు, నలరుచు సంతోషించుచునూ
యా రఘువీరుని స్తుతించి దప్పడు నలరుచు గీతికలను బాడి! 16

లంకయందు నభిషిక్తుడైన యా లంకేశ్వరుడగు విభీషణున్
గూడియుండు నలుగురు మంత్రులునూ కూరిమి గాంచియు బహుళముగా
సంతోషించిరి యానందించిరి చింత బాసెనని మోదమునన్
నతనియందు భక్తియు గలవారలు నానందించిరి బహుప్రీతిన్! 17

రామలక్ష్మణులు సంతోషించిరి రయమున విభీషణుని గాంచి
విభీషణుండును రామదత్తమగు విమల మహారాజ్యము నందీ
బహుసంతసమును నొందెను నాతడు బరగ బంధుమిత్రుల తోడన్! 18

అటుబిమ్మట యా విభీషణుండును బటు వాక్యంబుల రాక్షసులన్
నోదార్చియు సంతసము గూర్చియును నొనరగ జేరెను రాఘవునీ,
పౌరులైన యా రాక్షసులును మఱి బన్నుగ సంతుష్టాత్ములునై!
దధి, యక్షతలను మోదకంబులచు దగ లాజలునూ పుష్పములున్
మంగళ ద్రవ్యంబుల గొనిదెచ్చిరి రంగుగ విభీషణుని కపుడున్! 19-20

దుర్ధర్షుండును, వీర్యవంబుడును దోరంబుగను విభీషణుడున్,
వాని నన్నిటిని గ్రహించి బిమ్మట వనరగ మంగళ ప్రదములునూ,
యా సమస్త ద్రవ్యంబుల ప్రీతిని యా రాముడు లక్ష్మణులకునూ
యర్పించెను మఱి యందఱు జూడగ యాత్మీయతయును నుదయింపన్!

కార్యము జేసియు ఫలితమునందున కర్మవీరుడగు విభీషణున్
అతనికి ప్రీతిని గూర్పవలయునని యా కోరిక మాత్రము జేతన్
22)

ఆ శ్రీరాముడు గ్రహించె నాతడు నలరి యిచ్చినా సామగ్రిన్
ఫలపుష్పంబుల పాలు పెరుగులను బన్నుగ మంగళ ద్రవ్యములన్! 22

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును జటుల శైల సముడగు వాడున్
ధీరుడు ప్రాంజలితో నిలబడినా విమల భక్తుడగు వాయుసుతున్!
గాంచి యిటుల బలికెను శ్రీరాముడు నంచితముగ మృదువాక్యములన్!23

ఓ సౌమ్యుడ! లంకకు రాజయినా నొనరగ విభీషణుని జేరీ,
యనుమతి నందుచు లంకానగరిని నలరి ప్రవేశించియు మఱియున్
జనకనందినికి మా క్షేమంబును సరసత దెలుపుము పవనసుతా! 24

సంభాషణలో జతురుండవు మఱి సరగున వైదేహిని జేరీ,
నేను, లక్ష్మణుడు, సుగ్రీవుండును నిఖిలమైన కపివీరులునూ!
కుశలముగా నున్నటుల దెల్పుమా! కుదురుగ యారాక్షసుడు మఱిన్!
దురమునందునను హతమైనటులను సాధ్వికి దెలుపుము వేగముగన్! 25

హనుమంతుడు! యీ ప్రియవృత్తాంతము నా వైదేహికి దెలిపి మఱిన్,
ఆమె దెలిపినా సందేశంబును నలరుచు గైకొని రమ్మిటకున్!
అందుకు నీవే దగినవాడవును! చందము పండితుడవు నీవున్! 26

(యుద్ధకాండమునందు 112వ సర్గము-సమాప్తము)

* * * *

# శ్రీరామకథా సుధాలహరి యుద్ధకాండము

## రెండవ భాగము

నూ ట ప దు మూ డ వ స ర్గ ము)

(హనుమంతుడు సీతాదేవితో మాటలాడి తిరిగి వచ్చి రామునకు అమె సందేశమును దెలుపుట.)

ఈవిధముగ యాజ్ఞాపింపగబడి యిమ్ముగ వాయు సుపుత్రుండున్
హనుమంతుడును నిశాచరులచే నలరి పూజలను గైకొనుచున్!
లంకాపురమును బ్రవేశించెనూ శంకలేక శుభచింతనతో! 1

సీతకు విదితుండైన వానరుడు శీఘ్రము నా హనుమంతుడునూ
లంకాపురమును బ్రవేశించి మఱి శంకలేక యా విభీషణున్,
ననుజ్ఞ గోరినవాడై బిమ్మట యభ్యనుజ్ఞాతుండై వేగన్!
వృక్షవాటికను యథాన్యాయముగ వేగముగా జేరెను బిదపన్! 2

సంస్కారము లేకను మలినముతో సరసత వలువలు గలధియునూ
భయభీతిని గలిగున్నదియును మఱి బరగ రోహిణికి వలె నుండెన్!
ఆనందములేకను యున్నదియును నలరెడి రాక్షస వనితలచే
చుట్టుముట్టబడినట్టి జానకిని చెట్టు మొదలు మారుతి గాంచెన్! 3

ఆ హనుమంతుడు నా జానకినీ నలరి గాంచి యభిగమ్యుండై
నమస్కరించియు వినయ వంతుడై నయముగ యంజలితోగూడి
మౌనముతో నట నిశ్చలంబుగా మానుగ నిలబడి మారుతియున్! 4

మహాపతివ్రత సీతాదేవియు మానుగ సమాగతుండైనా
మహాబలీయుడు నా హనుమంతుని మానుగ గాంచియు మౌనముగా
నిశ్చేష్టితురాలాయెను మఱియును నిలకడగా మఱలను గాంచీ,
స్మరించి యాతని మది గుర్తించీ సంతసించె యానందమునన్! 5

ప్లవగోత్తముడగు హనుమంతుండును ప్రసన్న యగు సీతను గాంచి
రాముని సమస్తమగు వచనంబును రహి ప్రారంభించెను దెలుపన్! 6

ఓవైదేహీ! జనకసుతా విను! నొనరగ నాదు సువచనంబుల్!
లక్ష్మణుతోడను, సుగ్రీవునితో లాలిత విభీషణుని తోడన్,
వానర సైన్యములను గూడికొని వనరగ శ్రీరఘు వీరుండున్,
క్షేమముగా నున్నాడు జానకి క్షేమము దెలుపగ నను బంపెన్! 7

అమిత్రజితుడగు రామచంద్రుడును హతశత్రువు గలవాడగుచున్
సిద్ధమైన మతి ప్రయోజనంబునూ సిద్ధిని పొందిన వాడగుచున్!
నీ కుశలంబును నీ క్షేమంబును నీరజాక్షి! బలుకుచు నుండెన్!
విభీషణుని సహకారము దోడుత వీరులైన కపిసేనలతో!
రాముని చేతను లక్ష్మణు జేతను రయమున విక్రముడైనట్టి
యారాక్షసుడగు రావణుండునూ యట జంపగ బడె రణమందున్! 8

దేవీ నీకును నతిప్రియంబునూ దీరుగ దెలుపుచు నున్నాడన్
నీకింకను సంతోషకరంబును నిజవార్తను దెలిపెద వినుమా!
ధర్మంబుల నెఱిగిన ఓదేవీ! దగ నీదు ప్రభావము జేతన్
రాముడు సంగ్రామంబు నందునను రయమున బొందెను విజయంబున్!
గలత నలతలను వీడుము తల్లీ! గాంచుము స్వస్థత వేగముగన్! 10

శత్రువు రావణుడును జంపగబడె సరసత లంకయు గూడ మఱిన్
వశము జేసికొనబడినది దేవీ! వనరగ నీదు ప్రభావమునన్!
నీదు జెఱను విడిపింపగ వలెనను నిశ్చయంబుగల నేను మఱిన్!
నిద్రాహారంబులు లేకను మఱి నీరధియందున సేతువునూ!
నిర్మాణము గావించితి దాటగ నిలుపుకొంటి నా ప్రతిజ్ఞనూ, 11

నీవు రావణుని వనమునందునను నిలిచినందులకు భీతిలకూ!
యెందుజేతననగా లంకాపురి కందువ విభీషణునకు వఱిన్
అధీనమందున నుంచబడినదీ యఖిల సంపదలుగూడ మఱిన్! 12

ఆ కారణమున విశ్వాసంబున యలరి యూరడిల్లుము దేవి!
భావింపుము నీ స్వగృహంబుగా బన్నుగ యీ లంకాపురినీ!
ఆ విభీషణుడు గూడ నలరుచును నానందంబున బొంగుచునూ!
నీ దర్శనమును జేయవలయునని నిక్కము వచ్చుచు నున్నాడున్! 13

హనుమంతునిచే నటుల బలుకబడి యా శశినిభాననయు మఱియున్
దేవియైన యా సీతాదేవియు ధీరుగ సంతోషము జేతన్
నానందాతిశయంబుజేతనూ యలరి బలుకజాలకపోయెన్! 14

అటుబిమ్మట యా హరి వీరుండును నటు బ్రత్యుత్తర మీయని యా
సీతామాతను జూచి మారుతియు శీఘ్రము నీరీతిని బలికెన్!
అమ్మా సీతా! నాతోడను మఱి యలరి మాటలాడవదేమీ?
యాలోచించుచు నుంటివి మదిలో నలరి దెలుపు మో సుగుణవతీ! 10

హనుమంతుని యా వచనములను విని యలరి ధర్మపథమందుననూ
యున్న జానకియు బరమప్రీతయై బన్నుగ యానందము తోడన్,
బాష్పము జేతను గద్గదమై నా ప్రవిమల వాక్కున బలికె నిటుల్! 16

భర్తృవిజయ సంశ్రయమైనట్టి పరమప్రీతి కరమైనట్టి
అట్టి వార్త విని యానందంబున బిట్టుగ సంతసమంది మఱిన్!
క్షణకాలము నిర్వాక్యరాలనై సరసత మౌనము దాల్చితినీ! 17

ప్లవంగమా! నాకును బ్రియవార్తను బరగ తెలియజేసితివి యిటన్
అందుకు నీకును దగిన వస్తువులు చందముగా నిచ్చుటకు మఱిన్
ప్రతి ప్రియవచము బలుకుటకును మఱి బన్నుగ కనిపించుట లేదూ! 18

నీవు దెలిపినా ప్రియమగు వార్తకు నిజముగ సదృశమగు దానిన్
నీకిచ్చినచో నా మనసునకును నిండుగ సంతోషంబగునో!
అట్టి సదృశమునగు వస్తువు మఱి యిట్టి ధరణి గనబడదు సుమా! 19

వెండిగానీ బంగారముగానీ మెండగు వనేక రత్నములున్!
త్రిలోక సామ్రాజ్యంబునుగానీ దీటుగ నీ వాక్యంబులకున్!
సరితూగవు మఱి యెన్ని యిచ్చినను సత్కృతు లెన్నియు జేసినమూ! 20

సీతాదేవియు నటుల బలుకగా శీఘ్రము నా హరివీరుడునూ!
గృహీతాంజలిని గలిగినవాడై కేసరి సుతుడౌ పావనియున్!
జానకి యెదుటను నిలిచినవాడై జాగృతి చైతన్యములతోడన్!
సంతోషముతో నీవిధి బలికెను సుంత దోషమును లేకుండన్! 21

భర్తయొక్క ప్రియ హితముల చెప్పుడు బన్నుగ గోరెడి దానవునూ!
భర్తృ విజయముల గోరెడిదానవు బరగ యనిందితురాలవునూ!
ఓదేవీ! స్నేహముతో గూడిన నొనరగ యిట్టి సువచనములన్!
నీవే బలుకుటకును దగుదానవు! నీకే సాధ్యము లోకమునన్! 22

సౌమ్యురాల! నీ విపుడు బలికినా సారవంతమును స్నిగ్ధమునూ!
యైన వచనముల యనేక విధముల యలరు రత్నసముదాయంబున్!
మించినట్టిదియు స్వర్గముకంటెను మించి విశేషించినది సుమా! 23

సకల శత్రువుల సంహరించినా సార్వభౌముడగు శ్రీరామున్!
విజయవంతునిగ సుస్థితుడై మఱి విలసితముగ జూచుచు నుంటిన్!
అందుజేత సురరాజ్య గణంబులు పొందుగ లభించెనని మదిలో!
సంతసమున భావించుచుంటిని భ్రాంతి యింతయును లేకయునూ! 24

జనకాత్మజయును నామైథిలియును సరుగున నాతని మాటవినీ
యటుబిమ్మట హనుమంతుని గూరిచి యధిక శుభకరము నైనట్టి!
వాక్యంబును బలికెను నాతనితో వనరగ మధురాక్షరములతో! 25

అతిలక్షణ సంపన్నమైనదియు నల మాధుర్య గుణంబులతో!
నలంకరింపగ బడిన వచనమును అష్టాంగంబులు గలిగినదీ!
బుద్ధితోని మఱి గూడినట్టిదియు బొలుపుగ వాక్యము బలుకుటయున్!
నీవే దగుదువు! పావని నిజముగ నిఖిల వ్యాకరణ విదితుడవున్! 25

ఎ ని మి ది బు ద్ధి గు ణ ము లు

ఇతరులు జెప్పినదానివి వినుటయు నిల వినవలెనను కోరికయున్!
గ్రహించుటయు మఱి జ్ఞాపకంబునూ గలిగియుండుటయు నాల్గవదీ!
చెప్పని విషయము నూహించుట మఱి యనావశ్యకము నగు దానిన్!

త్యజించుటయును మఱి విషయార్థంబునుదగ సరిగా దెలియుట మఱియున్
యథార్థంబునూ నిర్ధయించుటయును, అష్ట బుద్ధి గుణములు జగతిన్! 26

అనిల సుతుండవు గీర్తింపగదగు నలరు బుద్ధిమంతుడవు దగన్!
పరమధార్మికుండవు! మఱి నీవును బలము మఱియు శూరత్వంబున్!
శాస్త్రజ్ఞానము బుద్ధిబలంబును సారవంతమగు విక్రమమున్!
ఉత్తమమైనా తేజస్సును మరి యోర్పు ధైర్యమును స్థిరత్వమున్!
వినయము ఈ గుణములును మరియునూ విశదముగా నితరములైనా
యుత్తమ గుణములుగలవు నీమదినియురుగుణ!సంశయమునులేదూ!27-28

అటుబిమ్మట నా హనుమంతుండును నలరుచు నంజలి ఘటియించి!
జానకి యెదుటను నిలిచినవాడై సరసత యీ విధమున బలికెన్! 29

ఈరాక్షస స్త్రీలందఱు పూర్వము నిమ్మగ నిను భయపెట్టియునూ!
పీడించిన వారలు గద! మిక్కిలి ప్రేలుచు బలికిన వారు గదా!
యనుమతించినట్లయిన నీవు మరి యలరి వీరలను నందరినీ!
వధింపవలెనని గోరుచుంటినీ వనరగ యొక్కరి నొక్కరినీ! 30

ఓదేవీ! దుఃఖించు దానవును నొనరగ పతియే దైవముగా
భావించెడి దానవును మరియునూ బరగ యశోకావని యందున్!
నున్నదానవును నైన నిన్ను మరి భిన్న ప్రవర్తన గలవారున్!
ఘోరరూపమును గలవారును మరి క్రూరురాండ్రు, క్రూరమునైనా
నేత్రంబులు గలవారును మరియును నీచ వికట ముఖములు గలిగీ
యున్నవారలగు రాక్షస స్త్రీలును జెన్నుగ రావణు యాజ్ఞలచే
మాటి మాటికిని పరుషవాక్యములు మానుగ బలుకుచు నుండగనూ
పీడించుచు నుండగ నే వింటిని పెనుకేకలు వేయుచు మఱియున్, 30-11

వికృతాకారము గలవారును మఱి వికారమును గలవారలునూ,
క్రూరతరేక్షణములు గలవారును మఱి క్రూరురాండ్రు వర్తన జేతన్!
దారుణ స్వభావమును గలవారును దారుణ గతులును గలవారున్,
అయిన యిట్టి యా రాక్షస స్త్రీలను ననేక విధముల ఘాతములన్,

జంపగోరుచున్నానో జననీ! యంపగోరెదను యమపురికిన్!
నే నీ వతమును గోరుచుంటినీ, నీ మఱి గోరుచు నుంటి మఱిన్! 33-34

నీకు నప్రియమును గూర్చినట్టి యీ నిర్దయులగు రాక్షస స్త్రీలన్
బిడికిళ్ళను నఱచేతి దెబ్బలను విశాలమగు బాహువుల మఱిన్,
పిక్కల మఱి మోకాళ్ళ దెబ్బలను బిక్కటిలగ దంతంబులచే
గఱచి, ముక్కులను చెవులను గోటికీ కచముల లాగుటచేత మఱిన్,
ఎండిన ముఖములుగా జేసి మఱిన్ దండనచే జీల్చుట జేతన్!
నెగిరి యెగిరి మీదను బడగొట్టియు నెముకలు, మెడలును, భుజములున్నూ,
పార్శ్వంబులుగల దేహంబులనూ బడవేసియు నేలను గొట్టి
చంపవలయుననిగోరుచుంటినీ!పంపగయమపురికిని మఱియున్!35-36-37

యశస్వినీ! పూర్వమున నిన్ను మఱి యతిభీకరమగు రూపములన్,
గలిగినట్టి యా స్త్రీల జేత మఱి కడు భయమందించిన వారిన్
ఈ విధముగ మఱి యనేక రీతుల వికటముగా జంపెద గొట్టి! 47

ఆ విధముగ మారుతి మాటలు విని యలరు దీన వత్సలయునగూ
దయావంతురాలగు నా సీతయు దగ యాలోచించియు మదినీ
విమర్శించి యా వాయుసుతునితో విశదముగా బలికెను నిటులన్! 39

రాజు నాశ్రయించిన వారును మఱి రాజుకు వశ్యులు నగువారున్,
పరాజ్ఞచే పనిజేసెడి వారును బరాధీనులగు వారు మఱిన్
అట్టి దాసదాసీ జనములపై నిట్టె యెవరు గోపించు ధరన్? 40

భాగ్యము ప్రతికూలముగా నుండుటచే బరగ నేను పూర్వమునందున్
జేయబడిన దుష్కృతము జేత మఱి జేరవచ్చె నిది యంతయునూ!
అనుభవింప వలయును సర్వంబును నలరి జేసినా కర్మములన్,
ప్రతివారును దమ కర్మఫలంబును బరగ యనుభవింతురు గాదా? 41

మహాబాహూ! నారీతి బలుకకుము! మానుగ దైవ సునిర్ణయమున్
దశాయోగమున నిటి ప్రాప్తించెను తగ దుఃఖంబును బొందగనూ,
దైవవశముచే నే నా నాడను దగ దుర్బలురాలనుకైనా

యీ విధముగ యిచ్చట రావణునీ యిమ్ముగ దాసీ జనములచే!
పెట్టిన బాధలు సహించు చుంటిని యిట్టి వేదనలు నందితినీ! 42

మారుతాత్మజా! ఇహ నే నిచ్చట మానుగ రాక్షస స్త్రీలు ననున్,
రావణుచే యాజ్ఞాపింపగబడి తహి భయ పెట్టిరి తీవ్రముగన్,
నాతడు జంపగబడె నిపుడును మఱి నటుల జేయరిట మీదటనూ! 43

ప్లవంగమా! విను! వ్యాఘ్రము తోడను భల్లూకము బలికిన కథనూ!
ప్రాచీనముగా ధర్మ సమ్మతము బన్నుగ యొక శ్లోకము గలదూ!
సావధానముగ వినుమా మారుతి సరసత వినిపింతును దానిన్! 44

సతుల విషయమున బాపకర్మలను బరగ జేయువానికి గూడన్
బాపకర్మమును నాచరింపడూ బన్నుగ యుత్తముడగు వాడున్,
నపకృతి జేసిన వానికి గూడను నపకృతి జేయగ రాదనెడీ
నియమంబును రక్షింపగ వలయును నిండు మనస్సున సజ్జనులున్
సత్పురుషులకును మంచివర్తనమె సర్వాభరణంబని దలతున్! 45

సత్పురుషుండగువాడు ధరిత్రిని సరి పాపాత్ముల విషయమునన్,
పుణ్యాత్ముల విషయంబున గూడను బొలుపుగ దయ జూపగ వలయున్,
జంపదగిన వారల విషయముననును నొంపవలయు కరుణాస్ఫూర్తిన్,
ఏదోయొక యపరాధము, దప్పను నిమ్ముగ జేయనివాడు మఱిన్
నీ లోకంబున నుండడుగా మఱి యీశ్వర విలాస రంగమునన్!
లోకంబుల హింసించుట పనిగా లోలత విహారమును గలిగీ
క్రూరులునై మఱి పాపకర్మముల కూరిమి గలిగిన వారలనూ!
గడగి దుష్కృతులు జేయువారికిని కరుణవీడి చెడుకార్యంబున్
జేయదగినదియు గాదు మారుతీ! స్థిరముగ నే దెలుపుచు నుంటిన్! 47

వాక్యకోవిదుడు నగు హనుమంతుడు వనరగ జానకి వచనంబుల్
విని యటుబిమ్మట రాముని భార్యయు, విమల యనిందిత పతివ్రతయున్
నగు నా సీతాదేవితోని మఱి యలరి బలికె యీవిధముగనూ! 48

ఓదేవీ! సద్గుణవతురాలవు! నొనరగ యా శ్రీరామునకున్
దగిన ధర్మపత్నివి! మఱి నీవును దగిన రీతిగా నీవు మఱిన్,
నేను దెచ్చినా యా శ్రీరాముని నిర్మల సందేశంబునకున్
ప్రతి సందేశము నిమ్ము తల్లి! నే బరగ బోదు రాముని కడకున్ 49

హనుమంతునిచే నటుల బలుకబడి యాజనకాత్మజ జానకియున్
హనుమంతునితో నీవిధి బలికెను మనసు సంతసము జిగురింపన్,
పవనసుతా! ఓమారుతి వినుమా! బరగ నాదు పతి శ్రీరామున్,
పాదపద్మముల జూడవలయునని బన్నుగ గోరుచు నుంటి నిదే! 50

మారుతాత్మజుడు, మహామతియునగు మానుగ హనుమంతుండు మఱిన్,
నావైదేహి వచనములను విని యలరుచు సంతసమంది మఱిన్
ఆ మైథిలియును సంతసమందగ యానందింపగ జేయుచునూ
నీ విధముగ యా వాయునందనుడు నిమ్ముగ బలికెను వినయమునన్! 51

పూర్ణచంద్రునీ వంటి ముఖంబును బొలుపుగ గలవాడును మఱియున్
లక్ష్మణుతోడను గూడిన వాడును లావుగ బలవంతుడునై నా
స్థిరమిత్రులతో గూడిన వాడును స్నేహశీలియగు శ్రీరామున్
శచీదేవి యాత్రిదశేశ్వరునీ సరసత గాంచిన విధముగనూ!
యా రఘువీరుని గాంచగలవు సుమ! నలరుచు నిపుడే వైదేహి! 52

మహాతేజమును గల హనుమంతుడు మానుగ సాక్షాత్ లక్ష్మివలెన్
విరాజిల్లు నా జనకనందినికి విమలవచనముల నటుబలికీ,
రాముడెచట మఱి నిలిచియుండెనో రయమున వచ్చెను నచ్చటికిన్
అంజలితోడను నా హనుమంతుడు నలరి నిలిచె రాముని యెదుటన్ 53

అటుబిమ్మట యా పవనసుతుండగు జటుల విక్రముడు మారుతియున్,
సీత దెలిపినా ప్రతివచనంబును శీఘ్రము దేవేంద్రునితోడన్!
సమానుడైనా శ్రీరామునకును సరసత క్రమమున దా తెలిపెన్! 54

(యుద్ధకాండయందు 113వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటపదునాల్గవ సర్గము

(రాముని యాజ్ఞజేత విభీషణుడు సీతను రాముని యెద్దకు రప్పించుట—సీతాదేవి రాముని గాంచుట)

మహాప్రాజ్ఞుడగు నా హనుమంతుడు మానుగ ప్రాంజలితో గూడీ
కమలపత్రములవంటి నేత్రములు కమనీయముగా గలవాడున్,
సకల దనుర్ధారులలో శ్రేష్ఠుడు సకల శాస్త్రముల సారంబున్,
తెలిసినవాడగు రామచంద్రునకు దీయగ మ్రొక్కుచు నిటుబలికెన్! 1

యన్నిమిత్త మీ కర్మలన్నియును నలరుచు జేయగ బడినవియో
యేజానకి యీ కర్మలన్నిటికి నెమ్మి ఫలోదయమో మఱియున్
అట్టి సీత శోకమునను గూడుక యిట్టె నిన్ను గనవలె ననుచున్,
నున్నదిరామా! యాదేవిని మఱి జెన్నుగ జూడగవలె నీవున్! 2

శోక సమావిష్టతతో గూడుక శుభచింతన యాసీతయునూ,
నీ విజయంబును విని కన్నీటను నిర్మలభాష్పము రాల్చుచునూ,
నిను జూడగ కాంక్షించుచున్నదీ నీ పదముల జూడగను మఱిన్! 3

పూర్వ నమ్మకముజేత మఱియునూ పొలుపగు విశ్వాసముతోడన్,
నాతో బలికిన దా వైదేహియు నయముగ గద్గద స్వరముననూ,
కార్యమందు విజయము సాధించిన ఘనుడగు లక్ష్మణుతోగూడన్,
నాదు వల్లభుని జూడవలయునని నయముగ గోరుచు నుంటి నిలన్! 4

పవనసుతుని యా మాటలు వినియును బరగ ధర్మభృతు లందుననూ!
శ్రేష్ఠుడైన యా రామచంద్రుడును జిందుచు భాష్పంబును మఱియున్
వ్యాకులతను మదిలో యోజించుచు వనరగ ధ్యానంబును బొందెన్! 5

దీర్ఘముగా నుష్ణముగా మదిలో దీరుగ నిట్టూర్పును విడిచీ
తలనువంచి ధరణీతలంబునూ దగ గాంచుచు బహు స్నేహమున్

తన సమీపమున నిలిచి యున్న యా ఘన మేఘమునకు సమానుడున్
అయిన విభీషణు జేర బిలిచి మఱి యార్ద్రభావమున నిటు లనియెన్! 6

శిరఃస్నానమును జేసినదియు మఱి శ్రీకరముగ మణిభూషలతో
అంగరాగములు గలిగినట్టిదియు సింగారంబుల గూడినదీ
అట్టి జానకిని నిచటికి వేగము నిట్టె దీసికొని వేరమ్మా!
ఆలస్యంబును జేయబోకు మఱి యందఱు నిట నున్నారనుచున్! 7

రాముని మాటలు విని విభీషణుడు రయమున త్వరమాణుం డగుచున్,
అంతఃపురమును బ్రవేశించి మఱి కాంతలైన వనితల వేగన్
సీత కడకు బంపియు వారలచే జెప్పించెను నీ విషయంబున్! 8

అటుదిమ్మట శ్రీమంతుడు మఱియును నల రాక్షస రాజయినట్టి
విభీషణుండును మహాభాగ్యవతి విమల పతివ్రత వైదేహిన్
సీతను గాంచియు వినయవంతుడై శిరసున బద్ధాంజలి జేర్చి
నమస్కరించుచు బలికెను నిటులను నయముగ వినయాక్షరములతో! 9

వైదేహీ! దివ్యాంగరాగముల వనరగ గలదానవు నగుచున్
దివ్యాభరణములను దాల్చియు మఱి దీరగు వాహనమును నెక్కి
క్షేమం బగుతను గాత! నిశ్చయము క్షేమము రాముడు లక్ష్మణుడున్
నీదు భర్తయగు రామచంద్రుడును నిను జూడగ గోరుచునుండెన్! 10

సీతాదేవియు విభీషణుని యా స్నేహశీలమగు బలుకువినీ
యాతనితో నీ విధముగ బలికెను నంతరంగమున యోజించీ!
రాక్షసేశ్వరా! విభీషణా విను! రయమున స్నానము జేయకనే
నాదు భర్త శ్రీరామచంద్రునీ నయముగ జూడగ కోర్కెసుమా! 11

విమల పతివ్రత సీతమాట విని విభిషణుండును నిటు బలికెన్
నీదుభర్తయగు నా రఘువీరుడు నియమముతో నే విధముగనూ,
యెటుల బలికెనో నావిధి జేయుట యిమ్ముగ మంచిది వైదేహీ! 12

పతిదేవతగా గలసాధ్వియునూ భవ్య శీలవతి సీతయునూ
ఆ విభీషణుని మాటలు వినియును నంతర్గతమగు వినయముతో
భర్తయందుగల భక్తితోడనూ బరగ యట్లుజేసెద యనియున్! 13

అటుబిమ్మట యా విభీషణుండును నటు శిరఃస్నానము జేసినదీ
సంస్కారముతో గూడినదియు మఱి సర్వాభరణములను గూడీ!
యమూల్యంబులగు వస్త్రంబులనూ యలరి ధరించిన యా సీతన్,
ప్రకాశించెడీ జరీవస్త్రముల బన్నుగ గప్పగ బడినదియున్
ననేకులగు రాక్షసవీరులచే నలరుచు రక్షింపగబడెడీ
సుందరమగు బల్లకి నెక్కించీ సుందరి సీతను గొనితెచ్చెన్! 14-15

సీత వచ్చినటు దెలిసికూడ మఱి మతి యేదో జింతించుచునూ
నున్న మహాత్ముడు రామునియొద్దకు దిన్నగ విభీషణుడు జేరీ
యంజలి తోడుత నమస్కరించుచు సంజలతోని సమంబైనా
సీతవచ్చినది యని సంతసమున జేరి పల్కె నతివేగముగా! 16

రక్షోగృహమున చాలకాలమును రహి నివసించిన జానకియున్
వచ్చినదని వినగా రామునకును జెచ్చెర హర్షము దైన్యమునూ
కోపంబును నీమూడు గుణములును గూరిమి యొకసారే గలిగెన్! 17

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును సహృష్టుడై మది యందుననూ
సమర్శకముగా నాలోచించుచు సరసిజాక్షి సీతను గాంచీ
ప్రక్కనున్న యావిభీషణునితో బరగ గాంచి యీవిధి బలికెన్! 18

ఎల్లపుడును నా విజయమందునను నిమ్మగ యాసక్తియు గలిగీ
నుండెడివాడవు! సౌమ్యుడ! వినుమా! మెండుగ రాక్షసరాజేంద్రా!
వైదేహియు నా సమీపంబునకు వనరగ నిలబడుగాత! మఱిన్!
కొన్ని పలుకులను బలుకవలయు నే కూరిమి జానకి వినుగాతన్! 19

రఘురాముని యా వచనములను విని రమ్య ధర్మముల నెఱిగిన యా
విభీషణుండును వేగముగా నట వివిధానేక జనంబులనూ!
దూరముగా దొలిగింపజేసెనూ తోరముగా భటులను బిలిచీ! 20

పొడవగు చొక్కాలును దలపాగలు బొందుగ బెత్తంబుల చేతన్
గరుకుగయున్నా హస్తంబులు గల కంచుకులును బహు వేగముగన్,
చుట్టును మూగిన కపివీరులనూ, శూరుల దూరము బొమ్మనుచున్
నా ప్రదేశ మంతయును నడిచిరీ యఱచుచు బెత్తము లాడించీ! 21

అన్ని వైపులను దొలగింపగబడు నలభల్లూకములును, గపులున్,
నల రాక్షసులును నా సమీపమున యా ప్రదేశముల నుండియునూ
త్వరితగతిని దూరంబునకును మఱి దగ యెగురుచు బోయిరి వేగన్! 22

కోపించిన యా రామచంద్రుడును గూరిమి చూపులతో వేగన్,
కాల్చివేయుచున్నట్టివాడు వలె గడగి మహాప్రాజ్ఞుండైనా
విభీషణునితో నాక్షేపముగా విమల వచనముల నిటు లనియెన్! 25

వా రా విధమున దొలగింపగబడి వనరగ బోవుచు నుండగనూ
వాయువుచే నట నెగురగొట్టబడు వలనొప్పగ సంద్రమువంటి
మహాధ్వనియు నట గలిగెను శీఘ్రము మానుగ దిక్కులు మార్మోగన్!23

అటువిమ్మట శ్రీరామచంద్రుడును నట దొలగింపగబడునట్టి,
కపి రాక్షసులును గొందఱు నేలను గాళ్ళక్రింద బడిపోవుటనూ
గాంచి వేగమే యా రఘువీరుడు కనికరమును మఱి బొందుచునూ
వారించెను వారల దొలగించుట వనరగ కంచుకులను వేగన్! 24

నాదు వాక్యమును ననాదరించి నయముగ బహు క్రూరత తోడన్
నీ జనంబులను నెందుల కీ విధి యిమ్ముగ బాధించెదవు మఱిన్!
నీ ప్రయత్నమును నాపుజేయుమా! యిమ్ముగ యీజన మంతయునూ
యీ ప్రజలందఱు నా వారు సుమా! యిమ్ముగ యాత్మీయులు నాకున్!26

గృహిణికి గృహ మావరణము గాదూ! గృహప్రాకారము కాదు మఱిన్
వస్త్రంబులు మఱి తెరలును కాదూ! వనర రాజ సత్కారంబుల్1
ఆవరణంబులు కాదు విభీషణ! నలరెడి రత్న విభూషలునూ,
మంచి వర్తనమె స్త్రీకి యావరణ మంచితముగ బరిశీలింపన్ ! 27

ఇష్టజనుల యెడబాటు లందునను నిమ్ముగ స్త్రీదర్శనము మఱిన్
దూషింపగ బడజాలరు జగతిని దోరముగా యుద్ధయులందున్,
రాజ్యక్షోభములందు మఱియునూ రమ్య స్వయంవరముల యందున్
క్రతువులందునను వివాహమందున మతిదూషింపగ బడరు ధరన్! 28

అట్టి యామె యాపదల నందినది యంతియగాకను ప్రస్తుతమున్
కష్టమునందున జిక్కియున్నదీ కావున యామెను నందఱునూ!
దర్శించిన మఱి తప్పులేదుగా దగ నాదు సమీపమునందున్,
యున్నసమయమున దోషములేదూ! చెన్నుగ దర్శింతురు గాతన్! 29

అకారణమున బల్లకివిడిచీ నలరి పాదములజేత మఱిన్,
నా సమీప్యమును వచ్చును గావుత! నయముగ వానరులందఱునూ,
నా వద్దను నుండగ వైదేహిని నర్మిలి గాంతురుగాత యిటన్! 30

రామచంద్రునీ వచనములను విని రయమున విభీషణుండు మఱిన్
నాలోచించియు సమర్శకముగా నల వైదేహిని వేగముగన్,
అల శ్రీరాముని సమీపంబునకు నల సీతను మఱిగొని వచ్చెన్! 31

అటుబిమ్మట లక్ష్మణ సుగ్రీవులు నల ప్లవంగముడు మారుతియున్
రామచంద్రునీ పలుకుల విని మఱి రయమున వ్యథ జెందిరి మదినీ! 32

భార్యయందు బహు ఔదాసీన్యము ప్రకటించెడి బహు దారుణమున్,
ముఖవికార [illegible] ల గమనించియు మఱి మోదమంతయును మాయంబై
భార్యయ [illegible] మచంద్రునకు బన్నుగ ప్రీతియు లేదేమో!
అనెడి [illegible] గలిగెను వారికి యాలోచనలో బడి రపుడున్! 33

జనకనందినియ [illegible] మిత లజ్జచే సరసత తన యవయవములనూ
యణగిపోవుచును నటునిటు జూడక యల విభీషణుని వెనువెంటన్,
ననుసరించుచును భర్త సమీపము నరుగుదెంచె తలవంచుకొనీ! 34

సౌమ్యతరమునగు నాననంబుగల సఖియ పతివ్రత జానకియున్
సుందరమైనా భర్తృముఖంబును సురుచిరమగు హర్షము తోడన్
ఆశ్చర్యముతో స్నేహము తోడను సలరి గాంచె ముఖమును నెత్తి! 36

విమల శశాంక నిభానన యగు నా విమల పతివ్రత జానకియున్,
ఆ సమయంబున చిరకాలమునకు నలరుచు గనిపించుచునున్నా,
ఉదిత చంద్రుని పూర్ణకాంతివలె యున్నతమగు తన పతిముఖమున్
గాంచుచు మనసున ఖేదము విడిచెను సంచితముగ హర్షము నందెన్! 36

(యుద్ధకాండము నందు 114వ సర్గము సమాప్తము)

* * * *

## శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటపదునైదవ సర్గము

[సీత చరిత్రను శంకించిన రాముడు 'నీవెక్కడికైనా వెళ్ళవచ్చును' అని యామెను యాదేశించుట]

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నటు తన పార్శ్వము నందుననూ,
నిలిచియున్న జానకిని గాంచుచును నిర్మలమగు కంఠముతోడన్,
హృదయాంతర్గతమగు భావములను మొదలు బెట్టి దెలుపుటకు మఱిన్!

మంగళప్రద! యాహవమునందునను రంగుగ శత్రువులను గెలిచి
నిన్ను గెలుచుకున్నాను! మానినీ! సన్నుతి నొందితి జగమందున్,
పురుష ప్రయత్నము వలన దేనినీ పొలుపుగ జేయగ వలెనొ మఱిన్,
అది నా చేతను జేయబడినదీ యఖిల లోకములు గీర్తింపన్! 2

కోపము యొక్కయు నంతంబును నే కూరిమి పొందితి నటుమీదన్,
అవమానంబును దుడిచివేయబడె యాపదయును దొలగెను మఱియున్!
అవమానము మఱి శత్రువు గూడను నలరి దొలగినవి యొకమారున్! 3

ఇప్పుడు నాదు పౌరుషమ్ము, బలంబును, నిమ్ముగ యుండెను చేత మున్
జూడగ బడినది నా శ్రమ యంతయు భారత సఫలంబై నదియున్,
నా ప్రతిజ్ఞ నెఱవేర్చుకొంటిని నయముగ స్వేచ్ఛను నందితివే! 4

నీ దగ్గఱ నే లేని సమయమున నిర్దయుడును మఱి చపలుడునూ
యగు రాక్షసుడును నపహరించెనూ దగ నిను గొనిపోయెను దనతో
దైవకృతమునగు నీ దోషంబును దగ మానవుడను నగు నేనున్
మానవ యత్నముచే సరిజేసితి మహోన్నతంబగు కార్యమునన్! 5

సంప్రాప్తించిన యవమానంబును సారవంతమగు దేజమునన్,
తుడిచివేయడో పరిహరింపడో కడిమి యెదుర్కొనడో బలిమిన్
అట్టి యల్ప జేతసుకు పౌరుషము నట్టి బలము యొసంగినను
దానివలన మఱి ప్రయోజనంబును దానివలన లాభం బేమి? 6

హనుమంతుడు మఱి మహాసంద్రమును నలరి దాటుటయును మఱియున్
లంకను మర్దించుట యను పనులును వంకలేని యా కర్మములున్,
కీర్తింపగ దగినవి ప్రస్తుతమును వర్తింపగబడె సఫలంబై! 7

యుద్ధమందు విక్రమత జూపుచును తద్ధితముగ హితమును నెపుడున్,
నాలోచించెడి వాడగునట్టి యల సుగ్రీవుడు సైన్యముతో
జేసినట్టి యా శ్రమ యంతయునూ స్థిరముగ సఫలంబైనదియున్! 8

విగుణంబులు గల సోదరు విడిచి వివేకవంతుండై మిగులన్,
తన సోదరుని విడిచి స్వయముగా దగ నను జేరిన వాడయినా,
విభీషణుని యా శ్రమయంతయునూ విజయము నందెను సఫలంబై!
ఈ రీతిని బలికెడి శ్రీరాముని యింపగు వచనములు వినియున్,
జనకనందినియు నాడు లేడి వలె సరసత వికసించిన కనులన్,
ఆనందామృత బాష్పంబులనూ నట విడిచెను నందఱు గాంచన్! 10

సమీపమందున హృదయ ప్రియమగు సరసిజాక్షి యా జానకిని
జూచుచున్న రాజయిన రామునకు జోద్యముగా హృదయము నందున్,

జనాపవాదము భయము జేత మఱి సరగున రెండగు విధములుగా!
విభజింపగబడి యుండె నప్పుడును వికృతమగు మనసున యపుడున్! 11

నల్లకలువ రేకులవంటివియును పుల్లములగు నేత్రములు మఱిన్
నల్లని వక్రములగు కేశములును నయమగు కటిప్రదేశంబున్
గలిగినట్టి యా సాధ్వితోడుతను గల యా కపివీరుల మధ్యన్
శ్రీరాఘుం డిటు బలికి నెమ్మదిగ స్థిరమగు వాక్యంబుల తోడన్! 12

గౌరవమును గోరుచు వైదేహీ! కఠిన రక్కసుని వధించితిన్,
అవమానంబును దొలగ జేయుటకు నలరి కోరికొను మానవుడున్,
నేమిజేయునో యది నే జేసితి విమల యశస్సును బొందితినీ! 13

తపస్సుజేతను భావితాత్ముడగు దగ ఋషి యగస్త్యుజేత మఱిన్
నిల్వలాదు లట యాక్రమించియును బలిమిని యుండుటజేత మఱిన్,
దుర్ధర్షంబగు దక్షిణదిక్కును దోరముగా గెలిచిన యటులన్
నిన్ను శత్రువులనుండి జయించితి నిఖిల దేవతలు గనుగొనగా! 14

ఎట్టి యుద్ధ పరిశ్రమము స్నేహితుల యిట్టి వీర్యమున దాటితినో
అట్టి యుద్ధ పరిశ్రమను త్వదర్థము నిట్టె చేయబడలేదు సుమా!
అదియే సత్యము! నాదు చరిత్రను అన్నివైపులను గ్రమ్ముకొనుచూ,
యపవాదము రాకుండ జేయుటకు నలరు ప్రసిద్ధము నైనట్టి,
నావంశమునకు గలుగు కళంకము నయముగ దుడుచుటకును మఱియున్
ఈప్రయత్నమును జేసితి నీకును నిమ్ముగ క్షేమంబగు గాతన్! 13-16

చరిత్ర విషయము నందున నీవును సందేహింపగ దానవునూ!
ప్రతిముఖమున నిలిచిన నీవును మఱి బరగ నేత్రరోగికి మఱియున్
దీపమువలె నాకును బహువిధముగ దీరుగ భరింప శక్యంబున్,
కానిదానవుగ యుంటివి యెదుటను కదిలిపొమ్ము! నిటనుండి మఱిన్! 17

జనకాత్మజ! విను నా కారణమున సకారణముగా నిపుడు నినున్,
అనుజ్ఞ నిచ్చుచు నున్నాడను మఱి నరుగుము నెచ్చటికైన మఱిన్,

ఈ పదిదిక్కుల లోపల నీవును నేదిక్కునకైనను మఱియున్,
బోవచ్చును, భద్రే! వైదేహీ! బొలుపుగ నీతో పనిలేదూ! 18

సత్కులమందున బుట్టినట్టి యా సద్గుణమతి తేజస్వియునూ
నగు పురుషుండును బరగృహమందున యలరి యుండినా స్త్రీని మఱిన్,
నాసక్తిని గూడిన చిత్తముతో నలరి స్వీకరించును మఱలన్? 19

మహత్తరంబగు గులమున బుట్టితి మహావీర్యుడను నను చు మఱిన్
రావణాంకమున నలిగినదానవు! రహి దుష్టములగు జూపులతో,
జూడబడినదానవు నగు నిను మఱి సుదతి! యెటుల గ్రహియింతును నే? 20

అందువలన యా కులము నిమిత్తము అంగన! నిన్ను జయించితినీ!
కీర్తిని మఱలను సంపాదించితి యార్తిని విడిచితి నీయందున్,
నీయందున యాసక్తిలేదు మఱి నిజముగ యిచ్చటినుండి మఱిన్,
నీ కిష్టమువచ్చిన చోటుకు మఱి నిశ్చితముగ బోవచ్చు మఱిన్! 21

ఓ మంగళ ప్రదురాలా! వినుమా! యొనరగ యా కారణముననూ!
ముందుగ నిర్ణయమును జేసికొని యందముగా నీ వచనములన్!
దెలుపుచుంటినీ యిష్టప్రకారము దీరుగ లక్ష్మణు రక్షణలో
భరతుని సంరక్షణలోగానీ బరగ యుండుమా నికమీదన్! 22

వైదేహీ! శత్రుఘ్నుని యందున వనరగ సుగ్రీవుని యందున్
రాక్షసుడైనా యల విభీషణుని రక్షణలో నుండుటగానీ
నిశ్చయించు కొనుమో! సుదతీ! యిక నీకెది యిష్టమొ యచ్చటికిన్! 23

దివ్యరూపమును గలిగినట్టి మఱి దీరుగ మనోహరంబైనా
రూపముగలిగిన నిన్ను జూచుచును జాపలుడగు నా రాక్షసుడున్!
తన గృహమందున యుండుట గాంచియు తరుణీ! యట్టి రావణుడుమఱిన్
నూరకుండజాలడు గద! సుదతీ! యూహింపుము నీవే మఱియున్! 24

అటువిమ్మట ప్రియమైన వచనముల నటు వినుటకు దగినట్టిదియున్,
ఆ మైథిలియును ప్రియుని నుండి మఱి యప్రియ వచనములను వినియున్
ఏనుగుతుండము జేత గొట్టబడు నిమ్మగ తామర తూడు వలెన్
జాలసేపు మిక్కిలి వణుకుచునూ వలవల కన్నీటిని విడిచెన్! 25

[యుద్ధకాండమునందు 115వ సర్గము సమాప్తము]

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటపదునాఱవ సర్గము

(సీత యధిక్షేప పూర్వకముగా రామునకు సమాధానముజెప్పి, తన పాతివ్రత్యమును పరీక్షించుటకు అగ్నిలో ప్రవేశించుట)

కోపముతో నా రామచంద్రుడును గూరిమి పరుషముతో గూడీ
భయము గలుగునటు బలుకబడిన యా బాధనుగూడిన వచనములన్
విని వైదేహియు బహువిధములుగా బాధ నొందె హృదయము నందున్! 1

ఆ మైథిలియును నామహాజనము నందున యశ్రుతత పూర్వముగా
భయంకరంబగు భర్తృవచనముల బన్నగ వినియును శీఘ్రముగా
సిగ్గుతోని మఱి క్రుంగిపోయె మఱి శీఘ్రము కన్నీటుల నొలికెన్! 2

ఆ జనకాత్మజ తన సంబంధపు నవయవముల యందున వేగన్
ప్రవేశించుచున్నది వలె తన పతి బన్నగ వాక్శరములజేతన్
ములుకులతో గూడినది వోలె మఱి ముదిత సీత కన్నీ రొలికెన్! 3

అటువిమ్మట కన్నీటిచేత మఱి నటదడిసిన దన నెమ్మోమున్
పైటచెంగుతో దుడుచుకొనుచునూ భర్తయైన రామునితోడన్,
దగ్ధదవాక్కున మెల్లమెల్లగా కాంత భర్తతో నిటులనియెన్! 4

ఓ రఘువీరా! నన్ను గూర్చి మఱి యొనరగ యొక సామాన్యుండున్,
సామాన్యస్త్రీతో బలుకునటు సరసత బలుకుచు నుంటివిగా!
అసదృశమగు మఱి యిట్టి వాక్యముల నలరు శ్రోత్ర దారుణమైనా
పరుషవాక్యముల బలుకుచుంటివి బరగ కారణము నది యేమీ! 5

మహాబాహు! నీవనుకొనునట్టుల మానుగ నేనటు గాదు సుమా!
నా విషయము నందునను నమ్మకము నయముగ పొందుము హృదయమునన్
సచ్చరిత్రపై యొట్టుబెట్టి మఱి నరసత దెలుపుచు నుంటి నిదే! 6

ప్రాకృత స్త్రీల ప్రవృత్తినిబట్టి బన్నుగ స్త్రీజాతిని సంతన్
శంకించుచు నున్నావు ప్రియతమా! శంకింపకు నను వారి వలెన్!
నా స్వభావమెట్టిదో యెలాంటిదో నయముగ దెలియును నీకు మఱిన్,
నీ యనుమానము నీ శంకలనూ నిమ్మగ వీడుము రఘువీరా!

నా వశమందున నేను లేని స్థితి నయముగ రావణు రాక్షసునీ
గాత్ర సంస్పర్శనంబు గలిగినది గడు వేగముగా బోవు మఱిన్,
ఆ విషయంబును బరిశీలింపగ యలరు దైవ యపరాధంబే
కానిపించు నే మనఃపూర్వకము గడగిజేసినది కాదుసుమా! 8

ఏది మదాధీనంబో ఓ ప్రభు! నిమ్మగ నాహృదయంబు మఱిన్
ఆ నా హృదయము నీయందుననే యలరుచు నిలుచును సతతంబున్,
వరాధీనమగు గాత్రములందున బన్నుగ యసమర్థత గూడి,
యున్నదాన మఱి యేమి జేయుదును? బన్నుగ దెలుపుము రఘువీరా! 9

కూడి పెరిగితిమి! వృద్ధి నొందితిమి కూరిమి సంబంధము జేతన్,
నీసంగతి మఱి నాకును దెలియును నా సంగతి దెలియును నీకున్
అటుల కలిసి మెలిసుండియు గూడను బటుతరముగ నను దెలియనిచో
శాశ్వతముగ నశియించిన దానను సరసత యనుకొందును నాత్మన్! 10

మహావీరుడగు హనుమంతుని మఱి మానుగ యవలోకింపగనూ!
నీచేతను మఱి బంపబడెను గద! నిజముగ నను వెదుకుట కొఱకై!
లంకాపురిలో నున్నప్పుడు నను శంకలేక దెలిపిన యపుడే!
ఎందువలన విడువగ బడలేదూ? ఎందున ద్యజియింపగ లేదూ? 11

ఓ వీరుడ! యా హనుమంతుండును నొనరగ ప్రత్యక్షంబుగనూ
చూచిచెప్పినా పిమ్మటగూడను శూరుడ! నన్ను త్యజించినచో
ప్రాణంబులు విడిచెడిదానను మఱి బరగ ధరణి నే లేకుండన్! 12

జీవితమును సంశయము నందునను స్థిరముగ యుంచియు వ్యర్థముగా
యింక నీవు శ్రమపడవలసినదీ సుంత యుండెడిది కాదు గదా!
నీమిత్రులకును నిష్ఫలంబునగు నిగిడి వ్యథయు బరిక్లేశంబున్
గలిగి యుండెడిది కాదుగదా మఱి కడు వ్యథ యుండెడిదియు గాదూ! 13

నృప శార్దూలా! కోపమునే మఱి నేమముగా వర్తించుచునూ
లఘు స్వభావము గల మానవువలె లాలితముగ యోజించుచునూ
స్త్రీయను దానికి ప్రాధాన్యంబును దీరుగ యిచ్చితి విది తగునా? 14

సచ్చరిత్రయును నెఱిగినవాడా! సరసత లోకప్రసిద్ధిని నే
జనకుని నుండీ జన్మించితినీ కానీ వాస్తవముగ నేనున్
భూమినుండియును బుట్టుట జరిగెను బులకించుచు యజ్ఞమునుండీ,
అట్టి నాదు బుట్టుటకును మఱియును నిట్టి నాదు వర్తనమునకున్!
నేమాత్రము గౌరవము నివ్వకను నిమ్ముగ యోజింప గలేదూ! 15

బాల్యమునందున గ్రహింపబడినా బన్నుగ నాదు సుహస్తంబున్
ప్రమాణంబుగా జేయగలేదూ బరగ భక్తియును, శీలంబున్,
అంతయు గూడను వెనుకనెట్టితివి సుంతయు యోజింపగలేదూ! 16

ఈవిధముగ బలుకుచు నేడ్చుచునూ యిమ్ముగ కన్నీళుల జేతన్,
గద్గదముగ మాటాడెడి సీతయు కడుదీనుండై ధ్యానమునన్,
నదీనుండగు నా లక్ష్మణుగూర్చియు నలరి బలికె నీ విధముననూ! 17

సౌమిత్రీ! నాకొఱకు వేగముగ సకలాపదలకు నౌషధమున్,
చితిని జేర్చుమా! మతిని దలచి మఱి స్థిరముగ యందు ప్రవేశింతున్
అసత్యమగు నపవాదులజేతను నలమటించు చుండిన దానన్
జీవించుటకును నిచ్ఛగింపనూ స్థిరముగ యగ్ని ప్రకాశింతున్! 18

గుణములజేతను నప్రీతుండగు గూరిమి శ్రీరఘురామునిచే
జనసంఘములో విడిచినాడు నను జన సమక్షమున విడనాడీ!
యేగతినొందుట యుక్తమో మఱియు నాగతి నొందెద సౌమిత్రీ!
హవ్యవాహనములో జొచ్చెద నే నందఱు గనుగొనగా నిచటన్! 19

జనకరాజ నందన యటు బలుకగ వినయ వ్రతుండగు లక్ష్మణుడున్
కోపంబుపకును వశుడై యాతడు గూరిమి రాముని కనుగొనియెన్! 20

వీర్యవంతుడగు నా సౌమిత్రియు విమల వ్రతుండగు రాఘవునీ
అకారంబున సూచితమగు నా యభిలాషను మది తెలిసికొనీ,
శ్రీరాముని యభిమతము ప్రకారము జితిని వేగముగ నిర్మించెన్! 21

ఆ సమయంబున కాలాంతక యమ నలరు సముండగు రామునిలో
ఏ స్నేహితుడును గూడ మఱియుసూ నెట్టి బంధుజనుడును గూడన్
మాటలాడుటకు ప్రతిమాలుటకును మానుగ జూచుటకును మఱియున్
సమర్థుండు మఱి కాలేదు గదా! శాంతివాక్యములు బలుకుటకున్! 22

అటువిమ్మట యా వైదేహియునూ యధోముఖస్థితి గలిగిన యా
శ్రీరఘురాముని ప్రదక్షిణముగా స్థిర చిత్తంబునజేసి మఱిన్
దీప్యమానమగు హుతాశనంబును దీరుగ వచ్చెను దగ్గఱకున్! 23

అంతట మైథిలి యాదేవతలకు జెంతనున్న విప్రులకు మఱిన్
నమస్కరించియు నగ్ని సమీపము నలరి జేరి బద్ధాంజలియై
యీవిధమున బలికెను జానకియును నింపుగ మధుర సువచనములన్! 24

నా హృదయము నెన్నండు రామునికి నయముగ దూరము గాకుండన్
రామునియందే స్థిరముగ నుండీ రమియించుచు నుండిన వేగన్!

లోకసాక్షియగు యగ్ని నన్నిపుడు లోలత రక్షించును గాతన్!
అన్నివైపులను నాదరించి నను నలసట దీర్చునుగాత! మఱిన్! 25

శుద్ధచరిత్రను గలదానిని నను శూరుడు రాముడు మదియందున్
భావించుచు నున్నట్టి రీతి నే బరగ దుష్టవర్తను రాలిన్,
కానిచో మఱియు యగ్ని నన్నిపుడు గాచియు రక్షించును గాతన్! 26

మనస్సు జేతను వాక్కు జేతనూ మానుగ కర్మలచేగానీ
సకల ధర్మముల నెఱిగిన రాముని సరసత యతిక్రమించనిచో,
లోకసాక్షియగు నగ్ని నన్నిపుడు లోలత రక్షించును గాతన్! 27

భగవంతుండగు సూర్యుడు, వాయువు బరగ దిక్కులును నింద్రుండున్
పగలు, సంధ్యలును, రాత్రి మఱియునూ బరగ భూమి దేవతలు మఱిన్,
నేను సచ్చరిత గలదానిని యని నిజముగ భావించిన వేగన్
లోకసాక్షియగు నగ్ని నన్నిపుడు లోలత రక్షించును గాతన్! 28

వైదేహియు మఱి నిటుల బలుకుచును వనరగ హుతాశనునకు మఱిన్,
ప్రదక్షిణంబును నాచరించి యును బన్నుగ యంజలి ఘటించుచున్,
ఏమాత్రంబును శంకలేకనూ నిమ్ముగ మనస్సునను గూడీ,
దీప్తమానమగు నగ్నియందునను దీరుగ ప్రవేశ మొనరించెన్!

బాలవృద్ధులను గూడినట్టి యా బహుజన సంఘముగూడ మఱిన్
హుతాశనంబున ప్రవేశించెడీ సీతాదేవిని యంచఱునూ!
దర్శించుచు కన్నీటి నాలికిరీ దగ మనసున వ్యథజెందుచునూ! 30

శుద్ధమైన బంగారమునంటీ సురుచిర కాంతిని గలిగి మఱిన్
తప్తకాంచనపు నలంకారములు దగ గలిగిన యా సాధ్వి నటుల్,
సకల జనంబులు గాంచుచునుండగ సమక్షమున శ్రీరాఘవునీ,
దీప్తమానమగు నగ్నియందునను దీరుగ ప్రవేశ మొనరించెన్! 31

బంగరు వేదిక సమానురాలును బరగ విశాలాక్షియునైనా
అట్టి జనక సుత యగ్ని యందునను నిట్టె ప్రవేశించుచు నుండన్!
సమస్త భూతంబులు గాంచినవీ చారుశీల సీతను నప్పుడున్! 32

అగ్నిప్రవేశము నొందుచున్న యా యతివ పతివ్రత సుచరితన్!
మహాభాగ్యవతి యగు నా జానకి నూనుగ ముల్లోకంబులకున్!
పవిత్రమైనా యాజ్యాహుతి వలె బరగ కనబడెను దివిజులకున్! 33

అధ్వరమందున మంత్రంబులచే నలరి సంస్కరింపగబడినా
యాజ్యధారవలె యగ్నిని బడెడీ యా సీతాదేవిని గాంచీ
అచట నున్న స్త్రీలందఱు వేగము నఱచిరి బిగ్గఱగా నపుడున్! 34

ముల్లోకంబులు దేవదానవులు ఘోరముగా గంధర్వులునూ
శపింపబడి స్వర్లోకమునుండీ సరగున నరకమునందుననూ
బడుచలడిన దేవతవలె గాంచిరి బన్నుగ శ్రీరాముని సతినీ! 35

ఆ జానకియు హుతాశనమందున నలరి ప్రవేశించుచు నుండన్!
రాక్షసులును మఱి వానరవీరులు రయమున హా! హా! యనుచు మఱిన్!
నాశ్చర్యముగా నతిబిగ్గఱగా నఱచిరి రోదన ధ్వనుల నటన్! 36

(యుద్ధకాండయందు 116వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట పదునేడవ సర్గము

(రాముని వద్దకు దేవతలు వచ్చుట—బ్రహ్మదేవుడు నీవు మహా విష్ణువని రామునకు జెప్పి రాముని స్తుతించుట)

అటుపిమ్మట ధర్మాత్ముడు రాముడు హాహా కారములను జేయూ
జనుల వాక్కులను వినిన వాడునై మనసునందు బహుదుఃఖముతో
బాష్పపూరితములగు లోచనముల ఒక్కగ ముహూర్త కాలమునన్
నాలోచించియు నిలబడి పోయెను నగ్ని హోత్రమును గాంచుచునూ! 1

అటుపిమ్మట యక్షుల రాజైనా నల వైశ్రవణుడు మఱి యింకన్
పితృదేవతలతో యముండునూ పేరిమి మహేంద్రుడును గూడన్!
జలేశ్వరుండగు వరుణుడు మఱియును షడర్ధ నయనుడు నీశ్వరుడున్
సకల లోకముల కర్తయునైనా సారసగర్భుడు బ్రహ్మయునూ,
వీరందఱునూ సమాగమ్యులై విమల సూర్య సన్నిభములునూ,
విమానములపై నధిరోహించీ వేగముగా లంకాపురికిన్!
చనుదెంచియు శ్రీరాముని కడకును సరసత గనుకొని రాతనిన్! 2-3-4

అటుపిమ్మట యాత్రిదశ శ్రేష్ఠులు హస్తాభరణములను గూడీ,
విశాలములైనా భుజముల నెత్తీ విమల ప్రాంజలిని నిలిచిన యా
శ్రీరామునితో నిట్లని పలికిరి స్థిరముగ మధురాక్షరములతో! 5

సకల లోకములకును కర్తవు మఱి సకలజ్ఞాన వంతులయందున్
జ్ఞానవంతుడవు, సమర్థుండవును సహజ ధర్మరతుడవు నీవున్
అగ్నియందు బడుచున్న జానకిని యలరి యుపేక్షింపగ దగునా?
దేవగణమునకు శ్రేష్ఠుండవు మఱి దీరుగ నిను గూర్చియు నీవున్
తెలిసికొనుట లేదెందుకు నీవిక దీరుగ సామాన్యుని వోలెన్! 6

పూర్వకల్పమున వసువుల లోపల బొలుపుగ ఋతధాముం డనెడీ
వసువును మఱి యీ మూడులోకములు నొనరగ సృజియించిన యట్టి
ఆదికర్తవును, స్వయంప్రభువునూ, యల ప్రజాపతివి! మరి నీవున్! 7

రుద్రులలో నెనిమిది రుద్రుండవు! రూఢిగ సాధ్యుల యందునసూ!
యైదవవాడవు! నశ్వన్యాదులు నలరు కర్ణములు మఱి నీకున్!
ప్రభాకరుడు మఱి శీతలచంద్రుడు ఇన్నుగ నీ శుభనేత్రంబుల్! 8

పరంతపా! నీవును లోకములకు బరగ యాది యందునను మఱిన్,
నంతమునందును నుండువాడవును నుంత దెలిసికొనుటయును లేదూ!
ప్రాకృతుడైనా మానవునకు వలె బరగ సీత యగ్నుల యందున్,
బడిపోవుట మఱి గాంచుచుండియును బరగ యుపేక్షించుట తగునా? 9

లోకపాలకులచేత నీవిధిని లోలత బలుకగ బడినట్టి
లోకంబులకుగు ప్రభువును మఱియును లోలత రఘువంశము నందున్,
సంజాతుండును ధర్మంబును మఱి సంరక్షించెడి వారలలో
శ్రేష్ఠుండగు శ్రీరామచంద్రుడును శ్రీకరముగ యీవిధి బలికెన్! 10

నన్ను నేను దశరథుని సుతునిగా నయముగ రాఘవుడను పేరన్
బరగినట్టి మానవుడను ననియే బన్నుగ భావించుచు నుంటిన్,
అందువలన నే నెవరి వాడనో చందముగా నే నెవ్వరినో;
ఎందువలన నే నిట్లున్నానో చందముగా భగవంతుడవూ!
విశదముగా వివరింపుము నీవే వినయముగా గోరుచునుంటిన్! 11

ఇటుల బలుక శ్రీరామచంద్రుడును చటుల బ్రహ్మవేత్తల యందున్,
శ్రేష్ఠుడైన యా బ్రహ్మదేవుడును శ్రీకరముగ నిటులను బలికెన్!
సత్యపరాక్రమ రామా వినుమా! సత్యమైన నావచనములన్! 12

స్వప్రకాశ రూపుండవు నీవును సతతము లక్ష్మివి గూడికొని,
యుండెడివాడవు, చక్రాయుధమును మెండుగ ధరించువాడవుమా!
సమర్థుండవును! నారాయణుడవు! సరసత నీకొక కొమ్ముగలా!

వరాహమూర్తివి! భూతభవ్యముల వనరంగ దుష్టుల సమయింపన్!
జేయునట్టి బహు పరాక్రముండవు శ్రితజన రక్షకుడవు నీవున్! 13

అక్షరమైనది! యాదియందునను నంతమునందున గూడ మఱిన్,
సత్యమైన బ్రహ్మవు నీవే సుమ! సకలజనుల యత్యుత్తమమున్!
ధర్మము నీవే! యజ్ఞము నీవే! వగ నీసైన్యము నంతటనూ
వ్యాపింపగ బడియున్నది రామా! వనరగ చతుర్భుజుండవునూ! 14

శార్ఙ్గంబును ధరియించెడి వాడవు! సకలేంద్రియముల కధిపతివీ!
హృదయ గుహను నివసించెడివాడవు! సదయ పురుషులను శ్రేష్ఠుడవున్!
నజితుండవు! నందక మను ఖడ్గము నలరి ధరించెడి వాడవునూ!
అంతట వ్యాపించిన వాడవునూ కాంత భూసతికి సుఖంబునూ!
యిచ్చెడివాడవు మహాబలుండవు! జెచ్చెర రణ ధీరుండవునూ! 15

నీవే సేనానాయకుండవును నీవే గ్రామంబునకు మఱిన్
నధిపతివియు మఱి బుద్ధివి నీవే! నలరు నోర్పు, దమమును నీవే!
నీవే సృష్టివి! మఱి ప్రళయంబును నీవే యుపేంద్రుడవు మఱియున్,
మధువను రాక్షసు జంపిన వాడవు! మధుసూదనుడవు నీవుసుమా! 16

సురపతివంటి మహాకార్యములు సురుచిరముగ జేయుదు వీవున్
మహేంద్రుండవును, పద్మనాభుడవు! మానుగ రణాన్తకృతుడవునూ,
శరణు జొచ్చినా వారలనందఱ శరణు మిచ్చువాడవు ననుచున్!
దేవఋషులు మఱి దెలుపుచునుందురు తేజోవంతుడవని యనుచున్! 17

సహస్రశృంగములను కొమ్ములునూ శతవిధి వాక్యపు శిరస్సులన్
గలుగునట్టి కర్మాలోచనములు గలిగినట్టి వేదంబులకున్,
నాత్మవు నీవును ముల్లోకములకు నాది వస్తువును నీవుసుమా!
స్వతంత్రుండవును సిద్ధసాధ్యులకు సరసత పూర్వము నందుసనే
యాశ్రయ మైనటువంటి వాడవును నాది పురుషుడవు నీవు సుమా! 18-19

నీవే యజ్ఞము వషట్కారమును నీవే ఓంకారంబు సుమా!
పరాత్పరుండవు నీదుప్రభవమును జన్మగ నాశంబును [illegible]
నెవ్వరు దెలియరు,నీవెవ రనునది నెవ్వరు నెఱుగరు [illegible]! 20

నీవు సకల ప్రాణులయందుననూ, నిఖిల ధేనువుల యందు[illegible],
సద్గుణ బ్రాహ్మణులందు మఱియునూ సమస్త దిక్కు[illegible]!
గగనమందు పర్వతములయందును కడులు నదీనదముల యందు[illegible],
జూడబడుచు నున్నావు లోకమున జూచుచు నుందువ సత్పురుష[illegible]! 21

వేలకొలది చరణంబులు మఱియును వేలకొలది మఱి [illegible]
గలిగినవాడవు! లక్ష్మీదేవిని కరమున హృదయమున[illegible]!
సకల భూతముల పర్వతములలో సరసత గూడిన [illegible].
ధరియించుచు నున్నాడవు నీవే! దగ యత్నద్వార విషయ[illegible]! 22

రామా! భూమికి యడుగు భాగమున రమ్యముగా నీటను [illegible]
ముల్లోకములను, దేవదానవుల మోదముగా గంధర్వుల[illegible]
ధరియించుచు మఱి యాదిశేషుని దగ రూపంబున గన[illegible],
భరించుచుంటివి మహాభరంబును బరగ భూత సంరక్షణకై! 23

రామా! నే నీ హృదయము! సత్యము రమ్య సరస్వతి నా[illegible],
నీ సమస్త యవయవముల యందున నిక్కముగా యం[illegible].
రోమంబులుగా నిర్మింపగబడె రూఢిగ నాచేతను మఱియు[illegible] 24

నే కనురెప్పలు మూయుట, దెఱచుట నిజముగ రాత్రియు [illegible]
దెలుపుగ బడినవి విధి నిషేధములు డీరుగ వేద సుశాస్త్ర[illegible]
నీవు సమస్తము! నీవు లేనిదే నిజముగ లేదీ లోకమున[illegible]! 25

సమస్తమును నీ జగమంతయునూ స[illegible] నీదు శరీర[illegible]
నీదు స్థిరత్వము నీ ధాత్రిసుమా! నీదు [illegible]!
నీ ప్రసాదమే చల్లని చంద్రుడు నిజముగ నీవే [illegible]! 26
పూర్వమందునను నీచేతను మఱి [illegible]
మూడు పాద న్యాసంబుల చేతను [illegible].

నాక్రమింపబడి భయంకరుండగు నాబలి బంధన మొనరించీ
దేవేంద్రుని మఱి త్రిలోక ప్రభువుగ దీరుగ జేసితి వా నాడున్! 27

సీత లక్ష్మి కాంతి స్వభావమును స్థిరముగ గలిగిన పురుషుడవున్,
కృష్ణవర్ణుడగు ప్రజాపతియు మఱి విష్ణుదేవుడవు నీవు సుమా!
ఈ లోకంబున రావణవధకై యిమ్ముగ మనుష్య రూపమునూ
ధరియించితి వా దశరథ సుతుగా దగ రాక్షసులను దునిమితివీ! 28

ధర్మంబును బోషించు వారిలో దగ శ్రేష్ఠుడవగు శ్రీరామా!
రావణాసురుని రణమున దునిమీ రయమున మాదు సుకార్యంబున్,
పూర్తిజేసితివి యిక సంతసమున దిరిగి యధిష్ఠింపుము దివినీ! 29

ప్రభూ నీదు బలవీర్యంబులునూ బన్నుగ యమోఘములు మఱియున్,
నీ విక్రమమును యమోఘమును మఱి నీదర్శనము నమోఘంబున్
నిన్ను స్తుతించుట నిను సేవించుట నిజముగ యమోఘములును సుమా! 30

ఈ భూలోకము నందున సుజనులు నిమ్ముగ నీదు సుభక్తిపరుల్
సార్థకమైనా జీవితంబునూ సరసత గలవారగుచు మఱిన్,
ప్రభువు, నిత్యుడును, ప్రాచీనుండును బన్నుగ పురుషోత్తముడయినా,
నిన్ను గూర్చి హృది నెమ్మనంబునను నిరతము స్మరించువారు మఱిన్,
నిహపరముల యందును గూడను మఱి నిమ్మల గోర్కెల నందుదురూ!

ఏ మానవు లీ లోకమునందున నింపగు దివ్య పురాతనమున్,
నితిహాసంబును వేదసమ్మతము నీతియుక్తమగు స్తోత్రంబున్,
పఠించు మానవులకు నెన్నడునూ పరాభవము జరుగదు జగతిన్! 33

(యుద్ధకాండమున 117వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి (యుద్ధకాండము)

## రెండవ భాగము

### నూటపదునెనిమిదవ సర్గము

[అగ్నిదేవుడు ప్రత్యక్షమై సీత పవిత్రురాలని జెప్పి రామునకు సమర్పించుట — రాముడు సంతోష పూర్వకముగా నామెను స్వీకరించుట]

ఆ విభావసుడు నా పితామహుని యలరు శుశోదయమగు పల్కుల్
విని సంతసమును నంది జానకిని యింపుగ యంకమునను జేర్చి
పైకి లేచెనట హుతాశనుండును బన్నుగ నందఱు గనుగొనన్! 1

అటుబిమ్మట యా హవ్యవాహనుడు నలరి శరీరము ధరియించి,
పైకి చితిని దూరముగా ద్రోయుచు బన్నుగ జనక సునందినినీ,
సీతను గ్రహించి పైకి లేచెనా శీఘ్రము నందఱు దిలకింపన్! 2

ఆ సమయంబున యగ్నిదేవుడును నలరు బాల సూర్యుని తోడన్
సమానురాలును దప్తకాంచనపు సరసాలంకారంబులతో
రక్తాంబరములు ధరించినదియును రమ్య మూర్ధజములును గలదీ
అక్లిష్ట మాల్యాంబరములు గలదియు నట్టి రూపమే గ్గలదియునూ,
అనిందితయును నగు సీతాదేవిని యంకమునందున యుంచుకొనీ,
అగ్నిదేవుడును నావైదేహిని యా రఘురామునకును నిచ్చెన్! 3-4

ఆ సమయంబున లోకసాక్షియగు నగ్నిదేవుడును రాఘవుతో
సానునయముగా నిటులను బలికెను సరస సుమధుర సువాక్యములన్
రామా! యిదిగో నీ వైదేహి! రమ్య సుపత్నిని గైకొనుమా!
ఈమెయందు నేమాత్రము దోషము నిమ్ముగ లేదుసుమా రామా! 6

మంచి నడవడిక గలదియు మఱియును నంచితముగ మంగళప్రదయున్
నీ సీతయు బహు పవిత్రురాలును నిమ్ముగ సాధ్వియు గుణవతియున్,
వాక్కుచేత మఱి మనస్సుచేతను వనర యతిచరింపగ లేదూ!

బుద్ధిజేత మఱి నేత్రముజేతను బొసగ యతిచరింపగలేమా!
సచ్చరిత్ర విషయంబున రామా! యుచ్చరితంబగు దీక్షయునూ!
పట్టుచలియు గల నిన్ను రాఘవా! బరగ యతిచరింపగలేదూ! 6

నీవు సమీపములేని సమయమున నిరవధికంబగు దీనతతోన్
విరహిత మఱియును దీనురాలునగు విమల పతివ్రత యీ సీతన్!
పరాక్రమముచే గర్వించిన యా ప్రబల రాక్షసుడు రావణుడున్
జనశూన్యంబగు వనమునుండి మఱి సరగున యపహరణము జేసెన్! 7

నీయందే చిత్తంబును గలిగి నీవే యుత్తమ గతి యనుచున్,
దలచుచున్న యీ సాధ్వీమణిని దగ యశోక వనమందుననూ
భయంకరులునగు రాక్షసస్త్రీలును బన్నుగ రక్షించుచు నుండన్,
బంధించియు మఱి దాచివేసెనూ బన్నుగ యారాక్షసుడు మఱిన్! 8

అనేకవిధముల లోభ పెట్టినను ననేక విధముల భయంబునూ
జూపిన గూడను నీ వైదేహియు జూపుచు చిత్తము నీపైని!
ఆ రాక్షసునీ లెక్కసేయకను నటు నిరాకంచిన దతనిన్! 9

విశుద్ధమైనా భావముగలదియు విమల పతివ్రత గుణశీలన్,
పాపములేని యీ మైథిలినీ బరగ స్వీకరింపుము వేగన్!
నీ వే మాత్రము బలుకగూడదిక యిమ్ముగ యీ సాధ్విని గూర్చి
ఆజ్ఞాపించుచు నుంటిని రామా! యనుసరింపు నా పలుకులనూ! 10

మాటలాడు వారలలో శ్రేష్ఠుడు మానుగ ధర్మాత్ముండు మఱిన్,
ఆ శ్రీరాముడు సంతోషించిన నలరు మనస్సును గలవాడై!
భాష్ప వ్యాకులంబగు లోచనముల బన్నుగ ముహూర్త కాలమునన్
మౌనము దాల్చియు నాలోచించెను మానసమందున బహురీతిన్! 11

ధైర్యవంతుడును నుడు విక్రముడును ధర్మభృతులగు వారలలో,
శ్రేష్ఠుండగు శ్రీరామచంద్రుడును శీఘ్రము నామాటలు వినియున్
త్రిదశశ్రేష్ఠుండగు హుతాశనుని దీటుగ గాంచుచు నిటు బలికెన్! 12

ఈ వైదేహియు యవశ్యమును మఱి యిమ్ముగ లోకములందుననూ
శుద్ధిని బొందగ దగియున్నది మఱి శోచనీయమైనను గూడన్
మంగళప్రదురాలగు నీ సీతయు మానుగ రావణు వశమందున్,
చాలాకాలము వసియించెను గద! కాలవైపరీత్యంబుననూ! 13

జనకనందినిని యీవిధముగనే సరసత శోధింపక యున్నన్
దశరథాత్మజుడు రాముడు మూర్ఖుడు దగ కామముతో గూడికొని
యుండినవాడని, యెంత కష్టమని మెండుగ లోకము నిందించున్,
నన్ను గూర్చి చెడుగా లోకంబున జెన్నుగ గుసగుస లాడుదురు! 14

మచ్చిత్తంబున బరివర్తితయగు మానుగ యీ జనకాత్మజయునూ
అనన్యహృదయమునుగలదానినిగా నరిరి యెఱుగుదును [illegible]
నాయందుననూ భక్తి గలదనియును నయముగ నెఱుగుదు నే గదా! 15

తన తేజస్సున రక్షింపగబడు దగ కమలాక్షియు నీ సీతన్
మహాసంద్రమటు దీరంబును మఱి మానుగ దాటగ లేదా యటుల్
ఆ రావణుడును నీవైదేహిని నతిక్రమింపగ [illegible]! 16

సత్య సంశ్రయము గలిగిన నేనును సరసత మర్త్యలోకంబుననూ,
ప్రత్యయార్థమై హుతాశనముననను బ్రవేశించు నీ వైదేహిన్
నంపెడి భావము వహించితిని మఱి యురుతర భావము [illegible]! 17

సుదుష్టాత్ముడగు నా రావణుడును శూరత పొందగ [illegible]
వైదేహిని మఱి యగ్నిశిఖనువలె వనరగ మనమున గూడ [illegible].
ఎదిరించుటకును సామర్థ్యంబును బదునుగ నిలువగలేడు గదా! 18

మంగళప్రద! యీ జనకనందినియు మానుగ రావణ రాక్షసుని,
యంతఃపుర యైశ్వర్యముతోడను సుంత యవసరము [illegible]!
భాస్కరప్రభ యా సీతను విడిచి బన్నుగ మఱియొక [illegible]
బోవని విధమున యీ సాధ్వియునూ [illegible]
అన్యుల సంబంధమును బొందదూ నరయుడు [illegible]! 19

జనకాత్మజయునగు నీ మైథిలియును సరసత ముల్లోకములందున్,
విశుద్ధురాలును బవిత్రురాలును విమలమైన యభిమానంబున్,
గలవాడును గీర్తిని యేవిధముగ విడువజాలడో యా విధమున్,
వైదేహిని నే వదలగజాలను వసరగ శక్తుడ కాదు సుమా! 20

స్నేహము గలిగిన లోకపాలకులు శ్రీకరమగు హిత వచనములన్
యీ విధముగ మఱి బలుకు చుండరీ వినయముతో గ్రహియింతును నే
సకలదేవతల హితవచనంబుల సరసత నే భావింపవలెన్! 21

మహాబలీయుడు విజయమునందిన మహా యశుండును, విక్రముడున్,
సుఖార్హుండు రఘువంశమునందున సురుచిరముగ పుట్టిన వాడున్,
శ్రీరాముడు దా నిటుల బలుకుచును స్థిరముగ తా జేసిన పనికిన్
అందఱి జేతను ప్రశంసలందుచు చందముగా జానకి తోడన్
సుఖమును మఱి సంతోషము నందెను శూరుడు నా రఘువీరుండున్! 22

(యుద్ధకాండము యందు 118వ సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము
## రెండవ భాగము

### నూటపందొమ్మిదవ సర్గము

[మహాదేవుని యాజ్ఞచేత రామలక్ష్మణులు విమానమునెక్కి వచ్చిన దశరథునికి నమస్కరించుట—దశరథుడు పుత్రులకు, సీతకు జెప్పవలసిన మాటలు జెప్పి యింద్రలోకమునకు వెడలిపోవుట)

రామునిజేతను ననుభాషితమగు రమ్య శుభోదయ వాక్యములన్
విని మహేశ్వరుడు నటు బిమ్మటనూ విమల వాక్యముల నిటుబలికెన్! 1

పుష్కరాక్ష! ఓ మహాబాహువా! బొలుపగు వక్షము గలవాడా!
పరంతపా! ధర్మభృతులందును బన్నుగ యగ్రేసరుడవునూ!
దైవయోగమున యీ ఘనకార్యము దగ బరిపూర్తిని జేసితివీ! 2

రావణు వలనను గలిగిన భయమును రహి సమస్త లోకంబులకున్,
నివారించితివి నీవు రాఘవా! నిండిన ప్రవృద్ధ దారుణమున్,
అంధకారమును దైవవశంబున చందముగా నీజేత మఱిన్,
తొలగింపగబడె సర్వలోకములు దొరముగా సంతస మందెన్! 3

మహాబలుడు! దీరుడునైనట్టీ మానుగ భరతుని కౌసల్యన్
నోదార్చుము కైకేయి సుమిత్రను నొనరగ వీక్షింపుము వేగన్
అయోధ్యయందున రాజ్యమునందీ యలరు సుహృజ్జనములను మఱిన్,
సంతసమందగ జేయుమా యికను చారుశీల! ఓ రఘువీరా! 4

పుత్రుల బడసీ యిక్ష్వాకులయా పొలుపుగ వంశము నిలుపుచునూ
అశ్వమేధమను యాగముజేసీ యనంత యశమును బొంది మఱిన్
బ్రాహ్మణోత్తముల దీవనలందీ భవ్యదానముల జేసి మఱిన్
స్వర్గధామమును జేరుటకును మఱి సర్వ విధములను నర్హుడవ ! 5-6

రామా! మానుష లోకమునందున రహి నీ గురువును దండ్రియునూ
మహా యశస్సును గలిగిన వాడును మానుగ ప్రభు దశరథుడు మఱిన్
నాదు విమానమునందు గలడుసూ! మఱి గనుమా! హృది సంప్రీతిన్! 7

పుత్రుడవైనా నీ చేతనుమఱి పొలుపుగ తరింపబడి మఱియున్,
శ్రీమంతుండగు ప్రభుదశరథుడును స్థిరముగ మహేంద్ర లోకంబున్
పొందినాడు గద! నీవు, లక్ష్మణుడు బొందుగ సామీప్యము జేరీ
యందజేయుమా! నమస్కృతులు మఱి జిందగ జేయుము ప్రహర్షమున్!

లక్ష్మణ సహితుడైన రాముడును మహాదేవ వచనముల వినీ
విమాన శిఖరము నున్న తండ్రికిని వీరుడు సౌమిత్రిని గూడీ,
ప్రణామంబులను జేసెను రాముడు బన్నుగ శిరసాంజలి తోడన్! 9

ప్రభువగు రాముడు లక్ష్మణు తోడుత బరగ తనదు తేజస్సులతో
ప్రకాశించుచును దీప్యమానమగు పరాగంబు మఱి లేనివి యా
అంబరములు ధరియించిన తండ్రిని యలరి జూచి రా సోదరులున్! 10

అవుడు విమానము నందున యుండిన యా మహీపతియు ప్రభువు మఱిన్
వరాసనంబున గూర్చొనియున్నా వనరగ దశరథ మహరాజున్!
ప్రాణంబులకంటెను ప్రియమైనా పన్నుగ పుత్రుని గాంచి మఱిన్,
హర్షముతో గూడిన వాడగుచును నంకమునందున జేర్చికొనీ
హృదయాలింగనమును జేసికొని సదయ వాక్యముల నిటులనియెన్! 12

రామా! నా దగ్గఱ మఱి నీవును రమ్యముగా లేకుండినచో
స్వర్గంబును గానీ, సురశ్రేష్ఠులు సరసత జేయు సపర్యలునూ
సమ్మానంబులు నిష్టము కాదూ! సత్యము దెలుపుచు నున్నాడన్ 13

నేడు శత్రువుల నిహతులజేసీ నిండిన యానందము తోడన్
సంపూర్ణంబగు మానసంబుతో సరసత వనవాసంబు మఱిన్!
పూర్తిచేసికొనినట్టి నిన్ను గని బొలుపుగ యీనాడును నాకున్,
అమితమైన సంతసమును గలిగెను నానందంబును బొందితినీ! 14

మాటలందు నేర్పును గలవాడా! మంచి మనసు గలవాడవునూ,
ప్రవాసమునకును బంపుటకొఱకై బన్నుగ యా కైకేయి మఱిన్,
పలికిన పలుకులు నా హృదయములో బరగ నిలిచి యున్నవి రామా! 15

లక్ష్మణ సహితుడవైన నిన్ను గని లాలితముగ బహు కుశలముగా
నుండుట గనుగొని మీ యిరువురినీ దండిగ హృదినీ జేర్చికొనీ,
అటుబిమ్మట యీదినమున నేనును నలరెడి రవి నీహారంబున్,
విడిన విధముగా దుఃఖమునుండీ విడివడి దూరంబైతిని నే! 16

మహాత్ముండవును, సుపుత్రుండవును మానుగ నీచేతను నేనున్
తరింపబడితిని! పుత్రా! నిజముగ దగ యష్టావక్రుని జేతన్,
ధర్మాత్ముండగు కహోలు డనియెడి ధార్మిక విప్రోత్తముని మఱిన్,
తరింపజేసిన యటుల నన్ను మఱి తరింపజేసిన వాడవుగా! 17

ఓ సౌమ్యుడ! పురుషోత్తమ వినుమా! వనరగ వింటిని స్వర్గమునన్,
రామా రాక్షస సంహారమునకు రహి దేవతలును నా రీతిన్,
అభిషేకమునకు విఘ్నములను మఱి యలరిజేసి నటులను వింటిన్! 18

రఘురామా! వనవాసమునుండియు రహి మఱలిన వాడవు నగుచున్,
శత్రువులను మఱి సంహరించియును సతి జానకితో గూడ మఱిన్
నిలుజేరిన నిను గాంచి కౌసల్య యిమ్ముగ సంతోషించినదై!
జూడగలము! యా కౌసల్యాసతి సురుచిర భాగ్యవతియును సుమా! 19

అలరి పురమునకు జేరిన పిదపను నా యయోధ్య రాజ్యమునందున్
అభిషిక్తునిగా నిన్ను జూచి మఱి యానందించెడి వారి మఱిన్,
ధన్యాత్ములు గాదా! రఘురామా! దగ కృతార్థులును వారలునూ! 20

ఓ సౌమ్యుడ! శ్రీరామచంద్ర విను! వనరగ జానకితోని మఱిన్
ధీమంతుండగు లక్ష్మణుతోడను ధీరత వసియించితివి వనిన్,
పదునాలుగు సంవత్సరంబులును బరగ గడిపినాడవు వనిలో! 22

వనవాసంబును బూర్తిచేసితివి! వనరగ నీదు ప్రతిజ్ఞ మఱిన్,
బూర్తిచేసితివి! సంగ్రామంబున బొలుపుగ రావణ రాక్షసునీ
సంహరించితివి సురలకు గూడను! సంతసమును గలగించితివీ; 23

శత్రు సూదనా! ఘనకార్యంబును సరసత నీచే చేయణడెన్,
శ్లాఘింపగదగు మహా యశస్సును సరగున నందితి వింక మఱిన్,
సోదరులను గూడియు రాజ్యంబును శూరత బరిపాలించుచునూ!
దీర్ఘమైన యాయుర్దాయంబును దీరుగ బొందుము నీవింకన్! 24

నీయందున ననురక్తుడు మరియును నిర్మల హృదయుడు బలియుడున్
ధర్మాచరణము గలవాడును మరి దగ భరతునితో గలియుటయున్
జూడవలయునని కోరిక పుత్రా! శుభమగు నా కోర్కెయు దీరున్! 25

ఇటుల బలుకు నా దశరథ రాజును నిమ్మగ శ్రీరాఘవుడు మరిన్
ప్రాంజలితో నీ విధమున బలికెను బన్నుగ దశరథ ప్రభుతోడన్!
ధర్మంబులు మరి యెరిగిన వాడవు దగ కైకేయీ విషయమునన్
భరతుని విషయముననను దయారసము బన్నుగ జూపింపుము నీవున్! 23

పుత్రునితో గూడిన నిన్నింకను బొలుపుగ విడుచుచునుంటి నిదే!
అని నీవును కైకేయి మాతతో ననిన పలుకులను వేగముగా,
ఘోరమైన యా మహాశాపమును బుత్రవతియు నగు కైకేయిన్
స్పృశింపకుండునుగాత! యనియునూ సుస్థిరతను గోరుచు నుంటిన్! 26

అంజలిబట్టిన రామునితోడను "అటులే" యనుచును బలుకుచునూ!
ఆ దశరథ మహరాజంతటనూ యాలక్ష్మణు కౌగిలిజేర్చి,
మధురముగా నీ విధమున బలికెను మధురాక్షరములు దొలుకాడన్! 27

విదేహ రాజకుమారి యైన యా విమల పతివ్రత జానకితో
శ్రీరాముని బహుభక్తి చేతనూ స్థిరముగ శుశ్రూషలు నీవున్!
జేయుచుండుటను గాంచి నేను మఱి చిరసంతసమును బొందితినీ!
ధర్మఫలంబుచు బొందినావు మఱి ధర్మాత్ముడ వైతివి నీవున్! 28

ధర్మజ్ఞుడ! ఓ లక్ష్మణ! వినుమా! దగ నీవును ధర్మమును మఱిన్
నీ భూలోకంబుననను నధికమగు నిమ్ముగ యశస్సు నందెదవూ!
శ్రీరాముడును ప్రసన్నుండగుచో స్థిరమగు స్వర్గంబును మఱియున్
నుత్తమమగు మహిమానంబును మఱి సత్తువ నొందెద వీ జగతిన్! 29

సుమిత్రసందన! శూరుడ లక్ష్మణ!శుభమగు గాతను వీకెపుడున్
సీతారాముల శుశ్రూషలనూ జేయుచు నుండుము నెల్లపుడున్
సమస్త లోకహితంబును రాముడు సరసత యాసక్తుండు గదా!
ధర్మఫలంబును బుణ్యఫలంబును దగ సమకూడును నీకు సదా! 30

సుర వల్లభుతో గూడినట్టి యా సురుచిర ముల్లోకంబులునూ
సిద్ధులు సాధ్యులు పరమఋషులు మఱి శ్రీకరముగ పురుషోత్తముడున్
మహాత్ముడగు శ్రీరామచంద్రునీ మానుగ సన్నిధి జేరికొనీ,
పూజించుచు నున్నారు కనుగొనుము బొలుపుగ కీర్తించుచును మఱిన్ 31

వరంతపా! ఓ సౌమ్య లక్ష్మణా! బరగ వినుము నా పలుకులనూ
అవ్యక్తము నక్షరమునైనదియు నలరు దేవతల హృదయంబున్
రహస్యమగు నా పరబ్రహ్మయే రాముడుగా జన్మించెననీ
దైవజ్ఞులు మఱి దెలుపుచు నుండిరి భావంబున యోజించి మఱిన్! 32

విదేహరాజ సుపుత్రియైన యా విమల జానకిని తోడుతనూ
యీ శ్రీరాముని భక్తితోని మఱి యిమ్ముగ శుశ్రూషలు జేయూ,
నీచేతను ధర్మానుష్ఠానము నిమ్ముగ వర్తింపగ బడియెన్
అధికాధికమగు యశస్సు గూడను నందగలిగితివి నీధాత్రిన్! 33

ఆ దశరథరాజును లక్ష్మణుతో నంఱి పలికి యీ విధముగనూ
అంజలి ఘటించి నిలిచియున్న యా నలరు గోడలిని గాంచి మఱిన్
ఓపుత్రీ! యని బలుకరించుచును నొనరగ మెల్లని గొంతుకతో 34
మధురముగా బలికెను నీవిధమున మధురాక్షరములు ధ్వనియింపన్!

వైదేహీ! శ్రీరామచంద్రుడును వనరగ నిను వదిలిన రీతిన్
కోపింపకుమా! నీ హితంబునే కోరి మదిని శ్రీరాముడునూ!
విశుద్ధి కొఱకై యిట్లు జేసెనూ విమల దేవతల యెదుట నిటన్! 35

పుత్రీ! యీ ధాత్రీతలమందున బొలుపుగ యితరుల కెవ్వరికిన్,
సుదుష్కరం బగు ఘనకార్యంబును సురుచిరముగ మఱి జేసితివో!
ఇతరస్త్రీల కీర్తిని, యశస్సునూ నిమ్ముగ దిరస్కరించుగదా! 36

దర్తయొక్క శుశ్రూషను గూర్చియు బరగ తెలుపగా పనిలేదూ!
అది నిజమే! ఐనను గూడను మఱి యలరి జెప్పగా వలయుమఱిన్
భర్తయె నీకును బరమ దైవతము! భర్తయె సర్వస్వము నీకున్! 37

రఘువంశంబున సంజాతుండగు రాజగు దశరథ మహరాజున్,
పుత్రులకును మఱి జనకనందినికి బూనిక యుపదేశించి మఱిన్,
విమానంబుపై యింద్రలోకమును విలక్షణముగా గమియించెన్! 38

మహాప్రభావము గలవాడును మఱి మహాశోభ గూడినవాడున్
నృపోత్తముండును నగు దశరథుడును నిర్మలదేహము గలవాడై
సీతతోని మఱి పుత్రులతోడను శీఘ్రము నామంత్రించి మఱిన్
విమానమును మఱి యధిరోహించీ విమల స్వర్గలోకము జనియెన్! 39

(యుద్ధకాండయందు నూటపందొమ్మిదవ సర్గము సమాప్తము)

   

# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట యిఱువదియ వసర్గము

(శ్రీరామచంద్రుడు గోరగా నింద్రుడు మరణించిన వానరులను బ్రదికించుట — దేవతలు స్వర్గమునకు వెడలిపోవుట — వానరసేన విక్రమించుట)

దశరథుండు మఱి వెడలిన పిమ్మట దగ పాకాసుర రక్కసునీ
సంహారించినా మహేంద్రుడు మరి సంతసించుచును మదియందున్
అంజలి ఘటించి నిలిచి యుండినా యల రఘువీరునితో ననియెన్! 1

మానవులను శ్రేష్ఠుండవు రామా! మా దర్శనమును నీకు మఱిన్
లభించినది వ్యర్థముకానిది యిది లాలితముగ సంతోషముతో
నున్నవారలము హృదయమందునను నున్న కోర్కె తెలుపుము హాయన్. 2

ప్రసన్నుడగుచును మహాత్ముడైనా బరగ మహేంద్రుని జేత మఱిన్
నీవిధముగ బలుకగ బడినట్టి నిర్మలభావము గలవాడున్
రామచంద్రుడును ప్రసన్నాత్ముడై రమ్య సంతసము నంది మఱిన్ 3
నీవిధముగ సరసముగా బలికెను విమల వాక్యములతోని మఱిన్

వదతాంవర! హే విబుధేశ్వర విను! వనరగ నాయందున నీకున్
ప్రేమగలుగుచో జెప్పెద వినుమా! ప్రేమమీర యొక కోరికనూ 4
తెలిపిన దానిని సత్యముజేయుము దీరుగ లోకము కీర్తింపన్!

నా నిమిత్తమున రణరంగంబున రయమున పరాక్రమించిన యా
వానరవీరులు యమసదనమునకు వనరగ బోయిన వారలునూ!
మఱల జీవితము నంది లేచెదరు! మానుగ ధాత్రీతల మందున్ 5
అనుగ్రహింపుము! నా కోరిక మఱి యందఱు గనుగొన యీనాడే!

మానవ! దేవేంద్రా! మఱి వినుమా! మానుగ నాదు నిమిత్తంబై
భార్యాపుత్రులకును దూరంబై బరగిన వానరు లందఱునూ
సంతోషించిన మనసుల నుండగ సరసత నే గోరుచునుంటిన్! 6

ఆ వానరవీరులు శూరులునూ నలరు విక్రమమును జూపుచునూ
మృత్యువు నైతము లెక్కను జేయరు కృతయత్నంబును గలవారై
ఆపదజెందీ మరణించిరి గద! యావహంబు మఱి జేయుచునూ!.
మరణించిరి దేవేంద్రా! వినుమా! మానుగ వారల బ్రతికింపూ! 7

మత్ప్రియంబు జేయుటకై కపులును మానుగ మృత్యువు గూడ మఱిన్
లెక్కజేయకను ధాత్రిని ఒడిరో లీలగ నీ యనుగ్రహముననూ!
తిరిగి వచ్చెదరుగాత! మహేంద్రా! దీరుగ కోరుచు నుంటి నిదే! 8

మానవ! గోలాంగూలంబులనూ మఱియు వెలుగుబంట్లను గూడన్,
విట్టిరోగములు లేనివిగానూ యెట్టి గాయములు లేకయునూ!
సంపన్నంబగు బల పౌరుషములను సంతసమున నుండగ వారిన్
చూడగోరుచున్నాను మహేంద్రా! చూడముచ్చటగ వారలనూ! 9

వానరులందఱు నే రోగములను వనరలేని వారగుచు మఱిన్!
గాయంబులు మఱి లేనివారగుచు గల బలపౌరుషములు గలిగీ,
నిద్రబోయినా వారలు మఱియును నిదురించిన తరువాత వలెన్
మేలుకొందు రిక రఘురామా విను! మిక్కిలి బడలిక జెందినటుల్! 10

ఈ వానరులును నెచట నుందురో! యిమ్ముగ యాస్థానములందున్
నకాలమందునగూడను ఫలములు నలరు పుష్పములు గూడ మఱిన్
నిర్మలమైనా యుదకంబులు మఱి నిఖిల స్రోతసులు గలుగునటన్! 11

మహాత్ముడగు నా రాఘవు వచనము మానుగ విని యింద్రుండు మఱిన్
ప్రీతిసంయుతంబగు వచనంబును ప్రేమమీర మఱలను బలికెన్ 12

తాత! రఘూత్తమ! యెది నీచేతను దగ జెప్పగబడెనో యదియున్
ఆ వరంబు బహు గొప్పది కావీ యలరుచు నే నెన్నండు మఱిన్

రెండు మాటలును బలుకలేదు గద! నిండుకుండవలె నుంటిని నే
అందువలన నీకోరిన రీతిని చందముగా జరుగగ గలదూ! 13

యుద్ధమందు రాక్షసులచేత మఱి వధింపబడినా వానరులున్
భల్లూకంబులు గోపుచ్ఛంబులు బాహువులును ముఖములు గూడన్
తెగబడియున్నా వానరులందఱు దీరుగ లేచెదరు గాతన్! 14

సమస్త వానర సముదాయంబును సంతోషము గూడినవారై
మిత్రులతోడను బంధులతోడను మేదిని స్వజనముతోని మఱిన్!
జ్ఞాతులతోడను గలిసికొనెదరూ నీతిభాషణల బలుకుదురూ! 15

మహాధనుస్సును గలవాడా! విను! మానుగ యకాలమున గూడన్
వృక్షంబులు పుష్పంబుల చేతను విచిత్రవర్ణము గలదిగనూ
ఫలములతో నిండిన కొమ్మలుగా బరువున వంగుచు నుండునటన్
నదీనదంబులు జలములతోడను నయముగ ప్రవహించుచు నుండున్ 16

అటు బిమ్మట యా సమస్తమైనా హరియూథపులును పూర్వమునన్
గాయంబులతో నిండినట్టి యా గాయము లిపుడును బోవుటచే
సమానంబులగు దేహంబులతో సరసత నిదురను లేచుటలా
లేచిరి వానరులందఱు గూడను లీలగ యాశ్చర్యము నందీ! 17

సకల సురోత్తము లందఱు గూడను సపరిపూర్ణ సఫలుడునైనా
గలిగినట్టి రఘురామునిగాంచి గడుప్రీతిని సంతోషించీ
లక్ష్మణ సహితుండైన రామునీ లావుగ స్తుతించి బలికి రిటుల్! 18

రాజా యిచ్చటినుండి యయోధ్యకు రయమున బయనింపుము రామా!
వానరులను నిక విసర్జింపుమా! వనముల నివసింతురు వారల్
అనురక్తయు, ననురాగము గలిగిన యతిరు యశస్వినియును నైనా!
సీతాదేవిని యోదార్పుము నిక చిత్తశాంతి గలుగగ వేగన్! 19

పరంతపా! నీ యెడబాటునకును బన్నుగ సహింపజాలకనూ!
శోకము వలనను వ్రతము సలుపు నా శూరుడు భరతుని మహాత్మునిన్!

శత్రుఘ్నుని మఱి సమస్త మాతల సరసత గనుగొను మిక వేగన్,
రాజ్యంబున నభిషిక్తుడ వగుచును రమ్యానందము గూర్పు ప్రజన్! 20-21

సౌమిత్రిని గూడిన రామునితో సహస్రాక్షుడును నిటుబలికీ
సంతోషించుచు సకలదేవతల వెంత గూర్చుకొని వేగముగా
సూర్యుని వంటీ కాంతిగలిగినా సురుచిర సుఖద విమానములన్,
దేవలోకమును దరలిపోయెనూ దీరుగ సహచరులను గలిసీ! 22

లక్ష్మణ సమేతుడైన రాముడును లాలితముగ సురలందఱకున్,
నమస్కరించియు ననుజ్ఞ యిచ్చియు నయముగ నటువిమ్మట వేగన్
వానరవీరుల నందఱ దమ తమ వనరగ స్థానము లందుననూ
విశ్రమింకగా నాజ్ఞాపించెను విమలమైన పరివారమునూ! 23

రామలక్ష్మణుల పాలితమైనా రమ్య హృష్ట జనములు గలుగూ
యశస్వినియునగు మహాసేనయును నలరుచు శోభను జ్వలించుచున్!
శీతరస్మియగు చంద్రునిచేతను శ్రీకరమగు రాత్రికి వోలెన్!
అన్నివైపులమ బ్రకాశించెనూ నంతట కాంతులు విలసిల్లన్! 24

(యుద్ధకాండము నందు 120వ సర్గము సమాప్తము)

* * * *

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట యిఱువదియొకటవ సర్గము

[రాముడు నయోధ్యకు బోవుటకు నుద్యుక్తుడగుట — రాముని యాజ్ఞచేత విభీషణుడు పుష్పకమును దీసికొని వచ్చుట]

ఆ రాత్రియు యట శయనించియు మఱి యలరుచు నిదురను మేల్కానినా
యరిందముండగు శ్రీ రఘురాముని నమిత వినయమునను గూడికొనీ
విభీషణుండును జయశబ్దంబును విమలవాక్యముల బలుకుచునూ
ప్రాంజలితో శ్రీ రఘువీరునితో బలికె నిటుల నతి మధురముగా! 1

అలంకార విదులైన వారలును నలరు పద్మ పత్రంబులతో
సమానమైన నేత్రంబులు గల చక్కని యా వనితలు రామా!
స్నానసాధనము లైనటువంటీ సరసత యంగ పరాగములన్
వస్త్రంబులు మఱి యాభరణంబులు పనరగ చందన మాల్యములన్
గైకొని వచ్చిరి యథోచితముగా గడగి నీదు స్నానంబునకై! 2-3

ఆమాటలు విని రామచంద్రుడును నా విభీషణునితో బలికెన్
సుగ్రీవుడు మొదలైన వానరుల సురుచిరముగ స్నానంబునకై!
ఆహ్వానింపుము! విభీషణా! మఱి యలరెడు బంధువులును వారున్! 4

ధర్మాత్ముడు మఱి సుఖోచితుండును దగు సుకుమారుడు సుశీలుడున్
మహాబాహువులు గలవాడును మఱి మానుగ సత్యాశ్రయు డతడున్
అట్టి సుభరతుడు నానిమిత్తమై నెట్టి కష్టముల నున్నాడో! 5

ధర్మాచరితుండైన వాడునూ, దగ కైకేయీ సుతుడు మఱిన్
నల భరతుండును లేకుండను మఱి యలరు సుగంధ సుస్నానంబుల్
వస్త్రంబులు మఱి యలంకారములు వనరగ యిష్టంబులు గావూ! 6

అయోధ్య పురికిని బోవు మార్గమును నాలోచింపుము శీఘ్రముగా
ఏదిమార్గమో! యెటుల బోదుమో! యేది సుకరమో యోజింపూ!

ఈమార్గంబున కాలినడకతో నిమ్ముగ నయోధ్య బోవుటయున్
ప్రయాణమునకును కష్టమైనదీ బరగ ప్రయాసను గూడినదీ! 7

రాముని మాటలు విని విభీషణుడు రమ్యముగా నీవిధి బలికెన్,
రఘువీరా! చింతింపకు మదిలో రమ్యమైన పుష్పకమందున్,
ఒక్కదినములో నయోధ్య జేర్చెద! నిక్కముగా నా మాటవినూ! 8

సూర్యునితోని సమానమైనదియు సురుచిరముగ కోరిక రీతిన్
పయనించునదీ దివ్యమైనదీ బరగ యుత్తమము నైనదియున్,
పుష్పకంబనెడి విమానంబునూ, పొలుపుగ గలదీ పురియందున్,
అపుష్పకమును నాసోదరుడగు నల కుబేరునిది స్వంతముగా,
బలవంతుండగు రావణాసురుడు బరాక్రమంబున యుద్ధములో
జయించి హరించినాడు దానినీ సరసత నీకొరకై నేనున్
రక్షించియు లంకాపురియందున రమ్యముగా యుంచితి రామా!
ఆ విమానమున నయోధ్యపురికిని నలరును గమింప వచ్చునికన్!

మేఘముతోని సమానమైనదీ మెఱుపు తీగపలె బోవునదీ,
యావిమాన మీపురి యందున్నది నలరుచు నిటకును దెప్పింతున్,
ఆవిమానమున నయోధ్య నగరము నలసట యింతయు లేకుండన్
ప్రయాణింప వచ్చును శ్రీరామా? బంధుమిత్ర పరివారముతో! 10-11

ప్రజ్ఞాశాలివి రామా! వినుమా! బన్నుగ నాదు సువాక్యములన్,
నేను ననుగ్రాహ్యుండను నగుచో నీభక్తుడనని నమ్మినచో,
నాదు మంచి గుణములు స్మరించుచో నాయందున స్నేహంబు మఱిన్,
ప్రీతిగలుగుచో నిచ్చట యుండుము! పేరిమి నే వచ్చినదాకన్! 12

రామా! సోదరుడైన లక్ష్మణుడు రమ్యపత్ని జానకితోడన్
నేను జేయు శుభసపర్యలన్నియు నిండు భోగ్యవస్తువుల మఱిన్
సమర్పించి పూజించెద నిప్పుడు విమల భక్తిభావంబునన్నూ!
స్వీకరింపుమా! దశరథరామా! స్వీకరించి బోవచ్చు మఱిన్! 13

రామా! ససైన్యములతో గూడిన రమ్య మిత్ర గణమును గూడి!
నే నేర్పరచిన యథాశాస్త్రముగ నే సంతోషమునను గూడి!
సమర్పింపబడు నీ సత్కారము చారుశీల! గ్రహియింపు మిదే! 14

ప్రేమవలన గౌరవభావమునను విమల స్నేహ భావముతోడన్
బ్రతిమాలుచు నున్నాడను స్వామీ! భగవదనుగ్రహమును గోరి,
నీదు కింకరుడ! నీసేవకుడను! నిన్నాజ్ఞాపించుటలేదూ! 15

విభీషణుడు బలికిన మాటలువిని విజయ రామచంద్రుండు మరి
వానరవీరులు, రాక్షసవీరులు వనరగ యటగల యందఱునూ!
వినుచుండగ యా విభీషణునితో విమల వాక్యముల నిటులనియెన్! 16

పరంతపా! ఓ సౌమ్యుడ వీరా! బన్నుగ యాలోచనలందున్
సాయముజేతను, బనులచేతనూ సద్గుణంబులగు స్నేహముచే
అన్నివిధములను బూజించితివీ, యఖిల సపర్యల జేసితివీ! 17

రాక్షసరాజా! నీవుజెప్పినటు రహి నే జేయక పోవుటయున్,
మాటయె లేనేలేదు సుమా! మఱి మానుగ సోదరుడగు భరతున్,
జూడవలయునని నాహృదయంబును గాఢముగా గోరుచు నుండెన్! 18

ఏ భరతుడు నను మఱల్చుటకునై నిమ్ముగ పరివారము తోడన్
చిత్రకూట పర్వతమున కొచ్చెనో శిరసా నను యాచించునూ!
ఎవని ప్రార్థనాపూర్వకమైనా భావగతములగు వాక్యములన్
తిరస్కరించితినో యా భరతుని దీరుగ తల్లిని కౌసల్యన్
సుమిత్రదేవిని యశస్వినియునగు సురుచిర కైకేయీ సతిని,
మిత్రుడైన యాగుహుని మఱియునూ, అత్రిని అనసూయాదేవిన్
అయోధ్యనగరపు జానపదులనూ యా నాగరకుల గాంచగనూ!
నామది బహు తొందరబడుచున్నది నయముగ వివరింపగలేనూ! 19-20

ఓసౌమ్యుడ! ఓ విభీషణా విను! నానఘగ యనుజ్ఞ నిక నిమ్మా!
పూజించిన యట్లే భావించెద పులకించితి నీ స్నేహమునన్!
ఆత్మమిత్రుడా! కోపింపకుమా! యలరి గోరుచుంటిని నిన్నున్! 21

రాక్షసరాజా! విభీషణా విను! రయమున విమానమును నాకున్
దెప్పింపుము నిటకుపు వేగముగా దీరుగ నే బయనింపగనూ!
కార్యము పూర్తిగ సమాప్తమైనది గడగి యిచట యుండుట మఱియున్
యుక్తముగాదుగదా! మఱి సౌమ్యుడ! భక్తుండవు సర్వము దెలియున్! 22

రాముని మాటలు విని విభీషణుడు రయమున సూర్యాగ్ని సమానమున్,
ఆ విమానమును బిలిచెను నాతడు నాత్మయందు ధ్యానించుచునూ,
కాంచన చిత్రాంగములు గలదియును సంచితముగ లోపలను మఱిన్
వైఢూర్యంబులు మాణిక్యంబుల విమల వేదికలు గలదియునూ,
మండపములతో వ్యాప్తమైనదియును మూసుగ రజిత సుకాంతులతో,
దెల్లనైన ధ్వజ పతాకములతో దీరుగ యలంకరింపబడీ,
బంగరు వికారమును గూడినదీ రంగుగ పద్మంబుల జేతన్
నలంకరింపగ బడినట్టిదియునూ యలరు స్వర్ణ హర్మ్యంబులచే!
నలంకరింపగ బడినట్టిదియునూ నల చిఱుగంటల మ్రోతలతో,
వ్యాప్తమునైనది ముక్తామణులను వనరగ గూర్చిన కిటికీలున్,
గలదియు గంటల సముదాయముచే గలగల వ్యాప్తం బైనదియున్,
అన్ని వైపులను మధుర ధ్వనులను జెన్నుగ వినబడుచున్నదియున్
మేరుపర్వతము నాకారంబును మేలుగ గలిగినదియును మఱియున్,
విశ్వకర్మచే నిర్మింపగబడి విలాస కర్మలు గలవియునూ
ముక్తారజితములను శోభించుచు మోదమునను బహు హర్మ్యములన్,
శోభితమైనది పాలరాతితో సుందర భాగములను గలదీ!
క్రిందిభాగములు స్ఫటికంబులతో సుందర మాణిక్యంబులతో!
విచిత్రములుగా గనబడునదియును విమల విమానము నంతటనూ,
విమలమైన యాస్తరణములుండిన విమలాసనములు గలదియునూ,
అట్టి విమానంబును బిలిచెను మఱి యిట్టె నిలిచె యందఱి ముందున్!
అనాధృష్యమును మనోజవంబును నలరునట్టి యా విమానమున్!
వచ్చిన దానిగ శ్రీరామునకును వనరగ దెలిపె విభీషణుడున్!
అచ్చోటనె నిలిచెను విభీషణుడు నందఱు జూడ విమానమునూ! 29

లక్ష్మణుతోడను గూడినట్టి యా లావు బలాఢ్యుడు రాఘవుడున్
పర్వతంబుతో సమానమైనది బరగ సుందరం పైనదియున్!
కామ గమనమును గలదియు మఱియునుగడుజవంబుగలదియుమఱియున్!
పుష్పకం బన్నెడి విమానంబునూ పొలుపుగ యుపస్థితంపై యుంటన్!
గాంచి విస్మయమునందెను రాముడు గాంచిరి కపులును రాక్షసులున్! :0

(యుద్ధకాండయందు 121వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట యిఱువది రెండవ సర్గము

(రాముని యాజ్ఞచేత విభీషణుడు వానరులను బాగుగా సత్కరించుట– రాముడు విభీషణునీ, వానరవీరులనుగూడ దీసికొని పుష్పకముపై అయోధ్యకు బయలుదేరుట).

అటుబిమ్మట యా విభీషణుండును నలరు పుష్ప భూషితమైనా!
ఆ విమానమును వచ్చుదానిగా నటులజేసి సమ్మోహముతో!
ఆ విభీషణుడు సమీపమందున యలరి నిలిచి శ్రీరామునితో!
అంజలితో నీ విధమున బలికెను నతి వినయమునను నెమ్మదిగా! 1

రాక్షసేశ్వరుడు నగు విభీషణుడు నతి వినీతుడై మధురముగా
అంజలితోడను బహు తొందరగా నంచితముగ నీ విధి బలికెన్! 2
ఇంక నేమి జేయుదును మహాప్రభు వంకలేక యాజ్ఞాపింపు!

మహాతేజుడగు రామచంద్రుడును మానుగ మది యెంజించుచునూ!
తమ్ముడైన లక్ష్మణుడును వినగా దగ విభీషణునితో నిటులన్!
స్నేహపూర్వకముగా మధురముగా జిత్తము రంజిల బలికె నహో! 3

రాక్షసరాజా! విభీషణా విను! రయమున మహాప్రయత్నములన్!
కర్మలు జేసిన కపివీరులకును గడువిలువగు రత్నంబులనూ!
మహాధనంబుల సత్కరింపునూ! మాణిక్యములను ముత్యములన్! 4

విభీషణా! యుత్సాహవంతులును విమల ధైర్యవంతులును మఱిన్!
ప్రాణభయంబును విడిచిన వాడును బన్నుగ యుద్ధము అందుననూ!
వెనుకకు మఱలని వారు సుమా మఱి వీరులు విపుల బలాఢ్యులునూ!
ఇట్టి వానరుల గలసియె నీవును గట్టి లంక జేపట్టితివి! 5

ఇట్టి మహా కపివీరు లందఱును గట్టిగ పనిచేసిన వారే!
ధనరత్నంబుల బహుమతిజేతను దగ గూర్పుము నానందంబున్!
వీరలు జేసిన మహాకార్యముల విమలత్వము గూర్పుము వేగన్! 6

కృతజ్ఞుడవు! మఱి నీవు విభీషణ! యతి మాత్రము కపివీరులకున్!
సంతసమును మఱి గలుగు విధముగా స్వాంతమందునను జింతించి!
సన్మానము జేసిన వీరందఱు సంతోషింతురు స్వాంతమునన్! 7

దాన గుణంబులు గలవాడవు మఱి దాసుల దగ్గఱ జేర్చుకొని!
బహుమానంబుల నిచ్చెడివాడవు బన్నుగ విజితేంద్రియుడవునూ!
అయినచో జనులు దగ్గఱ జేరి యభినందింతురు నిన్ను మఱిన్!
అందుచేతనే యీ విధముగ నే యలరి దెలుపుచున్నాడ సుమీ! 8

రాక్షసరాజా! సమస్తమైనా రతిగుణములచే హీనుండున్!
నావహమునకును గొనిపోవుచు మఱి నట జంపించెడి వాడు మఱిన్!
అట్టి మూర్ఖుడగు రాజును సైన్యము నిట్టె విడుచు రణరంగమునన్! 9

అటువిమ్మట యా విభీషణుండును నట శ్రీరాముని మాటవిని!
ఆ కపివీరుల కందఱికిని మఱి నట రత్నంబుల ధనములనూ!
బహూకరించెను బూజించెను మరి బరగ ప్రహర్షము గలిగించెన్! 10

అటుబిమ్మట రత్నంబుల జేతను బటుధనంబులను జేత మరిన్!
నా హరి యూధవు లందఱు బహువిధి నాదరింపబడుటయు గాంచి!
అత్యుత్తమమగు విమానంబునూ యారాముడు నధిరోహించెన్! 11

సిగ్గిలుచుండిన యశస్వనియు మఱి శ్రీవైదేహిని రాఘవుడున్!
అంకమునందున జేర్చుకొనెను మఱి వంకలేని యా ధరణీ సుతన్!
విక్రాంతుడు మఱి ధనుష్మంతుడును విమల మనస్కుడు లక్ష్మణుతో!
అత్యుత్తమమగు విమానంబునూ యా రాముడు నధిరోహించెన్! 14

ఆ రఘురాముడు విమానస్థుడై నల కపివీరుల గాంచుచునూ
విభీషణునితో గూడినట్టి యా విమల విక్రముడు వీర్యుండున్
సుగ్రీవుని మఱి యాదరించుచును సురుచిరముగ యీ విధి బలికెన్! 13

వానరశ్రేష్ఠులు వినుడో మీరలు! వనరగ మిత్రుని కార్యంబున్,
సాధించిన వారలు మీకును నే సరసత కృతజ్ఞతలు వేగన్
దెలుపుచుంటినీ యిక మీరందఱు దీరుగ నివాసమును బోవన్
భద్రానుజ్ఞను నిచ్చుచుంటినీ బరగ స్వేచ్ఛగా బోవచ్చున్! 12

సుగ్రీవా స్నేహంబు గలిగినా సుహితునిగ స్నేహితుజేతన్,
నేది జేయగా దగినదౌ యంతయు విధిగా జేసితి వదిగాకన్
ధర్మవిషయమున భయమును గలిగిన ధర్మాశ్రయుడవు నీవు మఱిన్,
శీఘ్రముగా సైన్యంబును గూడుక శ్రీకిష్కింధకు వెడలు మికన్! 15

విభీషణా! యీ లంకయందునను విమలమతిని నీ కొచ్చిన యీ
స్వరాజ్యమందున యధివసింపు మిక స్వకార్య నిరతుడవై యెపుడున్
ఇంద్రునితో గూడిన దివౌకసులు సాంద్రశక్తి నిన్నెదిరింపన్
శక్తిమంతులును గారుగదా మఱి రక్తిని భావింపుము ధరణిన్! 16

నాదు తండ్రి పరిపాలించిన యీ నయముగ నయోధ్య జనిమెద నే
మీ మీ యందఱి మధుర యనుజ్ఞను మేలుగ గోరుచు మన్నానన్! 17
అందఱి దగ్గఱ సెలవు దీసికొని యభినందించుచు నున్నానన్

ఆ శ్రీరాముని మాటలు వినుచును నా వానర నాయకులు మఱిన్
నా వానరులును రాక్షసరాజగు నల విభీషణుడు వానరులున్,
వారందఱునూ ప్రాంజలితోడను వనరగ బలికిరి రామునితో! 18

మేముగూడ యా యయోధ్య బోవగ మిగుల యిచ్ఛగించుచును మఱిన్
మది గోరుచునున్నారము రామా! మానుగ మము గొనిపోగలవూ!
ముదితులమై యా వన యుపవనముల మోదముతో విహరించెదమూ! 19

నృపసత్తమ! యభిషేకముజేతను సఫలముగా గనుగొనియు నినున్
మాతయైన కౌసల్యాదేవికి మానుగ యంజలి ఘటియించీ!
అటుబిమ్మట శీఘ్రముగా మా మా యాశ్రమములకును బోయెదమూ! 20

వానర వీరులు విభీషణుండును వనరగ యిటు బలికిన మీదన్
ధర్మాత్ముండగు రామచంద్రుడును దగ సుగ్రీవ విభీషణులన్!
వానరవీరుల గాంచుచు రాముడు వనరగ యీ విధమున బలికెన్! 21

సుహృజ్జనముతో గూడికొనియుసూ సురుచిరముగ యందఱి తోడన్
అయోధ్యజేరుట, సంతోషించుట నంతకంటె యేమియు లేదూ!
ప్రియముకంటె మఱి యతిప్రియమైనది పేరిమి పొందిన యట్లునగున్! 22

సుగ్రీవా! కపివీరులతోడను సురుచిరమగు నీ పుష్పకమున్
నధిరోహింపుము! రాక్షసరాజా!నలరు నమాత్యులతో గూడీ,
విమానంబు మఱి యధిరోహింపుము! విమల యయోధ్యకు బోవుదమూ!23

అటుబిమ్మట యా సుగ్రీవుండును నలరు కపులతో గూడికొనీ,
దివ్యమైన యా పుష్పకంబునూ దీరుగ నధిరోహించె మఱిన్
అమాత్యులను మఱి సన్నిహితులతో నల విభీషణుడు విమానమున్,
నారోహించెను సంతోషముతో నయోధ్యపురి దర్శించుటకై! 24

వారందఱునూ పుష్పకంబునూ యధిరోహించిన బిమ్మటనూ!
కౌబేరంబగు పరమాసనమును కాంతివంతుడగు రామునకున్,
నర్పింపగబడె రాము నాజ్ఞచే నా విమానమును దివ్యమనీ,
ఆకాశములోనికి పయనించెను నంబరమందున చక్కవలెన్! 25

ఆ శ్రీరాముడు ఆకాశములో నలరెడి హంసల ప్రతిమలతో
కూడినట్టి యా విరాజిల్లెడి కూరిమి పుష్పక మందునను!
సంతసించుచును శ్లాఘింపబడుచు సరసత కుబేరువలె నుండెన్! 26

సమస్తమైనా వానరవీరులు సకలమైన భల్లూకములున్,
మహా బలీయులు రాక్షసవీరులు మానుగ యా పుష్పకమునన్,
యధాసుఖముగా గూర్చుండిరి మఱి తథావిధిని నూటాడుచును! 27

(యుద్ధకాండయందు 122వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి యుద్ధకాండము

## రెండవ భాగము

### నూ ట యి రు వ ది మూ డ వ స ర్గ ము

(అయోధ్యకు బోవుచు శ్రీరాముడు సీతాదేవికి మార్గమధ్యమున ఆయాస్థానములను జూపుట.)

హంసల ప్రతిమలతో గూడినదీ యత్యుత్తమమైనది మఱియున్
మహానాదమును గలిగినట్టిదియును మానుగ యద్ది విమానంబున్
రాముని యనుజ్ఞ నందబడినదై రమ్యమైన ధ్వని చేయుచును
ఆకాశములోనికి మఱి యెగిరెను నంబరమందున మెఱుపువలెన్! 1

అటుపిమ్మట శ్రీరఘునందనుడును నా శ్రీరాముడు క్రమముగన్
అన్ని వైపులను దన నేత్రమును నలరి పారజూచుచును మఱిన్
శశినిభాననయు చారుశీలయగు సతి జానకితో బలికె నిటుల! 2

వైదేహీ గను! శ్రీకైలాసపు వనరగ శిఖరము వంటిదియున్
త్రికూటపర్వత శిఖరమునందున దీరుగ నిర్మింపగబడినా
విశ్వకర్మచే నిర్మింపగబడి వైశ్రవణునకును నిచ్చిన యా
లంకాపురినీ జూడు మల్లదే! వంకలేని దా పురము మఱిన్! 3

ఓ సీతా! వానర రాక్షసులను నొనరగ మరణించుటయు మఱిన్
కారణమైనది మాంసరక్తములు కలిసి బురదగా నిండిన యా
ఆవహాభూమిని జూడు మల్లదే యంతులేని హింసయు జరిగెన్! 4

విశాలాక్షి! విను! బ్రహ్మవరములను వికటముగా గర్వించుచునూ!
లోక పీడకుడు రాక్షసరాజును లోలత రావణ రాక్షసుడున్
నీ నిమిత్తమై నాచేతను మఱి నిహతుండై పడిపోయె నిటన్! 5

ఈ ప్రదేశమున కుంభకర్ణుడును నిమ్ముగ వధింప బడెను సుమా!
యీ రణభూమిని ప్రహస్తుండునూ నిహతుండాయెను నిచ్చటనే!
హనుమంతునిచే ధూమ్రాక్షుండును హతమాయెను గద క్రూరముగా! 6

మహాత్ముడగు నా సుషేణుజేతను మానుగ విద్యున్మాలియునూ
ఈ ప్రదేశమున జంపగ బడియెను నిమ్ముగ రణరంగము నందున్
ఇచ్చటనే మన లక్ష్మణు జేతను జెచ్చెఱ రావణు పుత్రుండున్
ఇంద్రజిత్తు రణరంగమునందున పాంద్రరీతి ధాత్రిని నొఱిగెన్! 7

ఇచ్చటనే మన యంగదుజేతను నిమ్ముగ వికటుండను వాడున్
జంపబడెను దుష్ప్రేక్షుండైనా వంపరాని యావిరూపుడున్
మహాపార్శ్వుడును మహోదరుండును మానుగ యకంపనుండు మఱిన్
అతికాయుడు మఱి దేవాంతకుడును నల నరాంతకుం డనువారున్
త్రిమూర్థుడనియెడి వాడును మఱియును దేరుగ కొందఱు రాక్షసులున్
వధింపబడినా రిచ్చోటుననే వలనొప్పగ యీ రణభూమిన్! 8-9

యుద్ధోన్మత్తుడు మత్తుండనియెడి యుద్ధతు లిద్దఱు నిచ్చటనే
వధింపబడిరీ వనజాక్షి! విను వనరగ యీ రణరంగమునన్!
కుంభకర్ణుని కుమారులైనా కుంభుడు మఱియు నికుంభుండున్

మహాబలీయుడు వజ్రదంష్ట్రుండును మానుగ దంష్ట్రుడునసువాయున్
అనేకమందీ మహారాక్షసులు నలరి వధింపగబడి రిచటన్
దుర్ధర్షుండగు మకరాక్షుండును దురపిల్లుచు నాచేత మఱిన్
వధింపంగబడె యీ రణభూమిని వసరగ రణరంగమునందున్! 10-11

ఈ రణభూమిని యకంపనుండును నిలపైబడి జీవము లొదిలెన్
వీర్యవంతుడగు శోణితాక్షుడును విక్రముడగు యూపాక్షుండున్
ప్రజంఘుడును మఱి వధింపబడెనూ బన్నుగ యీ రణరంగమునన్! 12

భీమదర్శనుడు రాక్షసుడైనా భీకర విద్యుజ్జిహ్వుడునూ
ఇచ్చోటనె మఱి వధింపబడెనూ చెచ్చెఱ రణరంగము నందున్
యజ్ఞశత్రువును గూడ జంపబడె నజ్ఞానజ్ఞాగా బడె నేలన్
మహాబలుండగు సుప్తఘ్నుండును మానుగ వధింపబడె నిచటన్
సూర్యశత్రువును, బ్రహ్మశత్రువును శూరులు వధింపబడి రిచటన్!

వేయిమంది సవతులతో గూడుక వీరవనిత రావణుని సతీ
యామండోదరి రావణుకొఱకై యఱచి మఱచి విలపించినదీ
యీ ప్రదేశముననే నేలనుబడి యిమ్ముగ రోదన జేసినదీ! 14

వరాననే! సీతా! గను మల్లదె! వనధి తీర్థమదె! కనుగొనుమా!
మేము సంద్రమును దాటిన రాత్రిని మిగుల సంతసము నందుచు నా
విడిదిజేసినా రేవు యిదే మఱి విమలమైన ధ్వనులను వినుచున్! 15

విశాలాక్షి! యిది సగరుని జేతను విపులముగా ద్రవ్వగబడినా
లవణార్ణవమున నా చేతను మఱి లావుగ గట్టింపగబడినా
సుదుష్కరంబును గష్టంబైనను సుదుచిరముగ లంకను జేరన్
నలుని చేత నిర్మింపగ బడినది నయముగ సేతువు గనుగొనుమా! 16

వనజాక్షి గను! యక్షోభ్యంబును వరుణాలయమును గనుగొనుమా
ఆవలి తీరము లేనిదానివలె నడలుచు గర్జించుచు నుండెన్!
శంఖశుక్తి ముత్యంబుల తోడను శోభనమూగా గనిపించెడి యా
మహాసంద్రమును గనుగొను మబలా! మామిగ సుందర దృశ్యములన్! 17

మైథిలి! కనుగొను! మన హనుమంతుని మానితమగు విశ్రాంతికినినై
సాగరమును మఱి ఛేదించుకొనీ సరసత పైకిని లేచిన యా
మహాపర్వతము మైనాకంబును మానుగ జూడుము వనజాక్షి! 18

ఈ ప్రదేశమును కనుగొను మబలా! యిది సముద్ర మధ్యమునందున్,
సైన్యము విడిదిని జేసిన చోటిది సరసత విశ్రాంతిని నందన్,
ప్రభువగు మహదేవుడు నన్నిచటను బరగ ప్రసాదించెను సఖియా! 19

ఈ కనబడుచున్నది కనుగొను మబలా! నిల మహాత్ముడగు సాగరునీ,
సేతుబంధమను పేరును గలిగిన ఖ్యాతిని బొందిన తీర్థమిదీ
ముల్లోకములను బూజింపగబడు మోదమునను నర్చింపబడున్
పరమ పవిత్రంబైనది సుదతీ! పాపనాశనం బైనదియున్,
ఈ స్థలంబునను రావణు తమ్ముడు నిమ్ముగ విభీషణుండు మఱిన్
తన సహచరులను గూడివచ్చెనూ దగ నా యాశ్రయమున కొఱకై 20-21

జనకసుతా! యిదె యవలోకింపుము; సరసత కిష్కింథా పురినీ,
మన సుగ్రీవుని నివాస మిదియే మానుగ సుందరములు నైనా
చిత్రకాననములను విలసిల్లుచు చిత్రకారునీ చిత్రములా,
కనిపించుచు న్నది కనుగొను మబలా! గఠోర బలుడగు నింద్రసుతున్
వాలిని నే నిచ్చట వధించితిని వనర ధర్మ పరిరక్షణకై! 22

అటుబిమ్మట యా జనక నందినియు నలరి వాలి పాలించిన యా
కిష్కింధాపురి గాంచి మానసము పలకిల కేరింతలు జేయన్,
ప్రణయ సాధ్వసములను గూడికొనీ ప్రశ్రిత వాక్యములను బలికెన్, 23

రఘువీరా! తారా మొదలైనా రహి సుగ్రీవుని భార్యలతో
నితరులైన వానర ఋక్షంబుల నిమ్ముగ ప్రియ భార్యలతోడన్
కూడినదానిగ నీతో గూడుక కూరిమి యయోధ్య పురమునకున్
కూడిపోవలయునని వాంఛితమును కూరిమి దీర్చగవలె నాథా! 24-25

మిథిల రాజసుత మాటలు వినియును మేదినీశుడగు రాఘవుడున్,
'అట్లే యగు గావుత!' యని బలుకుచు నా కిష్కింధకు జేరగనే,
యా విమానమును నిలిపి బలికెనూ! యా సుగ్రీవునితో నిటులన్! 26

వానరరాజా! సుగ్రీవా! విను! వనరగ కపివీరుల తోడన్,
'మీరందఱు మీ వనితల గూడుక మిధిల రాజసుతతో గూడి!
అయోధ్య పురికిని రం'డని దెలుపుచు రమ్యముగా పురి వీక్షింపన్! 27

మహాబలా! ఓ ప్లవగాధిపుడా! మానుగ సుగ్రీవా! నీవున్,
నీ భార్యలతో తొందర బడుమా! నిలిచి యుండెదము నీకొఱకై!
త్వరగా రమ్మా! త్వరగా పొమ్మా! త్వరిత గతిని ఇక పోవుదమా! 28

అమిత తేజమును గలవాడును నగు నా శ్రీరాముడు బలుకగనూ,
వానరాధిపతి శ్రీమంతుండును వనరగ సుగ్రీవుం డపుడున్,
సమస్తమైనా కపివీరులతో సమావృతుండై శీఘ్రముగా
అంతఃపురమును ప్రవేశించెనూ కాంతత తారను గని పలికెన్! 29-30

ప్రియురాలా! నీవును మఱి యిటుగల పేరిమి మహాత్ములైనట్టి,
వానర వీరుల స్త్రీలను రాముడు వనరగ యాహ్వానించె సుమా!
భార్యయైన యా జానకి కోర్కెను బన్నుగ తీర్పగఁ దలచి
మనల నందఱిని యాహ్వానించెను మానుగ యయోధ్య పురమునకున్! 31

ప్రియురాలా! తారా! తొందర బడు ప్రేమమీర సిద్ధముగమ్మా!
వానరవీరుల భార్యల నందఱ వనరగ గైకొని పోవుదమా!
వారలందఱికి యయోధ్యపురినీ యా దశరథుని పట్నలనూ!
జూపింతము! నచ్చటగల వింతలు జోద్యంబులు, నాగరికతనూ! 32

శోభనాంగి యగు నా తారయునూ సుగ్రీవుని వచనముల విని,
వానరస్త్రీలను నందఱ బిలిచీ వలనొప్పుగ నీవిధి బలికెన్! 33

రాజగు సుగ్రీవుని జేతను మఱి రహి మీ భర్తల జేత మఱిన్
యనుజ్ఞ యివ్వగ బడినవారు నిక యాలస్యంబును నేల యిటన్?
అయోధ్య నగరము గాంచుట జేతను నలరి నాకు గూడను పిదపన్!
ప్రియము జేయవలయును చెలులారా! ప్రియమారగ వచ్చుట నిటన్! 34

పౌరులతోడను జానపదులతో బన్నుగ గూడిన రాఘవుడున్,
నగర ప్రవేశము జేసెడి దృశ్యము నయముగ జూతము చెలులారా!

కన్నుల పండువుగా గాంచుదమూ చెన్నుగ రాముని పట్టమునూ!
దశరథ ధనితల యైశ్వర్యంబును దగ వైభవమును గాంచుదమూ! 35

తారజేత మఱి యనుమతింపబడి దగ వానరస్త్రీ లందఱునూ!
అలంకారములు ధరించి మఱియును నా విమానమునకును మఱియున్,
ప్రదక్షిణంబును జేసి మఱియునూ బన్నుగ సీతను గాంచగనూ!
యుత్కంఠతతో బుష్పక మెక్కిరి యుల్లాసంబున గూడీకొనీ! 36

వానరస్త్రీలును నెక్కిన దిమ్మట వనరగ యట్టి విమానంబున్
శీఘ్రముగా నెగిరెను యంబరమును స్థిరముగ యయోధ్య వైపునకున్,
ఆ సమయంబున యా పుష్పకమును నలరు ఋష్యమూకకు జేరన్,
శ్రీరాముడు నా జనకుని సుతతో స్థిరముగ యీ విధమున బలికెన్! 37

వైదేహీ! యదిగదిగో జూడుము! వనరగ స్వర్ణవికారమునన్
ధాతువులను గూడినదియు మఱియునూ దగ మెఱుపుల గూడిన యట్టి
మేఘంబును వలె గనబడుచున్నది మేలిమి పర్వతమును గనుమా!
ఋష్యమూక పర్వతమని యందురు ఋషులు జరింతురు నా గిరిపై! 38

సీతా! యిచ్చట యీ చోటుననే స్థిరముగ వానర ప్రభువైనా!
సుగ్రీవునితో సమాగమంబును సురుచిరముగ నే జేసితినీ!
వాలిని వధింపగా మఱి నేనును వనర ప్రతిజ్ఞను జేసితినీ ! 39

చిత్రకాననంబులు గలదియునూ చిత్ర పద్మములు గలదియునూ,
ఆదిగో! గాంచుము! పంపానది యది! నట గనబడుచున్నదిగద! చెలియా!
నీ వియోగమున సుదుఃఖితుడనై నీరజముఖి నిను గాంచుమనూ!
బహు విలపించితి పద్మములను గని బహుముఖముల వీక్షించుచునూ! 40

ఈ పంపానది తీరమునందే యిమ్ముగ శబరిని గాంచితినీ!
ధర్మంబును మఱి యాచరించునది దగ నను ము్ని గోరునదీ!
రేగుబండ్లతో విందు జేసినది వేగ స్వర్గమునకును బోయెన్,
యోజన ప్రమాణ బాహువులును గల యోచన జేయక కబంధునిన్,
ఈ ప్రదేశ మందే వధించితిని నింపుగ సురూప మందగనూ! 41

సీతా! అదిగో! మన జనస్థానము శ్రీకరముగ వసియించినదీ
అదిగో గనుమా మహావృక్షమును నదియె వనస్పతియని యనుచున్,
బిలిచెడి వారము! జ్ఞాపకమున్నద? ప్రీతిని విహరించితి మచటన్!
అచ్చటనే మఱి నీ నిమిత్తమై చెచ్చెఱ బలవంతుండు మఱిన్!
పక్షులలోపల ప్రవరుడు, వీర్యుడు బన్నుగ మహిమలు గలవాడున్
నా జటాయువును జంపగ బడెనూ నల రావణు రాక్షసు జేతన్!
నీ వార్తను కొంచెము వినిపించీ నేత్రములను మూసెను నతడున్! 42-43

వరవర్ణిని! గనుమా! యిచ్చోటను వనర సుతీక్షణ బాణములన్,
ఖర దూషణులను జంపిన దిచటే ఖలుడు త్రిశిరస్సును గూడ మఱిన్
చంపిన దిచటే! యాశ్రమ మల్లదె కంపము నొందకు శుభగాత్రీ!
ఎచ్చట బలుడగు రావణుజేతను జెచ్చెర గొనిపో బడినావో!
అట్టి పర్ణశాలయు శుభదర్శిని! యిట్టె గానబడు చున్నదిగా!
ఇచ్చటనే దగ వసియించితిమీ! ముచ్చటగా ప్రకృతి యొడిలో! 44-45

ప్రసన్న సలిలము గలదియును మఱి బన్నుగ శుభకరమైనదియున్,
రమ్యమైన గోదావరి నదియును రహి గనిపించుచు నున్నదిగా!
కదళీవృతమగు నగస్త్యాశ్రమము గనబడుచున్నది గనుము సఖీ! 46

దీప్తమంతమగు నీ యాశ్రమమును దీరుగ మహాత్ముడైనట్టీ,
సుతీక్ష్ణ మహర్షి యాశ్రయంబు సుమ! సురుచిరముగ గనబడున దదే!
శరభంగాశ్రమమును గూడను మఱి సరసత గనిపించుచు నుండెన్!
నిచ్చటికే గద! యల్లనాడు మఱి జెచ్చెర శత్రువినాశకుడున్
సహస్రాక్షుడగు దేవేంద్రుండును సరసత వచ్చెను ముని కడకున్! 47-48

తనుమధ్యా! యల్లదె గను సీతా! తాపసులను మఱి మౌనులను
జప తపాదులను జేయుచుండిరీ జింత లేక చిరకాలంబున్,
సూర్యునితోడను, వహ్నితోడనూ సురుచిరముగ సమానుండున్,
అత్రి మహాముని యాశ్రమమల్లదె! యగుబడుచున్నది గను సఖా! 49

ఈ ప్రదేశమున విరాధు డనియెడి వికట రాక్షసుని వధించితిన్
జనకనందినీ! యీ ప్రదేశమున చారుశీల తాపసియు మఱిన్!
ధర్మచారిణీ యనసూయను మఱి దగ గాంచితిని వినమ్రతతో! 50

అందమైన శారీరము గలిగిన సుందరి వైదేహీ! గనుమా!
శైలేంద్రంబగు చిత్రకూటమును సరసత గనిపించుచు నుండెన్!
ఇచ్చటనే గద! తమ్ముడు భరతుడు జెచ్చెర పదయాత్రను వచ్చి
అనుగ్రహింపగ వేడుకొనియెనూ యయోధ్యకును నను రమ్మనుచున్! 51

చిత్రకాననంబులు గలదియు మఱి శ్రీకరమగు సుందరమయినా
యమునా నదియును గనబడుచున్నది విమలమైన తరగల తోడన్
పవిత్రమును మఱి శోభావంతము భరద్వాజ యాశ్రమము నిటన్,
కనిపించుచునున్నది వైదేహీ! కాంతివంతమగు గ్రహము వలెన్! 52

అనేక విధముల పక్షులతోడను నంతట పుష్పించిన తరులున్,
గలిగినట్టిదియు, పవిత్రమైనది కామితముల నిచ్చెడిదియునూ!
ముల్లోకములను బ్రవహించునదీ మునులు ఋషులు నివసించెడిదీ!
అదిగో జాహ్నవి గనబడుచున్నది యలల తెరల సుస్వనములతో!

జనకనందినీ! గను మల్లదిగో వినయమంతుడగు మిత్రుండున్
గుహుడు వసించెడి ప్రదేశమిదియే కూరిమి నీవును గాంచితివీ
శృంగి బేర పుర మల్లదె గనుమా! శ్రీకరమగు సరయూ నదియున్
యూప స్తంభముల పంక్తులు గలదియు నీప వృక్షముల నిండినదియున్
పుష్పించిన మ్రానులు గలదియునూ పులకిత సరయూ నదిగనుమా! 54

తండ్రిగారి రాజ్యంబదియే సుమ తరలి వచ్చితిమి యయోధ్యకున్!
కనబడుచున్నది రాజధాని యదె కన్నుల పండువు సేయునదీ
వైదేహీ! మన యయోధ్యపురినీ వనరగ యంజలి ఘటియించీ
నమస్కారమును సేయుము సీతా! నయముగ పూజ్యసుభావమునన్! 55

అటుదిమ్మట! యా సమస్తమైనా చటుల ఋక్షములు గపివీరుల్
విభీషణునితో నున్న రాక్షసులు విమానంబునను గలవారున్
సంతోషించుచు పైకి లేచిరీ సరసత గాంచగ యయోధ్యనూ! 56

అటుబిమ్మట కపులును, రాక్షసులును నట తెల్లని కాంతుల తో
హర్మ్యంబుల పంక్తులు గలదియును నలరు విశాల సువీధులు
గజములతోడను నశ్వంబులతో గడు క్రిక్కిరిసియు యున్న
మహేంద్ర పురియగు నమరావతితో నూనుగ యుండిన
వానర రాక్షసులందఱు గాంచిరి వసుధ యయోధ్యా!

[యుద్ధకాండమునందు 123వ సర్గము సమాప్తము]

★ ★ ★ ★

## శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము
## రెండవ భాగము

నూ ట యి రు వ ది నా లు గ వ స ర్గ ము

(రాముడు భరద్వాజమహర్షి యాశ్రమములో దిగి, ఆయన
జేయుట.)

పదునాలుగు వర్షములు నిండినా పంచమి యగు తిథియందు
లక్ష్మణాగ్రజుడు రామచంద్రుడును లావితముగ పయన
భరద్వాజుని యాశ్రమమునకును బన్నుగ యేతెంచె 1
నియమవంతుడై మహామునికిని నిలిచి నమస్కారము!

తపోధనుండగు భరద్వాజునకు దగ శ్రీరాముడు నంజలి
నమస్కరించియు నిటు ప్రశ్నించెను నయముగ వినయ
భగవంతుడ! యా యోధ్యపురిలో బన్నుగ సుభిక్ష యున్న
శాంత్యారోగ్యము లున్నట్లుగ నటు కాంతివంతముగ భరతుం
రాజ్యపాలనము సేయుచున్నటుల రమ్యముగా వినుచున్నావా?
తల్లు లందఱును జీవించియె ధర దగ క్షేమము నున్నారు!

రాముని మాటలు విని మహామునియు రమ్యముగా సంతోషమునన్
చిఱునవ్వున శ్రీరామచంద్రునకు శీఘ్రముగా నిటులను పలికెన్! 3

భక్తుడు కైకేయీ సుతుడును మఱి భవ్య సువ్రతుడును విక్రముడున్
నీదు తమ్ముడగు భరత కుమారుడు నిరంతరము నిను స్మరించుచున్
పంకముబట్టిన శరీరంబుతో బన్నుగ జటలను ధరియించీ
నీదు పాదుకల ముందు నుంచుకొని నిర్మల మతియై నీకొఱకున్
ప్రతీక్ష సేయుచు నున్నవాడునూ బన్నుగ నీ యాగమనములన్
తల్లులందఱును క్షేమము గృహమున దగ పరివారము క్షేమంబున్! 4

కదన విజయ! శ్రీరామా! వినుమా! కైకేయీ వచనము లందున్
కట్టుబడిన వాడవునై సతితో పట్టమునుండీ కానలకున్
ధర్మమందు నాసక్తిని గలిగీ దగధార్మిక వృత్తినిగూడీ
కాలినడకచే బోవువాడవును గలసంపదలను వదులుకొనీ
తండ్రి యాజ్ఞ పాలించువాడవును దగ సమస్త భోగంబులనూ
విడిచినవాడవు, స్వర్గమునుండీ విడివడి నేలను బడినట్టి
దేవపురుషువలె యున్నవాడవును దీరుగ వన మూలంబులమూ
ఫలముల దినుచున్నట్టివాడవును బరగ నార చీరలు దాల్చి
మహావనంబున బ్రవేశించెడీ, మానుగ నిను పూర్వముగాంచీ
కరుణ గలిగెనూ! రామా వినుమా! కన్నులలో బాష్పము లొలికెన్! 7

కానీ ప్రస్తుత సమయమందునను కార్యంబును మఱి సాధించీ,
శత్రువు లందఱ సంహరించి మఱి మిత్రబాంధవుల గూడికొనీ
కలిసివచ్చినా నిన్ను జూచి మఱి కన్నుల పండువు నయ్యెనుగా
మనసున మిక్కిలి యానందంబును మానుగ గలిగెను రఘువీరా! 8

శ్రీరామా! జనస్థానమునందున స్థిరముగ నీ వపు డున్నపుడున్,
అనుభవించినా సుఖ దుఃఖములను నన్నియు నాకును దెలియునుమా!
శిష్యులజేతను, ఋషులజేత మఱి శీఘ్రము తెలిసితి రఘురామా! 9

పూజ్యులైన బ్రాహ్మణుల దపస్సును బూనికతో రక్షించుటకై
వారల ప్రార్థన యాలించి మఱియు వారల రక్షించుట కొఱకై
రాక్షస సంహారంబు జేసితివి రయముగ జనస్థానమునందున్,
నీదు భార్య మఱి యనిందితయునగు నిర్మల మతి యా వైదేహిన్!
లంకేశుండగు రావణాసురుడు శంకలేక యపహరియించెన్! 10

ధర్మవత్సలుడ వగు శ్రీరామా! ధార్మిక వ్రతుడవు నీవు మఱిన్,
మాయా మారీచుని జాచుటయును మానుగ సీతాహరణంబున్,
కబంధురాక్షసు బరిమార్చుటయును గడునిర్మలమగు బంపకునా!
జేరుటయును సుగ్రీవుని తోడను జిర సఖ్యంబును జేయుటయున్,
ఇంద్రసుతుండగు వాలిని జంపుట సాంద్రమైన వన వీధులలో
సీతను వెదుకుట హనుమంతుండును శీఘ్రము సముద్రమును దాటి
వైదేహి జాడలను దెలియుటయును వనరగ నలుడును సేతువునా!
నిర్మించుటయును సంతోషించిన నిఖిలమైన కపినాయకులున్! 11-16

లంకను ధ్వంసము జేయుటను మఱి శంకలేక యా రావణునీ,
సుపుత్ర బాంధవ మంత్రులతోడను సైన్యము మఱి వాహనములతో!
బలదర్పితుడగు దశగ్రీవుండును బన్నుగ రణరంగము నందున్
జంపగ బడియెనొ నా విషయంబును గంపితులగుటయు రాక్షసులున్!
దివిజులతోడను సమాగమంబును దీరుగ నేవిధి జరిగినదో!
వరముల నిచ్చుట యన్ని విషయములు వనరగ తపోబలము చేతన్!
తెలిసికొంటిని శ్రీరఘురామా! దీరుగ మెప్పొది కష్టుడు మఱిన్,
వార్తలు దెలిపెడి వారలునైనా వనరగ నా శిష్యులు మఱియున్,
అయోధ్యనగరము బోవుచుందురూ యచటి వార్తలును గూడ మఱిన్,
తెలియజేయుదురు శ్రద్ధా భక్తిని దీరుగ విశదము వివరముగన్! 16

శస్త్ర భృతులను శ్రేష్ఠుడ! రామా! సరసత నే గుడను నీకున్,
వరమును నిచ్చెద! యీ యర్ఘ్యంబును వనరగ గ్రహింపుమా యిపుడున్!
అయోధ్యకును మఱి రేపు పోగలవు నలసట దీరగ యీనాడున్! 17

శ్రీమంతుండగు, నృపాత్మజుండును శ్రీకరుడగు శ్రీరాఘవుడున్,
సంహృష్టుండై భరద్వాజుని సరసత యీ వాక్యంబు మెఱిన్,
'అస్తే' యనుచును శిరస్సు జేతను నలరుచు స్వీకరణము జేసి,
వరమును గోరెను నంజలి ఘటించి వనరగ యీపథమున బలికెన్! 18

భగవంతుడ! ఓ భరద్వాజుడా! బన్నుగ సమస్త వృక్షంబుల్
అకాలమందున ఫలించేవిగా నలరుచు మధువులు వృక్షములున్,
స్రవించు నవిగను యమృత రసంబులు సరసత యనేక విధములునూ
మధుర ఫలంబులు నయోధ్య బోయెడి మా పథముల మానుగ యందున్
లభించు గావుత! భరద్వాజముని మార్గము సొడవున మా కివుడున్! 19

'అస్తే' యనుచును భరద్వాజముని యలరి పలుకగా వేవెంటన్,
అచటనున్న వృక్షములన్నియు నలరి స్వర్గ వృక్షంబులతో
సమానముగ విలసిల్లెను నచ్చట సహజ వసంత సుకాంతులతో! 20

వారు బోవుచున్నట్టి పథంబున వనరగ సమస్త దిశలు మఱిన్,
మూడు యోజనంబుల దూరమునూ మోదముగా దరు లన్నియునూ!
ఫలములు లేనివి ఫలముల తోడను బన్నుగ ప్రకాశ మొందినవీ!
పుష్పంబులు మఱి లేని వన్నియును బుష్పంబుల విలసిల్లినవీ!
ఎండిన చెట్లును పత్రంబులతో దండిగ వికాస మొందినవీ!
తేనె పట్టులను నిండిపోయినవి దీరుగ ప్రతి వృక్షము గూడన్! 21-22-23

అటుపిమ్మట యా వానర శ్రేష్ఠులు నటు సంతోషము నందుచునూ!
స్వర్గంబును మఱి జయించినట్లుగ సరసత యానందము తోడన్!
దివ్యములగు ఫలములను భుజించిరి దీరుగ పుష్పంబుల దాల్చి!
యెగిరి గంతులను వేయుచు దరులను దగ మధువులనూ గ్రోలి రటన్!24

(యుద్ధకాండయందు 124వ సర్గము సమాప్తము)

  

# శ్రీరామకథా సుధాలహరి - యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట యిరువది యైదవ సర్గము

(హనుమంతుడు గుహునకు, భరతునకు రాముని రాకనుగూర్చి చెప్పుట- భరతుడు సంతోషించి హనుమంతునకు బహుమతి నిచ్చుటకు నిశ్చయించుట).

రఘువంశంబున బుట్టిన వాడును రమ్య విక్రమము గలవాడున్!
నగు శ్రీరాముడు నయోధ్యగాంచీ యతిప్రియమును జేయగదలచీ
అట్టి విషయమును మనస్సునందున నిట్టి యోజనయు జేసె మఱిన్! 1

బుద్ధిశాలియును దేజోవంతుడు బొలుపుగ శ్రీరాఘవుడు మఱిన్!
నాలోచించియు నంతరంగమున యతిప్రియమగు నా విషయంబున్,
వానరవీరులపై తన దృష్టిని వనరగ ప్రసరింపగ జేసీ
హనుమంతునితో నీవిధి పలికెను నాప్యాయత మనసున దొలుకన్! 2

ప్లవగసత్తమా! బహు త్వరితముగను బన్నుగ యయోధ్యపురికి మఱిన్
నాలోచించియు నంతరంగమున యతిప్రియమగు నా విషయంబున్
శీఘ్రముగా బోయిన వాడవునై శ్రీయుత నృపమందిరమందున్!
జనులందఱు మఱి కుశలమే కదా! చతురతతో నంతయుదెలిసీ!
పవనసుతా! వేగముగా రమ్మిక బన్నుగ దెలుపుము నంతయునూ! 3

శృంగబేరి పురమునకు బోయీ స్థిరముగ యరణ్యమున యందున్!
వసియించెడి యా నిషాదప్రభువగు వనరగ గుహుడనువాడు మఱిన్
నాదు మాటగా కుశలము దెలుపుము నయముగ జరిగిన విషయంబున్! 4

క్షేమముగా నే నున్నవానిగా స్థిరమగు నారోగ్యము గలిగీ,
సుఖముగ నే నున్నానని దెలిసీ సురుచిర సంతసమును నందున్!
ఆత్మసమానుండగు మిత్రుడు సుమ! యా గుహుడును నాకునుమఱియున్ 5

నిషాదాధిపతియైన గుహుండును నిర్మలమతి సంతస మందీ
అయోధ్యకును గమనించు మార్గమును శాఖరతుని వృత్తాంతంబున్
సొంతముగా వివరించును నీకును సానుకూలముగ బోవచ్చున్! 6

భరతుని తోడను నాదు మాటగా భవ్య కుశల వృత్తాంతంబున్!
తెలియజేయుమా! సీతతోని మఱి ధీరుగ లక్ష్మణు దోడుతనూ!
పితృవాక్య పరిపాలనంబునూ ప్రియముగ కావించితి ననియూ!
వివరముగా జరిగిన వృత్తాంతము విశదముగా వినిపింపుమటన్! 7

బలవంతుండగు నా రావణుడును వైదేహిని గొనిపోవుటయున్
సుగ్రీవునితో సంభాషణమును సురుచికముగ జరుగుట మఱియున్
రణమందున యావాలి వధయునూ రహి విని పింపుము భరతునికిన్! 8

సీతను అన్వేషించుట మఱియును శీఘ్రముగా సంద్రము దాటి!
అశోకవనమున నున్న జానకిని నట గనుగొన్న విధంబు మఱిన్!
లంకాదహనము నన్ని విషయములు శంకలేక దెలుపుము వేగన్! 9

సముద్రతీరము నా సేవలతో సమీపించుటయు సాగరమున్!
దర్శన మిచ్చుటయును సేతువును దగ గట్టించుట నట మఱియున్
దశగ్రీవుని వే సంహరించుటయు విశదముగా వివరింపు మటన్! 10

బ్రహ్మేంద్రాదులు వరము లిచ్చుటను బన్నుగ దీవెన లిచ్చుటయున్,
శ్రీమహేశ్వరుని యనుగ్రహంబున శ్రీకరముగ దశరథ రాజున్
గలియుట దెలుపుము మా భరతునకును కమ్మని మాటలతోని నటన్! 11

సౌమ్యుడవగు ఓ మారుతి వినుమా! సకలసత రాక్షస రాజయినా!
విభీషణునితో కపీశ్వరుండగు విపుల బలుడు సుగ్రీవునితో
వచ్చినట్లుగా మా భరతునకును వనరగ దెలుపుము శీఘ్రముగన్! 12

రాముడు శత్రుల సంగ్రామంబున త్రయమున జయించి వేగముగన్!
అనుత్తమంబగు కీర్తిని బొందీ యతి సఫలుండై కార్యమునన్!
మహాబలీయులు మిత్రుల తోడను మానుగ వచ్చుచు నుంటిననీ!
తమ్ముడైన భరతునిలో దెలుపుము! దగ మృదువాక్యంబుల తోడన్! 13

దీని నంతయును విని భరతుండును దీరుగ యటులిమ్మటను మఱిన్
నే యాకారము బొందునో మఱియు నెటుల జరించునో యదిగూడన్
గమనింపగవలె నన్ను గూర్చి మఱి కడు జాగ్రతను వహించుచునూ
నన్ను గూర్చి యేమైనను జరిగిన నయముగ గమనింపగను వలెన్! 14

సమస్తమైనా వృత్తాంతములను సరసత తెలియుగవలెను సుమా!
ముఖవర్ణంబున దృష్టిచేత మఱి మోదంబున మాటలచేతన్
భరతుని మనసున గల భావములను బన్నుగ మారుతి! దెలియవలెన్! 15

సర్వకామములతో సమృద్ధమగు సకల సంపదలతో గూడి!
గజాశ్వములునూ, రథముల తోడను గడు బలమగు సైన్యము తోడన్!
తండ్రి తాతలకు సంబంధించిన దగ విశాల రాజ్యంబు మఱిన్!
ఎవరి మనస్సునూ మార్చివేయదూ నిండ్రదభోగ రాజరికంబు మఱిన్! 16

ఇంతకాలమును నీ రాజ్యంబును సొంతముగా బాలించుటచే
శ్రీమంతుండగు నా భరతునకును స్థిరముగ యీ పరిపాలనమున్!
దనకే యుండగవలెనను గోరిక దగ మదియందున యుండినచో!
సమస్తమైనా యీ వసుమతినీ సరసత పాలించును గాతన్! 17

పవనసుతా! భరతుని మది బుద్ధియు బన్నుగ వ్యవసాయంబు మఱిన్!
దెలిసికొనుము వేగము రమ్మిటకును దీరుగ మేము నయోధ్యకునూ
చేరకముందే మార్గమధ్యమున శీఘ్రము గలియుము మా తోడన్! 18

భరతుని చిత్తము పూర్వ మెన్నడును బన్నుగ యోజింపదు నిటులన్,
అయినప్పటికిని నీతిశాస్త్రమున యలరి యున్న నీతిని బట్టి
ఈ విధమున నే జేయు చుంటినీ యిమ్ముగ యాతని బరీక్షయున్
మానవులందున శ్రేష్ఠ దాతడును మర్యాదను మఱి దప్పడుగా
మానుష రూపమ్ములో నున్నట్టి మహాత్మ రూపమా భరతుండున్! 19

మహోన్నతంబగు నుత్తమ మార్గము మఱి దప్పడు మా భరతుండున్,
నాతని హృదయము నాకు దెలియునూ నరవిందమువలె పవిత్రమున్,
నా గుఱించి తన ప్రాణములైనను నయముగ త్యజించు విక్రమునగన్! 20

ఈ విధముగ యాజ్ఞాపింపగబడి నిమ్మగ పవనసుతుండు మఱిన్,
తొందర బడుచును మానుషరూపము చందముగా ధరియించి మఱిన్,
అయోధ్యవైపుకు బోయెను నాతడు నదురు బెదురు లేకుండగనూ!
అటుపిమ్మట యా వాయుపుత్రుడును హనుమంతుండును వేగముగన్,
బన్నగోత్తమము బట్టదలచినా బన్నుగ వినతా సుతుని వలెన్,
ఎగిరినట్లు బై కెగెరెను మారుతి దగ బాహువులను జాచి మఱిన్! 20

వీర్యవంతుడగు హనుమంతుండును విహగేంద్రాలయమును నైనా
శుభకరమగు దన పితృపథంబును సురుచిరముగ లంఘించి మఱిన్!
గంగా యమునా సంగమంబునూ సంగతిగను దాటుచు వేగన్!
శృంగబేరి పురమును దా జేరి రంగుమీర యా నిషాదుడే
గుహుని సమీపించియు సంతసమున కూరిమి శుభకర వాక్యములన్
మానుష భాషను సంభాషించెను మాధుర్యము జిందుచు వేగన్! 21-22

రఘువంశంబున బుట్టిన వాడును రమ్యసఖుడు నీకును మఱియున్
సత్యపరాక్రముడైన రాఘవుడు చనుదెంచుచు నున్నాడు మఱిన్
సీతా లక్ష్మణ సమేతుడై మఱి శీఘ్రము నిట కొచ్చును వేగన్
నీకుశలంబును నడుగుచు నుండెను నిర్మలమతినీ గూడికొనీ! 23

నేడు మహాముని మాట ప్రకారము నిర్మలమతి యా రాఘవుడున్
పంచమి నాటి రాత్రి యాశ్రమము బన్నుగ యచ్చోటను గడిపి
రేపు బయలుదేరును శీఘ్రముగా రేపు యిచటికిని రాగలడూ
అచిర కాలమున సీతారాముల నవలోకింతువు కనులారా! 24

మహాతేజమును గలవాడును మఱి మహాబలుండగు మారుతియున్
గుహునితోని యామాత్రము బలికి కూరిమి మఱియొక యోజనమున్
లేకుండగనే మహావేగమున లీలగ వేగముగా నెగిరెన్! 25

మార్గమునందున హనుమంతుండును మహానదులు వాలూకినినీ,
పరశురామ తీర్థంబును మఱియును బన్నుగ వరూథినీ నదినీ,
గోమతీ నదిని; శాలవనంబును కూరిమి వేల ప్రజావళినీ,
విశాలంబులగు జనపదమ్ములనూ వేడుకగా మారుతి గాంచెన్! 26

కపికుంజరుడగు హనుమంతుండును గడు వేగముగ గమించుచునూ!
బహుదూరంబును దాటిపోయి మఱి బన్నుగ గాంచెను నచ్చోటన్
దేవేంద్రుని యుద్యానవనంబగు దీరుగ నందన వనమందున్,
చైత్రరథంబును నుపవన మందలి శ్రీకరమగు దరువుల తోడన్,
సమముగ నందీ గ్రామంబునకును సరసనగల యుపవనమునకున్,
సమీపించెనూ యా యుపవనమును సరసత పడతుల చేత మఱిన్
పుత్రులతో కూడియు బాగుగనూ బొలుపుగ యలంకరించుకొనీ
విహరించెడి వృద్ధుల సేవలనూ విరాజిల్లు చుండెను నదియున్! 28

అయోధ్య నుండియు క్రోశము దూరము నలరియున్న యుపవనమందున్,
నారచీరలును కృష్ణాజినమును నయముగ వస్త్రములును గలిగీ,
దీనుండును కృశియించిన వాడును దీరుగ జటులను గలవాడున్,
యల దిగ్గాంగుడు! భాతృ వ్యసనమున మానుగ దుఃఖిత డగువాడున్,
ఫలమూలంబుల భుజించువాడును బన్నుగ దాంతుడు నగువాడున్
తాపసుండు, మఱి ధర్మచారిణుడు తగ సమున్నతము నగు జటలన్
వల్కలాజినములును వస్త్రంబులు వనరగ గలిగినవాడు మఱిన్,
నియమవంతుడును, భావితాత్ముడును బ్రహ్మఋషులతో సమానమున్!
తేజస్సును మఱి గలిగినవాడును దీరుగ రాముని పాదుకలన్!

నెదుట నుంచుకొని వసుమతి యంతయు నింపుగ బాలించెడి వాడున్,
చాతుర్వర్ణాత్మకమగు లోకము సమస్త భయముల నుండియునూ,
రక్షించెడీవాడును, శుచులైనా రమ్యముగా మంత్రుల జేతన్,
పురోహితులచే గూడినవాడును బొలుపుగ తమ విధులందుననూ,
సావధాన చిత్తముతో నుండెడి సైన్యనాయకుల జేత మఱిన్!
నుపస్థితుండై యుండినవాడును నున్నతమగు నాశ్రమ మందున్!
వసించువానిని కైకేయీ సుతు వనరగ భరతుని మారుతియున్
కనులగాంచి యాశ్చర్యము నందెను గడు మనోహరముగా గాంచి! 29-33

ధర్మమునం దాసక్తియు గలిగిన దగ యా యయోధ్య పౌరులునూ,
నారచీరలును కృష్ణాజినమును నయమున వస్త్రములును గలిగీ,

ఏ భోగములను ననుభవింపకను నిలనుండిన భరతుని గాంచి,
తాముగూడ భోగములను బొందగ దగ నిరాకరించిరి వారున్! 34.

మారుతాత్మజుడు హనుమంతుడును మానుగ ధర్మజ్ఞుండైనా
మఱియొక ధర్మము యనునట్లుండిన మహామతియునగు భరతునితో,
ప్రాంజలితో నీవిధమున బలికెను బన్నుగ వినయ సువాక్యములన్! 35

దండకవనమున నివసించిన యా దయాశీలుడును విక్రముడున్,
నారచీరలును ధరించి దిరిగెడి నయముగ యేరాముని గూర్చి
దుఃఖము నొందుచు నున్నావో మఱి దోరముగా నా రాఘవుడున్,
నీ క్షేమంబును ప్రశ్నించెను మఱి నిజముగ నే బలుకుచు నుంటిన్! 36

దేవా! నీకును ప్రియవాక్యంబును దీరుగ దెలుపుచు నుండి నిదే!
సుదారుణంబగు శోకము వీడుము సురుచిరముగ నీ సోదరుడే!
శ్రీరామునితో నీ ముహూర్తమున స్థిరముగ గలియుదు వింక మఱిన్! 37

రావణాసురుని సంగ్రామంబున నయముగ సంహారము జేసి,
మిధిల రాజసుత నంది మఱలనూ సిద్ధించిన కార్యము తోడన్,
బలవంతులునగు సన్నిహితులతో బన్నుగ వచ్చుచు నున్నాడున్! 38

మహాతేజమును గల లక్ష్మణుడును మహేంద్రుతో గూడిన యట్టి
శచీదేవి వలె రాముని తోడను సాధ్వి యశస్విని జానకియున్,
వచ్చుచున్న వారలు వేగముగా జెచ్చెర విమాన ముందుననూ! 39

హనుమంతుని యా వచనములను విని యలరుచు కైకేయీ సుతుడున్
భరతుడు సంతోషించిన వాడై బన్నుగ ధరణిని బడిపోయెన్,
హర్షమువలనను మూర్ఛను జెందెను హర్షబాష్పములు రాల్చుచునూ 40

అటుపిమ్మట రఘువంశము నందున యలరి జనించిన భరతుండున్
ముహూర్తకాలము నందు లేచియును మోదముపడుచు మదియందున్
ప్రియమును బలికిన వాయుసుతుని గని ప్రేమమీరగను నిటులనియెన్ 41

శ్రీమంతుడునగు నా శీతతుంతును శీఘ్రముగా హనుమంతు డీతిన్,
హృదయమునను మఱి కౌగలించుకొనె సదయ తనదు సోదరునికి వలెన్!
ఆనందాశ్రువులను రాల్చెను మఱి యశ్రుధార నాతని దడిపెన్! 42

ఓ సౌమ్యుడ నామీద జాలితో నానరగ యిట నీ వొచ్చితివి
దేవ పురుషుడవా మానవుండవో? దీరుగ వివరింపగ లేనూ!
ప్రియవృత్తాంతము వినిపించితివి ప్రీతిని యిచ్చెద నీకు మఱిన్! 43-44-45

లక్షగోవులను నూఱు గ్రామములు లాలితముగ నేనిచ్చెదనూ!
కుండలములతో గలిగిన యట్టి మెండుగ సదాచారవతులైనా
అవివాహితలను షోడశ కన్యల నలరు భార్యలుగ యిచ్చెదనూ!
బంగరు శరీర ఛాయ గలిగినా రంగుగ నాశిక లూరువులున్
చంద్రునివంటీ ముఖములు గలిగిన సకలాభరణములును గలిగి
ఉత్తమ గులజాతులు నగు స్త్రీలను సత్యముగా వారలను మఱిన్,
దాసీజనముగ యర్పించెదనూ దగ స్వీకారము జేయు మిదే!
నృపాత్మజుండగు భరతుడంతటను నిర్మలమును నత్యద్భుతమౌన్
రాముని యాగమనంబును గూర్చియు రయమున మారుతి చేత మఱిన్
అన్నయైన శ్రీరాముని గాంచగ నలరుచు సంతోషము గాంచన్
ఆనందముతో నటునిటు నూగుచు నాంజనేయునితో నిటు లనియెన్ 46

( యుద్ధకాండయందు నూటయిరువదియైదవ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# శ్రీరామకథా సుధాలహరి-యుద్ధకాండము

## రెండవ భాగము

### నూట యిరువదియాఱవ సర్గము

(హనుమంతుడు సీతారామలక్ష్మణుల వనవాస సమయమునందు జరిగిన వృత్తాంతము జెప్పుట)

బహువర్షంబులు వనమునకేగిన ప్రభువగు రాఘవు గూర్చి మఱిన్
ప్రీతికరంబగు శుభవర్ణనమును ప్రేమను వినుచున్నాను కదా
యదృష్టమన్నది నాది కదా మఱి యారాముని కథ వినుచుంటిన్! 1

మానవు డిలలో బ్రతికియున్నచో మానుగ శతవర్షములకునూ
యానందము లభియించు ననియెడి యలరెడి లోకోక్తియు నిజమూ!
నా విషయంబున కల్యాణముగా నయముగ ఫలియించెను నేడున్! 2

ఆ రామునకును వానరులకు మఱి యల యే దేశమునందుననూ,
ఎందునిమిత్తము సంబంధంబును చందముగా నేర్పడెను మఱిన్
నడుగుచున్న నాకును యథార్థముగ యలరి దెలుపుమో పవనసుతా! 3

మునులు గూర్చొనెడి యాసనమందున మోదముగా బృసి యందుననూ
గూర్చొనగ జేసియు హనుమంతుని కూరిమితో నా భరతుండున్,
ప్రశ్నింపగ యా పవనసుతుండును బన్నుగ యావన మందుననూ
జరిగిన వృత్తాంతంబంతయునూ సరసత దెలిపెను భరతునికిన్! 4

మహాబాహు! ఓ భరతవిభూ! విను మానుగ నాదు సువచనములన్,
నీదు మాతకును రెండు వరములను నిర్మలమతితో దశరథుడున్,
నిచ్చుటయును మఱి రాముఢు వనికిని జెచ్చర బంపగ బడుటయునూ!
పుత్రశోకమున రాజు దశరథుడు బొందుగ మరణించుటయు మఱిన్
దూతలజేతను రాజగృహమునకు దోరముగా నెటు వచ్చితివో
అయోధ్యకును నీ వొచ్చిన తదుపరి యలరి రాజ్యమును గైకొనగన్,
నిరాకరించితివో వేగముగా నిర్మలమతి సత్పురుషులయున్,

ధర్మ మాచరించెడి నీవును మఱి దగ ప్రయాణమును జేసి మఱిన్
చిత్రకూటమును జేరి సోదరుని శ్రీకరముగ శ్రీరాజ్యంబున్! 5-9

స్వీకరింపగా గోరితివో మఱి శ్రీరాముడు దన రాజ్యంబున్
విసర్జించెనో యతని పాదుకల విమలమైన మతితోని మఱిన్
మఱల వచ్చితివొ యంతయు నీకును మానుగ దెలియును రఘు...!
తిరిగివెళ్ళినా వాడ వగుచునూ దీరుగ జరిగిన దంతయునూ
తెలిసికొనుము! నానుండి భరతుడా! దీరుగ చేతో మోదముగ...!

అటు నీవును మఱి వెడలిపోవగా చటుల విక్రముడు రాఘవుడు...
సముద్రాంతమగు మృగములు, పక్షులు సరగున ...ంపగ బడ...,
నున్నవనంబును ప్రవేశించెనూ జెన్నుగ రఘునందను డపుడు...! 10

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును నటు గజముంచే సంచియు...
సింహ వ్యాఘ్ర మృగముల వ్యాకులమై స్థిరముగ నిర్జనమైయు...
భయంకరంబగు దండక వనమును ప్రవేశించె రాఘవు డంత...! 11

దట్టమైన యా వనము నందునను దగబోవుచు నుండగ వారు...!
ఎట్టియెదుట సుమహానాదంబును గట్టిగ యఱచుచు కేకంతో!
విరాధుడను నొక మహారాక్షసుడు వికటముగా గనిపించె నట...! 11

ఊర్ధ్వబాహువులు మహానాదమును నురుతరముగ చేసెడి వానిన్!
నఱచుచున్న గజమునువలె నాతని యధోముఖముగా త్రొక్కిం...!
గోతిలోనికిని బడగ ద్రోసిరీ గోం మాన్పగను రాక్షసుని! 13

సోదరులునగు, రామలక్ష్మణులు ...రులు నెవ్వరు ... జగతిన్
జేయగజాలని కార్యము జేసి శీఘ్రము సాయంకాలమునన్
శరభంగుని యాశ్రమము జేరిరి సరసగతిని వారల వేగన్! 14

శరభంగుడు స్వర్గమును బొందగా సత్యపరాక్రమమాతైన...
రామచంద్రుడును సమస్తమునులకు రక్షణ వమన...
జనస్థానంబును జేరెను రాముడు ... లక్ష్మణు ... గూడి! 15

అటుబిమ్మట శూర్పణఖ రాక్షసియు ఇటుల విక్రమముని రఘువీరున్!
జేరవచ్చెనూ మోహింపగనూ స్థిరముగ లక్ష్మణుని గూడన్!
ఆజ్ఞాపింపగ రామచంద్రుడును నా లక్ష్మణుడును వే వెంటన్
ఖడ్గము ధరించి ముక్కును జెవులను ముదమున చేదించెను నచటన్! 16

అట నివసించుచు నున్న సమయమున యామహాత్ముడగు రాఘవుడున్,
జనస్థానంబున వసియించెడి యా జనులజరపు రాక్షసులను మఱిన్!
పదునాలుగు వేలకు మించిన యా బరగ రాక్షసుల వధియించెన్! 17

కలిసి యుద్ధ రంగమునకు వచ్చిన గల రాక్షసులను నందఱినీ!
ఒక్కరాముడే సాయంకాలము నొక ముహూర్తకాలము నందే
సంహరించెనూ దన సాహసమున సరసత మునులను రక్షింపన్! 18

రాముని జేతను సంగ్రామంబున రమ్య విక్రమము గలిగిన యా
మహావీర్యులును, మహాబలము గల మానుగ మునుల దపస్సులనూ,
విఘ్నము గలిగించెడి వారలునూ వికట రక్కసులు దండకనూ!
వసించునట్టి మహారాక్షసుల వనరగ సంహారము జేసెన్! 19

ఆవహమందున శ్రీరాముండపు నలరి రాక్షసుల నందఱినీ
సంహారము గావించెను శీఘ్రము సంహరించె ఖరునిని గూడన్!
ముందుగ దూషణు వధించి వేసెను, చందము త్రిశిరస్సును గూడన్! 20

అటుబిమ్మట రాక్షస సంహారము నటు జరిగిన బిమ్మటను మఱిన్!
మూర్ఖురాలునగు శూర్పణఖయు మఱి ముఖము మార్చుకొని లంకకునూ
బోయి రావణునితోని జెప్పెనూ బొలుపుగ రాముని జాడలునూ! 21

అటుబిమ్మట రావణుని యనుచరుడు నలరి భయంకరు డైనట్టి
మారీచుండను రాక్షసుండు మఱి మానుగ రత్న వికారంబున్!
మృగముగా నగుచు వైదేహిని మఱి దగ ప్రలోభమున బురికొల్పెన్! 22

ఆ వైదేహియు మృగమును గాంచి నలరుచు రామునితో ననియెన్!
నీ మృగమును మఱి బట్టుకొను మదే నింపుగ మన యాశ్రమమునకున్!

ఐహుసుందరముగ మనోహరముగా బరగుచుసుండును దిరుగుచునూ
నా హృదయంబును లాగుచున్నదీ నయముగ యందము చందములున్! 23

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నలరుచు చాపము ధరియించీ
మృగము వెంట బడిపోయెను నాతడు దగ బరుగెత్తెను నా మృగమున్
బరుగులు దీయుచు వారిరుపురునూ సరగున బోయిరి దూరముగన్!
పాఱిపోవు నా మృగమును రాముడు బన్నుగ గొట్టెను బాణమునన్! 24

ఓ సౌమ్యుడ! యా రాఘవేంద్రుడును నొనరగ మృగమును గూర్చియునూ
తరలిపోవగా సౌమిత్రియునూ దగ బోయిన వాడగుచుండన్
రావణాసురుడు నాశ్రమమందున రయమున జొచ్చెను దొంగ వలెన్! 25

అంబరమందున యంగారకుడును నలరి రోహిణిని జేరినటుల్
రావణాసురుడు బలవంతముగా రమణి జానకిని బట్టుకొనెన్,
రక్షింపగ దలచిన జటాయువును రణమునందు నిహతుని జేసీ
సీతను గైకొని రావణాసురుడు శీఘ్రముగా లంకకు జనియెన్! 26

అటుపిమ్మట యద్భుత సంకాశులు నల పర్వత శిఖరము మీదన్
నున్నవారలును పర్వతంబుతో నొనరగ సమానులునునైనా
వానరవీరులు రావణాసురుడు నొనరగ సీతను గ్రహియించీ
అంతరిక్షమున బోవుట గాంచియు నాశ్చర్యంబును జెంది రటన్! 27-28

అటుపిమ్మట రాక్షస ప్రభువైనా యతి బలాఢ్యుడగు రావణుడున్,
శీఘ్రతరముగా బోవుచు వేగము స్థిరమగు సువేగమును గలుగగా!
పుష్పక మనియెడి విమాన మందున పూని జానకిని గూడికొనీ
యారోహించియు యంబర మందున యా లంకాపురి యందు దిగెన్! 29

రావణుడంతట సీతాదేవిని రమ్య సువర్ణ సుభూషితమౌ
శుభకరమగు నొక మహాగృహంబున సుశీలయగు జానకినుంచీ
మాటలతో నోదార్చి మఱియునూ మానుగ బలిమాలెన్నో నామెన్! 30

ఆ వైదేహియు నతని భాషలను నా నైరృత పుంగవుని మఱిన్
గడ్డిపరకయంతయు విలువయునూ కదిరి నివ్వకను నిరసించన్,

నిరాశజెందియు రావణాసురుడు నిరతము నామెను వేధింపన్
అశోక వనమున నుంచెను సీతను నల రాక్షస స్త్రీలకు మధ్యన్! 31

ఆ సమయంబున రామచంద్రుడును నా మృగమును దెగటార్చి మఱిన్
వెనుకను మఱలెను నా సమయంబున నలరి వచ్చు రాఘవుడు మఱిన్
వనమునందు నా జటాయువును గని వనరగ మదిలో వ్యథ జెందెన్
పితృసముండగు జటాయువును వని పేరిమి వధింప బడుటయుమా
మనసునందు వ్యథజెందెను బహుళము కనుల జిందె భాష్పములు మఱిన్!

వైదేహిని యన్వేషించెడి యా వనరగ రాముడు లక్ష్మణుతో
గోదావరినది తీరప్రాంతమును కూరిమి పుష్పించిన యట్టి
వనోద్దేశముల యందు దిరిగెనూ వనరగ సీతను వెదుకుచుమా! 23-33-34

రామలక్ష్మణులు మహారణ్యమున రహి కబంధుడను నామమునూ
గలిగినట్టి గంధర్వుని గలిసిరి కడు రాక్షసు రూపము గలుగూ
సత్యపరాక్రముడై రాముడును సరసత కబంధు మాట వినీ
పర్వతగిరియగు ఋష్యమూకమును బన్నుగ జేరియు సుగ్రీవున్
స్నేహము జేసెను హృదయ పూర్వకము చిరస్నేహము బెంపొందగనూ!

ప్రారంభమునందే వారిరువురు బన్నుగ ప్రీతి సమాగమమున్
ప్రేమపూర్వకముగా జరిగెను నట ప్రీతి, స్నేహములు బెంపొందెన్
అన్నయైన వాలియు సుగ్రీవుని జెన్నుగ దూరముగా దరిమెన్
ఆ శ్రీరాముడు నా సుగ్రీవుడు నట పరస్పరము భాషింపన్
వారల స్నేహము ప్రగాఢమాయెను వనరగ విడదీయగరానీ! 36-37

స్వబాహు వీర్యముజేత రాఘవుడు సరసత మహా బలీయుండున్
మహాకాయమును గలిగిన వాలిని మానుగ సమరమునందునమా
వధించి సుగ్రీవుని రాజునుగా జేసెను కిష్కింధకు మఱియున్! 38

రాజ్యమునకునూ యభిషిక్తుండై రమ్యముగా సుగ్రీవుండున్
సమస్త వానరులను గూడికొనీ సరసత శ్రీరామునితోడన్,
సీతాన్వేషణ గావించెదనని శీఘ్రము ప్రతిజ్ఞ దా జేసెన్! 39

మహాత్ముండు మఱి వానర ప్రభువగు మానుగ సుగ్రీవుని జేతన్!
ఆజ్ఞాపింపగబడి కపివీరులు నలరుచు బది కోట్లకు పైనన్
అన్ని దిక్కులను గూర్చి వెడలిరీ యా వైదేహిని వెదుకగనూ! 40

పర్వత శ్రేష్టము వింధ్యము నందున బరగ దారితప్పిన మేమున్!
దారుణమగు శోకంబు జేతమఱి దరిగానక యుండిన మాకున్
చాలకాలమట గడిచిపోయినది విలపించుచు నుంటిమి యచటన్ 41

జటాయువునకు మఱి సోదరుడైనా సహజ పరాక్రమ వంతుడునూ
సంపాతీయను పక్షిరాజొకడు సరసజాక్షియగు వైదేహి!
రావణు మందిరమందు నున్నదని రయమున దెలిపెను మాకు నటన్! 42

దుఃఖపరీతులునగు జ్ఞాతులయును దుఃఖంబును దొలగించుచునూ!
అట్టి సమయమున నే ముందడుగిడి యిట్టె నాదు బలవీర్యములన్
సూతగా గొనుచు సముద్రమందున నూఱు యోజనములను దాటీ,
లంకాపురికిని జేరితి నేనూ శంకలేక యేమాత్రమునూ! 43

ఆ లంకాపురి యశోక వనమున యలరి గాంచితిని స్త్రీని మఱిన్
పట్టు జీర ధరియించి నట్టిదీ బహు మాలిన్యము దోడుతనూ!
ఆనందంబునులేని వనితనూ నల దృఢనియమములను గలిగీ,
యుండినట్టి యొక వనితను గాంచితి మెండుగ శోకము గూడినదీ! 44

నే నామెను మఱి సమీపించియును నిర్మల భక్తిని గూడికొనీ
అనిందితయునగు నా సాధ్విని నే యథా న్యాయముగ సర్వమునూ
యడిగి తెలిసికొని రామనామమును నలరి గుర్తుగల యుంగరమున్
ఆనవాలుగా నిచ్చితి నామెకు నా శ్రీరాముడు నిచ్చినదీ! 45

ఆనవాలుగా గ్రహించి మణినీ యా సీతాసతి నుండి మఱిన్,
చరితార్థుడనై తిరిగివచ్చితిని జేరితి కిష్కింధకు మఱలన్,
కాంతిగలిగినా యా మహామణిని భ్రాంతిలేక శ్రమలేకుండన్
ఘనులు సాధించు రామచంద్రునకు బరగ నిచ్చితిని సద్భక్తిన్! 46

సీత వార్త విని శ్రీరాముండును శీఘ్రము మరణింపగ నున్నా
రోగి యమృతము త్రావిన రీతిని రూడిగ యా రఘువీరుండున్,
జీవితమందును నాశను జెందీ స్థిర ధైర్యంబును నతడొందెన్! 47

ఉద్యోగంబును జేయదలచుచును నున్నతుడైన విభావసుడున్,
లోకాంతపుకాలంబు నందునను లోకంబులు గాల్చగదలచూ,
మహాగ్నిజ్వాలగ రఘురాముండును మానుగ లంకాపురము మఱిన్,
ధ్వంసము జేయుటయందు మనస్సును దగ ధరించె నిశ్చయ మపుడున్!48

అటువిమ్మట శ్రీరామచంద్రుడును నట సముద్రమును జేరికొని
నలుని జేత మఱి సేతుబంధనము నయముగ నిర్మింపగ జేసెన్!
ఆ సేతువు ద్వారా కపిసేనయు నలరి దాటె సంద్రమునంతన్! 49

నీలుండనియెడి వానర యోధుడు నల ప్రహస్తుని వధియించెన్,
రఘురాముండును, కుంభకర్ణుని రావణులను వధియించె నటన్,
రావణసుతుడగు నింద్రజిత్తునూ, తహి సౌమిత్రియు వధియించెన్! 50

శ్రీమంతుడును, పరంతపుండును స్థిర విక్రముడగు రాఘవుడున్,
ఇంద్రునితోడను, యమునితోడనూ సాంద్రబలుడు వరుణునితోడన్,
మహేంద్రుతో మఱి బ్రహ్మతోడుతను మానుగ దశరథు తోడుతనూ
కలిసి వారిచే వరముల బొందెను కనికరింపబడి వారలచే
వచ్చిన మునులును,ఋషులందఱునూ, జెచ్చెర వరములనిచ్చిరటన్!51-52

ప్రేమతోని వారందఱు యిచ్చిన ప్రియమగు వరముల గైకొనియున్,
రామచంద్రుడును కపివీరులతో రయమున పుష్పక మందుననూ
కిష్కింధా నగరంబును జేరెను కోశాధిపతియు గొలువంగన్! 53

కిష్కింధా నగరము నుండియునూ కీశాధిపతిని గూడికొనీ,
ఆ శ్రీరాముడు గంగాతీరము నటజని మున్యాశ్రమములనూ,
కనుగొనుచును ముని భరద్వాజునీ గడు పవిత్ర యాశ్రమమందున్,
నున్నవాడు సుమ! పుష్యమి యోగము కన్నుల గాంచుము రేపు మఱిన్
ఎట్టి విఘ్నములు లేకుండగనే యిట్టె దర్శనము జేయుదువూ! 54

అటుదిమ్మట యా భరతకుమారుడు నా మారుతి మధురము నైనా
వాక్యంబుల విని సంతోషించుచు వనరగ యంజలి గూడికొని,
మనస్సునకు నానందము గలిగెడి మధుర వాక్యమును [illegible]!
నా మనోరథము చిరకాలమునకు నయముగ దీరెను గద [illegible]! 96

(యుద్ధకాండము యందు 126వ సర్గ సమాప్తము)

* * *

## శ్రీరామకథా సుధాలహరి (యుద్ధకాండము)

### రెండవ భాగము

### నూట యిరువదియేడవ సర్గము

[రాముని సత్కారముకొఱకు అయోధ్య [illegible]— [illegible] నెదురేగుటకై పౌరులందఱును నందిగ్రామములోనున్న [illegible] జేరుట—రాముడు నందిగ్రామము జేరుట — [illegible] గలియుట—పుష్పక విమానమును కుబేరుని యొద్దకు [illegible]]

సత్యవిక్రముడు పర పురంజయుడు శత్రువీర [illegible]
నగు భరతుండును నా హనుమంతుని [illegible]!
మధుర వాక్యమును విని శీఘ్రముగా [illegible]
శత్రుఘ్నుని గని యాజ్ఞాపించెను [illegible]! 1

సమస్తమైనా దేవి దేవతల సకల [illegible],
గుడి గోపురముల మండపములను [illegible]
పూలమాలలను వాద్యంబులతో [illegible]! 2
పవిత్రులును నై ప్రజలందఱును [illegible]

స్తుతి పురాణములు దెలిసిన సూతులు మతి నెఱిగిన పౌరాణికులున్,
వైతాళికులును, వాద్య నిపుణులును వసరగ వన్నెల వేశ్యలునూ!
రాజుభార్యలును నమాత్యులును మఱి రయమున బోయెడి సైన్యములున్,
నటవీ ప్రాంతపు సేనలు మఱియును నలరు స్త్రీగణములును విప్రుల్,
రాజపుత్రులును శ్రేణీముఖ్యులు రమ్యమైన వృత్తుల వారున్
చంద్రునితోడను సమానమైన సాంద్ర ముఖముగల శ్రీరామున్,
దర్శించుటకై బయలుదేరుడూ దగు సన్నాహముల తోడన్! 3-4

శత్రువీర సంహారకుడైనా శత్రుఘ్నుడు బహు శీఘ్రముగా
భరతుని మాటలు విని నాతండును బహువిధ చతురుల పనివారిన్
వేఱువేఱుగా పనులు జేయుటకు విడివిడి గుంపులు గుంపులుగా
నియమించెను నా శత్రుఘ్నుండును నీతివిదుల శిల్పుల వేగన్! 5

ఇచటి నందిగ్రామము నుండియునూ యచటి యయోధ్యాపురి వఱకున్,
పల్లములను మఱి పూడ్చి వేయుడీ బన్నుగ మెత్తగ నుండునటుల్,
ఎత్తువల్లముల స్థానంబులనూ యొత్తిలకుండగ వాహనముల్,
ఆ భేదము లేకుండు నట్లుగా నలరి చేయుడో కర్మకరుల్! 6

సమస్తమగు పృథివీ తలమంతయు హిమ శీతల యుదకము జేతన్,
నడుపుడు వేగము! నటుభిమ్మట మఱి దగ పథముల నన్నింటి మఱిన్
లాజలచేతను పుష్పంబులచే లాలిత్యముగా జల్లవలెన్! 7

పురవరోత్తమంబగు నయోధ్యలో పూనికతో వీధుల నన్ని
పతాక ధ్వజముల తోడుత మిక్కిలి బన్నుగ శోభను సమగూర్చి,
సూర్యోదయ సమయానికి పురమున సురుచిర గృహముల నన్నియునూ!
అలంకరింపగ బడవలెను సుమా నలరు తోరణంబుల గూర్చి,
పసుపు కుంకుమల రాజిల్లగవలె ప్రతిగుమ్మము వాకిళ లందున్! 8

వందలకొలదియును పనివారల మఱి చందముగా వాసన గలుగూ!
ఐదురంగులా చూర్ణంబులు మరి నలరు పుష్ప మాలాపంక్తుల్,
విశాలమైన రాజమార్గమున వేడుకగా జల్లగ వలయున్

విడినిడిగా పూవులను జల్లి మరి విమలమైన పూరేకులనూ
జల్లవలెను సుమ! రంగుల తోడను చక్కని ముగ్గులు బెట్టి మరిన్ ! 9

అటుపిమ్మట శత్రుఘ్నుని యాజ్ఞను దృష్టి, జయంతుడు, విజయుండున్,
అర్థ సాధకుడు, సిద్ధార్థుడు మరి యశోకుడును మరి సుమంత్రుడున్,
మంత్రపాలకుడు,సంతోషముతో మంత్రు లందఱును వెడలిరటన్!10-11

కొందఱు ధ్వజములతోని గూడినా సుందరముగ దీర్చిన యట్టి
మదగజములపై నెక్కి బోయిరీ మానుగ శత్రుఘ్నుని యాజ్ఞన్
నడుమున బంగరు త్రాళ్ళు గలిగినా నయముగ గజముల నెక్కి మరిన్
కొందఱు బోయిరి రథముల పైనను కొందఱు బోయిరి రథికులునూ! 12

శక్తులు, ఋష్టులు, పాశంబులు మరి హస్తంబుల ధరియించియునూ
ధ్వజములు పతాకములు ధరియించిన దగ పదాతులును వెడలగనూ
అశ్వంబుల నెక్కిన యోధులునూ నటు నిటు వెడలగ వీరులునూ!
అలంకరింపగ యయోధ్యపురినీ యందచందములు వెలయింపన్,
బయలుదేరి పోయిరి యయోధ్యకును బంగరు బాటను దీర్చుచునూ!13-14

అటుపిమ్మట దశరథుని భార్యలును నా కౌసల్యను సుమిత్రనూ,
ముందు నుంచుకొని వాహనమెక్కి చందముగా వెడలిరి వారున్,
కైకేయీ సతితో వారందఱు కదిలిరి నందీ గ్రామంబున్! 15

ఆ సమయంబున ధర్మాత్ముండును నలరి ధర్మ మెఱిగిన వాడున్,
మహాత్ముండునగు భరతకుమారుడు మానుగ రాముని పాదుకలన్!
శిరసుపైని ధరియించి రామునకు శీఘ్రముగా నెదురుగ బోయెన్!
ఆ భరతుండును నుపవాసంబుల నలరి కృశించియు దీనుండై
నారచీరలను కృష్ణాజినమును నయముగ ధరించి యుండె నటన్,
ఇంతటి సుదీర్ఘ కాలము నందున నింతటి సంతోషంబు మఱిన్,
తొలిసారిగ గలిగినది సోదరుని తోరముగా రాకను గూర్చి,
వినినపుడే భరతునికి గలిగినది విమలానందము సంతసమున్!

తెల్లని పుష్ప సుమాల్యంబులచే దీరుగ యలంకరించినదీ,
స్వేత చత్రమును హేమభూషితము శ్రీకరమగు వింజామరలున్,
కరమున గ్రహించి శ్రీరామునకును గడు వినయంబున నెదురేగెన్!

శంఖధ్వనులును భేరీధ్వనులును పొంకముగా వెడలిన యతనీ,
వందిమాగధులు స్తోత్రంబులతో చందముగా కీర్తింపగనూ,
బ్రాహ్మణ శ్రేష్ఠులు, శ్రేణుల నేతలు బన్నుగ వర్తకులును మఱియున్,
పుష్ప మాల్యములు, ఫల పుష్పంబులు బొలుపుగ మధుర పదార్థములున్,
హస్తంబులతో ధరించినట్టి యామంత్రులు మఱి సచివులునూ,
ఆ భరతుని మఱి యనుసరించుచును యలరి బోయిరీ వెనువెంటన్! 16-20

అశ్వంబుల ఖుర శబ్దంబులచే నలరెడి రథ చక్రాంతములా,
ధ్వనుల చేత మఱి శంఖదుందుభుల దగ బహునాదంబుల చేతన్,
భూమియంతయుచు నదిరినట్లుగా భూరిధ్వనులు నట రాజిల్లెన్! 21

అయోధ్య నగరంబంతయు గూడను నలరి నందిగ్రామము జేరెన్,
వృద్ధులు, బాలలు, యువకులు, స్త్రీలును వికలాంగులు గూడనుమఱియున్
నా శ్రీరాముని యాగమనమునూ నలరి గాంచుచుండిరి యచటన్,
భరతుడు బరిశీలించి జూచి మఱి పావనితో నిటులను బలికెన్! 22

కపులకు సంబంధించు జపలమును గడగి చంచలత లేదుగదా!
అన్నగారు శ్రీరామచంద్రుడును జెన్నుగ యేడీ యెచటెచటా?
కనిపించుటలేదు గదా మారుతి? కన్నుల పండువుగాగ మఱిన్! 23

భరతుం డా విధి బలుకుచుండగా బన్నుగ హనుమంతుడు మఱిన్,
సత్యవిక్రముండగు భరతునితో సరసత విజ్ఞాపన తోడన్
అర్థయుక్తమగు వాక్యము బలికెను నందఱు వినగా భరతునితో! 24

భరద్వాజముని ప్రసాదంబుచే బరగ సదా ఫలములు గలిగీ
పుష్పింపిన మఱి మధువులు రాల్చుచు బొలుపుగ భ్రమరంబుల చేతన్
ధ్వనింపబడెడీ తరువుల నందీ సంతసమందుచును మఱియున్,
వనౌకసుల యా భయంకరధ్వని వనరగ వినబడు చున్నదదే!

పరంతపా! యా భరద్వాజునకు బన్నుగ దేవేంద్రుడు మఱిన్,
మహావరంబును ప్రసాదించెనూ మానుగ వరప్రభావముచే,
పూర్వము నీకును నీ సైన్యమునకు బొలుపుగ యాతిథ్యమును మఱిన్,
సర్వగుణంబులతో గూడినదీ చక్కని సత్కారము జేసెన్!
అదిగో! యదె! వానరసేనయునూ నలరుచు గోమతి నదిని మఱిన్,
దాటుచున్నదని దలచుచుంటినీ దగ నా మనసున నిక్కముగన్! 25-26-27

సాల వనంబున వైపున గనుమా! సముద్భృతముగ పరాగమున్,
మహావీరులగు వానరసైన్యము మానుగ సాలవనంబు మఱిన్
కదిపి వేయుచున్నారని దలచెద కనుగొను మల్లదె కపిసేనన్! 28

చంద్రునితోడను సమానమైనా సాంద్రమైన యా విమానమున్,
దూరమునుండియు గనబడుచున్నది దోరముగా నంబర మందున్,
దివ్యమైన పుష్పక విమానమును దీరుగ మనస్సుజేత మఱిన్,
విశ్వకర్మచే నిర్మింపగబడె విమలమైన దీ పుష్పకమున్! 29

మహాత్ముడగు శ్రీరామచంద్రుడును మానుగ రావణ రాక్షసునీ,
అతని బంధువుల హతమొనర్చి మఱి యా విమానమును నతడొందెన్,
తరుణాదిత్యుని సంకాశంబును దగ రాముని వాహనమైనా
ఇట్టి దివ్యమగు మనో జవంబును గట్టిగ గలిగిన విమానమున్!
బ్రహ్మదేవునీ యనుగ్రహముచే బన్నుగ బొందెను గుబేరుడున్! 30

ఈ విమానమున సోదరులైనా యిమ్ముగ రాముడు లక్ష్మణుడున్
సీతాదేవియు గలరు సుమా! మఱి శ్రీమంతుడు సుగ్రీవుండున్!
రాక్షస రాజగు విభీషణుండును రాజిలుచుండెను విమానమున్! 31

అటుబిమ్మట యిదిగో శ్రీరాముడు నలరి వచ్చినాడని బలుకన్!
స్త్రీలు, బాలలును, యువకులు, వృద్ధులు చిత్తము సంతసమున బొంగన్!
మిన్నుముట్టగా ధ్వనులను జేసిరి జెన్నుగ యా ప్రజలందఱునూ! 32

రథములనుండియు, గజములనుండియు రయమున వాజులనుండి మఱిన్
దిగి వసుంధరను నిలిచినవారై దీరుగ విమానమున నున్నా

ఆ రఘువీరుని రామచంద్రునీ యంబరమందున నుండిన యా
చంద్రునివలె మఱి జూడసాగిరీ చక్కని నేత్రంబుల తోడన్! 33

ప్రాంజలితోడను సంతోషించిన బన్నుగ భరతుం డంతటనూ!
శ్రీరామునకును నభిముఖుండునై స్థిరచిత్తము గలవాడగుచున్!
స్వాగతవచనములను శ్రీరాముని సరసత పూజించియును మఱిన్! 34

విశ్వకర్మ మనసా సృజియించిన విమాన మందున యుండిన యా
పృధు దీర్ఘాక్షంబులు గలిగిన బహు ప్రేమమయుండగు రాఘవుడున్!
మఱియొక దేవేంద్రునికి వోలెమా మానుగ నచట ప్రకాశించెన్! 35

అటుబిమ్మట యా భరత కుమారుడు నట విమానాగ్ర గతమును నైనా
ఆశ్రీరాముని యా సమయంబున యలరి మేరుగిరి పై నున్నా
భాస్కరునికివలె నాభరతుండును బరగ నమస్కారము జేసెన్! 36

అటుబిమ్మట మఱి యనుత్తమంబును హంసల ప్రతిమలు గలదియునూ
మహాజవంబును గలదియునైనా మానుగ యాపుష్పకము మఱిన్
రామాజ్ఞను నది నేలకు దిగెనూ రమ్యమైన శోభలతోడన్! 37

రామచంద్రుడును పుష్పక మందున రహి భరతుని యెక్కింపగనూ
సత్యవిక్రముండగు భరతుండును సరగున శ్రీరాముని జేరీ
యంజలి ఘటించి రెండు జేతులను నభివాదనమును జేసి మఱిన్! 38

అరఘువీరుడు జిరకాలమునకు నక్షి పథంబును బొందిన యా
భరతకుమారుని లేవదీసి మఱి బన్నుగ యంకము నందుననూ!
కూర్చుండగ జేసియు సంతసమున కూరిమి కౌగిలిలో జేర్చెన్! 39

అటుబిమ్మట యా పరంతపుండును నలరుచు భరత కుమారుండున్!
ఆసౌమిత్రిని వైదేహిని మఱి నటు సమీపమునకును జేరీ
తనపేరును దెలుపుచు నంజలితో దగ నమస్కృతుల నర్పించెన్! 40

అటుబిమ్మట యాకైక సుతుండగు నల భరతుండును సుగ్రీవున్!
జాంబవంతునీ, మైందుని, ద్వివిదుని సరసత వాలి సుతుండైనా
అంగదు ఋషభుని కౌగలించుకొనె నలరుచు ప్రీతిని గాఢముగా! 41

అచ్చటనే గల సుషేణు, నలునీ నలరెడి గవాక్షు, పనసుణ్ణీ!
గంధమాదనుని, శరభుని, మఱియును నటగల వానర వీరులనూ!
హృదయపూర్వకము కౌగలించుకొనె మది సంతసమును దొలుకగనూ!

కామరూపమును ధరింప గలిగిన కపివీరులు నా సహయమునన్!
మానుష రూపములును ధరించియును మది సంతసమును పొందుచునూ!
కుశల ప్రశ్నలను వేసిరి భరతుని కూరిమి ప్రియ వచనంబులతో! 43

నటుబిమ్మట యాదశరథ పుత్రుడు నలరెడి తేజో శాలియునూ
ధర్మాత్ములలో శ్రేష్ఠుడు నైనా దగ రాజ సుపుత్రుండైనా
భరతకుమారుడు నా సుగ్రీవుని బన్నుగ కౌగిలి జేర్చికొనీ!
మధురవాక్యముల నీవిధి బలికెను మమత దొలుక హృదయమునందున్! 44

భాస్కరపుత్రా! ఓసుగ్రీవుడ! బన్నుగ మానలుగురికి మఱిన్!
ఐదవ సోదరుడవు నీవు సుమా! యాలకింపు నావచనములన్
స్నేహము జేతను నీ లోకములో చిరమిత్రుడు నేర్పడునుగదా!
అపకారము జేయుటయే జగతిని యలరి శత్రు లక్షణముగదా! 45

అటుబిమ్మట యా భరతకుమారుడు బన్నుగ విభీషణుని గాంచీ!
మధురముగా నీవిధమున బలికెను మమత జిలుక హృదయమునందున్!
దైవ వశంబున సహాయుండవై దగ యుండుట జేతను మఱియున్,
శక్యముగానీ కార్యము జేసెను సద్గుణ శీలుడు రాఘవుడున్! 46

అటుబిమ్మట యా శత్రుఘ్నుండును నలరుచు సలక్ష్మణుండైనా
శ్రీరామునకును నమస్కరించెను శీర్షము వంచియు పదములకున్
అటుబిమ్మట వైదేహి పదములకు నభివందనమును జేసె మఱిన్! 47

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును నట శోకమున కృశించినదై
శరీర వర్ణము మారిపోయినా సద్గుణవతి తన తల్లికినీ,
సామీప్యంబును జేరి మనస్సుకు సంతసమును గలిగించుచునూ
వినయముతో పాదాభివందనము విమల మనస్సున నర్పించెన్! 48

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నా సుమిత్ర కైకేయికినీ,
నమస్కరించియు దల్లులందఱికి నయముగ నమస్కరించియునూ,
ఆ తర్వాతను బురోహితుండగు నా వశిష్ఠుకడ కేగి మఱిన్
భక్తితోడుతను నమస్కరించెను రక్తిమీర పాదంబులకున్! 49

సతి కౌసల్యానందవర్ధనా సార్వభౌమ! విక్రమతేజా!
నీకు స్వాగతము! నీకు స్వాగతము! నిఖిల ప్రజల యంజలు లివిగో!
అనుచు నగర జనులందఱు గూడను నంజలులను ఘటియించి మఱిన్
శ్రీరామునితో బలికి రంతటను శీర్షము వంచుచు వినయమునన్! 50

నగర జనులచే గ్రహింపబడినా నయముగ రప్పు నమస్కృతులన్
వేలకొలది దోసిళ్ళు రామునకు విమలమైన వికసించిన యా
అరుణోదయ పద్మంబుల వలెనూ యా రామునకును నగుపించెన్ 51

ధర్మవిదుడు నా రాము డంతటను దగ శ్రీరాముని పాదుకలన్
గ్రహించి స్వయముగ ప్రభు రాఘవునకు పాదములను భక్తిని దొడిగెన్!

భరతుడంతటను నంజలితోడను బన్నుగ శ్రీరాముని తోడన్,
మధుర వాక్యముల నీవిధి బలికెను మాధుర్యంబును దొలుకగనూ,
న్యాసముగా నుంచిన రాజ్యంబును నయముగ యుంచిన సంపదలన్,
మఱల నీకు నర్పించుచుంటినీ! మహాజనులు నందఱు జూడన్! 53

నాదు జన్మమును నేటి దినంబున నయముగ జరితార్థత నొందెన్,
నా మనోరథము సిద్ధించినదీ నయముగ జనులందఱు గాంచన్
మఱల దిరిగి వచ్చిన మఱి నీవును మానుగ మయోధ్య పురమునకున్,
రాజువగుట నే జూడగ కోరిక రయమున దీర్పుము శ్రీరామా! 54

ధనాగారమును, కోష్ఠాగారము దగ గృహంబులును, సైన్యంబున్,
వీక్షింపుము మఱి రఘుకుల తిలకా! విమలమైన నీ తేజమునన్,
దశగుణంబులను వృద్ధి జేసితిని దగ యా యా సంపదల మఱిన్ 55

భ్రాతృవత్సలుండైన భరతునీ బన్నుగ యా వచనముల వినీ,
యా వానరులును, విభీషణుండును నలరుచు కన్నీటిని దొలికి,
భరతకుమారుని ప్రశంసించిరీ బన్నుగ సుమధుర వచనములన్! 56

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును నలరుచు సంతోషము తోడన్
అంకముపైనీ భరత కుమారుని పొంకముగా గూర్చుండగ జేసీ
యా విమానమున యా పుష్పకమున యా సైన్యంబును గూడికొనీ
భరతుని యాశ్రమమునకును జనియెను బన్నుగ దిలకింపగ యచటన్! 57

అట్టి సమయమున రాఘవు డంతట నటు భరతాశ్రమమును జేరీ
సైన్యముతో గూడిన వాడగుచును సరగున విమానమున నుండీ,
దిగిన వాడగుచు ధీరుడు రాముడు దీరుగ నిలచెను ధరిత్రిపై! 58

అటుబిమ్మట యా రఘు వీరుండును నత్యుత్తమ మగు పుష్పకమున్
సంబోధించుచు నీవిధి బలికెను సరసమైన వాక్యంబులతో!
ఇటుబిమ్మట ఓ పుష్పకమా విను! నిమ్మగ ప్రభువగు కుభేరుకున్,
వాహనంబుగా నుండుము నీవిక వరుస దప్పకుము నే నాజ్ఞన్
నిచ్చుచుంటినీ! యేగుము! వేగము!! జెచ్చెర నా పుష్పకము మఱిన్ 59

అత్యుత్తమమగు నా విమానమును నా శ్రీరాముని యాజ్ఞలనూ!
వైశ్రవణుని సేవలు జేయుటకై వసరగ యంబరమును జేరీ
ఉత్తర దిశకును ప్రయాణ మాయెను నూహకు నందని వేగముగన్! 60

రావణాసురుడు నపహరించినా రమ్యమైన యా పుష్పకమున్
రామచంద్రునీ యాజ్ఞ ప్రకారము రయమున యట్టి విమానంబున్
ధనదుని యొద్దకు జేరుకొనియెనూ ధగధగ కాంతుల గూడికొనీ 61

వీర్యవంతుడగు రామచంద్రుడును విమలత దనకును దగినట్టి
పురోహితుండగు వశిష్ఠునకునూ బులకితుడై యంజలితోడన్
సురరాజగు నింద్రుడు బృహస్పతికి సురుచిరముగ మ్రొక్కిన రీతిన్
నమస్కరించియు నతనితోడుతను నయముగ వేఱొక యాసనమున్!
నలరుచు నట గూర్చుండెను దిక్కులు నద్భుతమగు కాంతుల జిందన్ 62

(యుద్ధకాండయందు 127వ సర్గము సమాప్తము)

# శ్రీరామకథా సుధాలహరి యుద్ధకాండము

## రెండవ భాగము

### నూటయిరువదియెనిమిదవసర్గము

(భరతుడు రామునకు రాజ్యము దిరిగి యప్పగించుట — రాముడు మఱల యయోధ్యలో బ్రవేశించుట — రాముడు రాజ్యాభిషిక్తు డగుట — వానరులను వెనుకకు బంపుట — శ్రీమద్రామాయణ గ్రంథ మహాత్మ్యము)

కైకేయీ యానందవర్ధనుడు కమ్మని మనసుసు గలవాడున్
ఆ భరతుండును శీర్షముపైనీ యంజలి ఘటించుచు మఱియున్
సత్యపరాక్రముడైన రామునీ సరసత నమస్కరించి మఱిన్
నీవిధమున వినయమున బలికెనూ విమలాక్షరములతోని మఱిన్ 1

నాదు మాత యాజ్ఞానుసారమున మది మన్నించుచు పూజించీ
రాజ్యంబును నాకిచ్చి మఱియునూ రయమున నడవుల కేగితివీ,
ఆ రాజ్యము నాకెటుల యిచ్చితివో యా రాజ్యంబును నావిధినే
తిరిగి మఱల నే నిచ్చుచుంటినీ, దీరుగ అన్నా! గైకొనుమా! 2

బలీయసంబును నొంటరివైనా విలసితమగు వృషభము జేతన్
అనాయాసముగ లాగబడినదో యాకాడిని మఱి యాధురమున్
లేగదూడవలె గురువగుభారము లీలగ నే మోయుటకు మఱిన్
కడుసమర్థుడను గాను సుమా మఱి కావున నీ కర్పించితినీ! 3

మహ త్తరంబగు వారి వేగమున మఱి బీటలువారిన యట్టి
స్రవించనుండిన సేతువునకు వలె సరసత యీరాజ్యంబునకున్
సంబంధించిన ఛిద్రంబులుగల సరగున రాజ్య సుఛిద్రంబుల్
ఆచ్ఛాదింపకబోయినచో మఱి నది బంధింపగ రాదు సుమా! 4

పరంతపా! విను ఖరము యశ్వముల బన్నుగ గమనము వోలె మఱిన్,
వాయస హంసల గమనము వోలెను వసరగ నీ మార్గము నేనున్
నీ గమనంబును ననుసరింపగా నేరను నే విధి రఘువీరా! 5

మహాబాహూ! నా విన్నపమును విను! మానుగ పది యోజనతోడన్
పెరటియందు నాటిన వృక్షంబును పేరిమి మహత్తరంబుగనూ!
దురారోహమును మహాస్కంధమును దోరముగా విస్తృతమైనా
శాఖలు గలిగియు బుష్పించినదై ఫలములు జూపక వ్యర్థంబై
పోయినచో నేఫలము నిమిత్తము బొలుపుగ నాటగ బడినట్టి
ఫలమును బొందగ జాలడొ మఱియును ఫలితము నొందడొ మానవుడున్
ఇది యుపమానము రామచంద్ర! విను నిమ్ముగ మనుజేంద్రా వినుమా!
నీవు పోషకునిగా మఱి యుండియు నిరతము భృత్యులమగు మమ్మున్,
పోషింవగవలె పరిపాలింపగ. పూర్ణ శాసకుడవు నీవున్
అట్టి నీవు నిను దెలియకున్నచో గట్టి యాపదయు వచ్చు మఱిన్
తండ్రి దశరధుడు ప్రజాపాలకుడు తనయుడు గావలె ననుచు మఱిన్
పుత్రేష్ట్యాదులు జేసి బొందెనూ బొలుపుగ నిను వరములజేతన్
ఇంతగొప్పవాడవునై యాతని సొంత కార్యమును జేయనిచో
ఆతని యాశలు విఫలంబగునూ యతని కోరికయు విఫలమగున్ 6-7-8

రఘురామా! మధ్యాహ్నమునందున రవి దపించుచును దీప్తంబై
తేజస్సులుగల భాస్కరునికి వలె దీరుగ యభిషిక్తుడవైనా
నిను గాంచును గావుత రఘురామా! నిఖిల జగత్తును గనులారన్! 9

కాంచీ నూపుర నిస్వనములతో నంచితముగ తూర్యంబులయున్
సముదాయంబుల ధ్వనులజేతనూ విమలగీతి శబ్దంబులచే
మేలుకొనుము శయనించుము రామా! మేలుగ రాజ్యము జేయు మికన్ 10

అంబరమందున జ్యోతిశ్చక్రము నలరుచు దిరుగుచునుండు మఱిన్
అంతకాలమును నీ వసుంధరయు నెంత దూరముండునొ మఱియున్
అంతదూరమును నే లోకంబును సొంతము బరిపాలింపు మికన్! 11

పరపురంజయుడు రామచంద్రుడును భరతుని వాక్యంబులను వినీ,
'యక్లే' యని యంగీకరించెనూ నటు పిమ్మట శ్రీరాఘవుడున్
మంగళకరమగు నాసనంబునను రంగుగ నాశీనుం డయ్యెన్! 12

అటుపిమ్మట శత్రుఘ్ను యాజ్ఞచే నతి సుఖకరమగు హస్తములున్
గలిగిన వేగముగా పనిజేసెడి గడుచతురులు నగు మంగళ్ళన్,
రాముని యొద్దకు వచ్చిరి వారలు రమ్యమైన పొదులును గూడీ! 13

ముందుగ భరతుడు స్నానముజేసెను సందమొప్ప నటు మీదటనూ!
మహాబలుండగు లక్ష్మణుండునూ మానుగ స్నానంబును జేసెన్,
వానర ప్రభువగు సుగ్రీవుండును వనరగ రాక్షసరాజయినా
విభీషణుండును స్నానముజేసెను విమలమైన జలముల తోడన్! 14

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నలరు జటల విప్పించుకొనీ
స్నాన మాచరించెను సుగంధముల సలిలంబుల మఱి యటుమీదన్
చిత్రములైనా మాల్యంబులనూ శ్రీకరముగ ధరియించి మఱిన్
చందనాదులను బూసికొనీ మఱి సుందర వస్త్రంబుల గూడీ
యాప్రదేశమున నలరు శోభతో నటు ప్రకాశమొందుచు నుండెన్! 15

అటుపిమ్మట యావీర్య వంతుడును నల శోభా సంపన్నుడునూ
ఇక్ష్వాకులకుల వర్ధనుండయిన యిమ్ముగ శత్రుఘ్నుడు మఱిన్
రామచంద్రునకు, లక్ష్మణునకు మఱి రయమున యలంకరణములనూ
జేయించెను మఱి విధి విధానమున విపులమైన శ్రద్ధాభక్తిన్! 16

ఆ సమయంబున సమస్తమైనా నలరెడి యంతఃపుర స్త్రీలున్
వైదేహికినీ మనోహరముగా వనరగ యలంకరణములనూ
స్వయముగ జేసిరి బహు చతురతనూ సారస గంధులు వేగముగన్! 17

పుత్రవత్సలయు నగు కౌసల్యయు పూనికతో నటు పిమ్మటనూ
వానరవీరుల భార్య లందఱికీ వనరగ సంతోషము తోడన్!
శోభనమైనా యలంకారముల శోభాకరమున జేసె మఱిన్! 18

అటుబిమ్మట శత్రుఘ్నుని యాజ్ఞను నా సుమంత్రుడను సారథియున్,
సర్వాంగంబుల శోభనంబయిన సరసత యశ్వములను గట్టీ
సర్వాలంకారములను గూడిన సౌమ్య సుందరం బైనట్టీ
భవ్యరథంబును గొని వచ్చెను మఱి దివ్యాలంకారంబులతో! 19

అర్కమండలవు సంకాశంబును నట నిలిచిన దివ్యంబైనా
మహారథంబును గాంచి శీఘ్రమున మానుగ పరాక్రముండయినా
పర పురంజయుడు మహా బాహువును బన్నుగ రాముడు గాంచి మఱిన్
నా యరదంబును నారోహించెను నటగల వారందఱు గాంచన్! 20

మహేంద్ర సదృశ ద్యుతి గలిగిన యా మానుగ సుగ్రీవుండు మఱిన్,
వాయుసుతుండగు హనుమంతుడును వనరగ స్నానము జేసియునూ,
శుభకుండలముల ధరించి మఱియును శుభవస్త్రంబుల ధరియించీ
శ్రీ రఘువీరుని రథము తోడుతను శీఘ్రము బోయిరి వెనువెంటన్! 21

ఆ సుగ్రీవుని భార్యలు మఱియును నా సీతాదేవియు మరియున్
సర్వాభరణములను గూడికొనీ సరసత శుభ కుండలములనూ!
యలరించుక నగరము జూడగనూ యౌత్సుక్యంబుగ జని రటకున్! 22

అయోధ్యయందున దశరథ మంత్రులు నలరు పురోహితు డైనట్టీ
యా వశిష్ఠునీ ముందుంచుకొనీ యభిషేకంబును గూర్చి మరిన్
అర్థయుక్తముగ యాలోచించిరి యా మంత్రులు బహువిధముననూ! 23

అశోకుండు, విజయుండును మరియును నలిరెడి సిద్ధార్థుండు మరిన్.
రాముని యభివృద్ధిని గోరుచునూ రమ్య నగరవృద్ధిని మదిలో
విచారించుచును సావధానులై విమలాలోచనలను జేసీ! 24

జయార్థుండునూ మహాత్ముండునూ జయ శీలుండగు రామునకున్,
నభిషేకింపగ జేయవలసినది నా యా కర్మల నొనరింపన్,
ఏది యేది సమకూర్చవలయునో, యేది యేది జేయగవలెనో
మంగళ పూర్వకముగను జేయుడీ మహిలో ప్రశస్తులను నంపన్! 25

ఈ విధముగ యామంత్రు లందఱును నిమ్మగ పురోహితునకు మఱిన్
సావధానముగ దెలిపి రామునీ సరసత దర్శింపగ గోరీ
నగరమునుండీ బయలు వెడలిరీ నయముగ నందీ గ్రామంబున్! 26

సహస్ర నేత్రంబులును గలిగినా శచీదేవి భర్తయు నైనా
ఆకుపచ్చనీ గుఱ్ఱంబులు గల నల యింద్రుని రథమును బోలెన్
అనఘుడైన శ్రీరామచంద్రుడును యలరెడి యత్యుత్తమమైనా
యరదంబును మఱి యధిష్టించియును నల యయోధ్యకును వెడలె మఱిన్

భరతుండును గుఱ్ఱముల కళ్ళెముల గురుతుగ బట్టియు వేగముగా
సారథ్యము మఱిజేయు చుండగా సరసత యా శత్రుఘ్నుండు మఱిన్
శిరసునందు ఛత్రంబును బట్టెను శ్రీవిలసిల్లెడు లక్ష్మణుడున్
వింజామరమును వీచుచుండెనూ విమలమైన గౌరవముననూ!

పలితఃస్థితుడగు రాక్షసేంద్రుడును బన్నుగ విభీషణుండు మఱిన్
చంద్రునితోడను సమానమైనా సాంద్రమైన శ్వేతంబుసునౌ
మఱియొక వింజామరను గ్రహించెను మానుగ భక్తిని వీచగనూ! 28-29

ఆ సమయంబున ఋషి సంఘంబులు నలరుచు దివిజాలు నటు మీదన్
మరుద్గణంబులు సంబరమందున మానుగ రాముని స్తుతియింపన్
ఆ మధురధ్వని వినబడె నంతట మానుగ యయోధ్య పురముననూ! 30

అటుబిమ్మట యా వానర శ్రేష్టుండు నలరు మహస్సులు గలవారున్
సుగ్రీవుండును శత్రుంజయంబును సురుచిర నామము గలదియునూ
పర్వత సన్నిభమగు గజంబునూ బన్నుగ యధిరోహించె మఱిన్! 31

మానుష రూపములను ధరించియును మఱి యావానర వీరులునూ
విమలాభరణముల ధరించియును విపుల శోభలను గూడికొనీ
తొమ్మిది వేలా గజములపైనీ తోరముగా వెడలిరి పురికిన్! 32

పురుష శ్రేష్ఠుండగు శ్రీరాముడు బొలుపుగ శంఖ ధ్వనుల మఱిన్
దుంధుభి నాదంబులు ధ్వనియింపగ దోరముగా రథమందుననూ

మర్మమాలికల తోడను గూడిన యా యయోధ్య పురికిని వేగన్
వచ్చి జేరెనూ వసుధాస్థలిప్రజ వనరగ కొని యాడగ యతనిన్! 33

ముందుగ నడిచెడి భటాదులును మఱి యందమైన యాకారముచేన్
సంప్రకాశుడును నతిరథుండునూ సురుచిర యరదము నెక్కి మఱిన్
వచ్చుచుండగా రాముని జూచిరి వనరగ పురి ప్రజలందఱునూ! 34

పౌరులందఱును నా రఘువీరుని బన్నుగ జయజయనాదములన్
అభినందించిరి యాత్మీయునిగా నలరి తిరిగి వచ్చిన యటులన్
రాముడు గూడను బ్రజలందఱికిని రమ్యముగా యభినందనముల్
యాచరించెనూ జనాళియంతయు నలరుచు చుట్టును నుండిన యా
సోదరులున్నా రామచంద్రుపీ జూచుచు బోయిరి పురమునకున్! 35

మంత్రులతోడను విప్రులతోడను మానుగ ప్రకృతులను గూడీ
యుండినట్టి శ్రీరామచంద్రుడును మెండుగ నక్షత్రంబులతో
గూడినట్టి యా శశాంకు తోడను కూరిమి శోభను భాసించెన్! 36

ఆ శ్రీరాముడు మాల్యంబులు మఱి నలరు తాల స్వస్తికములనూ
హస్తంబులలో ధరించి మఱియును నలరుచు మంగళ వచనములన్
సంతోషంబున బలుకుచున్న యా సరస వంది మాగధులు మఱిన్
అగ్రభాగమున నడుచుచుండగా నా శ్రీరాముడు బురి జేరెన్! 37

అక్షతలును బంగారము గోవులు నలరు కన్యలును బ్రాహ్మణులున్
మధుర భక్షక్ష్యములు హస్తంబులతో మానుగ గ్రహించి కొందఱునూ
ఆ శ్రీరాముని ముందు నడిచిరీ నలరుచు సమ్మోదంబుననూ! 38

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నా సుగ్రీవుని సఖ్యంబున్
నేవిధముగ యేర్పడినది దెలిపెను నిమ్ముగ పావని ప్రభావమున్
మహావీరులగు వానరయోధులు మహా కార్యముల నన్నింటిన్
నా మంత్రులకును దెలియగ జెప్పెను నాశ్చర్యము వారును నందన్! 39

అయోధ్యపురమున వసించువారును నా కపివీరులు జేసిన యా
ఘనకార్యంబులు నా రాక్షసులయు ఘనమగు బలమును విక్రమమున్
వినుచు వినుచు నాశ్చర్యము నందిరి విమలాద్భుతమని యనుకొనిరీ! 40

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నా మంత్రులకు, సచివులకున్,
విభీషణుని యా సంయోగంబును విపులముగా తెలియగ జేసెన్,
ద్యుతిమంతుడగు నా రఘువీరుడు దోరముగా నంతయు దెలిపి,
వానరవీరుల గూడినవారై వనరగ తమ్ములతో గూడి
హృష్టపుష్టమగు జనాకీర్ణమగు నిష్ఠ యయోధ్యాపురి బొచ్చెన్! 41

ఆ సమయంబున పౌరులందఱును నలరుచు గృహ గృహమందుననూ
పతాకంబులను నెగురవేసిరీ బన్నుగ జేసిరి శుభధ్వనులన్,
ఇక్ష్వాకులు నివసించునట్టి యా యిమ్ముగ సుందర మందిరమున్,
తండ్రిగారి యా సుందరభవనము దన్మయ మందగ జేరుకొనెన్! 42

రాజపుత్రుడగు శ్రీరాముండును రమ్యమైన దశరథు గృహమున్
సమీపించి మఱి ప్రవేశించియును నరగున కౌసల్యకు మఱియున్
సుమిత్రదేవికి కైకేయి మఱి సురుచిరముగ వందనములనూ
యాచరించి ధార్మికులను శ్రేష్ఠుడు నలరుచు భరతునితోడ నిటుల్
అర్థయుక్తమగు వాక్యము బలికెను నల మధురాక్షరముల తోడన్! 44

అశోకవనములతో గూడినదియు నల ముక్తా వైదూర్యములన్,
వ్యాప్తమైనదియు మహోన్నతంబగు వనరగ మద్భవనంబు మఱిన్
సుగ్రీవునకును నివాసమునకై సురుచిరముగ జూపుము భరతా! 45

అటు దర్వాతను సత్యవిక్రముడు నా భరతుండును వేగముగన్,
రాముని మాటలు విని సుగ్రీవుని రయమున హస్తము బట్టుకొనీ
రాముని గృహమున బ్రవేశ బెట్టెను రమ్యముగా నివసింపగమా! 46

అటుపిమ్మట శత్రుఘ్నుడు వేగము నాజ్ఞాపింపగ పరిచరులున్
తైలదీపములు, పర్యంకంబులు దగ యాస్తరణములను గూడి,
శీఘ్రముగా యా గృహమును జేరిరి స్థిరమగు వినయ విధేయతలన్! 47

మహాతేజమును గలవాడును నగు మఱి భరతుడు సుగ్రీవునితో
నీ విధముగ బలికెను మధురముగా నిమ్ముగ సుమధుర వాక్యమున్,

ఓ సమర్థుడా! సుగ్రీవా! విను! నొనరగ రఘుకుల చంద్రునకున్
అభిషేకముకొఱకై దూతలనూ యాజ్ఞాపింపుము వేగముగన్! 48

సుగ్రీవుండును క్షిప్రముగా మఱి సురుచిరముగ నలువుర కపులన్
బిలిచి మఱియు సౌవర్ణంబులునగు బేరిమి రత్నంబుల జేతన్,
అలంకరింపగ బడిన కలశలను నలరి యిచ్చె కపివీరులకున్! 49

వానరులారా! నాల్గు సంద్రముల వనరగ పవిత్ర యుదకములన్
నిండిన కలశల గొనిరావలయును మెండుగ సూర్యోదయమునకున్
రాముని యభిషేకింపగ వలయును రమ్యముగా ప్రత్యూషమునన్
కావున మీకై వేచి యుండెదరు గడు వేగము గొని రావలయున్! 50

కపిరాజగు సుగ్రీవుని జేతను కమ్మని పలుకుల నీ విధినీ,
యజ్ఞాపింపగబడి కపివీరులు నలరుచు వినుతా సుతుల వలెన్
గజములవంటీ మహాత్ములైనా కపివీరులు బహు శీఘ్రముగా
అంబరమునకును నెగిరిరి వారలు సంబరమున సంద్రంబులకున్ 51

అటుబిమ్మట యా జాంబవంతుడును నలరుచు హనుమంతుండు మఱెన్
వేగదర్శియగు వానరవీరుడు వీర విక్రముడు ఋషభుండున్,
జలపూర్ణములగు కలశల నంతట జాగుసేయకను దెచ్చి రటన్,
వందలకొలదియు నదీ జలంబుల చందమైన కలశల తోడన్,
అతి వేగముగా గైకొని వచ్చిరి యతిభక్తిని యభిషేకమునకై 52-53

అటు బిమ్మట బలసంపన్నుండగు నల సుషేణుడును వేగముగన్,
తూర్పు సముద్రమునుండి వేగముగ తోరముగా జలపూర్ణములౌ
సకల రత్నముల శోభితమైనా చారు కలశమును గొనివచ్చెన్! 54

దక్షిణ సంద్రమునుండి ఋషభుడును రక్తచందనము కొమ్మలనూ
గప్పినట్టి జలపూర్ణ ఘటంబును నొప్పుగ గొనివచ్చెను నటకున్! 55
మారుత విక్రముడైన గవయుడును మహత్తరంబై శక్తిపయున్
రత్నకలశమున పడమట నున్నా రమ్య సముద్రముండి మఱిన్
శీతజలములను గొని దా వచ్చెను భీతిలేక నిసుమంతయునూ! 56

గరుడానిల విక్రముడును మఱియును గడు ధర్మాత్ముండును నైనా
సర్వగుణాన్వితుడైన నలుండును సరగున యుత్తర సంద్రమునన్,
శీఘ్రముగా శీతల జలంబులను సేకరించి కలశము లందున్
గొనితెచ్చెను ప్రత్యూష సమయమున కూరిమి సుగ్రీవుడు మెచ్చన్! 57
ఆ సమయంబున మంత్రులతోడను నట గూడిన శత్రుఘ్నుండున్,
రామచంద్రుని యభిషేకమునకు రయమున వానర శ్రేష్ఠులునూ
గొనివచ్చిన యా సముద్రజలముల కూరిమి పురోహితునకు మఱిన్
మిత్రులకును మఱి జూపి సిద్ధమని మేలుగ బలికెను నాతండున్! 58

అటుపిమ్మట బ్రాహ్మణ శ్రేష్ఠులతో నటగూడిన వృద్ధుండైనా
పురోహితుండగు వసిష్ఠుండునూ పొలుపుగ నిశ్చల చిత్తుండై
సీతా సమేతుడగు శ్రీరాముని శ్రీకరముగ రత్నంబులచే
బొదిగినట్టి సింహాసనంబునను బొలుపుగ గూర్చుండగ బెట్టెన్; 59

వసిష్ఠుండు మఱి వామదేవుడును వనరగ జాబాలియు మఱియున్
కాశ్యపుడును మఱి కాత్యాయనుడును గడు నిర్మలుడగు సుయజ్ఞుడున్,
గౌతముండు మఱి విజయుండనియెడి గడగి మునులు నెనమండుగురున్,
నిర్మలంబు మఱి సుగంధ యుక్తము నీరధి నదీ జలంబులతో,
అష్టవసువులును సహస్రాక్షుడగు నా యింద్రునకును స్వర్గమునన్,
అభిషేకంబును జేసినట్లుగా నా రామునకును జేసి రటన్; 60

సంప్రహృష్టులగు వసిష్ఠాదులును సరగున ఋత్విజులైనట్టి
విప్రులచేతను, కన్యలచేతను వినుతికి నెక్కిన మంత్రులచే
యోధులజేతను, వర్తక శ్రేష్ఠుల మది బొంగగ వ్యాపారులచే,
అంబరమున గల దివిజుల చేతను నటుమీరట నలువురునైనా,
లోకపాలురగు వారలజేతను లీలగ నటు గుమిగూడిన యా
సకల దేవతల చేతను కూడను సరగున యభిషేకంబు మఱిన్
జేయించిరి వీరందఱునూ నట దీరుగ నదీ సముద్రములా
జలములతోడనె గాక మఱియునూ సమస్త యోషధి రసములచే
రామచంద్రునకు యభిషేకంబున రయమున జేసిరి వేగముగన్! 62

ఏ కిరీటమున మనువు పూర్వమున యిల యభిషేకింపగ బడెనో
ఆ మను వంశము నందు రాజులును నలతుచు నెట్టి కిరీటమునన్
అభిషేకింపగ బడినారో మఱి నల స్వయంభువుని జేత మఱిన్,
నిర్మింపగబడిరత్నశోభితమునిర్మల ప్రదీప్తతేజసునన్!63-64-65-66-67

శోభించెడి యా కిరీటమును మఱి సురుచిరమగు బంగారముచే,
నలంకరింపగ బడిన యట్టి మఱి యలరు మహా ధనముల చేతన్
ప్రకాశింపగా జేయు బడియు మఱి బన్నుగ యనేక విధములునూ
సుశోభితములగు రత్నంబులచే సురుచిర వర్ణము గలదిగనూ!
చేయబడిన సభయందు మఱియునూ శ్రీకర రత్న వితానంబున్
అట్టి పీఠమున నుంచి యథావిధి యును విప్రుల నా మహాత్ముడున్
ఆ వసిష్ఠుడును కిరీటంబుతో నల ఋత్విజుల జేత మఱిన్
భూషణంబులను నా శ్రీరాముడు బొలుపుగ యలంకరింప బడెన్! 68-69

శత్రుఘ్నుడు మఱి శ్రీరామునకును సరసత పాండుర శుభకరమున్
ఛత్రంబును బట్టెను సుగ్రీవుడు సరగున వింజామరను మఱిన్,
రాక్షసేంద్రుడగు విభీషణుండును రయమున చంద్ర సుకాంతులదే
మఱియొక వింజామరను గ్రహించెను మానుగ శ్రీరామున కపుడున్!
ఇంద్రునిచేతను ప్రబోధితుండై యిమ్ముగ యా వాయువు మఱియున్,
సర్వరత్నముల సమాయత్తమును సకల మణులనూ గూడినదీ, 71
ముక్తాహారము శ్రీరామునకును మోదముగా నవు దర్పించెన్!

అట్టి సమయమున యభిషేకమునకు నర్హుడైన శ్రీరామునకున్
పట్టము గట్టెడి సమయమునందున బన్నుగ దివిజులు గంధర్వుల్
మధురగీతముల గానము జేసిరి మంజుల సురాగ తాళములన్,
అప్సర స్త్రీలును నాట్యము జేసిరి నలరు సందియలు ఘల్లుమనన్! 72

రాఘవోత్సవము జరుగగ నప్పుడు రమ్య భూమి సశ్యామలమై,
పాదపములు ఫలములు గలవిగా బన్నుగ యేర్పడె నంతయునూ! 72
పుష్పంబులు బహు సుగంధములుగా భూరి సొగసులను వర్తిల్లెన్

వాయుదేవుడును వాసవుజేతను వనరగ ప్రబోధితుం డగుచున్
శరీరంబుతో నటకువచ్చి మఱి జ్వలించు స్వర్ణ వికారంబున్
శతపుష్కరములు గలిగిన మాలను సరసత శ్రీరాముని కొసగెన్

మహాయశుడగు రామచంద్రుడును మానుగ ముందుగ విప్రులకున్
లక్ష గుఱ్ఱముల దానము జేసెను లక్ష క్రొత్తగా యీనిన యా
ధేనువులను మఱి యర్పణజేసెను దీరుగ నూఱగు వృషభములన్,
బ్రాహ్మణులను బూజించి యొసగెనూ బన్నుగ దక్షిణలను గూడన్! 70

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును బటు పండితులగు విప్రులకున్
ముప్పది కోటుల స్వర్ణనాణ్యముల మోదముతో దానము జేసెన్,
విలువ గలిగినా యనేక విధముల విమలాభరణములను మఱియున్
అమలవస్త్రముల దానము జేసెను నల బ్రాహ్మణులకు నందఱకున్! 74

మనుజాధిపుడగు రామచంద్రుడును మానుగ సుగ్రీవున కపుడున్
అర్కరశ్మితో ప్రతీకాశమును నధికమైన మణులను గలిగీ
స్వర్ణవికారంబైనది మఱియును సరసత దివ్యంబైనదియున్
మాలను నర్పించెను కపిరాజుకు మానుగ సభయంతయు గాంచన్ 76

ధృతిమంతుండగు రామచంద్రుండును మతిమంతుండగు నంగదుకున్
వైడూర్యములను దాపినట్టి యా వనరగ విచిత్ర వర్ణములన్
మణులచేత మఱి రత్నంబులచే మానుగ భూషితములు నైనా
బాహుపురులనూ బహూకరించెను బన్నుగ యా సమయమునందున్! 77

రాముడంతటను మణులను గూడిన రమ్యమైనదియును శ్రేష్ఠమునూ
చంద్ర కిరణ సమ ప్రభలు గలిగినా సాంద్రమైన ముత్తెపు దండన్
పరిశుద్ధములును దివ్యములైనా బన్నుగ రెండు సువస్త్రములున్
సుందరములునగు నలంకారములు సురుచిరముగ సీతకునిచ్చెన్! 78

జనకుని కుమార్తెయైన మైథిలియు వినయ వంతు మారుతి దలచీ
తన కంఠంబున నుండి హారమును దగ హస్తంబున గైకొనియున్

సమస్తమైనా వానర వీరుల సరసత కనుగొని తన పతినీ
మాటిమాటికిని కలయ జూచెనూ మధురమైన వీక్షణములతో! 79-85

ఇంగితజ్ఞుడగు రామచంద్రుడును నిమ్మగ సీతను బరికించీ,
జనకాత్మజతో నీవిధి బలికెను మనసువిప్పి మృదుమధురముగన్
సుభగే సీతా! ఎవనియందునను సురుచిరముగ దయ గలిగినదో
ఎవనియందు సంతోషించితివో యెవనియందు తేజస్సు మఱిన్
ధృతి యశస్సునూ, నేర్పు, చతురతయు దగ సామర్థ్యము నుండినదో
వినయము, నీతియు, పౌరుషంబుమా. విక్రమంబు, బుద్ధియు మఱియున్
నీ సుగుణంబులు నెవరికి గలవో యా వానరవీరునికి మరిన్
ఈ హారంబును నతనికి నిమ్మా నిమ్మగ బహుమోదము తోడన్ 81-82

అసితేక్షణయగు నా జానకియును నా ముత్యాల సుహారంబున్
హనుమంతునకును బహూకరించెను నందఱు గాంచగ సభయందున్
వానరశ్రేష్ఠుండైన మారుతియు వనరగ హారము ధరియించీ
చంద్రకిరణ సముదాయము వోలెను సాంద్రశ్వేతమగు హారమునూ
గూడినట్టి యా హనుమంతుండును కూరిమి తెల్లని మేఘముతో
పర్వతంబు మరి ప్రకాశించినటు బన్నుగ నతడు బ్రకాశించెన్! 83

సమస్తమగు వానర వృద్ధులునూ సకల వానరోత్తములు మరిన్
వారలందఱును దగిన విధముగా వస్త్రంబుల జేతను మఱియున్
భూషణంబులను సత్కరింపబడి బొలుపుగ గౌరవ మంది రటన్! 84

అటుబిమ్మట యాపరంతపుండును నా వసుధాధిపుడైనట్టి
ఆ శ్రీరాముడు నాలోచించియు నా మైందునకును ద్వివిదునకున్
నీలునకు మఱి కోరదగిన యా నిఖిలమైన వస్తువు లిచ్చెన్

అటుబిమ్మట యా విభీషణుండును నా సుగ్రీవుడు మారుతియున్,
జాంబవంతుడును సమస్తమైనా సకలమైన వానర వీరుల్,
అక్లిష్ట కర్మణుడైన రాముతో నలరు కోరికల జేత మఱిన్,
కోరదగిన వస్తువుల జేతనూ కూరిమి రత్నంబుల జేతన్,

తగు విధముగ సత్కారము లందిరి దగు విధి బహు మానములందీ,
వారందఱను సంతోషించియు సంతస మందిన మనసులతో.
వచ్చినటులనే దిరిగిపోయిరీ వారి వారి స్థానంబులకున్! 87

అటువిమ్మటనూ మహాత్ములైనా యా వానర శ్రేష్ఠులును మఱిన్
శ్రీరామునకు నమస్కరించియు శ్రీఘ్రము ననుజ్ఞలను నందీ
కిష్కింధా నగరమునకు బోయిరి కీశాధిపతిని గూడికొనీ! 88

వానరశ్రేష్ఠుండగు సుగ్రీవుడు వనర రామునభిషేకంబున్
గాంచి రాముచే బూజింపగబడి యంచితముగ పరివారముతో
కిష్కింధా పురమునకును బోయెను కీశ సేనలను గూడికొనీ! 89

ధర్మాత్ముడు మఱి మహాయశుండును దగరాజైన విభీషణుడున్,
కులధనమగు రాక్షస రాజ్యంబును కూరిమి సంపాదించుకునీ
రాక్షసులతోడను గూడికొనీ రమ్యమైన లంకాపురికిన్
వెడలిపోయెనూ రాముని విడిచీ విమల యయోధ్యా నగరంబున్! 90

మహాయశుండును పరమోదారుడు మానుగ శ్రీ రఘువీరుండున్
శత్రువులను మఱి సంహరించియును సకల రాజ్యమును నంతయునూ
పరివారంబును నానందముతో బన్నుగ యనుభవమును బొందెన్,
ధర్మవత్సలుండగు శ్రీరాముడు దగ ధర్మజ్ఞుడు లక్ష్మణునీ,
గాంచి యీ విధము బలికెను రాముడు కరుణారస భరితుం డగుచున్!

ధర్మజ్ఞుడ! ఓ సౌమిత్రీ విను దగ నాదు సువాక్యంబులనూ,
పూర్వకాల రాజులజేతను మఱి బొలుపుగ పాలింపగబడెనో
యీ ధాత్రిని మఱి బలిమి జేతమూ యిమ్ముగ నాతో గూడ మఱిన్
నధిష్ఠింపుమా! యేది పూర్వమున నల పూర్వపు రాజుల చేతన్
ధరింపబడినదో యా భారంబును దగ నీవును నాతో గూడన్
సమముగ యువరాజువునై మోయుము సతతము నాతో రాజ్యంబున్ 93

యౌవరాజ్య మంగీకరింపుమా భవ్య పదవి గొనుమంచు మఱిన్
రాము డెంత బలిమాలిన గూడను రమ్యవర్తనుడు లక్ష్మణుడున్,

ఏ విధముగ యంగీకరింపకను నిమ్ముగ యుండెను మౌనముగా,
మహాత్ముడగు నా రాము డంతటను మానుగ భరతుని నంతటనూ
యౌవరాజ్యమున యభిషేకించెను భవ్యమైన రాజ్యము నందున్! 94

పార్థివాత్మజుండగు రాఘవుడును బన్నుగ యనేక మారు లిలన్
పౌండరీకమును, యశ్వమేధమును వాజపేయమును మఱి యింకన్!
అనేక విధముల యజ్ఞంబులనూ యాగంబులనూ జేసె మఱిన్! 95

పదివేలకు పైబడిన వర్షములు బన్నుగ రాముడు రాజ్యంబున్
బరిపాలించెను సదశ్వమునూ బన్నుగ దక్షిణ లిచ్చుచునూ!
అశ్వమేధ యాగంబుల నూటిని యలరి జేసె కీర్తింప ధరన్! 26

మహాబాహువుమ మహావక్షమును మానుగ ప్రతాప వంతుండున్!
నా రఘువీరుడు రామచంద్రుడును నల సౌమిత్రియు ననుచరుడై
యలరి యుండగా ధాత్రియంతయును నటు బాలించెను క్షేమముగా! 97

ధర్మాత్ముండగు రామచంద్రుడును దగ నుత్తమమగు రాజ్యంబున్,
బొంది సతులతో సహోదరులతో దగ బంధుల గూడినవాడై
బహువిధ యజ్ఞంబుల జేతను మఱి బహు దేవతలను బూజించెన్! 98

రాముడు రాజ్యము బాలించిన యా రమ్యమైన యా కాలమునన్!
పడతుల వైధవ్యంబు జేత మఱి బరగ దుఃఖమును నందరుగా
క్రూర జంతువుల భయమును లేదూ కూరిమి విష సర్పంబులచే
వ్యాధులజేతను భయ మరణంబులు వనరగ లేకుండను నపుడున్! 99

దొంగతనము నటలేదు గదా మఱి సంగతి దోపిడి లేదచటన్,
నెవనికి గూడను నేయనర్థమును నిమ్ముగ స్పృశింప లేదచటన్,
వృద్ధులైన వారలు పిన్నలకును ప్రేమ కార్యములు జరిగెడి యా
యవసరమెన్నడు నెచ్చటనూ మఱి భావమందునను లేదు ధరన్! 100

అంతయు నానందముగా నుండెను నంతయు దుఃఖము లేదచటన్
ప్రజలందఱునూ ధర్మపరులుగా బన్నుగ దయ ప్రేమల గూడి,

శ్రీరాముని నాదర్శముగా గొని స్థిరమతులై మెలగుచు వారున్,
పరస్పరము హింసించుకొనరుగా బన్నుగ నుండిరి స్నేహముతో! 101

రాముడు రాజ్యము బాలించెడి యా రమ్యమైన యాకాలముననన్
వేలకొలది వత్సరములు బ్రదుచుచు వేలకొలది పుత్రులతోడన్
రోగంబులు మఱి లేనివారలై శోకంబులు మఱి లేకయునూ
ప్రజలందఱునూ సుఖముగ నుండిరి బన్నుగ సౌఖ్య సుశాంతులతో! 102

రాముడు రాజ్యము బాలించెడి యా రమ్యమైన కాలమునందున్
రాముడు రాముడు రాముడనుచునూ రాముని గుఱించి దివ్యకథల్
జెప్పికొనిరి ప్రజలందఱు గూడను శ్రీకరముగ గీతంబులతో
రాముడు రాజ్యము జేయుకాలమున రామమయముగా ధరయయ్యేన్! 103

ఆ సమయంబున వృక్షంబులు మఱి యలరె నిత్య పుష్పంబులతో
నిత్యఫలంబులు గలవియు నయ్యేను నిర్వ్రణములు గలవియు నయ్యేన్!
తగినకాలమున దగిన వర్షములు దగ గురియుచు నుండెను నచటన్
వాయువు సుఖస్పర్శయు గలదిగనూ వర్థిలు చుండెను నచ్చోటన్! 104

రాముడు ధర బాలించుచుండగా రమ్యముగా విప్రులు మఱియున్
క్షత్రియ వైశ్యులు. శూద్రు లందఱును సరగున లోభము, దురాశయున్
నింతయు లేకయు దమ కృత్యంబుల యెంతయు దృప్తిని జెందుచునూ
ప్రవర్తించు చుండిరి ధర్మంబున బన్నుగ యాసక్తియు గలిగి
అసత్యంబు మఱి యధర్మంబునూ యంటరు ముట్టరు ప్రజలు మఱిన్! 105

ప్రజలందఱు లక్షణ సంపన్నులు భన్నుగ ధర్మ పరాయణులున్
నెటుజూచిన మఱి శాంతి సౌఖ్యములు నెటుజూచిన యానందంబే
రామచంద్రు డీ విధము నయోధ్యను రమ్యముగా నాదర్శముగనూ
పదివేలకు పైబడి వత్సరములు బన్నుగ రాజ్యము నొనరించెన్! 106

ధర్మసమ్మతము యశస్సు నిచ్చును దగ యాయుస్సును నిచ్చునదీ
రాజులకును విజయంబు నిచ్చునది రహి పూర్వము వాల్మీకుల జేతన్
రచింపబడినది ఋషిప్రోక్తమునై రమ్య వేద సంబంధమునూ! 107-108

రాముని పట్టము వఱకును గలిగిన రమ్యమైన యీ గ్రంథమునూ
విని చదివిన మానవుడు లోకమున విమల సౌఖ్యముల నతడందున్
పుత్రులగోరెడి యా మనుజుండును బుత్రులనందును దప్పకనూ
ధనమును గోరెడి యా మానవుడును ధనముల నందును యాతండున్
రాజు భూమినీ జయించి వేగము రయమున శత్రువులను నణచున్! 109

శ్రీరామునిచే యా కౌసల్యయు జీవపుత్ర మైనది జగతిన్
లక్ష్మణుజేతను నా సుమిత్రయును లాలితముగ భరతుని జేతన్
నా కైకేయియు జీవపుత్రులుగ నలరిరి యీధర యందుననూ
అట్టి విధము నీ యాది కావ్యమును నిట్టె చదివినా వినిన మఱిన్
అట్టి స్త్రీలు మఱి జీవపుత్రులై యిట్టె పుత్రపౌత్రుల గూడి
చిరకాలము నానందము లోడను శ్రీకరముగ నుందురు జగతిన్!110-111

ఈరామాయణ పుణ్యకావ్యమును నిమ్ముగ యక్లిష్ట కర్మణుడున్
శ్రీరాముని జయ వృత్తాంతంబును స్థిరముగ వినునో మానవుడున్
దీర్ఘాయుర్దాయమును బొందుసూ దీరుగ సౌఖ్యంబును నందున్! 112

పూర్వము వాల్మీకులు రచించినా పుణ్యప్రదమగు కావ్యమునూ
శ్రద్ధతోని మఱి జితక్రోధుండై శుద్ధ మనస్సున వినువాడున్
కష్టంబుల దుఃఖంబుల దాటును కమ్మని జీవితమందు మఱిన్! . 113

పూర్వము వాల్మీకులు రచించినా పుణ్యప్రదమగు కావ్యమునూ
యెవరు విందురో యట్టి జనులు మఱి యిమ్ముగ ప్రవాస మంతమునన్
బంధువులను మఱి గలిసికొందురూ బన్నుగ సంతోషింతు రిలన్! 114

ఈకావ్యంబును విన్నవారు మఱి యిమ్ముగ శ్రీరాముని మండి
కోరినవరముల నన్ని బొందెదరు కూరిమి భోగము లందెదరూ!
ఈకావ్యంబును వినుటచేత దుఱి యిమ్ముగ దేవత లందఱునూ
వినెడి వారి విషయంబున వారలు విమలానందము నొందెదరూ! 115

ఎవని గృహముననను విఘ్ననాయకులు నిమ్ముగ దుష్ట సుభూతములున్!
నిలిచియుందురో దీనిని జదివిన నిలిచి శాంతము నందెదరూ!

రాజులు శత్రువులను జయింతురూ రహి వసుంధరను బొందెదరూ!
ప్రవాసంబులో నున్నవాడు మఱి బన్నుగ క్షేమముగా నుండున్! 116

రామాయణమును విన్నచో మఱియు రజస్వలలు నగు ప్రమదలున్నూ
ఉత్తములును నగు బుత్రుల గనెదరు సుగుణవంతులు నగు వారిన్!
బురాతనంబగు నీ యితిహాసము బొలుపుగ పూజించెడి వారున్
చదువువాడు బాపంబుల నుండియు బరగ విముక్తుండగు మఱియున్
దీర్ఘాయుర్దాయమును బొందునూ దీరుగ సౌఖ్యములను నందున్! 117

క్షత్రియుండు మఱి శిరమునువంచి సక్షత నమస్కరించుచునూ
సతతము విప్రుని నుండి దీనినీ సరసత వినవలయును మఱియున్!
ఈ రామాయణ కావ్య మెప్పుడును నిమ్మగ వినువారికి మఱియున్!
చదివెడివానికి యైశ్వర్యంబును సరగున సుపుత్ర లాభంబున్!
గలుగును సంశయమింతయు లేదూ, కమ్మని నా వచనంబులలో! 118-119

ఈ కావ్యంబును జదువుట జేతను నిమ్మగ రాముడు నెల్లపుడున్!
సంతోషించును సనాతనుండును సాక్షాత్ నాతడు విష్ణుగదా!
రఘువంశమునందున శ్రీరాముడు రహి సాక్షాత్తుగ దేవుండున్!
మహాబాహువును బాపహారియును మానుగ ప్రభువగువాడు మఱిన్
నారాయణుడే! లక్ష్మణుండు మఱి నయముగ శేషుడు బరకింపన్! 120

ఓ జనులారా! పూర్వమీ విధము నొనరగ జరిగిన చరిత్రనూ!
అడిగిన వారికి నిర్భయంబుగా నలరుచు దృఢ విశ్వాసముతో
తెలియజేయుడీ! క్షేమం బగుమా! దీరుగ మీయందఱికి మఱిన్!
విష్ణువు బలమును వృద్ధిబొందునూ విమలకాంతి ధర వర్ధిల్లున్! 121

ఈ రామాయణ మహాకావ్యమును నిమ్మగ జదివిన వినిన మఱిన్!
సమస్తమైనా దేవతలందఱు సరసత యనుగ్రహింతురిలన్
రామాయణమును వినుటచేత నిల రమ్య పితృ దేవతలు మఱిన్
ఎల్లకాలమును సంతోషింతురు యుల్లము రంజిలు చుండగనూ! 122

మహర్షి వాల్మీకులు రచియించిన మానుగ శ్రీరామునకు మఱిన్!
సంబంధించిన యీ సంహితనూ సరసత సుభక్తి పూర్వముగన్
వ్రాయు నరులకును స్వర్గమునందున వనరగ లభించు వాసమునూ! 123

మహార్థంబులునుగల శుభకరమైనా మానుగ యీ కావ్యమును మఱిన్!
చదివినవాడును వినిన వాడునూ సరసత కుటుంబ వృద్ధియునూ
ధనధాన్యంబుల వృద్ధియునూ దగ ముఖ్యలు నగు ప్రమదలున్నూ!
ఉత్తమమైనా సుఖంబు మఱియును నుర్వియందు సకలమునైనా
అర్థసిద్ధినీ యందుకొనును మఱి సిద్ధిని బొందును కార్యములన్! 124

వృద్ధిని గోరెడి సత్పురుషులచే విపులమైన యారోగ్యమునూ
ఆయుస్సును బెంబొందించెదియును నల యశస్సు నిచ్చెడియునూ!
భాతృప్రేమనూ కలుగ జేసెడిది బరగ బుద్ధికరమైనదియున్!
శుభకరమును మఱి కాంతి నిచ్చెడిది సురుచిరమగు నీకావ్యమునూ
నియమముజేతను వినదగినది సుమ! నిఖిల జగమునకు శుభమగునూ!225

(యుద్ధకాండము యందు 128వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

ము గిం పు

మహాత్ములగు శ్రీ. వాల్మీకులిదే మలిచిరి యీ ఘన కావ్యమునూ
రాముడు మన కెపు డాదర్శముగా రహి నుండుటకై యెల్లపుడున్!
చదివిన వ్రాసిన వినినగూడనూ సద్బుద్ధులు మన కలవడునూ!
కర్మక్షేత్రమున కార్యసాధనకు కమ్మని దారుల నందించున్!

మం గ ళ మ్

మంగళమగు మన రాముల వారికి మంగళమగు మన [illegible]
మంగళమగు మన లక్ష్మణమూర్తికి మంగళమగు మన [illegible]
మంగళమగు మన పవనసుతునకు [illegible] రాముని [illegible]
మహదాదర్శములను జూపిన మన తారక [illegible] మంగళమూ!

# రచయిత పరిచయం

జననం : విజయవాడలో బ్రాహ్మణవీధి.

స్వగ్రామం : నల్లగొండ జిల్లాలో చెరుకుపల్లి (నక్రేకల్) గ్రామం.

బాల్యం : ప్రాథమిక విద్యకుగూడ నోచుకోని దుర్భర జీవితం 12 సం॥ల ప్రాయంలోనే శ్రామిక జీవితం.

జీవనయాత్ర : స్వగ్రామం జేరుకొని పితృతుల్యునికి శుశ్రూష. ఉన్న కొద్ది పొలంలోనే వ్యవసాయం.

ఉస్మానియా తెలుగు పరీక్షలు స్వయముగా అధ్యయనం. ఉన్న కాస్తపొలం గ్రామనాయకులచే అపహరణ.

జిల్లా ఉన్నత పాఠశాలలో తెలుగు పండితునిగా ఉపాధ్యాయ జీవితం.

ఉపాధ్యాయ వృత్తితోబాటు రచనా వ్యాసంగం. కీ॥ శే॥ శ్రీ దేవులపల్లివారిని ఆదర్శంగా లలితగీతాలు, ఇతర సాహితీ గ్రంథాలు. దాదాపు నలుబది పైన రచించి ప్రచురించడం.

జిల్లా విద్యాధికారులచే ఉత్తమ ఉపాధ్యాయునిగా సమ్మానింపబడుట.

ఉద్యోగ విరమణ :

2400 పేజీలుగల శ్రీరామకథా సుధాలహరి గీతికారూపమైన రామాయణాన్ని ఎనిమిది సంపుటాలుగా ప్రచురించుట.

చివరి కోరికలు : స్పృహ ఉన్నంతకాలం సాహితీరచన చేయాలనీ, తాను పనిచేసిన పాఠశాలలకు బీదవిద్యార్థుల పేర యిచ్చిన విరాళాలు మరణానంతరం సద్వినియోగం కావాలనీ.

అంతిమ సమయంలో : కొండల్లో, కోనల్లో, సెలయేటి నిస్వనాలలో ప్రకృతిమాత ఒడిలో కన్నుమూయాలనీ.